# హరిజనాభ్యుదయం - తెలుగు కథానిక

## ( దళిత కథ )

Acc. No. 27261

డా. కె. లక్ష్మీనారాయణ

MA.,MEd.,D.F.P.A.,T.P.T.,Ph.D

రమా పబ్లికేషన్స్

అనంతపురం.

**HARIJANABHYUDAYAM**
Telugu Kathanika
(A wakening of Harijans in Telugu Short Story)
by **Dr. K. Lakshmi Narayana**

ప్రథమ ముద్రణ, డిసెంబర్ 1996
ప్రతులు 1000

ముఖచిత్రం : శీలా వీర్రాజు

తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహకారంతో ముద్రితం
సర్వహక్కులు రచయితవి

వెల సాదాప్రతి : 50/-
లైబ్రరీ ప్రతి : 75/-

ప్రతులకు :

శ్రీమతి కె. రమాదేవి 19-437ఎ - 47-ఇ1,
వినాయక నగర్, పాతూరు, అనంతపురం - 515003.

1. విశాలాంధ్ర అన్ని బ్రాంచీలు.
2. దిశ పుస్తక కేంద్రం, చిక్కడపల్లి, హైదరాబాద్.
3. నవయుగ బుక్ హౌస్, సుల్తాన్ బజార్, హైదరాబాద్ .
4. మణి బుక్‌స్టాల్, సండే మార్కెట్, నెల్లూర్.
5. బి.యస్.రాములు, 6-2-157 మిషన్ హాస్పటల్ ఎదురుగా, జగిత్యాల, కరీంనగర్ జిల్లా.
6. డా. నమమాసస్వామి, దళితరచయితల సంఘం,12-10-682బి, టి.ఆర్.టి 188, సీతాఫల్ మండి, సికింద్రాబాద్.

ముద్రణ :
పద్మావతీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్
1-1-517/బి/1, న్యూబాకారాం
గాంధీనగర్, హైద్రాబాద్ - 500 038.
ఫోన్: 7611413

లేజర్ టైప్ సెట్టింగ్:
శ్రీ సాయిమేధ
కంప్యూటర్ క్రియేషన్స్
కూకట్‌పల్లి, హైదరాబాద్ - 72,
ఫోన్: 888708

తేది : 30-12-96

**ఆచార్య కొలకలూరి ఇనాక్**

ఆంధ్రాచార్యులు, శాఖాధ్యక్షులు

తెలుగు శాఖ

శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం

అనంతపురం .

# అనుమోదనం

డా. కె. లక్ష్మీనారాయణ మా విశ్వవిద్యాలయంలో మా శాఖలో ఎం.ఎ. పూర్తిచేసిన వెంటనే పిహెచ్.డి. పరిశోధకుడుగా చేరి, అనతికాలంలోనే తన సిద్ధాంత గ్రంథం '' **హరిజనాభ్యుదయం - తెలుగు కథానిక** '' సమర్పించి డాక్టరు పట్టం పొందాడు.

హరిజనాభ్యుదయం చిత్రించిన నవల, కవిత్వం, నాటకం, కథానిక మీద ఒక యం.ఫిల్, మూడు పిహెచ్.డి పరిశోధనలు చేయించాను. డాక్టరేటు సిద్ధాంత గ్రంథాలు మూడూ ముద్రితమయ్యాయి. ఇది మూడోది. అగ్రజుల అడుగు జాడలు డా. లక్ష్మీనారాయణకు ఆమోదాచరణ యోగ్యాలయ్యాయి.

ఈ సిద్ధాంత గ్రంథంలో దాదాపు నూటాయాభై దళిత కథలు పరిశీలనం పొందాయి. ఈ కథానికలను దళితులు, దళితేతరులు సృష్టించారు. సృష్టిమూలం నుంచి పరిశోధకుడు వైవిధ్యం దర్శించాడు. దళిత రచయితలు రచనలు పరిమితంగా వుండటం, దళితేతర రచయితలు రచనలు అధికంగా ఉండటం గుర్తించాడు.

ఈ సిద్ధాంత గ్రంథంలో తెలుగు కథానికా వికాసం స్థూలంగా పరిశీలించి ఈ సాహిత్యానికీ సంఘానికీ ఉన్న సంబంధం సమీక్షించి, ఈ కథానికల్లో ఉన్న హరిజన జీవితం విడమర్చి చూచి వీళ్ళ దృక్పథం పరీక్షించి, ఈ పాత్రల వైవిధ్యం, వైశిష్ట్యం గుర్తించి, పరిశోధకుడు హరిజనాభ్యుదయం నిర్ణయించాడు.

కథను పరిశీలించే సూక్ష్మేక్షి పరిశోధకుడిలో సునిశితమయింది. సాహిత్య సమాజ సంబంధ సంస్థాపనంలో గ్రంథ కర్త విశ్లేషణ సామర్థ్యం, బుద్ధివికాసం విశిష్టంగా రూపొందాయి. ఈ పాత్ర ఇలా ప్రవర్తించడానికి ఈ నేపథ్యం ఇలా ప్రభావం చూపిందని స్పష్టమైన అవగాహన పెంచుకొని, ఈ సమాజం పట్ల ఆర్ద్ర హృదయంతో దళితులపట్ల

అడ్డమూకలు లేని అనురాగంతో, పీడన పట్ల, పీడకులపట్ల మహర్షిఆగ్రహంతో పరిశోధకుడు సిద్ధాంత గ్రంథం రూపొందించాడు.

పరిశోధకుడు దళితుల కష్టాలు చదివి అల్లాడిపోయాడు. ఆ జీవితం చూచి ఆవేదన చెందాడు. వీటి పరిష్కారం కోసం తపన పడ్డాడు. ఈ జీవితాలు ఇలాగ్గే ఉండకూడదని తనలోతాను ఘర్షించాడు. ఈ ఘర్షణ నుంచి ఈ పరిశోధన గ్రంథం ప్రభవించింది.

ఉత్సాహం ఉరకలు వేసే యువకుడుగా ఎం.ఏ.లో చేరిన మా విద్యార్థి పరిశోధకుడుగా రాటుదేలి, డాక్టరు గా జీవనప్రాంగణంలో అడుగు పెడుతున్నాడు. ఈ సంఘంలోని చాలా జబ్బుల్లో ఏకొన్నయినా మా డాక్టరు నయం చేస్తాడని నాకు నమ్మకముంది.

డా. కె.లక్ష్మీనారాయణ మాకు పుత్రతుల్యుడు, మా పట్ల ప్రేమానురాగాల ప్రకటనంలో స్వచ్ఛ సుందరమయిన తేజస్వి. తనబుద్ధి శ్రమజన్య సౌందర్యం ఈ సిద్ధాంత గ్రంథం. తాను తన కృషి ఫలితాన్ని మాకు అంకిత మిస్తానంటే అంతకంటే ఆనందం లేదు. ఇది అనూహ్యమైన అదృష్టం.

ఇంతటి అభిమానం చూపిన డా.లక్ష్మీనారాయణ అంకితానికి అనుమోదనం తెలుపుతూ, కొడుకును కోడల్ని, మనుమళ్ళని హృదయ పూర్వకంగా భార్యా సమేతుణ్ణై ఆశీర్వదిస్తున్నాను.

సం :

కొలకలూరి ఇనాక్

# అంకితం

శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయ ఆచార్యుల్లో సర్వప్రథములుగా

దేశ విశ్వవిద్యాలయాంధ్రాచార్యుల్లో సర్వప్రథములుగా

స్వదేశ విశ్వవిద్యాలయ దళితాచార్యుల్లో సర్వప్రథములుగా

38 ఏళ్ళ పఠన పాఠన పరిశోధనల్లో అగ్రగణ్యులుగా

సృజన విమర్శన పరిశోధన సాహిత్య త్రివిక్రములుగా

దళిత సాంఘిక సాహిత్య ఉద్యమ రథసారథిగా

మా కోసం కన్నీటితో పరితపించే వాత్సల్యమూర్తిగా

మా అభ్యుదయానికి నిరంతరం పాటుపడే ప్రేమమూర్తిగా

అవతరించిన ఆదర్శమూర్తి

**ఆచార్య కొలకలూరి ఇనాక్** గారికీ

వారినిలా రూపొందించిన **శ్రీమతి కొలకలూరి భాగీరథమ్మ** గారికీ

భక్తితో చేతులు జోడించి ఈ గ్రంథం అంకితమిస్తున్నాను.

**...... కె. లక్ష్మీనారాయణ**

దళితోద్యమం పట్ల అభిమానంతో నాకు సహాయం చేసి ప్రోత్సహించాలన్న దృష్టితో రూ. 10,000/- ఆర్థిక సహకారాన్ని అందించిన పూజ్యులు, మధురహృదయులు పీడిత ప్రజోద్ధారకులు, త్యాగధనులు ఫాదర్ ఫెర్రర్ గారికి, వారికి నన్ను పరిచయం చేసి సహాయం చేయించిన వదాన్యులు శ్రీవై.వి. మల్లారెడ్డి గారికి, ఆర్థికంగా సహాయం చేసిన ఇతర పెద్దలందరికి కృతజ్ఞుణ్ణి.



శ్రీ ఫాదర్ ఫెర్రర్
వ్యవస్థాపకులు
రూరల్ డెవలప్‌మెంట్ ట్రస్ట్.
అనంతపురం.



శ్రీ వై.వి. మల్లారెడ్డి
డైరెక్టర్
రూరల్ డెవలప్‌మెంట్ ట్రస్ట్.
అనంతపురం.

1. శ్రీ పయ్యావుల వేంకటనారాయణ, కౌకుంట్ల, ఉరవకొండ తా॥ 2,000/-

2. శ్రీ యస్. ఆంజనేయులు, లిటిల్‌ఫ్లవర్ ఎడ్యుకేషనల్ సొసైటీ. అనంతపురం. 1,116/-

3. శ్రీ వి. ప్రభాకర్ చౌదరి, మున్సిపల్ ఛేర్‌పర్సన్, అనంతపురం. 1,116/-

4. శ్రీ బి. నారాయణ రెడ్డి, మాజీ. ఎమ్మెల్యే, అనంతపురం. 1,000/-

5. శ్రీ యస్. గంగాధర్, ఇన్‌స్పెక్టర్ ఆఫ్ పోలీసు, (పి.టి.సి) అనంతపురం. 1,000/-

6. శ్రీ యన్. శ్రీనివాసులు, యన్. మునిరత్నం మోటార్ సర్వీస్, అనంతపురం. 516/-

# విషయసూచిక

# కృతజ్ఞత

నేను యం.ఏ. పూర్తిచేసి జీవితాన్ని వెదుక్కోవడంలో పలు ఇబ్బందులకు గురవుతున్నపుడు, నన్ను చేరదీసి, నాలోని పిరికితనాన్ని పోగొట్టడంతో పాటు జీవితాన్ని విశ్లేషించి పరిశోధనమీద, సాహిత్యం మీద కొంత అవగాహన కలిగించి, నా అభిరుచికి అనుగుణంగా పరిశోధనాంశాన్ని ఇచ్చి, పర్యవేక్షణకు అంగీకరించి నాపరిశోధనాగ్రంథం అతిత్వరలో రూపుదిద్దుకోవడానికి, నాకు నేను ఉపయోగపడేలా చేసిన మాగురువర్యులు, పూజ్యులు, పితృసమానులు ఆచార్యకొలకలూరి ఇనాక్ గారికి శతాధిక కృతజ్ఞతాంజలులు.

నా కష్టాల్లో అప్పుడప్పుడు ఆర్థికంగా సహకరిస్తూ, నాపరిశోధనాంశం గురించి అనేక విషయాలను చర్చించి నా పరిశోధన పూర్తి కావడానికి సహకరించిన గురువర్యులు ఆచార్య ఆర్. చంద్రశేఖర రెడ్డి గారికి కృతజ్ఞుణ్ణి. నేనీ పరిశోధన చేయడానికి అవకాశం కల్పించిన విశ్వవిద్యాలయ అధికారులకూ, తెలుగు శాఖాధ్యాపకులకూ, గ్రంథాలయ అధికారులకూ, కృతజ్ఞతలు.

నా పరిశోధనకు అభిమానంతో తమ కథలను, విమర్శలను వెంటనే అందించిన రాష్ట్రవ్యాప్త రచయితలకూ, విమర్శకులకూ కృతజ్ఞుణ్ణి.

నా ఉన్నతిని కోరి ప్రతి చెమట బొట్టు నాకోసం ధారపోసి తన గుండెల్లో పెట్టుకొని నన్ను కాపాడి, నిరంతరం నాకోసం తపించి నన్ను ఇంతవాణ్ణి చేసిన నామాతృమూర్తి శ్రీమతి కె. అనంతమ్మకు ప్రణామాలు. నేను ఎప్పుడు ఇంటికి వెళ్ళినా కన్నబిడ్డ ఆప్యాయతను కనపరచి పలువిషయాల పట్ల సహాయ సహకారాలు అందించిన మాగురుపత్ని శ్రీమతి కొలకలూరి భాగీరధమ్మగారికి, నా పరిశోధనాంశం గురించి ఆసక్తితో పలువిషయాలు తెలియజేసిన అక్క డా॥ కుమారి మధుజ్యోతి గారికి, అన్న శ్రీ శ్రీకిరణ్, తమ్ముడు శ్రీ సుమకిరణ్‌లకూ కృతజ్ఞుణ్ణి.

నా పరిశోధన సుగమం కావడానికి డా॥ కె. ఆనందరావు, డా॥ వి. పోతన్నల పరిశోధన గ్రంథాలు హరిజనాభ్యుదయం - ఆధునికాంధ్ర కవిత్వం, హరిజనాభ్యుదయం - తెలుగు నాటకం, ఎంతో సహాయకారులయ్యాయి. నాపట్ల అభిమానంతో పలు సూచనలిచ్చిన డా॥ వి.పోతన్న గారికి కృతజ్ఞుణ్ణి. అలాగే నాకష్టసుఖాల్లో పాలుపంచుకొనే నా ధర్మపత్ని శ్రీమతి కె. రమాదేవికి, కుమారులు కె హేమంత్, కె. యశ్వంత్‌లకూ అభినందనలు.

నన్ను సాహితీలోకానికి పరిచయం చేసిన అన్నలాంటి శ్రీపాను గోటి కృష్ణారెడ్డి(ఆంధ్రజ్యోతి) గారికి సాహితీబంధువులు అనంతపురం లిటరరీ మీట్, వారికి సర్వదా కృతజ్ఞుణ్ణి.

ఈ పుస్తకం ముద్రణకు నోచుకోవడానికి శ్రమించిన అన్నలు శ్రీ యఫ్ ఇమామ్, డా॥జూపల్లె ప్రేంచంద్, శ్రీ.టి.శ్యాంప్రసాద్, శ్రీ బి. సాదక్‌వలి గార్లకు ప్రత్యేక కృతజ్ఞుణ్ణి.

ఈపుస్తకము ఇంత అందంగా తీర్చిదిద్దిన శ్రీ సాయిమేధా కంప్యూటర్ క్రియేషన్స్‌కాసం శ్రీనివాస్, బి. శ్రీనివాస్, ఐ. శ్రీనివాస్ గార్లకు, పద్మావతీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ యజమాని పి. శ్రీనివాస్ గౌడ్ గారికి మరియు అడిగిన వెంటనే ఆనందంగా ముఖచిత్రాన్ని తీర్చిదిద్ది ఇచ్చిన శిలా వీర్రాజు గారికి కృతజ్ఞుణ్ణి.

**రచయిత**

# ఉపోద్ఘాతం

1910వ సంవత్సరంలో పాశ్చాత్య సాహిత్య ప్రభావంచే తెలుగులో ఉద్భవించిన కథానిక సమాజానికనుగుణంగా తన స్థితిని మార్చుకుంటూ శాఖోపశాఖలుగా విస్తరించి నేటికి ఉన్నత శిఖరాలను అందుకొంది. సమాజ జీవితాన్ని పలుకోణాల్లో చిత్రించింది. పలుచీకటి కోణాలను వెలికి తీసింది. ఈ కథానికా సాహిత్యంలో దళితవాదం ఒక భాగం అయింది. కథానికా సాహిత్యం మీద ఇంతవరకు ఎక్కువ భాగం పరిశోధన, రచయితను దృష్టిలో ఉంచుకొనే జరిగింది. ఈ పరిశోధన రాష్ట్ర వ్యాప్తంగా వున్న దళిత కథానికా సాహిత్యం (1910-1995) సంపాదించి రచయిత నిష్టంగా కాక ఒక విషయ నిష్టంగా ఈ పరిశోధన రూపొందింది.

తరతరాలుగా హరిజనులు సమానతకు సంపదకు దూరమై, మర్యాదకు మన్ననకూ కడుదూరమై, కటిక దారిద్ర్యాన్ని అనుభవిస్తూ, సవర్ణుల దౌర్జన్యానికి దోపిడికి బలవుతూ వాళ్లకే ఊడిగం చేస్తూ, ఊరిబయట తలదాచుకొనే స్థితికి నెట్టబడ్డారు. ఆంగ్లేయుల రాకవల్ల, అనేక సంఘ సంస్కర్తల ప్రభావం వల్ల హరిజనుల జీవితంలో చిరుదీపం వెలిగింది. నాడు స్వాతంత్ర్యోద్యమంలోనూ, సంస్కరణోద్యమంలోనూ ఈ అస్పృశ్యత భాగమైంది. తదనుగుణంగా హరిజన కథానిక సాహిత్యం వెలువడింది.

ప్రథమాధ్యాయంలో తెలుగు సాహిత్యంలో ఉద్భవించిన కథానిక సంఘ సంస్కరణ ప్రభావంతో కాలానుగుణంగా తన ఉనికి మార్చుకొని ఎలా అభివృద్ధి చెందిందో తెలుపుతూ, కథానికా నిర్వచనాలను గురించి వివరించే కృషి ఉంటుంది. కథానిక అభివృద్ధి చెందడానికి వివిధ పత్రికలు చేసిన దోహదం రచయితల రచనల్లో కాలంతోపాటు మార్పు రావడం అభివ్యక్తమయింది.

ద్వితీయాధ్యాయంలో తెలుగు కథానిక అనేక శాఖలుగా సమాజాన్ని పరికించటం, రచయితలు ప్రజల జీవన విధానంలో వస్తున్న మార్పులూ, సంసార జీవితంలో సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా రూపొందిన మార్పులను గమనించి కాలానుగుణంగా సమాజ సమస్యలను చిత్రించి వాటి పరిష్కారం కోసం తపన పడటం, అభివ్యక్తమవుతూవచ్చింది.

తృతీయాధ్యాయంలో కథానికా సాహిత్యంలో హరిజన జీవితాన్ని గురించి రచయితలు ఒక్కొక్కరు ఒక్కొక్క విధమైన వస్తువును స్వీకరించి రచనలు చేయటం, బానిసత్వం, పాలేరుతనం, అంటరానితనం, మతాంతరీకరణం, రాజకీయ, ఆర్థిక, సాంఘికరంగాల్లో హరిజనులు ఎదుర్కొంటున్న సమస్యలను వారికి జరుగుతున్న అన్యాయాలను అక్రమాలను అవమానాలను రచయితలు తమ కథానికా సాహిత్యంలో తెలియజేయడం, ఈ సమస్యను చిత్రించడంలో హరిజన రచయితల ప్రయత్నం విషయాన్ని సక్రమంగా విశదం చేయగలగటం, అంతేగాక రచయిత జీవిత దృక్పథం విశదమవుతూవచ్చి, హరిజనులు మారడానికి ఎటువంటి ప్రయత్నాలు అవసరమో ఈ కథానికా సాహిత్యం తెలుపుతూ వచ్చింది.

చతుర్థాధ్యాయంలో హరిజన జీవన విధానాన్ని సంప్రదాయిక, ప్రయోగ దృక్పథాలు అనేక కోణాల్లో పరిశీలించడం, హరిజనులు తమస్థితిని మార్చుకోవడానికి ప్రయత్నిస్తే సవర్ణులు అడ్డుపడటం, తమస్త్రీల మాన, ప్రాణాలను హరింపచేయటం, సంప్రదాయిక దృక్పథంలో కనిపిస్తే, ప్రయోగ దృక్పథంలో హరిజనులు తమ ఉనికిని కాపాడుకొంటూ తమ హక్కులను సాధించుకోవడానికి చేసే ప్రయత్నాలు వ్యక్తమవుతూ రావడం, ఈ రెండింటి సమన్వయం దృక్పథ ద్వైవిధ్య తత్త్వంలో విశదం కొనసాగింది.

పంచమాధ్యాయంలో హరిజన పాత్రల మనస్తత్వాలు పలుకోణాల్లో దర్శన మివ్వటం, వీరి మనస్తత్వాలను మూడు భాగాలుగా చేసి పరిశీలించటం, యధాతధ దృక్పధంలో హరిజనులు పడే జీవన వ్యధలు స్త్రీల ఆవేదనలకు హద్దులేక పోవడం, పరిణామ దృక్పధంలో హరిజనులు తమ స్థితిని మార్చుకోవడానికి చేసే ప్రయత్నాలు కనిపించడం. హరిజనాభ్యుదయంలో హరిజనులు సవర్ణులతో సమానంగా ఉండటానికీ, తమ హక్కులను కాపాడుకొని సుఖంగా బ్రతకడానికీ చేసే ప్రయత్నాలు విశదమవుతాయి.

షష్టాధ్యాయంలో హరిజన కథానికా సాహిత్యాన్ని సృష్టించడంలో హరిజన రచయితలకు, హరిజనేతర రచయితలకు ఉన్న తేడాను వివరించడం, హరిజనేతర రచయితల్లో హరిజనుల జీవితంపై అవగాహన వున్న రచయితలు రచించేతీరును పరికించటం రాయలసీమ, ఆంధ్రా, ఉత్తరాంధ్ర, తెలంగాణా ప్రాంతాల కథానికా సాహిత్యంలో వివిధ ప్రాంతాల రచయితల మనస్తత్వం ప్రతిబింబించటం మొత్తం మీద కథానికా సాహిత్యంలో హరిజనాభ్యుదయం అభివ్యక్తమయిన తీరుతెన్నులు విస్పష్టంగా దర్శించటం, సాధ్యం, అవుతూ వచ్చింది.

# విషయసూచిక

# కృతజ్ఞత

నేను యం.ఏ. పూర్తిచేసి జీవితాన్ని వెదుక్కోవడంలో పలు ఇబ్బందులకు గురవుతున్నపుడు, నన్ను చేరదీసి, నాలోని పిరికితనాన్ని పోగొట్టడంతో పాటు జీవితాన్ని విశ్లేషించి పరిశోధనమీద, సాహిత్యం మీద కొంత అవగాహన కలిగించి, నా అభిరుచికి అనుగుణంగా పరిశోధనాంశాన్ని ఇచ్చి, పర్యవేక్షణకు అంగీకరించి నాపరిశోధనాగ్రంథం అతిత్వరలో రూపుదిద్దుకోవడానికి, నాకు నేను ఉపయోగపడేలా చేసిన మాగురువర్యులు, పూజ్యులు, పితృసమానులు ఆచార్యకొలకలూరి ఇనాక్ గారికి శతాధిక కృతజ్ఞతాంజలులు.

నా కష్టాల్లో అప్పుడప్పుడు ఆర్థికంగా సహకరిస్తూ, నాపరిశోధనాంశం గురించి అనేక విషయాలను చర్చించి నా పరిశోధన పూర్తి కావడానికి సహకరించిన గురువర్యులు ఆచార్య ఆర్. చంద్రశేఖర రెడ్డి గారికి కృతజ్ఞుణ్ణి. నేనీ పరిశోధన చేయడానికి అవకాశం కల్పించిన విశ్వవిద్యాలయ అధికారులకూ, తెలుగు శాఖాధ్యాపకులకూ, గ్రంథాలయ అధికారులకూ, కృతజ్ఞతలు.

నా పరిశోధనకు అభిమానంతో తమ కథలను, విమర్శలను వెంటనే అందించిన రాష్ట్రవ్యాప్త రచయితలకూ, విమర్శకులకూ కృతజ్ఞుణ్ణి.

నా ఉన్నతిని కోరి ప్రతి చెమట బొట్టు నాకోసం ధారపోసి తన గుండెల్లో పెట్టుకొని నన్ను కాపాడి, నిరంతరం నాకోసం తపించి నన్ను ఇంతవాణ్ణి చేసిన నామాతృమూర్తి శ్రీమతి కె. అనంతమ్మ కు ప్రణామాలు. నేను ఎప్పుడు ఇంటికి వెళ్ళినా కన్నబిడ్డ ఆప్యాయతను కనపరచి పలువిషయాల పట్ల సహాయ సహకారాలు అందించిన మాగురుపత్ని శ్రీమతి కొలకలూరి భాగీరథమ్మగారికి, నా పరిశోధనాంశం గురించి ఆసక్తితో పలువిషయాలు తెలియజేసిన అక్క డా॥ కుమారి మధుజ్యోతి గారికి, అన్నశ్రీ శ్రీకిరణ్, తమ్ముడు శ్రీ సుమకిరణ్‌లకూ కృతజ్ఞుణ్ణి.

నా పరిశోధన సుగమం కావడానికి డా॥ కె. ఆనందరావు, డా॥ వి. పోతన్నల పరిశోధన గ్రంథాలు హరిజనాభ్యుదయం - ఆధునికాంధ్ర కవిత్వం, హరిజనాభ్యుదయం - తెలుగు నాటకం, ఎంతో సహాయకారులయ్యాయి. నాపట్ల అభిమానంతో పలు సూచనలిచ్చిన డా॥ వి.పోతన్న గారికి కృతజ్ఞుణ్ణి. అలాగే నాకష్ట సుఖాల్లో పాలుపంచుకొనే నా ధర్మ పత్ని శ్రీమతికె. రమాదేవికి, కుమారులు కె హేమంత్, కె. యశ్వంత్‌లకూ అభినందనలు.

నన్ను సాహితీలోకానికి పరిచయం చేసిన అన్నలాంటి శ్రీపాను గోటి కృష్ణారెడ్డి(ఆంధ్రజ్యోతి) గారికి సాహితీబంధువులు అనంతపురం లిటరరీ మీట్, వారికి సర్వదా కృతజ్ఞుణ్ణి.

ఈ పుస్తకం ముద్రణకు నోచుకోవడానికి శ్రమించిన అన్నలు శ్రీ యస్ ఇమామ్, డా॥ జూపల్లె ప్రేంచంద్, శ్రీ. టి. శ్యాంప్రసాద్, శ్రీ బి. సాదక్‌వలి గార్లకు ప్రత్యేక కృతజ్ఞుణ్ణి.

ఈపుస్తకము ఇంత అందంగా తీర్చిదిద్దిన శ్రీ సాయిమేధా కంప్యూటర్ క్రియేషన్స్ కాసం శ్రీనివాస్, బి. శ్రీనివాస్, ఐ. శ్రీనివాస్ గార్లకు, పద్మావతీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ యజమాని పి. శ్రీనివాస్ గౌడ్ గారికి మరియు అడిగిన వెంటనే ఆనందంగా ముఖచిత్రాన్ని తీర్చిదిద్ది ఇచ్చిన శీలా వీర్రాజు గారికి కృతజ్ఞుణ్ణి.

**రచయిత**

# ఉపోద్ఘాతం

1910వ సంవత్సరంలో పాశ్చాత్య సాహిత్య ప్రభావంచే తెలుగులో ఉద్భవించిన కథానిక సమాజానికనుగుణ ంగా తన స్థితిని మార్చుకుంటూ శాఖోపశాఖలుగా విస్తరించి నేటికి ఉన్నత శిఖరాలను అందుకొంది. సమాజ జీవితాన్ని పలుకోణాల్లో చిత్రించింది. పలుచీకటి కోణాలను వెలికి తీసింది. ఈ కథానికా సాహిత్యంలో దళితవాదం ఒక భాగం అయింది. కథానికా సాహిత్యం మీద ఇంతవరకు ఎక్కువ భాగం పరిశోధన, రచయితను దృష్టిలోఉంచుకొనే జరిగింది. ఈ పరిశోధన రాష్ట్ర వ్యాప్తంగా వున్న దళిత కథానికా సాహిత్యం (1910-1995) సంపాదించి రచయిత నిష్ఠంగా కాక ఒక విషయ నిష్ఠంగా ఈ పరిశోధన రూపొందింది.

తరతరాలుగా హరిజనులు సమానతకు సంపదకు దూరమై, మర్యాదకు మన్ననకూ కడుదూరమై, కటిక దారిద్ర్యాన్ని అనుభవిస్తూ, సవర్ణుల దౌర్జన్యానికి దోపిడికి బలవుతూ వాళ్లకే ఊడిగం చేస్తూ, ఊరిబయట తలదాచుకొనే స్థితికి నెట్టబడ్డారు. ఆంగ్లేయుల రాకవల్ల, అనేక సంఘ సంస్కర్తల ప్రభావం వల్ల హరిజనుల జీవితంలో చిరుదీపం వెలిగింది. నాడు స్వాతంత్ర్యోద్యమంలోనూ, సంస్కరణోద్యమంలోనూ ఈ అస్పృశ్యత భాగమైంది. తదనుగుణ ంగా హరిజన కథానిక సాహిత్యం వెలువడింది.

ప్రథమాధ్యాయంలో తెలుగు సాహిత్యంలో ఉద్భవించిన కథానిక సంఘ సంస్కరణ ప్రభావంతో కాలానుగుణ ంగా తన ఉనికి మార్చుకొని ఎలా అభివృద్ధి చెందిందో తెలుపుతూ, కథానికా నిర్వచనాలను గురించి వివరించే కృషి ఉంటుంది. కథానిక అభివృద్ధి చెందడానికి వివిధ పత్రికలు చేసిన దోహదం రచయితల రచనల్లో కాలంతోపాటు మార్పు రావడం అభివ్యక్తమయింది.

ద్వితీయాధ్యాయంలో తెలుగు కథానిక అనేక శాఖలుగా సమాజాన్ని పరికించటం, రచయితలు ప్రజల జీవన విధానంలో వస్తున్న మార్పులూ, సంసార జీవితంలో సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా రూపొందిన మార్పులను గమనించి కాలానుగుణ ంగా సమాజ సమస్యలను చిత్రించి వాటి పరిష్కారం కోసం తపన పడటం, అభివ్యక్తమవుతూవచ్చింది.

తృతీయాధ్యాయంలో కథానికా సాహిత్యంలో హరిజన జీవితాన్ని గురించి రచయితలు ఒక్కొక్కరు ఒక్కొక్క విధమైన వస్తువును స్వీకరించి రచనలు చేయటం, బానిసత్వం, పాలేరుతనం, అంటరానితనం, మతాంతరీకరణం, రాజకీయ, ఆర్థిక, సాంఘికరంగాల్లో హరిజనులు ఎదుర్కొంటున్న సమస్యలను వారికి జరుగుతున్న అన్యాయాలను అక్రమాలను అవమానాలను రచయితలు తమ కథానికా సాహిత్యంలో తెలియజేయడం, ఈ సమస్యను చిత్రించడంలో హరిజన రచయితల ప్రయత్నం విషయాన్ని సక్రమంగా విశదం చేయగలగటం, అంతేకాక రచయిత జీవిత దృక్పథం విశదమవుతూవచ్చి, హరిజనులు మారడానికి ఎటువంటి ప్రయత్నాలు అవసరమో ఈ కథానికా సాహిత్యం తెలుపుతూ వచ్చింది.

చతుర్థాధ్యాయంలో హరిజన జీవన విధానాన్ని సంప్రదాయిక, ప్రయోగ దృక్పథాలు అనేక కోణాల్లో పరిశీలించడం, హరిజనులు తమస్థితిని మార్చుకోవడానికి ప్రయత్నిస్తే సవర్ణులు అడ్డుపడటం, తమస్త్రీల మాన, ప్రాణాలను హరింపచేయటం, సంప్రదాయిక దృక్పథంలో కనిపిస్తే, ప్రయోగ దృక్పథంలో హరిజనులు తమ ఉనికిని కాపాడుకొంటూ తమ హక్కులను సాధించుకోవడానికి చేసే ప్రయత్నాలు వ్యక్తమవుతూ రావడం, ఈ రెండింటి సమన్వయం దృక్పథ వైవిధ్య తత్త్వంలో విశదం కొనసాగింది.

పంచమాధ్యాయంలో హరిజన పాత్రల మనస్తత్వాలు పలుకోణాల్లో దర్శన మివ్వటం, వీరి మనస్తత్వాలను మూడు భాగాలుగా చేసి పరిశీలించటం, యథాతథ దృక్పథంలో హరిజనులు పడే జీవన వ్యథలు స్త్రీల ఆవేదనలకు హద్దులేక పోవడం, పరిణామ దృక్పథంలో హరిజనులు తమ స్థితిని మార్చుకోవడానికి చేసే ప్రయత్నాలు కనిపించడం. హరిజనాభ్యుదయంలో హరిజనులు సవర్ణులతో సమానంగా ఉండటానికీ, తమ హక్కులను కాపాడుకొని సుఖంగా బ్రతకడానికీ చేసే ప్రయత్నాలు విశదమవుతాయి.

షష్ఠాధ్యాయంలో హరిజన కథానికా సాహిత్యాన్ని సృష్టించడంలో హరిజన రచయితలకు, హరిజనేతర రచయితలకు ఉన్న తేడాను వివరించడం, హరిజనేతర రచయితల్లో హరిజనుల జీవితంపై అవగాహన వున్న రచయితలు రచించేతీరును పరికించటం రాయలసీమ, ఆంధ్రా, ఉత్తరాంధ్ర, తెలంగాణా ప్రాంతాల కథానికా సాహిత్యంలో వివిధ ప్రాంతాల రచయితల మనస్తత్వం ప్రతిబింబించటం మొత్తం మీద కథానికా సాహిత్యంలో హరిజనాభ్యుదయం అభివ్యక్తమయిన తీరుతెన్నులు విస్పష్టంగా దర్శించటం, సాధ్యం, అవుతూ వచ్చింది.

# 1. తెలుగు కథానికా వికాసం

సాహిత్య ప్రక్రియలకు ప్రాతిపదిక సామాజిక జీవితం, సమాజంలోని జీవన స్థితిగతులను చక్కగా ప్రతిబింబించేది ఉత్తమ సాహిత్యం. ఇటువంటి ఉత్తమ సాహిత్యం అన్ని సాహిత్య ప్రక్రియల్లోనూ ఉంటుంది. వాటిలో కథానిక ఒకటి. తెలుగులో కథానిక ఒక విశిష్ట స్థానాన్ని సంతరించుకొంటుంది.

సమాజంలో కథలు లిఖిత సారస్వతం కాకముందు నుంచే మౌఖికంగా వున్నాయి. యమ మయ సంవాదం, శునశ్శేపుని వృత్తాంతం మొదలైన వాటిని కథానికలుగా గుర్తించాలి. కథానికలు వెలువడక పూర్వమే కథానిక నీడలు వెలువడినాయి. హితోపదేశంలో ఘంటాకర్ణ కందర్పకేతు కథలు కథానికా లక్షణాలను కూడుకొన్నాయి. ఆ కాలంలో పద్య సాహిత్యం పట్ల అభిరుచి పెరిగిన కారణంగా వచన రచనా ప్రక్రియలకు అంతగా ఆదరణ లభించలేదు.

మనిషి అందుకోలేని అందాలను, ఆలోచనలనూ అందేలా చేస్తూ జీవితంలో పొందలేని సుఖాలను పొందాలనిపించే భావాల్ని కథానిక కల్గించాలి. కథారచయిత పదునాల్గు విద్యలందు అర్హవై నాలుగు కళలయందు ఆరితేరినవాడుకాకపోయినా ఆసక్తి కలవాడై వుండాలి. కమ్మని తేనియలాంటి రచనలు చేయాలనే తపనతో నిత్యం విషయాన్వేషకుడై వుండాలి. మానవ జీవితంలోకి ప్రవేశించి లోతులను తరచి చూసి అవ్యక్తానుభూతమైన అందాన్ని, ఆనందాన్ని తన అనుభవ పాఠంతో పాఠకులకు అందించేవాడై వుండాలి. మనిషి ఆదమరచినా ఎదమరచినా బాధలపాలవుతారనే నిజాన్ని తన రచనలద్వారా హెచ్చరించే మనస్తత్వాన్ని కల్గి వుండాలి. మానవునిలోని పిరికితనాన్ని, గాంభీర్యాన్ని ఈ రెండింటినీ తననుండి వేరు చేయడానికి రచయిత ప్రయత్నించాలి.

ప్రాచీన సాహిత్యంలోని 'కథ' అనే పదం ఆధునిక సాహిత్యానికి వచ్చేసరికి కొన్నిమార్పులతో కథానికగా పునరుద్ధరింపబడింది. దీనికి కొంత పాశ్చాత్య ప్రభావం కూడా వుందని చెప్పవచ్చు. కథానిక అనగా సమాజంలోని ప్రజాజీవనాన్ని తరచి చూసి వాటికి శిల్పవస్తు, మర్యాదలను చేకూర్చి ప్రాణం పోయడం. కథానిక దాదాపు ఒకేకాలంలో జర్మనీ, అమెరికా, ఫ్రాన్స్, రష్యా దేశాలలో కూడా ఉద్భవించిందని కథానికల గురించి వివిధ రచయితల నిర్వచనాలను పరిశీలించవచ్చును.

## 1.1 కథానిక లక్షణాలు :

కొందరు విద్వాంసులు కథానిక అంటే 'కథానకం' అంటూ వ్యవహరించారు. 'కథానకం' అంటే కథయొక్క పర్యాయపదం. వీరి దృష్టిలో కథానకం అంటే కార్య వ్యాపార ప్రయోజనం. కథానికను కొందరు పాశ్చాత్యులు ఈ విధంగా నిర్వచించారు:

" A short story must contain on and only one informing idea and that this idea must be worked. Out to its logical conclusions with absolute singleness of aim and directness of method"

- HenryHudson.

''ఒకే సంఘటనను వాస్తవమైనదైనా భూతకల్పనతో కూడుకొన్నదైనా చిత్రిస్తూ ఒకే సారి కూర్చుని చదువగలిగే ఒక సాహిత్య ప్రక్రియ చిన్న కథ. అది స్వతంత్రమై మెరుపులా మెరిసి, అద్భుతమైన అనుభూతుల్ని రేకెత్తిస్తూ సత్ఫలితాలను, సామ్యతను కలిగి వుండాలి. ఎత్తుగడనుంచి ముగింపు వరకూ సాఫీగా నడవాలి.''

ఎడ్గార్ ఎలెన్‌పో-

" A short story is a work of prose fiction and must of the terms for analysing the component parts the types and the various narrative techniques of the novel are applicable to the short story as well."

M.H.Abraham.-

కథానికా లక్షణాలు : భారతీయ సాహిత్యంలో అద్భుత విషయాలను వినిపించేవి పురాణాలు. వాటిలో అగ్ని పురాణానికి ఒక ప్రత్యేకత వుంది. కథానికా లక్షణాలను గురించి సంగ్రహంగా అగ్ని పురాణంలో ఉంది. అగ్ని పురాణంలో 337వ ఆధ్యాయంలో మనకు కథానికా లక్షణాలు కనిపిస్తాయి.

''భయానకం సుఖపరం గర్భే కరణో రస:
అద్భుత్తోంతే నసుక్తప్తార్థానోదాత్తాసాకథానికా''-4

1. కథానిక క్లుప్తంగా వుండాలి. దూరంగా సాగిపోక పొందికగా వుండాలి.
2. కథలో పెద్ద పెద్ద సమాసాలు, వర్ణనలు వుండరాదు.
3. పఠితను సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తే విచిత్రమైన సంఘటనలుండాలి.
4. కథాగర్భంలో కరుణ రసోత్పాదకమైన సన్నివేశములుండాలి.
5. పాఠకుడు ఊహించని అద్భుతమైన మలుపులో కథ ముగియాలి.

పై శ్లోకం ఈ లక్షణాలను తెలుపుతోంది.

అంతేగాక అగ్ని పురాణంలో చెప్పిన లక్షణాలను అర్వాచీన కాలంలో పాశ్చాత్య విమర్శ గ్రంథాలలోనూ చెప్పిన కథానికా లక్షణాలను సమన్వయం చేసుకొని కొన్ని లక్షణాలను ప్రతిపాదించారు. ''ఒకరకమైన ఎత్తుగడ, నడకతీరు, ముగింపు, పరిమిత పాత్రలు, ఆ పాత్రలకు చక్కని పోషణ వస్తు విన్యాసవైశిష్ట్యం, ఒకజీవితసత్యాన్ని ప్రతిపాదించటం అన్నింటినీ మించి వస్త్వైక్యముండి వినోదమో విజ్ఞానమో, వికాసమో కలిగించగలగి ఉండటం''5 కథానికా లక్షణంగా రూపొందించారు.

కథానికకు ''సంక్షిప్తత, అద్భుతమైన ముగింపు''6 చాలా అవసరం. ప్రపంచ కథానికా సాహిత్యంలో అత్యున్నత పదం అధిష్టించిన రచయితలు వీటిని పాటించారు. సంక్షిప్తత అనేది కథా వస్తువుమీద ఆధారపడి వుంటుంది. రచయిత ఎంచుకున్న వస్తువును బట్టి కథానిక పెరగవచ్చు లేదా తరగవచ్చు. రెండవ అంశం అద్భుతమైన ముగింపు. పాఠకుడిని తృప్తిపరిచేందుకు చమత్కారమైన ముగింపు అవసరం. ''అంతా అనుకున్నట్టే జరిగితే అది కథకాదు''7 అంటాడు మధురాంతకం రాజారాం. ''కథానిక అంతంలో ఆశ్చర్యంగా తెరపడటం ఎప్పుడూ చిన్న కథకు సత్ఫలితాలనిస్తుంది'' అంటాడు తాళ్ళూరి నాగేశ్వర రావు.

సామాన్యంగా పాఠకుడు కథను చదువుతున్నప్పుడు ఆదిమధ్యాంతాలను గమనిస్తాడు. ఆదిలో భయానకం, మధ్యలో కరుణరసం, అంతంలో అద్భుతరసం ఉండాలి. అప్పుడే పాఠకుడు కథను రసవత్తరంగా చదవడానికి ప్రయత్నిస్తాడు.

ఈనాటి కథానిక శిల్ప ప్రధానమైన సాహితీ లక్షణ ప్రక్రియ. ''కథానికకు శిల్పమే ప్రాణం'' అని శీలవీర్రాజు అభిప్రాయం. సంక్షిప్తత, ఏకాగ్రత, నిర్బరత అనునవి కథానికకు ప్రధానలక్షణాలు, కథానికలో నిర్దిష్టమైన జీవిత సంఘటన ఒక్కటి మాత్రమే చిత్రించబడుతుంది. సంక్షిప్తతవల్ల కథలో వేగం పెరుగుతుంది. రచయిత తన కథద్వారా సమాజానికి చెప్పదలచు కొన్న విషయం స్పష్టంగా చెప్పడానికి ప్రయత్నించాలి.

పాశ్చాత్య విమర్శకులు కథానికకు

| | | | |
|---|---|---|---|
| 1. | Brevity | 2. | Compatiability |
| 3. | Dependability | 4. | Plansibility |

అను లక్షణాలు ఉండాలన్నారు.

కథానికకు ఈ క్రింది లక్షణాలుండాలని తాళ్ళూరి నాగేశ్వరరావు అభిప్రాయపడ్డాడు. అవి

| | | | |
|---|---|---|---|
| 1.''కథావస్తు వు | 2. ఎత్తుగడ | 3. నిడివి | 4.వాతావరణం |
| 5.పాత్రల చిత్రణ | 6.శైలి | 7.గమనం | 8.సంభాషణలు |
| 9.క్లైమాక్స్ | 10.ముగింపు.''9 | | |

కథకు అయువుపట్టు కథావస్తువు. కథరాసేముందు రచయిత మనసులో కథావస్తువు సిద్ధంగా వుండాలి. కథావస్తువు నిత్యనూతనమై వుండాలి. ఒక వ్యక్తిలోగానీ సంఘంలోకాని పరిసరాల్లోగాని లోపాలనుగానీ బలహీనతలనుగాని హృదయానికి హత్తుకొనేలా చెప్పేటట్లు వుండాలి. కథాముఖంలో ఎత్తుగడ అవసరం. కథలను మొదలుపెట్టడంలో ఏకంగా పాత్రల్ని ప్రవేశపెట్టి సాధ్యమైనంత తక్కువ వ్యాఖ్యానాలతో చిత్రించడం తో సంఘటనలకు దారితీసే వాతావరణాన్ని కల్పించాలి. విటివిషయంలో కథలోని సంఘటనలూ, పాత్రలూ, వాతావరణం, ఒక స్థానం వద్ద నిలబడాలి. కథలోని వాతావరణ సృష్టికీ శైలికీ దగ్గర సంబంధ ముంటుంది. ఈ రెండింటికీ సంబంధం వున్నప్పుడే శిల్పం పటిష్టపడుతుంది. కథల్లో పాత్రలు స్వతంత్రంగా వుండాలి. రచయిత ప్రతిభకు శైలిక దగ్గర సంబంధ మంటుంది. ఈ రెండింటికీ సంబంధం వున్నప్పుడే శిల్పం పటిష్టపడుతుంది. కథల్లో పాత్రలు స్వతంత్రంగా వుండాలి. రచయిత ప్రతిభకు శైలి గీటురాయి. సులభమైన పదాలతో అవసరమైన వాక్యాలనే రాయాలి. గమనం వేగంగా వుండాలి సంభాషణలు సహజంగా, ముగింపు ఆశ్చర్యకరంగా వుండాలి.

''ఒక సంఘటననో లేదా రచయిత భావావేశమునో, సామాజిక జీవితమును ప్రతిబింబింప జేయుటయో లేక ముఖ్యపాత్రను తీసుకొని భావావేశమునో, సామాజిక జీవితమును ప్రతిబింబింప జేయుటయో లేక ముఖ్యపాత్రను తీసుకొని దాని స్వభావమును చిత్రించుట కథానికలందు ఇతివృత్తముగా నుండును. నవలలందువలె సుదీర్ఘవర్ణనలకుగాని, పాత్రలకుగాని, కాలమునకుగాని అవకాశముండదు. కథానికలో వస్తువునుబట్టి వర్ణనలుంటాయి.

''కథానికా నిర్వచనంగా కాని, కథానికా లక్షణంగా కాని కథాంశాలను గుర్తించాలి. కథావిషయం, కథకు ప్రాణమైన వస్తువు. సాధ్యమైనంత చిన్నదిగా వుండటానికి ప్రయత్నించాలి. కథాపాత్రలంటే కథావస్తువుకు లేదా ఇతివృత్తానికి అవసరమైన పాత్రలను తీసుకోవాలి. కథాకాలం అంటే కథ జరుగడానికి పట్టినకాలం. కథా సన్నివేశ సమయం. ఇది చాలా తక్కువగా కథాస్థలం కూడా ఒకే ప్రదేశం అయి వుండాలి''10 అని కొలకలూరి ఇనాక్ అభిప్రాయం.

కథ వస్తు ప్రాధాన్యమైతే కథానిక శిల్ప ప్రాధాన్యంగా వుంటుంది.

కథానికయందలి భాష వ్యవహారికంగా వుంటుంది. కొందరు రచయితలు మాండలికాన్ని కూడా వాడుకొన్నారు. రావిశాస్త్రి తూర్పు మాండలికం, కొడవటిగంటి కుటుంబరావు కథల్లో ఆంధ్రప్రాంతం మాండలికం కనబడుతుంది. నేటి సమాజంలో వెలువడుతున్న కథలన్నీ వ్యావహారికంలోనూ, మాండలికంలోనూ వుంటున్నాయి.

నేడు వచనరచనకు ప్రాధాన్యం హెచ్చింది. ముఖ్యంగా వచన ప్రక్రియల్లో కథానికా స్థాయి పెరిగింది. నేడు సమాజంలో పామరులు కూడా కథలను చెప్పుకోవడం పరిపాటి అయ్యింది.

ఆంగ్ల సాహిత్య ప్రభావంతో తెలుగులో వెలువడ్డ ప్రక్రియల్లో కథానిక ఒకటి. ఇది ఇతరవచన ప్రక్రియలకంటే వయస్సులో చిన్నదైనా బుద్ధిలో పెద్దదని చాటి చెప్పింది.

**1.2.తెలుగు కథానికా వికాసం:**

సాహిత్యం సర్వసాధారణంగా కాలానుగుణంగా పరిణామం పొందుతుంది. భిన్న కాలాల్లో వెలువడిన సాహిత్యం ఆయాకాలాల్లో ప్రయోగానికి లక్ష్యంగా నిలిచింది. ప్రాచీన సాహిత్యంలో కొంత సాహిత్యం ఎక్కువ మార్పులను పొందకుండా రాజసభల్లో ప్రాచుర్యాన్ని పొంది ప్రజాదరణ తగ్గి సన్నగిల్లిపోయింది.

పాశ్చాత్య సాహిత్య ప్రభావంతో తెలుగు సాహిత్యంలో నూత్న బానాలు అంకురించాయి. సంఘంలోనూసాహిత్యంలోనూవివిధ ఉద్యమాలు ప్రారంభమయ్యాయి. ఆ నేపథ్యములో తెలుగు కథానిక ఉద్భవించింది. అభివృద్ధి చెంది విస్తృత పాత్రను సంతరించుకొంది. తెలుగు సాహిత్యంలో ఉన్నత స్థానాన్ని ఆక్రమించుకొంది.

తెలుగు కథానిక 1910 ప్రాంతంలో మొదలైంది. అంతకుముందున్న కథావాఙ్మయం జానపద కథల రూపంలో వుండేది. కాశీమజలీకథలు, నలామరాజు కథ, యల్లమ్మకథ, పెద్దమ్మకథ, దేశింగరాజు కథ, కాంభోజరాజుకథ వంటి కథలు వుండేవి. ఇవి ఎక్కువ భాగం మౌఖికంగా వుండేవి.

క్రీ.శ. 19వ శతాబ్దంలో సమాజంలోని మార్పుకోసం అనేకమంది సంఘ సంస్కర్తలు ఉద్భవించారు. కథానికా సాహిత్య వస్తు విషయంలో మార్పువచ్చింది. గిడుగు రామమూర్తి వ్యావహారిక భాషోద్యమం భాషారంగంలోని శాస్త్రీయ దృష్టికి మార్గం ఏర్పరచింది. తెలుగు కథానిక రహదారిలో పడింది. భిన్నప్రయోగాలకు నాందిగా నిలచింది.

తెలుగులో సంపూర్ణ లక్షణాలను సంతరించుకొన్న తొలికథ గురజాడ అప్పారావు 'దిద్దుబాటు.' ఇది 1910 ప్రాంతంలో 'ఆంధ్రభారతి' పత్రికలో ప్రచురితమయింది. ఆ నాడు సమాజంలోని వేశ్యా పద్ధతిని వితంతు వివాహాలను గురించి సంఘ సంస్కరణోద్యమంలో భాగంగా ఈయన కథలు రాశాడు. ఈయన వ్రాసిన కథలు దిద్దుబాటు, మెటిల్డా, పెద్దమసీదు, మీపేరేమిటి, సంస్కర్తహృదయం. తొలిరోజుల్లో ఆంధ్రభారతి, అఖ్యాయిక, త్రిలింగ, సాహితి, భారతి, శారద, ప్రతిభ, ప్రబుద్ధాంధ్ర, గృహలక్ష్మి లాంటి పత్రికలు కథారచనలో రచయితలకు తోడ్పడ్డాయి. అప్పటినుండి కథానికల వ్యాప్తి విస్తృతమయ్యింది.

వేదం వెంకటరాయశాస్త్రి భోజకాళిదాసుకథలు. బేతాళపంచవింశతి, కథా సరి త్సాగరము అనే కథల సంపుటాలను వెలువరించాడు. ఇవి సంస్కృతం నుండి అనువాదం పొందాయి. ఇందులో చిన్న పెద్దకథలకు తేడావుంది. చిలకమర్తి లక్ష్మీనరసింహం రాసిన రాజస్థాన్ కథావళి,చమత్కార మంజరి, భారత కథామంజరి, చిత్రకథామంజరి, చిత్ర కథాగుచ్ఛం అనే కథల సంపుటులలో కథానికలని చెప్పుకోదగిన రచనలు కొన్నే ఉన్నాయి. 1911లో మల్లికాగుచ్ఛమను సంపుటిని మాడపాటి హనుమంతరావు రచించాడు. ఇందులో కొన్ని స్వరచనలు, కొన్ని ప్రేమ్‌చంద్ కథల అనుకరణాలు. ఈయన రాసిన హృదయ శల్యం కథలో మానవ మనస్తత్వాన్ని చక్కగా చిత్రించాడు. వెదురుమూడి శేషగిరిరావు 1914లో మద్రాసుకథలు రాశాడు. 1915లో ఆంధ్రపత్రిక దినపత్రిక అవతరించి తెలుగు కథానికకు మరికొంత దోహదం చేకూర్చింది. అప్పటి నుండి ప్రముఖులు కథా సాహిత్యానికి కృషి చేశారు.

''చింతా దీక్షితులు ఆధునిక కథా సాహిత్యంలోగురజాడ ప్రక్కనే చెప్పాల్సిన రెండవ కథకుడు. ఈయనకథల్లో పల్లెపట్టుల్ని పామరజన జీవనాన్ని కళ్లకు కట్టినట్లు చిత్రించాడు''. ఈయన స్వకీయ చరిత్ర, గాలిపాటు, అభిప్రాయభేదం, చెంచుదంపతులు, ఊరిపేరు మొదలైన కథలను రాసి కథక చక్రవర్తి అనే బిరుదు సాధించాడు. బాల్య చిత్తవృత్తి కనుగుణమైన కథలు రాయడంలో కూడా చింతా దీక్షితులు

మొదటివాడు. జాతకము, జన్మపరంపర, ఎవరుమంచినవారు అనే స్కెచ్ రచనలను కూడా వ్రాశాడు. తెలుగువారే తెలుగు కథను పోషించడం లేదని గమనించి తెలుగువారి సర్వతో ముఖాభివృద్ధిని కాంక్షించి తెలుగు కథలు రాసి తెలుగుజాతికి సమర్పించినవారు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి. ఈయన కథల్లో సంస్కరణ భావాలు కన్పిస్తాయి. తొలితరం కథా రచయితలలో వ్యావహారిక భాషకు తమ రచనల్లో ప్రాధాన్యమిచ్చిన విశిష్టుడాయన. ఈయన కథల్లో రామలక్ష్మి, ఇలాంటి తవ్వాయి వస్తే, తల్లిప్రాణం, మార్గదర్శి మొదలైనవి సంస్కరణ భావాలు కలిగిన ముఖ్యమైన కథానికలు, దాదాపు డెబ్బై కథలు రాశాడు. కథానికా సాహిత్య చరిత్రలో వేలూరి శివరామశాస్త్రిది విశిష్టస్థానం. ఈయన 1925-50 మధ్య కాలంలో కథానికలు రాశాడు. ఈయన కథల్లో ఉపనిషత్సూక్తులు కన్పిస్తాయి. ఈయన కథలు పాత, కొత్త మేలి కలయికను గుబాళించే రసగుళికలు. దాదాపు డెబ్బై కథలు వ్రాశాడు. వీటిలో వ్యత్యయం, అంతర్నాటకం, పెంపుడు చిలక, వివాహబలి, మాలదాసరి మొదలైన కథలు ముఖ్యమైనవి. మొక్కపాటి నర్సింహాశాస్త్రి కథల్లో హాస్యం తొణికిసలాడుతుంది. వీరి తొలి రచన స్కాట్ బిక్షువు. చావు తెలివి, గత్యంతరం, లక్ష్మి, చిత్రం మొదలైనవి వీరి కథలు.

స్త్రీవాద రచయితగా తెలుగు కథానికా సాహిత్యంలో ముద్రపడిన చలం సాహిత్యానికి విశిష్టస్థానముంది. ఈ రచయితను గూర్చి కె.సభా అన్నట్లు ''ఆధునిక తెలుగు కథారచన చరిత్రలో ఒక బ్రహ్మాండమైన ఉప్పెన''12 ఈయన కథల్లో సాటిలేని వాతావరణ సృష్టి, శక్తివంతమైన భాషా పాత్ర-చిత్రణ మానసిక స్థితి కన్పిస్తాయి. ఈయన స్త్రీ పురుష సంబంధాలపై కొన్ని నిర్దిష్ట అభిప్రాయాలను, స్త్రీకి పురుషుడిద్వారా, సమాజంద్వారా జరిగే అన్యాయాలను తెలియజేశాడు. దాదాపు వందకథలు రాశాడు. అందులో ఓ పువ్వు పూసింది, కర్మమిట్లా కాలింది, పునర్వివాహం, విచిత్రనళీయం, వితంతువు, ఆ రాత్రి అనే కథలు ముఖ్యమైనవి. తెలుగు సాహిత్యానికి విశేష సేవలందించిన విశ్వనాథ సత్యనారాయణ కథారచనలోనూ ఉన్నాడు. ఈయన వ్రాసిన ముగ్గురు భిక్షుగాళ్లు, మాక్లీదుర్గంలో కుక్క, ఏమిసంబంధం మొదలైన కథానికలు ప్రసిద్ధి పొందాయి. అడవి బాపిరాజు చిత్రకళాకారులు. భారతీయ శిల్పకళకు ఆంధ్రులే ఆద్యులని అభిప్రాయపడ్డాడు. ''స్వయంగా చిత్రకారుడగుటచే వారి కథనమునందు శైలియందును శిల్పవిన్యాసాలు గోచరించును''13 ఈయన కథల్లో అభ్యుదయ భావాలు కన్పిస్తాయి. ఆదర్శాలు పరవళ్లు త్రొక్కుతాయి. ఈయన అద్భుతమైన సన్నివేశాలతో భోగీరలోయ, హిమాలయ రశ్మి, తిరుపతి కొండ, నాగళి వంటి పెద్దకథలను రచించాడు.

తెలుగునాటి బాల్య జీవితం గూర్చి తల్లావఝల శివశంకర శాస్త్రి మురారి కథలు రాశాడు. కథావిధానాలలో ఆత్మాశ్రయవిధానంను ప్రవేశపెట్టాడు. క్రీ.శ. 1916 నుండి 1919 వరకున్న మధ్యకాలంలో కథానికా రచనలు విస్తృతమయ్యాయి. ఈ కాలంనాటి ప్రముఖ రచయితలు కొడవటిగంటి వెంకటసుబ్బయ్య, మునిమాణిక్యం, నోరి నర్సింహశాస్త్రి మొదలైనవారు ముఖ్యులు. వెంకటసుబ్బయ్య టాల్‌స్టాయ్ కథలను అనువదించటం ప్రారంభించి సుకుమారి, ఎర్రచీర వంటి స్వంత కథలను రాశాడు. తెలుగు కథానికా సాహిత్యంలో మునిమాణిక్యం గూర్చి ఆలోచిస్తే కాంతం కథలు జ్ఞప్తికొస్తాయి. హాస్యరసాన్ని పోషించడంలో ఈయన సిద్ధహస్తులు. ఈయన సృష్టించిన కాంతంపాత్ర అమోఘమైనది. కాంతం కథలు ఇప్పటికీ సజీవ మే. వీరి కథలలో మధ్యతరగతి దాంపత్య జీవితం రమ్యంగా చిత్రీకరించబడింది. కైఫీయత్తుల భాషలోనూ, శాస్త్ర పరిభాషలోనూ వీరి చెప్పిన కథలలో వైచిత్రి గోచరిస్తుంది. తెలుగు కథ పుట్టిన నాటికి తొమ్మిదేళ్ళు వయస్సున్న కరుణ కుమార తెలుగు కథకు మెరుగులు దిద్దారు. ఈయన అసలు పేరు కందుకూరి అనంతం. గ్రామీణ జీవితాన్ని, ముఖ్యంగా అట్టడుగు వర్గాల జీవనస్థితిగతులను గురించి రచనలు చేశాడు.

కరుణ కుమారకు ముందు తెలుగు కథానికా సాహిత్యంలో గ్రామీణుల కష్టనష్టాలను చిత్రించినవారు లేరు. గ్రామాల్లో పెత్తందార్లు చేసే దారుణ కృత్యాలు, ధనికుల దౌర్జన్యాలు జమీందారుల దురాగతాలు, అక్రమాలు హృదయాలకు హత్తుకొనేలా కథలు రాశాడు. ఈయన కథా సాహిత్యంలో ''జీవచైతన్యం తొణికిసలాడుతుందని ''14 మధురాంతకం రాజారాం అభిప్రాయం. ఈయన కథల్లో ద్వేషాన్ని పురికొల్పటం కాని విప్లవాన్ని రేకెత్తించటం కాని వుండదు. కొత్త చెప్పులు, పోలయ్య, అంటుజాడ్యం, బిళ్లల మొలత్రాడు, టార్చ్‌లైట్, కనువిప్పు ఈయన కథల్లో ముఖ్యమైనవి. భాషా విజ్ఞానంతో తనదైన శైలినొకదానిని ఏర్పరచుకొని కథలురాసిన రచయిత మల్లాది రామకృష్ణశాస్త్రి. జాతీయ అంతర్జాతీయ సాహిత్యంలోని చిన్న కథలను మధించి నాటిని జీర్ణించుకొన్న శాస్త్రి చేతిలో తెలుగు కథ రాను రాను తెలుగుతనాన్ని నిలునెల్లా సంతరించుకుంది. ఈయన కథలలో 'తాతగారికథలు' ముఖ్యామైనవి. ఈయన సెక్సు సమస్యలను తీసుకొని ఔచిత్యం పోషిస్తూ చిన్న కథలనెన్నింటినో రాశాడు. ఆరుద్ర అన్నట్లు ''మల్లాది రామకృష్ణశాస్త్రి జాతికథకుడు''.15

తెలుగుకథ పుట్టిన తొలిరోజుల్లో (1910-30) అనేకమంది రచయితలు సంఘ సంస్కరణోద్యమాన్ని వస్తువుగా స్వీకరించి కథలు రాయడానికి ప్రయత్నించారు. మూఢాచారాలను, బాల్యవివాహాలను నిషేధించాలని, స్త్రీలు విద్యావంతులు కావాలని, వితంతువులు పునర్వివాహం చేసుకోవడంలో తప్పులేదని చాటారు. వీరిలో వాసుదేవరావు, కొత్తపల్లి సూర్యారావు, రాయసం వేంకట శివుడు, వై. రాజగోపాలం, ముద్దా విశ్వనాథం, ఓలేటి సీతారామ్మూర్తి, బందా కనకలింగేశ్వర రావు, వెంపటి పురుషోత్తం ముఖ్యులు.

పానుగంటి లక్ష్మీనరసింహం శ్రీరామ, జై సీతారామ్, రామయ్య దుర్భర జీవితం, ప్లీడరుమెంట్లు నా వాచి వంటి కథలను రాశాడు. వాసుదేవరావు ఆలోచన, ఇదేనా పునర్వివాహం, మాటలు అనర్థం, సుప్రభాతము, కమ్మలు, చిట్టెమ్మపట్టుదల లాంటి కథలను రచించాడు. కొత్తపల్లి సూర్యారావు కథల్లో మహాపతివ్రత, ఉచితవేషము, ఆనందకందకుడు వంటివి ముఖ్యమైనవి. అలాగే రాయసం వేంకటశివుడు నాగరాజు, కళ్యాణి, నాగరత్నము, నిక్షేపము, విశాలాక్షి మొదలైన కథలను రచించాడు. వై. రాజగోపాలం రూపకృష్ణ, సహజసౌందర్యము, అక్రమ విభాగము, నారీహృదయం అనే కథలను రాశాడు. ముద్దా విశ్వనాథం అంత్యసేవ, నవ్య సంసారికా నిర్వహణం, మిత్రద్రోహి, నాకేమిసట్టింది, కాంతాకవనం కథలను, ఓలేటి నరసింహా పాతమ్మ కొత్తమ్మ మొదలైన కథలను, బందా కనకలింగేశ్వర రావు పందిరి క్రింద, గుక్కెడునీళ్ళు స్నేహలతాదేవి వంటి కథలను రచించారు. తెలుగు ప్రజల మనస్తత్వాన్ని కాచినడబోసినవాడు భమిడిపాటి కామేశ్వరరావు. ఈయన కథలు మడతపేచి, దానికేముంది, మాటలేనా మొదలైన కథల్లో ఈ లక్షణం విశదం అవుతుంది. కవులుగా, విమర్శకులుగా, కథానికా కర్తలుగా ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి ప్రసిద్ధుడు. ఈయన కథలు హనుమచ్ఛాస్త్రి కథలు, విజయ దశమి అనే పేరుతో సంపుటిలుగా వెలువడ్డాయి. శాస్త్రి రాసిన వివాహమంగళం, ప్రశస్తమైన కథ.

''వీరేశలింగం, గురజాడల సాహిత్య వారసత్వాన్ని ముందుకు తీసుకెళ్లిన మేధావి, మహా కథకుడు, సాహిత్యోద్యమశీలి16''కొడవంటిగంటి కుటుంబరావు. మొదటినుండి కుటుంబారావు కథల్లో ప్రత్యేకబాణి కన్పిస్తుంది. మధ్య తరగతి మానవుడి జీవితం స్పష్టంగా గోచరిస్తుంది. ఈయన కథల్లో విమర్శనాత్మక వాస్తవికతదే పైచేయి. కథనశైలిలో సారళ్యం, సూటిదనం, సంక్షిప్త వ్యంగం వుంటాయి. సాంఘిక ఇతివృత్తాలనే గాక శాస్త్రీయ సంఘటనలను కూడా దృష్టిలో పెట్టుకొని కథలు రాశాడు. ఈయన కథలు పాఠకుల్ని ఆలోచింపజేస్తాయి. సుడిగుండాలు, నిలవనీరు, ఆడజన్మ, పెంపుడు తల్లి, సత్యకాలపు మనిషి, నిరుద్యోగం వంటివి వీరికథల్లో ముఖ్యమైనవి. కథానికా సాహిత్యంలో బహు ముఖ ప్రజ్ఞాశాలి గోపీచంద్. కళకు ప్రయోజనం

వుండాలనీ, ఆ ప్రయోజనం సమాజానికి మేలు చేసేదిగా వుండాలని, అలాంటి రచననే రచయిత ఎన్నుకోవాలని అభిప్రాయపడ్డాడు. ''సజీవమైన భాషా, సరళమైన శైలీ, నిరాడంబరమైన శిల్పమూ, సూక్ష్మమైన మానసిక విశ్లేషణ, విప్లవాత్మకమైన భావసంపద, హేతుబద్ధమైన శాస్త్రీయ విజ్ఞానమూ సంగ్రహతా, వ్యంగ్యాత్మకమైన వ్యాఖ్యానాలు''17 వీరి కథల్లో కన్పిస్తాయి. వీరికథల్లో ధర్మవడ్డీ, కార్యశూరుడు, దేశం ఏమయ్యేట్టు, డబ్బు, డబ్బు, డబ్బు బస్సు ఆగింది- పోయింది వంటికథలు ముఖ్యమైనవి. మానవస్వభావాన్ని గురించి , వారిజీవితంలోని నైతిక సామాజిక సూత్రాల గురించి రచన చేశాడు.

తెలుగులో మనోవిశ్లేషణ సంబంధమైన విషయాలను కథలుగా రాసిన రచయితలు పాలగుమ్మి పద్మరాజు, బుచ్చిబాబులు, పాలగుమ్మి పద్మరాజు పాత్రలను , సన్నివేశాలను, అతిక్లుప్తముగా, అతిస్పష్టంగా కథలలో రచించాడు. వ్యక్తుల పరివర్తన ప్రభావాలను పరిశీలించి నిశితమైన వాస్తవిక దృష్టితో వ్యంగ్యమైన శిల్పం ఈయన కథలకు ఆయువుపట్టు. ''ఊహించి పాత్రలను స్పష్టించడం సంఘటనల్ని కూర్చడం నా స్వభావానికి సరిపడదు'' అంటాడు. తన పాత్రలన్నింటికీ ఆధారం వుండి తీరాలంటాడు. ఈయనరాసిన గాలివాన కథకు 1952లో న్యూయార్క్- హెరాల్డ్ పత్రికవారు నిర్వహించిన ప్రపంచకథల పోటీలో ద్వితీయ బహుమతి లభించింది. ఈయన కథల్లో పడవ ప్రయాణం, వానవచ్చిన రాత్రి, పంతం, ఉద్యోగాలు, ఇసుకతిన్నెలు మొదలైన వాటిలో శిల్పచాతుర్యం, పాత్రల స్పష్టత కన్పిస్తుంది. తెలుగు కథానికా సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన రచయిత బుచ్చిబాబు. ఈయన అసలు పేరు శివరాజు వెంకట సుబ్బారావు. ఈయన కథల్లో ఆశాప్రియ, దేశం నాకిచ్చిన సందేశం, చరిత్రకాగడా, దిగజారిన మాలిన్యం, నా గాజువేడ, అరకులోయలో కూలిన శిఖరం, నన్ను గురించి కథరాయవూ మొదలైనవి ముఖ్యమైనవి. ఈయన కథల్లో కవికి మించిన భావావేశం శక్తివంతమైన పదాలు కన్పిస్తాయి.

శ్రమజీవుల కష్ట సుఖాల్ని, మనసుల్నీ, మమతల్నీ వారి భాషలోనే కథరూపంగా చిత్రించిన రచయిత మాగోఖలే, సామాన్యజనుల ఆర్థిక జీవిత విధానం వారి దృక్పథాలూ, సమస్యలూ, పరిసరాలూ వీరి కథలలో కన్పించే కథావస్తువులు. వీరి రచనలో, వస్తువులో, శైలిలో, భాషల్లో నవ్యత కన్పిస్తుంది. స్మరణ తెలుగుకథల యితివృత్తాల్ని పాఠజనం జీవితాలకు సన్నిహితంగా తీసుకోవడంలో చేయి తిరిగినవాడు. వీరి కథల్లో బల్లకట్టు పాపయ్య వంటి కథలు ముఖ్యమైనవి. '' కథానికా సాహిత్యం జీవించి వున్నంతవరకూ తిలక్ కథలు నిత్యనూతనంగా వుంటాయి19''. ఈయన కథల్లో మానవతా దృక్పథంతోపాటు హేతువాద దృక్పథం కూడా కనబడుతుంది. విప్లవధోరణి వుండదు. కథ వీరిచేతిలో సానపట్టిన వజ్రంవలె రాణిస్తుంది. కథల విషయంలో కూడా అతని అక్షరాలు కన్నీటి జదులతో తడిసిన దయాపారావతాలు. ఈయన కథలను 1961లో ఏలూరులోని ప్రజాప్రచురణ సంస్థ ''ఊరి చివర యిల్లు'' అనే పేరుతో సంపుటిగా ప్రచురించింది. బుద్ధవరపు చిన కామరాజు 'తూలికాభూషణ్ ' అనే పేరుతో ఋణానుబంధం, బ్రతికిన దినాలు, లచ్చితల్లి మెరీనాతీరే వంటి కథలను రచించాడు. వీరికథల్లో అమాయకులైన కొండవాళ్లను, నకిలీ పోలీసులు చేసే రాక్షసకృత్యాలు కన్పిస్తాయి.

1936-45 కాలంలో జాతీయోద్యమ ప్రభావం వల్ల అనేక కథానికలు రచించారు. వారిలో వెంపటి నాగభూషణం, కవికొండల వెంకటరావు, టేకుమళ్ల కామేశ్వరరావు, పూడిపెద్ది వెంకటరమణయ్య, చిలుకూరి నారాయణ రావు, అందే నారాయణస్వామి ముఖ్యులు. వీరు ఉద్యమ కాలంలో సామాజిక స్థితిగతులను , అట్టడుగువర్గాల జీవన స్థితులను తమ కథల్లో చిత్రించారు. వీరి కథల్లో దాదాపు ఉద్యమ స్ఫూర్తి గోచరమౌతుంది.

వెంపటి నాగభూషణం తలనీలాలు, వన్నెచిన్నెలు, వెలుగునీడలు, వెన్నెల పరుగులు, అవకతవకలు, తప్పటడుగులు, మూడు వలపులు మొదలైన కథానికలను, అలాగే కవికొండల వెంకటరావు రక్తి, బికారీ, మేదరసొర్గం వంటి కథలను టేకుమళ్ల కామేశ్వరరావు పీర్లపండుగ, సౌందర్య, ప్రేమచిత్రాలు, తీర్థంకుడి రెండవ దర్శనం, సహగమనం, నందన కరువు, నియోగీవైది వంటి కథలను, ఇదేధోరణిలోనే కుబేరపుష్పకం, అమ్మతల్లి, గోరచిలుక, అలుక అనే కథలను, పూడిపెద్ది వెంకటరమణయ్య రచించారు. తెలుగు సాహిత్యంలో మొట్టమొదట డాక్టరేట్ సంపాదించిన చిలుకూరి నారాయణ రావు 'తరువాత' అనే కథను, అందే నారాయణస్వామి పుత్రసంతానం, పరివర్తన, సంఘసంస్కర్త మొదలైన కథానికలను రచించారు. ముఖ్యంగా సమాజ సంస్కరణ, ధార్మిక దృష్టి , గ్రామజీవితచిత్రణ, గ్రామస్థుల మనస్తత్వ పరిశీలన వీరి కథలకు ఆయువుపట్టు. ''తెలుగు నుడికారాన్ని పుణికి పుచ్చుకొని సహజత్వంతో జాతీయతతో ఆకర్షకమగు శైలివీరిది''20.

తెలుగు కథానికా సాహిత్యాన్ని పరిపుష్టం చేసి చరిత్రకెక్కిన చరితార్థుల్లో ఒకడు చాగంటి సోమయాజులు ఉత్తమ వ్యక్తిత్వం, ఆదర్శప్రాయమైన జీవితం కల్గిన ఈ రచయిత ఉన్నత విలువలు గల సాహిత్యాన్ని సృష్టించాడు. చాసో కథలన్నింటిలోనూ తెలుగువాడి జీవితం కన్పిస్తుంది. పాత్రోచితమైన సంభాషణలు కన్పిస్తాయి. చాసో ప్రతికథలోనూ అపురూప కళాకారునిగా కన్పిస్తాడు. 'తెలుగు కథను ప్రగతి శీలమైన మలుపు తిప్పడంలోనూ ప్రయోజనకరమైన దిశను నిర్దేశించడంలోనూ ప్రధానమైన పాత్రను నిర్వర్తించారు''21. ఈయన రాసిన కుంకుడాకు, కుక్కుటేశ్వరం, బొండుమల్లెలు, వాయులీనం, ఎందుకు పారేస్తావు నాన్న వంటి కథల్లో మధ్యతరగతి మానవుడి జీవన స్థితిగతులు కన్పిస్తాయి. రావూరి భరద్వాజ 1943-44 నుండి కథా రచన చేస్తున్నాడు. ''ఒక వ్యవస్థమీద కోపం కొద్దీ ఒకపదం మీద మోజుకొద్దీ కొన్ని సన్నివేశాలు కదిలించిన కారణంగా కథలు ''22 రాస్తున్నాడు. కథారచనలో అనేక ప్రయోగాలు చేసిన వారిలో ముఖ్యుడు. ఈయన కథల్లో గోడలులేని జైలు, లక్కబొమ్మలు, వేకువ, ఈడొచ్చినకథ మొదలైనవి ముఖ్యమైనవి. కొందరు ముందుతరం రచయితలలాగానే జీవితావగాహనను ఇతరులతో పంచుకోవడానికి కథలు రాస్తున్నవారు కాళీపట్నం రామారావు. వీరి కథలు అట్టడుగు సమాజంను జీవుల భుజం తట్టిలేపుతాయి. కథాసాహిత్యం వున్నంతవరకూ వీరికథలు చిరస్మరణీయాలే. యజ్ఞం, ఆర్తి, పలాయితుడు, శిక్ష, అవిద్య మొదలైనవి వీరికథల్లో ముఖ్యమైనవి. ఈ నేపథ్యంతోనే కొనకళ్ల వెంకటరత్నం సాంప్రదాయం, అతడు ఇకరాడు, మనిషి , మునిపల్లెరాజు అరణ్యంలో మానవయంత్రం; కళ్యాణసుందరీ జగన్నాథ్, అలరాస పుట్టిళ్లు వంటికథలు మనకు స్ఫూరిస్తాయి.

రావిశాస్త్రి కథానికా సాహిత్యంలో సామాన్య మానవుల గాథలు కన్పిస్తాయి. ఈయన నిజ జీవితంలో వేటిని చూస్తాడో దానినే కథగా మలుస్తాడు. వీరి కథల్లో ఉత్తమ పాత్ర చిత్రణ ఉత్కృష్టమైన శిల్పమూ, నిండైన నాటకీయత, వాస్తవిత కన్పిస్తాయి. కవిత్వరంగానికి శ్రీశ్రీ లాగా వచన సాహిత్యానికి సంభంధించి రావిశాస్త్రి మార్క్సిస్ట్ దృక్పథంగల రచయితగా పేరుపొందాడు. సారాకంపు కొట్టుకుంటూ, కోర్టు జీవితపు ఛలోక్తులతో పలుకరిస్తున్న అభాగినుల జీవితాన్ని దయనీయంగా చెబుతాయి. ఆరు సారాకథలు, కలకంఠి, బుక్కులు వంటి కథానికల్లో సమాజంలోని వర్గవైషమ్యాలు కన్పిస్తాయి. రాయలసీమలో తొలికథారచయిత కె. సభా తెలుగునాట పల్లెప్రజల జనజీవితాన్ని కళ్లకు కట్టినట్లు చిత్రించగలిగాడు. ఈయన తాకని సాహిత్య ప్రక్రియ అంటూలేదు. ఈయన కథలను బంగారు, పాతాలగంగ, నీటిదీపాలు అనే సంపుటాలుగా ప్రచురించాడు. చెరుకుపల్లి జమదగ్ని శర్మ జమదగ్ని అనే పేరుతో చిలుక - గోరింకా, అన్నదమ్ములు, మరుపురాని ఆవూరు, బళ్లోకి వెళ్లాలి అనే కథలను శిల్ప వైశిష్ట్యంతో రచించాడు.

ఈ కథలు నోరులేని మూగజీవాలను ఆలంబనంగా గ్రహించి మానవ పరివర్తన మాలిన్యాన్ని అధిక్షేపించేవి. అలాగే పాపికొండలు అనే కథల సంపుటిని మద్దిపట్ల సూరి వెలువరించాడు. మెతుకుమల్లి వెంకటనరసింహ ప్రసాదరావు 'హితశ్రీ' పేరుతో కథారచన చేస్తున్నాడు. ''సంఘంలో వ్యక్తి మారాలి. వ్యక్తి సంస్కరించబడకుండా సమాజం సంస్కరింపబడాలంటే కుదరదు. సాటి మనిషికి సహాయపడే సంస్కారం పెరగాలి''23 అంటారు. ఈయన కథలు కథాసాగరం, హితశ్రీ కథలు, గులాబిపువ్వు, సిగరెట్టు, జరీఅంచు, కథామంజూషిక అనే సంపుటులుగ వెలువడినాయి. అలాగే అవసరాల రామకృష్ణారావు నాకు సర్వం, నీకు నేను, ఎవడితోనైనా లేచిపోరాదు, సామాన్యుడు సర్కారువారూ, గాంధీగారి ఖరీదువంటి కథలను రచించాడు. తాళ్ళూరి నాగేశ్వరరావు మానవత్వం, గెజిటెడ్ ఆఫీసర్ భార్య, నిజానిజాలు, ఆలోచన, అనుభూతి, మావూరికథలు వంటి కథలను శిల్ప వైశిష్ట్యంతో రచించాడు. తెలుగులో రమ్యమైన హాస్యమును కల్పించిన రచయిత ముళ్లపూడి వెంకటరమణ. వీరి కథనికలలో జనతాఎక్స్‌ప్రెస్, లజ్‌కార్నర్, ఆకలి ఆనందరావు, వేట, సాక్షి , కానుక మొదలైనవి ముఖ్యమైనవి.

తెలుగు కథానికా సాహిత్యంలో మధురాంతకం రాజారాం ప్రసిద్ధుడు. ''ఆధునిక ప్రమాణాలకు దూరంగా పట్టణాలకు ఎడంగా ప్రాచీన సంప్రదాయ బద్ధంగా కలుషితం కాని జీవితంతో వెలుగుతున్న పల్లెపట్టులు ఈ కథారచయిత కథలకు ఆటపట్టులు ''24 అన్నాడు. కొలకలూరి ఇనాక్. ఈయన కథలన్నింటిలోనూ వారి వ్యక్తిత్వం తెలుగుదనం నిండుగా కన్పిస్తాయి. పురుషపాత్రలు అన్ని కోణాల నుండీ కన్పిస్తాయి. ఈయన సాహిత్యానికి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు, శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేటుని అందజేశాయి. ఈయన కథలను కేంద్ర సాహిత్య అకాడమి భారతీయ భాషల్లోకి అనువదించడానికి ప్రయత్నిస్తుంది. దాదాపు మూడువందల కథలు రాశాడు. అందులో కుంపట్లో కుసుమం, అజ్ఞాతవాసం, మాతృసప్తకం, మర్రిచెట్టు వంటి కథలు ముఖ్యమైనవి. తెలుగు కథానికా సాహిత్యానికి నిశిష్టసేవలందించినాడు కొలుకలూరి ఇనాక్. దళితతరం కథారచయితలకు, దళితుల అభ్యుదయానికి ఆదిగురువు. ఈయన కథల్లో బడుగు వర్గాల జీవనస్థితిగతులు చిత్రితమయ్యాయి. కథా కథనంలో ఆశ్చర్య, అవాస్తవాలకు చోటుండదు. ఈయన ఊరబావి కథకు 1986లో సాహిత్య అకాడమి ఉత్తమ బహుమతిని ప్రదానం చేసింది. దళితుల విముక్తికోసం సంపూర్ణ సాధన, హేతుబద్ధం, చైతన్యమార్గం వీరి కథల్లో కన్పిస్తుంది. వీరి కథల్లో ''అతిసామాన్య జీవితాలు రోడ్డు ప్రక్క జీవితాలు, పాకలలో జీవితాలు, లారీడ్రైవర్‌లు, కల్లుపాకలు, కిల్లీకొట్లు, సమాజంలో తక్కువవాళ్లను కొనేవారి జీవితాల్లోని సమస్యలు ''25 కన్పిస్తాయి. తెలుగు కథానికా స్థానాన్ని నిలబెట్టిన గాలివానకు ఊరబావి అండగా నిలిచింది. ఈయన కథలను గులాబి నవ్వింది, భవానీ, ఇదాజీవితం, ఊరబావి, సూర్యుడుతలెత్తాడు అనే సంపుటులుగా ప్రచురించాడు. కలువకొలను సదానంద తమవంతు కృషిని తెలుగు కథానికా సాహిత్యానికి అందించాడు. క్రొవ్విడి లక్ష్మన్న కథల్లో నిండైన తెలుగుదనంతోపాటు, పసందైన అలంకారాలు, సమయస్ఫూర్తి, గల లోకోక్తులతో పాత్రోచిత భాషగల సంభాషణలతో అద్భుతమైన సన్నివేశాలు కన్పిస్తాయి.

రాచమల్లు రామచంద్రారెడ్డి ప్రగతి స్ఫురణతో 'అలసిన గుండెలు' అనే కథా సంపుటిని ప్రచురించాడు. అలాగే గంగినేని వెంకటేశ్వరరావు ఒన్‌పాయింట్ ప్రోగ్రామ్‌లాంటి కథలను రచించారు. బీనాదేవి కథల్లో 'చావడానికి సిద్ధంగా వున్న రోగులదగ్గర నుండి డబ్బులు గుంజే ఆసుపత్రి వైద్యులూ వ్యభిచారానికి రక్షకులుగా వున్న ప్రభుత్వ అధికారులు ఇంకా లారీడ్రైవర్‌లు, క్లీనర్‌లు, కడుపు నింపుకోవడంకోసం మానాన్ని అమ్ముకొనే బజారుబిడ్డలు''26 కన్పిస్తారు. తోటి మనుష్యులకు తెలియుని, తెలిసినా పట్టించుకోని ప్రపంచదర్శనం ఈ కథల్లో స్ఫురిస్తుంది. పురాణం సుబ్రహ్మణ్య శర్మ కథల్లో చౌరవైన సంభాషణలు వ్యంగ్యం

వ్యక్తమవుతూ వుంటాయి. న్యూయార్క్-హెరాల్డ్ ట్రిబ్యూన్ వారు నడిపిన ప్రపంచ కథానికల పోటీకి పంపడానికి ఎన్నికచేసిన కథల్లో ఈయన రాసిన 'నీలి' కథకు మొదటి బహుమతి వచ్చింది. '' శ్రీపాదలోని సమగ్రదృష్టి ,మల్లాది వారిలోని కళాసృష్టి.''27 ఈయన కథల్లో అందంగా మేళవించింది. మల్లెపందిరి, అభిద, కులపాలిక, జ్వలిత జ్వాల వంటి కథల్లో మధ్యతరగతి కుటుంబంలోని ముద్దుముచ్చట్లు చిత్రించబడ్డాయి.

వాకాటి పాండురంగారావు కథల్లో వాస్తవికత, ఆదర్శనం, ఆర్ద్రత కన్పిస్తాయి. ఈయన కథాసాహిత్యానికి తెలుగు విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేటును ప్రసాదించింది. ఈయన కథల్లో ఆర్. చక్రారావు కథ, పాముల నిచ్చెన, రెండు రెక్కలవాడు, బ్రతుకన్నది ఒక వరం, సృష్టిలో తీయనైనది వంటి కథలు ముఖ్యమైనవి. నగ్నముని బీదల దయనీయ గాథల్ని మండే గుండెల్లో హృదయాలు కదిలించేలా చెబుతాడు. నీరికథల్లో ఆకలి తీరక అర్థరూపాయికి, ఒక రొట్టెముక్కకి మానాన్ని అమ్మకొనే అభాగినులు, సంసారం గడుపుకోలేక కాబూలీవాలా విషవలయాల్లో చిక్కుకొన్న వాళ్ల బాకీలు తీర్చలేక భయంతో మానసిక వ్యధను అనుభవిస్తున్న మధ్యతరగతి మానవజీవితం కన్పిస్తుంది. ఈయన విలోమ కథలు ముఖ్యమైనది. పిచ్చేశ్వరరావు గొప్ప తెలుగు కథకుల్లో ఒకరు. కమ్యూనిష్టు భావజాలం గల రచయితగా బొల్లిముంత శివరామకృష్ణ ఒక తరం పాఠకులకు పరిచయస్తుడు. వీరి కథల్లో వర్గసంఘర్షణ వుంది. వీరి కథల్లో ప్రతిఫలం, పేదరికం, పాలేరు వంటివి ముఖ్యమైనవి.

సున్నితమైన మనోవృత్తులను గ్రహించి సుందరంగా మలచిన కథకుడు మంజుశ్రీ (అక్కిరాజు రమాపతిరావు ). ఈయన కథల్లో అవతలివైపు, అగ్నిపుష్పం, వానలో తడిచిన మనిషి, రైలు పడిపోయింది, మంచు కురిసిన రాత్రి మొదలైనవి ముఖ్యమైనవి. ఆర్.యస్. సుదర్శనం రచించిన కాలం తెచ్చిన మార్పు, మొగలిపువ్వు, ఆత్మజ్ఞానం, అమృతుడు వంటి కథలు అతని రచనా నైపుణ్యానికి నిదర్శనం. అమరేంద్ర దాదాపుగా 1962 ప్రాంతము నుండి కథలు వ్రాస్తున్నాడు. ఈయన కథలలో గతంలో వెలుగు చూడని వివిధ సమస్యలు, జీవిత వాస్తవాలు కన్పిస్తాయి. ఈయన ఎక్కువ భాగం ప్రథమ పురుషలో కథను మొదలుపెడతాడు. ఈయన కథల్లో కూలిన శిఖరాలు సంధ్యారాగం, నిష్క్రమణ, రాగమాలిక మొదలైనవి ముఖ్యమైనవి. తెలుగు కథానిక సాహిత్యానికి సేవచేయడంలో తన కర్తవ్యాన్ని నిర్వర్తిస్తున్న రచయిత కేతు విశ్వనాథరెడ్డి, గాఢమైన జీవిత వాస్తవికత వీరి కథల్లో వుంటుంది. బడుగు వర్గాల జీవన స్థితిగతులు దర్శనమిస్తాయి. నిత్యం కూలికి వెళ్తేగాని కడుపునిండని కార్మికులు, స్వార్థంకోసం కార్మికుల జీవితాలను బలిచేస్తున్న అధికారులు కన్పిస్తారు. వీరి కథలను జప్తు, కేతు విశ్వనాథరెడ్డి కథలు అనే సంపుటాలుగా ప్రచురించినాడు.

సమాజంలో అట్టడుగు వర్గాల జీవన స్థితిగతులను గురించి కథలు రాయడంలో పులికంటి కృష్ణారెడ్డిని చెప్పాలి. ''ఈయన ఆలోచనే కథారచనకు ఆదిగురువు''28 ఈయన దాదాపు నూటాయాభై కథలను రచించాడు. ఈయన కథల్లో ముత్తడు గొప్పోడు, చెంబుకొక గంగ, కొమ్మలు, సబ్బు వంటి కథలు ముఖ్యమైనవి. అలాగే బలివాడ కాంతారావు సభ్యత, మంచిముత్తెం, పాడులోకం - పాడుమనుషులు వంటి ఉత్తమ కథలు రచించాడు. బి.యస్. రాములు కథల్లో వ్యక్తిత్వం, ఉద్యమస్ఫూర్తి స్ఫురిస్తుంది. జీవితాన్ని అవగాహన చేసుకొని వాటిని కథారూపంగా మలుస్తున్న రచయిత బోయ జంగయ్య. ఈ కథల్లో జీవిత చిత్రణ ఉంది. ఓ లక్ష్యం, ఓసూత్రం రన్నవుతుంది. ఈ వ్యవస్థలో ఎవరైతే బాధపడుచున్నారో వాళ్ల బాధల్ని యాక్చువల్‌గా రాశాడు''29 ముఖ్యంగా తెలంగాణాలో జరుగుతున్న ఘోరాలకు ఈయన కథలు ప్రతిబింబాలు. ఈయన కథలను ఎచ్చరిక, దున్న అనే సంపుటాలుగా ప్రచురించాడు. రాయలసీమలోని సామాన్య జనుల జీవన స్థితిగతులను గురించి అవగాహనతో కథలు రాసిన రచయిత సింగమనేని నారాయణ. సాహిత్యంలోనైనా రైతును బ్రతికించాలని తపనపడుతాడు. ఈయన జూదం కథల సంపుటిని వెలువరించాడు. ఈయన వ్రాసిన అడుసు కథ థానాసభలకు ఎంపికయ్యింది.

1956-65 ప్రాంతంనుండి కొందరు రచయితలు సామాజిక స్పృహతో పరిసర సామాజిక జీవితం నుండి ప్రేరణ పొంది కథానికలు రాస్తున్నారు. వీరిలో కొమ్మూరి వేణుగోపాలరావు, వడ్లపట్ల దయానందం, ద్రోణంరాజు కృష్ణమోహన్, ప్రేమ్‌చంద్ర, ఇసుకపల్లి లక్ష్మీ నరసింహశాస్త్రి, ఎస్. పార్థసారధి, వల్లంపాటి వెంకటసుబ్బయ్య, భమిడి పాటి రామగోపాలం ముఖ్యులు. సమాజంలో తెలుగు పత్రికలు ప్రారంభమైన పిదప కథానికా రచనల సంఖ్య పెరిగిపోయింది. బాలబాలికలకు పత్రికలు ప్రారంభమై వారి నాకర్షించుటకు చిన్న చిన్న కథలు ఆవిర్భవించాయి. ఈ కథలు ఇతర సాహిత్య ప్రక్రియల కన్నా అధిక ప్రాధాన్యంను సంతరించుకొన్నవి. అంతేగాక పత్రికలు యువరచయితలను ప్రోత్సహపరచడం కోసం వాసిలేకున్నా కథలను ప్రచురిస్తున్నాయి. రేడియోలు కూడా కథా సాహిత్యానికి తమవంతు కృషిని అందిస్తున్నాయి.

వస్తు శిల్పంలో అత్యంత వాస్తవికతను ప్రదర్శించి తెలుగు కథలో ఒక వినూత్నపు కోణాన్ని వెలికితీసినవాడు అల్లం రాజయ్య, ఈయన కథల్లో బడుగువర్గాల జీవన స్థితిగతులు, తెలంగాణా పోరాటం దర్శనమిస్తాయి. ఎదురుతిరిగితే, సృష్టికర్తలు, బంతిపువ్వు లాంటివి ఈయన కథల్లో ముఖ్యమైనవి. తోలేటి జగన్నాథరావు కథల్లో లోకజ్ఞత చదివించేగుణం, సున్నితమైన వ్యంగ్యం స్ఫురిస్తాయి.

కథానికా రచన చేయడంలో రచయిత్రులు కూడా వున్నారు. కథానికా రచన ప్రారంభమైన తొలిరోజుల్లోనే చుండూరి రమాదేవి 'ధర్మతల్లి', చ.రా, 'కొత్తజోడు', అయ్యపెళ్లి, రామలక్ష్మి, ధన్యజీవులు; గొట్టుముక్కల మంగాయమ్మ అయ్యోపాపం, దంతుర్తి లక్ష్మీనరసమ్మ, ప్రణయత్యాగం, జి.యల్. భార్గవీదేవి పట్టుచీర, కనుపర్తి వరలక్ష్మమ్మ 'మధు' రాజేశ్వరి ప్రత్యక్ష ప్రమాణంలాంటి కథలను రచించారు. వీరి కథలలో అస్పృశ్యత, సంఘ సంస్కరణోద్యమం, స్త్రీ పునర్వివాహం మొదలైనవి కథావస్తువులుగా వున్నాయి. ఈ కథలు మూఢాచారాలను వదలగొట్టి సాటి మనిషిని ఆలోచింపజేస్తాయి.

మలితరం కథా రచయిత్రులలో ఇల్లెందుల సరస్వతీ దేవి, తేన్నేటి హేమలత, ముప్పాళ్ల రంగనాయకమ్మ, అబ్బూరి ఛాయాదేవి, మాలతీచందూర్, ద్వివేదుల విశాలాక్షి, భానుమతీ రామకృష్ణ, ఓల్గా మొదలైనవారు కన్పిస్తారు. వీరికథల్లో స్త్రీ పాత్రలు ప్రాధానంగా కన్పిస్తాయి స్త్రీ ఔన్నత్యం స్ఫురిస్తుంది. ఈ దశాబ్దం స్త్రీవాద సాహిత్యానికి ఆయువుపట్టు. ఇల్లందుల సరస్వతీదేవి బలీయసీ, కేవలమీశ్వరాజ్ఞా, ముత్యాల మనస్సు మొదలైన కథానికలను రచించింది. ఆధునిక తెలుగుసాహిత్యంలో కథకురాలిగా, నవలా రచయిత్రిగా, విమర్శకురాలిగా స్థానం పొందిన రచయిత్రి ముప్పాళ్ల రంగనాయకమ్మ కథల్లో ఆర్తనాదం, మనమిద్దరమే వుందాం, విజయ వంటివి ముఖ్యమైనవి. కథారచనలో అబ్బూరి ఛాయాదేవిది ప్రత్యేక బాణి. ఈమె కథలు ''పాఠకుల్ని రంజింపజేయడమే కాకుండా వ్యక్తిగత సమస్యలను గురించి ఆలోచింపజేస్తాయి''30 ఈమె కథలను అబ్బూరి ఛాయాదేవి కథలు అనేపేరుతో సంపుటిగా ప్రచురించింది. అలాగే మాలతీచందూర్ డాబాయిల్లు. పవన నిర్మల ప్రభావతి, అనాథ, జానకీరాణి మనసులో బొమ్మ మొదలైన కథలు స్ఫురిస్తాయి. ద్వివేదుల విశాలాక్షి కథల్లో స్త్రీ పురుషుల జీవితాలు పలుకోణాల్లో కన్పిస్తాయి. తెలుగు కథానికా సాహిత్యంలో భానుమతీ రామకృష్ణ అనగానే తెలుగింటి అత్తా కోడళ్లు కన్పిస్తారు. అత్త ప్రధానపాత్ర అయితే మిగిలిన పాత్రలన్నీ ఆమెచుట్టూ పరిభ్రమిస్తాయి. సంసార జీవితంలో ఎదుర్కొనే సమస్యలు, ముఖ్యంగా మధ్యతరగతి కుటుంబంలో ఎదురయ్యే సమస్యలు, వాటికి పరిష్కార మార్గాలు ప్రధాన యితివృత్తాలుగా కన్పిస్తాయి. కొన్ని కథల్లో రాజకీయ సమస్యకూడా కన్పిస్తుంది. వీరికథలు పాఠకుల్ని ఆకర్షింపజేస్తాయి. అత్తగారి కథలు రెండు సంపుటాలుగా ప్రచురింపబడ్డాయి. స్త్రీవాద రచయిత్రిగా పేరుగాంచిన ఓల్గా (లలితకుమారి) సమాజంలో స్త్రీ బ్రతుకు మెరుగుపడాలని స్త్రీని ప్రధాన వస్తువుగా తీసుకొని కథలు రాస్తున్నది. యద్దనపూడి సులోచనరాణి కథల్లో పెళ్లి ప్రయాణం, తొలిమజలీ, అదృష్టదురదృష్టాలు మొదలైనవి అలా ముఖ్యమైనవి.

అలాగే నాయనికృష్ణకుమారి యథాకవి భార్య, గుడ్డితనం, వంటి కథలు రచించారు. ఆచంటి శారదాదేవి కథల్లో స్త్రీహృదయంలో అన్యోన్యత, అజ్ఞాతవాంఛలు, అవ్యక్త భావతరంగాలు, అసమానలాలిత్యం, అవ్యాజకారుణ్యం, అఖండ త్యాగం కన్పిస్తాయి. ఈమె దాదాపు యనభై కథలు రచించింది. అలాగే బుచ్చిబాబు భార్య శివరాజు సుబ్బలక్ష్మి తెల్లవారింది, కావ్యసుందరి కథలను వ్రాశారు.

నేడు యువతరం కథారచయితలలో అనేకమంది లక్ష్యం తెలిసిన కొత్తతరం రచయితలు వివిధ ఉద్యమాల ఆధారంగా రచనలు చేస్తున్నారు. శ్రీకాకుళ రైతాంగ గిరిజన పోరాట ప్రతిస్పందనగా చక్కా, గోదావరి, కార్మిక, కాలువ మల్లయ్య, ఉప్పల నరసింహం, తుమ్మేటి రఘోత్తమరెడ్డి కథలను రాస్తున్నారు. ప్రస్తుత కథా సాహిత్యంలో కనీసం నలభైమంది చక్కాని ప్రయోగాలను చేస్తున్నారు. మంచి కథలను రాయడానికి వస్తువును తమ జీవితంనుండీ సమాజంనుండీ తీసుకొంటున్నారు. రాయలసీమ గ్రామాలలో కరువు మూలంగా గడ్డిలేక పశువులను కసాయికి అమ్మవలసిన పరిస్థితిని గురించి చక్రవేణు కసాయికరువు అనేకథను రాయగలిగాడు. వ్యవస్థలోని లోపాలను సునిశితంగా వ్యంగ్యంగా బలంగా, విమర్శిస్తూ కథలు రాస్తున్నవారు చిలకూరి దేవపుత్ర, వీరికథలు ఆరుగ్లాసులు, ఏకాకి, నౌకచప్పుడు అనే సంపుటులుగా ప్రచురించాడు. ప్రజల జీవితాలను ప్రజల భాషలోనే చెప్పడానికి ప్రయత్నించాడు స్వామి. ఈయన కథల్లో అనంతపురం జిల్లా మాండలికం కన్పిస్తుంది. కథల్లో వానరాలే, చావుకూడు, నీళ్లు, తల్లిమట్టి ముఖ్యమైనవి. పల్లెజీవితాన్ని వాస్తవికంగా గాఢంగా శాంతినారాయణ కథల్లో పొందుపరచాడు. రాయలసీమ కథకుల్లో తమకంటూ స్థానాన్ని సాధించుకొన్నవాడు దాదాహయత్. గోపీ తీవ్రవాద ఉద్యమస్ఫూర్తితో ఒక తండ్రి కథ, సుజాత, ఆచూకి, రివోల్ట్ మొదలైన కథానికలను రచించాడు. వాడ్రేవు లక్ష్మీపతి గ్రామ సమస్యలను గురించి ఆక్రోశం వంటి కథానికలను రచించాడు. కాలువ మల్లయ్య కథల్లో తెలంగాణా ఉద్యమస్ఫూర్తి కన్పిస్తుంది.

వై.సి.వి.రెడ్డి గ్రామీణ జీవితంలోని ఆటుపోట్లనూ, కష్టాలూ, కార్పణ్యాలను ఎంతో నిజాయితీతో చిత్తశుద్ధితో కథలు చిత్రించాడు. వీరి కథలను గట్టిగింజలు అనే సంపుటిగా వెలువరించాడు. యస్. వెంకటరామిరెడ్డి పల్లీయుల జీవన విధానాన్ని బాగా ఆకలింపు చేసుకొన్న కథారచయిత. ఈయన కథల్లో మానవ సంబంధాలు కన్పిస్తాయి. రాయలసీమ స్థితిగతులను గురించి అభ్యుదయ దృక్పథంతో మధురాంతకం నరేంద్ర, మహేంద్రలు కథారచన చేస్తున్నారు. వీరి కథల్లో పల్లీయుల జనజీవితం కళ్లకు కట్టినట్లు కన్పిస్తుంది. ప్రోలవరపు కోటేశ్వరరావు కాకుళయ్య కథలను, చిత్తూరి కోటేశ్వరరావు బడుగువర్గాల పరిస్థితులను, పోలీసుల వ్యధను రచనా వస్తువుగా చేసుకొని కథలు రాస్తున్నారు. అలాగే పెన్నానదీ పరీవాహక ప్రాంత ప్రజల స్థితిగతులను గురించి పెన్నేటి కథలు అనే సంపుటి వెలువడింది.

''పోరాట ప్రాంతాలలో అంతరిస్తున్న భూస్వామ్య వ్యవస్థను తుమ్మేటి రఘోత్తమరెడ్డి చావువిందు అనే కథను''31 రచించాడు. ఈయన రచించిన పనిపిల్ల కథ అనేక విమర్శలను, ప్రశంసలను అందుకొన్నది. బమిడి జగదీశ్వరరావు కథల్లో సామాన్యజనుల జీవనస్థితిగతులు కన్పిస్తాయి. గ్రామజీవితంలోని అరాచకత్వాన్ని త్రాగుడుకు బానిసలైన వ్యక్తులను గురించి పాపినేని శివశంకర్ మట్టిగుండె అనే కథల సంపుటిని ప్రచురించాడు. అప్పల్నాయుడు కొండజాతి సవరల గురించి కథలు రాశాడు. ఉప్పల నరసింహం ఉద్యమ పోరాట స్ఫూర్తితో తిరగబడ్డ భూమి అనే కథల సంపుటిని వెలువరించాడు. ''సమాజంలో కులమత ఉన్మాదాలు కొత్తగా శక్తి పుంజుకుంటున్న సమకాలీన జీవితం గురించి అభ్యుదయ భావాలతో వైద్య వృత్తి నేపథ్యం''32 చేసిన కథలు రాస్తున్నవారు డాక్టర్ వి. చంద్రశేఖర రావు స్వయంగా వైద్యుడవటంచేత అనారోగ్యం సమస్యలను అవగాహన చేసుకొని కథలు రాస్తున్నాడు. జీవని, హిట్లర్ వీరి కథలలో ముఖ్యమైనవి. డా. టి.దామోదరరావు కథల్లో దళితుల మానవత్వం కన్పిస్తుంది. కథనంలో శిల్పంలో పల్లె జీవితాలు స్పష్టంగా కన్పిస్తాయి. అతిసామాన్య

జనజీవనంలోని కష్టనష్టాలన్నీ వీరికథల్లో ప్రస్ఫుటిస్తాయి. వీరి కథలను 'సింగిడి' అనే సంపుటిగా ప్రచురించాడు. జలంధర మనస్తత్వ విజ్ఞాన నేపథ్యంతో మనోధర్మ, ముంగిట్లో ముత్యాలు, ఆటోగ్రాఫ్ వంటి కథానికలను రచించారు. ''ఈమె కథల్లో మల్లాది రామకృష్ణశాస్త్రి భాషా సౌందర్యం, కళ్యాణసుందరీ జగన్నాథ్‌కథన సౌకుమార్యం''33 కన్పిస్తుంది. ప్రకృతి పర్యావరణం, కాలుష్యం గురించి, దాని ప్రమాదం గురించి పొండ్రంకి సుబ్రమణి, ద్విభాష్యం రాజేశ్వర రావు కథలను రాస్తున్నారు.

నేడు సమాజానుగుణంగా వివిధ దృక్కోణాలలో అనేకమంది రచయితలు రచనలు చేస్తున్నారు. వీరిలో అక్కినేని కుటుంబరావు, అరిగే రామారావు, ఆదివిష్ణు, ఆకెళ్ల శివప్రసాద్, ఇచ్ఛాపురం జగన్నాథరావు, కట్టా రాంబాబు, కాటూరి రవీంద్ర, కేతు బుచ్చి రెడ్డి, జి. ఆర్. మహర్షి, కోడూరి శ్రీరామమూర్తి, కె.ఆర్.కె. మోహన్, కేతవరపు వెంకటరమణ మూర్తి, గిడుగు రాజేశ్వరరావు, గొల్లపూడి మారుతీరావు, గోపరాజు నాగేశ్వరరావు, చీకోలు సుందరయ్య, జ్వాలాముఖి, తులసి బాలకృష్ణ, దేవరాజు మహారాజు, గౌరునాయుడు, వి. రామమోహనరావు, విహారి,జింబో, పినాకపాణి, సదానంద, శారద, ఘండికోట బ్రహ్మాజీరావు, ఉపద్రష్టసా, పి.నాసరయ్య మొదలైనవారు కథానికాసాహిత్యానికి తమవంతు కృషిని అందించి కథానికాస్థానాన్ని నిలబెట్టడానికి ప్రయత్నిస్తున్నారు.

ఇదేధోరణిలోనే రచయిత్రులైన తురగా జానకీరాణి, భార్గవీరావు , శీలా సుభద్రాదేవి, హైమా భార్గవ్, యామినీ సరస్వతి, గంటి రమాదేవి, కుప్పిలి పద్మ, మొదలైనవారు కథానికకు రూపుదిద్దుతున్నారు.

సమాజ అభివృద్ధి చెందడంవల్ల కథానికా సాహిత్యం చాలా అభివృద్ధి చెందింది. పాశ్చాత్య ప్రభావంతో వెలువడిన తెలుగు కథానిక సాహిత్యంలో ఉన్నతస్థాయిని అందుకున్నది. టాల్‌స్టాయ్, మాక్సింగోర్కి మొదలైన రచయితల కథానికలను రవీంద్ర శరశ్చంద్ర వంటి బెంగాలీరచయితల తెలుగునకు అనువదించారు. జాతీయ స్థాయిలో అనేక సాహితీ సంస్థలు ఆవిర్భవించడం వల్ల అనేక భాషలు కథానికలు తెలుగులోనికి అనువదింపబడుచున్నవి. కేంద్ర సాహిత్య అకాడమి తెలుగులోని ఉత్తమ కథానికలను ఇతర భారతీయ భాషలలోనికి అనువదించుచున్నది. దండమూడి మహీంధర్, ముక్కామల నల్లేశ్వరరావు, డాక్టర్ భీమసేన్ నిర్మల్, నీమూరి ఆంజనేయ శర్మ, వేమూరి రాధాకృష్ణమూర్తి, డా. ఇలపావులూరి పాండురంగారావు, పుట్టంరాజు అశ్వత్థ నారాయణ, కె. ఆర్.కె. మోహన్ లాంటివారు తెలుగు కథానికలను హిందీలోనికి హిందీకథానికలను తెలుగులోనికి అనువదిస్తున్నారు. నేషనల్ బుక్ ట్రస్ట్‌వారు అంతర భారతీయ పుస్తకమాల అనే శీర్షిక క్రింద కథా భారతిగా 27 కథలను తెలుగులో ప్రచురించారు.

సుప్రసిద్ధ కథారచయిత మధురాంతం రాజారాం ''తెలుగు కథానికా సాహిత్యంలో వస్తువు కుంచించుకపోయింది. శిల్పం కాగడావేసి వెతికినా కన్పించకపోయింది. భాషా సౌందర్యం మృగ్యమైపోయింది. వెరసి తెలుగు కథకు గ్రహణం పట్టిందని''24 ఇటీవలి కథల్నిగూర్చి వాపోయినాడు. కాని ఆ గ్రహణం వీడిపోవడానికి కథానికా రచయితలు తమవంతు కృషిచేస్తున్నారు. అనేక సంస్థలు దోహదపడుతున్నాయి.

పుస్తక సంస్థలు కొన్ని సాహసించి, చా.సో, కుటుంబరావు, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి, గోఖలే, చలం లాంటి వారి కథలు నిండైన సంపుటాలుగా ఇప్పుడు పాఠకులకు అందిస్తున్నాయి. కాళీపట్నం రామారావు, భ.రా.గో, శీలా వీర్రాజు, అబ్బూరి ఛాయాదేవి, చిత్తూరి కోటేశ్వరరావు వంటివారు తమ సంపుటాలను స్వయంగా ప్రచురించుకొంటున్నారు. మంచికథలు పుట్టుక రావడానికి అవసరమైన దోహద చర్యలన్నీ తీసుకోవడంతోపాటుగా కొన్ని పత్రికలు పాతకథలు మంచివి కొన్నింటిని ప్రచురిస్తూ పాఠకులచేత వాటిపైన విశ్లేషణ కావించి ఒక మంచి అభిరుచి ఏర్పడటానికి దోహదం చేస్తున్నాయి.

సంవత్సరం పొడుగునా వచ్చిన కథలలో నుంచి ఉత్తమ కథలను ఎంపిక చేసి సాహితీమిత్రులు చొక ధరలో సంపుటాలను ప్రచురిస్తున్నారు. ఈ నేపథ్యంలోనే వాసిరెడ్డి, నవీన్, పాపినేని శివశంకర్ సంకలన కర్తలుగా 'కథ 91 కథ 92,' అనే సంవత్సరాల పేరుతో సంపుటాలను ప్రచురిస్తున్నారు. పాఠకుల్ని మంచి కథలవైపు , కొత్త రచయితల్ని ఉత్తమ సాహిత్యంవైపు మళ్లించడంకోసం కథావేదికలు ఏర్పడుతున్నాయి. అనేక రచయితల సంఘాలు మంచి కథలకు బహుమతులు ప్రకటించడం వంటి కార్యక్రమాలను చేపడుతున్నాయి. ఇవన్నీ తెలుగు కథానిక అభ్యుదయంవైపు పయనించడానికి సోపానాలే. నేడు ప్రాంతీయ జీవిత చిత్రణ, కుల చైతన్య దృష్టితోనూ అనేక సంకలనాలు వెలువడుతున్నాయి. ఆ ప్రయత్నంలో భాగంగా కళింగకథలు, దశాబ్దికథలు, సీమకథలు, దళితకథలు అనే సంకలనాలు వెలువడుతున్నాయి. వానిలో కూడా వస్తుస్వీకరణ, శిల్ప నిర్వహణ సందేశ చాలన, పాత్రచిత్రణ, మనస్తత్వ పరిశీలన, భావావిష్కరణ, వాతావరణ వర్ణన మొదలైన శిల్పలక్షణాలన్నింటిలోనూ నేడు తెలుగు కథానిక ఉన్నత శిఖరాలను అందుకున్న దనడం నిస్సందేహం.

ఈ దశకంలో సంఘంలో స్త్రీ ఉద్యమం, దళిత ఉద్యమం ప్రాధాన్యతను సంతరించుకొన్నాయి. అవే సాహిత్యోద్యమంలో కూడా ప్రధాన వస్తువులు అయ్యాయి. అదేనేపథ్యంతో స్త్రీవాద కథలు, దళితకథలు వస్తున్నాయి. ప్రస్తుతం వస్తున్న వారపత్రికలైన ఆంధ్రజ్యోతి, స్వాతి, ఆంధ్రభూమి, ఆంధ్రప్రభ, మయూరి ఎక్కువ భాగం కథలు ప్రచురించడానికి ప్రాధాన్యం ఇస్తున్నాయి. కథానికా రచనలో కూడా వాసి రాసి పెరిగింది.

ఆధునికాంధ్ర సాహిత్యంలో కథానిక నవల తర్వాత స్థానంలో వుంది. అది సమాజానికి మణిదర్పణం లాంటిది. ఒకప్పుడు కాలక్షేపానికే పరిమితమైన కథానిక నేడు మానవ స్థితిగతులను దాటి పరిసర వాతావరణ పరిధిలోనికి చొచ్చుకొనిపోయి సమస్యలను చిత్రిస్తూ ఉంది. నేడు వచ్చే కథానికల్లో మాండలికం ప్రధానపాత్ర వహిస్తున్నది. వస్తు విషయంలోనూ శైలి విషయంలోను వైవిధ్యం ప్రదర్శిస్తూ ఉంది. 1910లో పుట్టిన కథానిక నేటికి దాదాపు యనభై ఐదు సంవత్సరాలను పూర్తి చేసుకొని శతాబ్దం పూర్తి చేసుకోవడానికి పరుగులిడుతూ ఉంది. ప్రపంచకథానికలలో తెలుగు కథానిక కూడా తీసిపోదని తెలియజేస్తూ వుంది.

## అధస్సూచికలు

1. కథాచరిత్ర - పి. యశోదారెడ్డి పుట 58
2. కథలు ఎలా వ్రాస్తారు (సంకలనం) - శార్వరి పుట 83
3. ఎ గ్లోసరి ఆఫ్ లిటరసీ టెర్మ్స్ - పుట 157
4. కథానిక స్వరూప స్వభావాలు - పోరంకి దక్షిణామూర్తి పుట 182
5. తెలుగు సాహిత్య సమీక్ష (రెండవ సంపుటం) - జి. నాగయ్య పుట 831
6. తెలుగు సాహిత్య సమీక్ష (రెండవ సంపుటం) జి. నాగయ్య పుట 833
7. కథలు ఎలా వ్రాస్తారు - శార్వరి పుట 58
8. కథాచరిత్ర - పి.యశోదారెడ్డి పుట 31
9. కథలు ఎలావ్రాస్తారు - శార్వరి పుట 85
10. తొలితెలుగు నవలా వికాసం - కొలకలూరి ఇనాక్ పుట 9
11. తెలుగు కథారచయితలు - ఇరివెంటి కృష్ణమూర్తి పుట 226
12. తెలుగు కథారచయితలు - ఇరివెంటి కృష్ణమూర్తి పుట 27
13. మనిషితనం గల విజ్ఞాన సత్వస్వం ఆయన - రాంభోట్ల కృష్ణమూర్తి ఉదయం దినపత్రిక 7.2.1994.

14. తెలుగు కథా రచయితలు - ఇరివెంటి కృష్ణమూర్తి పుట 103
15. తెలుగు కథారచయితలు - ఇరివెంటి కృష్ణమూర్తి పుట 93
16. తెలుగు కథా రచయితలు - ఇరివెంటి కృష్ణమూర్తి పుట 114
17. నూటా పదహార్లు (కథా సంకలనం ) - తాళ్లూరి నాగేశ్వర రావు పుట 259
18. కథలు ఎలా రాస్తారు - శార్వరి పుట.
19. తిలక్ కథానికా సాహిత్యం - వాస్తవికత - యం.అన్నపూర్ణ పుట.
20. నూటాపదహార్లు (కథాసంకలనం ) తాళ్లూరి నాగేశ్వర రావు పుట 172
21. విలక్షణమైన కథాకథన శిల్పి చా.సో - డా.యస్వీ ఆంధ్రజ్యోతి దినపత్రిక ఏప్రిల్5 - 1994.
22. కథాసదస్సు - కొత్తకదలిక - వేదగిరి రాంబాబు పుట 136
23. జీవితపు విలువలను సృష్టించేది మంచికథ - రామమోహన్‌రావు, ఆంధ్రజ్యోతి
డైలీ ఏప్రిల్ 24, 1995 ( పితశ్రీ ఇంటర్వ్యూ)
24. సాహిత్య వ్యాసాలు - కె. ఇనాక్ పుట 79
25. సాహిత్యంలో సామాన్య మానవుడు - దాస్‌బాబు పుట 105
26. తెలుగు కథాసాహిత్యంపై మార్క్సిజమ్ ప్రభావం - కోడూరు శ్రీరామమూర్తి భారతి,
జనవరి, 1978 కోపుట 58
27. తెలుగు సాహిత్య సమీక్ష (రెండవ సంపుటం ) - జి. నాగయ్య పుట 843
28. కథలు ఎలా రాస్తారు - శార్వరి పుట 172
29. ఎచ్చరిక - బోయ జంగయ్య పుట .1
30. కథలు ఎలా రాస్తారు - శార్వరి పుట 218
31. లక్ష్యం తెలిసిన కొత్తతరం రచయితలు - శ్రీపతి ఇండియాటుడే 1993 మార్చి
ఏప్రిల్ 21 - 5 పుట 63
32. లక్ష్యం తెలిసిన కొత్తతరం రచయితలు - శ్రీపతి ఇండియాటుడే 1993
మార్చి ఏప్రిల్ 21 - 5 పుట 63
33. లక్ష్యం తెలిసిన కొత్తతరం రచయితలు - శ్రీపతి ఇండియాటుడే 1993 మార్చి
ఏప్రిల్ 21 - 5 పుట 63
34. గ్రహణం పట్టిన తెలుగు కథ - మధురాంతకం రాజారాం ఆంధ్రజ్యోతి దినపత్రిక
20 - 9 - 1993.

## 2. తెలుగు కథానిక - సమాజం

మానవుడు సంఘజీవి. సమాజంలో నివసించనివాడు దేవుడైనా అయివుంటాడు లేదా జంతువైనా అయివుంటాడు. తన మనుగడకోసం ఇతరుల శ్రేయస్సు కోసం వ్యక్తి సమాజంలో నివసిస్తాడు. తను నివసిస్తూ సమాజ ప్రగతికీ స్థిరత్వానికీ తనవంతు కృషిని అందిస్తాడు. సమాజం అంటే జన సమూహం, ఒక భౌగోళిక ప్రదేశం - అదికూడా విభిన్న పరస్పర చర్యలు ఏకత్వభావం, సహకారం, ప్రత్యేక సంస్కృతి వైవిద్యాల సమ్మేళనం.

''ఒకే సంస్కృతి దానితో సంబంధ స్పృహ
ఉన్న జన సమూహం సమాజం.'' 1

సమాజం కొన్ని సంప్రదాయాలు, ఆచారవ్యవహారాలు, జీవన విధానాలు , విశ్వాసాలు, కళలను కలిగి వుంటుంది. సమాజ సభ్యుల్లో పతి ఒక్కరూ తాము ఆ సమాజానికి చెందినవాళ్ళమనే అభిప్రాయం ఉంటుంది. సమాజానికి దూరంగా ఒంటరిగా బ్రతకడానికి ప్రయత్నిస్తే ఆ జీవి నశించడం తప్ప బ్రతకడం కాదు. కాని మనుషులు కలసికట్టుగా బ్రతకడానికి ప్రయత్నిస్తే ఆ జీవితం ఆశాజనకం అవుతుంది. మానవుల్లో స్త్రీ, పురుషుల సహకారాన్నీ హితసాధనమొదలు లైంగిక వాంఛలకు, గర్భస్థ పిండపోషణకు, శిశు వికాసానికి, శిశు సంరక్షణకు అన్నికోణాల్లోనూ ఒకరికి మరొకరు తోడు అవసరం. అందువల్ల ఒకరికొకరు సత్సంబంధాలు చేసుకోక తప్పదు. మనిషి ఒక వ్యక్తిగా సాధించలేని విజయాలను సమాజం ద్వారా సమిష్టిగా సాధించగలడు.

''ప్రతి వ్యక్తికీ విలక్షణమైన ఒకానొక మూర్తిమత్వం వుంటుంది. అది ఆత్మీయమైనది. అమూల్యమైనది. ఏ ఇద్దరిమూర్తిమత్వాలూ ఒక్కతీరుగా వుండవు. ఈ విభేదాలు వయస్సు పెరిగేకొద్దీ మరింత విస్పష్టంగా రూపుగడతాయి. సమాజీకరణ కారకాల ప్రభావంవల్ల ఇవి వికాసం చెందుతాయి. అయితే వేయక్తిక మూర్తిమత్వం కూడా సామాజిక అంతః ప్రేరణ Social - Inter - Sentementation ) ల ప్రభావంలోనే రూపు దిద్దుకొంటుందన్నది నిర్వివాదాంశం''2 అని పోరంకి దక్షిణామూర్తి అభిప్రాయం.

ప్రపంచంలో ఎక్కడ ఏ ఒక్కడూ బాధపడుతున్నా ప్రపంచం దానికి స్పందించాలి. దానితో ఏ ఒక్కడు కన్నుమూసినా, తాను కొంత తరిగిపోతున్నట్లు గ్రహించాలి. లోకంలో ఎవ్వడూ ఏకాకి కాడని నిరూపణ కావాలి. అన్న (John Done) మాటలు చిరస్మరణీయాలు. ప్రతివ్యక్తి జీవితాంతం సమాజంలో సభ్యుడే అతను బ్రతకడానికి అవసరమైన ప్రేమ, కరుణ, దయ, భద్రతా అన్నీ సమాజం నుండి లభిస్తాయి. తోడివాళ్ల కష్టాల్లో కలసి వుండని సమాజం ఊహకే అందదు.

ఉత్తమ సమాజం మానవుని కులమతాలను గుర్తించకూడదు. అతని పుట్టుకకూ, శక్తికీ సంబంధం వుండకూడదు. అతను పుట్టిన పరిసరాలే అతనిని ప్రభావితం చేస్తాయి. అది సమాజం బాధ్యత. ఈ కారణం వల్ల జాతిపేర, కులంపేర, వర్గంపేర మానవుల మధ్య చూపే విచక్షణ, మూఢ విశ్వాసం మీదకాని, స్వార్థపరత్వం మీద కాని ఆధారపడకూడదు. ఒక భౌగోళిక ప్రాంతంలో నివసిస్తూ ఒకేభాష మాట్లాడుతూ పరస్పర సంబంధం ఏర్పరచుకొంటూ సమష్టి ప్రయోజనాలన్నింటిలోనూ పాలుపంచుకొనే వ్యక్తుల సముదాయాన్ని సమాజం అంటారు. తెలుగు మాట్లాడేవాళ్ళు ఏయేప్రాంతాలలో వున్నప్పటికీ వారందరినీ తెలుగుసమాజం అనవచ్చు. ఎందుకంటే, వారికి ఏదోవిధంగా ఎవరితోనో ఒకరితో సంబంధాలుంటాయి కనుక.

సమాజం మారుతుండటం వల్ల బ్రతుకుదెరువు మార్చుకోవలసిన అవసరం వుంటుంది. సమాజం ఒకవైపు పరిణామానికి తోడ్పడుతున్నట్లుగా కనిపిస్తూ మరోవైపు పరిణామాన్ని ప్రతిఫలిస్తూ

వుంటుంది. సమాజంలో నివసించే ప్రతిమనిషీ తన ఉనికిని కాపాడుకొంటూ తనకు తెలియకుండా అభివృద్ధిపథంవైపు పయనిస్తుంటాడు.

హైందవ కుటుంబవ్యవస్థలో సామాన్యంగా సమష్టి కుటుంబాలు కన్పిస్తాయి. కుటుంబ సభ్యులందరి అవసరాలను ఆలోచనలనూ గమనించి నడుచుకోవలసిన బాధ్యత కుటుంబ పెద్దది. కష్టసుఖాల్లో అందరూ భాగం పంచుకొంటారు. కాని ఈ శతాబ్దిలో అనేక కారణాలవల్ల సమిష్టి కుటుంబాలు ఛిన్నాభిన్న మయ్యాయి. వృత్తిరీత్యానో సమస్యరీత్యానో వ్యక్తులు ఒక ప్రాంతమునుండి మరొక ప్రాంతానికి వెళ్లవలసి వస్తుంది. అందువల్ల ఈ శతాబ్దంలో ఎక్కువ భాగం సమష్టి కుటుంబంగా వుండటానికీ వీలులేకుండాపోయింది. సమాజానికి సంబంధించిన కొన్ని నిర్వచనాలను పరిశీలిద్దాం:

''Sociology is a body of learning about Society. It is a Discription of ways to make society better. It is social ethics a social Philosophy. Generally how ever it is defind Science society."3

''సమాజం అనే పదం వ్యక్తుల సమూహాన్ని మాత్రమే సూచించదు. ఇది సభ్యులలో సభ్యుల మధ్య సంభవించు సంశ్లిష్టంగా వుండే పరస్పర చర్యలను సూచిస్తుంది.''- లాపియర్.

సమాజ పరిణామ క్రమంలో మారుతున్న జీవన సరళిని భావాత్మకంగా చిత్రించేది సాహిత్యం. చరిత్ర నిర్మాణంలో సాహిత్యం ఒక భాగం కాకపోయినా చరిత్ర ఊహించని మానవ జీవితాన్ని సాహిత్యం అందిస్తుంది.

సాహిత్యం సమాజాన్ని అణు క్షణం వెంటాడుతుంది. రచయిత తాను రచన చేయాలంటే ఆ కాలపు సామాజిక స్థితిగతులను దృష్టిలో పెట్టుకొని వాటిని తన రచనలో క్రోడీకరిస్తాడు. ఆ నేపథ్యంతోనే తెలుగు కథానిక సమాజ జీవితానికి మణి దర్పణంగా నిలచిపోయింది. కథానికల వస్తువు సమాజం నుంచే తీసుకోబడుతుంది. సమాజంలో జరుగుతున్న అన్యాయాలు , అక్రమాలు, హింస, మంచి, చెడులు రచయితకు కథావస్తువులవుతాయి. కథానిక సమాజ జీవన చిత్రణలో స్థూలంగా ఈ అంశాలను పరిశీలించవచ్చు:

| | |
|---|---|
| 1. ఆచార వ్యవహారాలు. | 2. సంసారిక జీవితం. |
| 3. వృత్తి - ఉద్యోగం | 4. సంస్కరణ దృక్పథం |
| 5. రాజకీయ ప్రభావం | 6. జాతీయోద్యమం |
| 7. స్త్రీవాదం | 8. పర్యావరణం |
| 9. అభ్యుదయం | 10. దళితవాదం. |

## 2.1 ఆచార వ్యవహారాలు

మానవజీవితంలో జరిగే పనులన్నీ సమాజ సమష్టికి సామాన్యమైనవి. మానవుడు పుట్టింది మొదలు పేరుపెట్టడం, జోలపాడటం, మాటనేర్పడం, కథలు చెప్పడం, ప్రతిమానవ సమూహంలోనూ చూస్తుంటాం. ఆ బిడ్డ పుట్టగానే బొడ్డుకోసి స్నానం చేయించి చేటలో పడుకోబెట్టి రచ్చలు వేసి బొడ్డుమీద బంగారు పెట్టడం కొన్ని సముదాయాలలో చూస్తాం. అప్పటి నుండి పిల్లవాడు పెరిగేకొద్దీ పిల్లవాడి నక్షత్రం చూడటం, నామకరణం చేయడం, పుట్టు వెంట్రుకలు తీయడం, బడిలోకి పంపడం మొదలైన క్రమం తప్పకుండా జరుగుతాయి. ఇవి తెలుగువారి ఆచార వ్యవహారాలలో గమనించవచ్చు.

ఆకలి తీరడానికి మానవులు ఆహారం తీసుకొంటారు. తీసుకొనే ఆహారం విభిన్న ధోరణుల్లో వుండవచ్చు. తినే పద్ధతులు వేరుగా ఉండవచ్చు. ఉదా: ఆటవికులు నిత్యం మాంసంతో కూడిన ఆహారం తినవచ్చు, బ్రాహ్మణులు శాకాహారభోజనం భుజించవచ్చు. మధ్య తరగతి ప్రజలు ఆ రెండింటినీ తినవచ్చు. అవి వారివారి ఆచార వ్యవహారాలపై ఆధారపడివుంటాయి. వివిధ సమయాలో ప్రజలు చేసే పనితీరుల్లో ఆలోచనల్లో ఆశయాలలో వారి సంస్కృతి బయటపడుతుంది. సుమారు యనభై ఐదు సంవత్సరాల తెలుగు కథానిక సాహిత్యమును పరిశీలించినట్లైతే తెలుగు ఆచారాలు ఎన్నికోణాల్లో ఎన్ని విధాలుగా కన్పిస్తున్నదీ పరిశీలించవచ్చు. కుటుంబం, కులం, వర్గం, ప్రాంతం, జీవన స్థితిగతుల్లో వైవిధ్యం కన్పిస్తున్నప్పటికీ వాటి సమాచారం తెలుగు ఆచార వ్యవహారాల రూపురేఖలను కళ్లకు కడుతుంది. కథారచనచేసే ప్రతిరచయిత నీటిని ప్రదర్శిస్తూనే వుంటాడు. ''భాషలో భావనలో వృత్తిలో కళలో కల్పనలో అందంలో అలంకరణలో అన్నింటా ప్రత్యక్షమవుతుంది. కాబట్టి సాహిత్యంలోనూ అది ప్రతిబింబించక తప్పదు.''5

ఆచార వ్యవహారాలన్నవి సనాతన కాలంనుండీ వస్తున్న సంప్రదాయాలు, నమ్మకాలు, కట్టుబాట్లు కలుపుకొని వుంటాయి. అనేక శతాబ్దాల కాలక్రమంలో తెలుగు ప్రజల జీవితంలో అనేక పరిణామాలు సంభవించాయి. ఏ కాలంలో రాసే రచయిత ఆ కాలపు పరిస్థితులను యదార్థంగా చిత్రించడమన్నది అతని గురుతర బాధ్యత. భిన్న జాతులవాళ్లు, సంస్కృతులవాళ్లు, మనస్తత్వంగలవాళ్లు, నగరాల్లో కలుసుకొని జీవిస్తున్నారు. వీరిమధ్య పరస్పర ప్రభావాలు ప్రసరిస్తూనే వుంటాయి.

రచయిత ఆచార వ్యవహారాల పరిశీలనకు పూనుకొన్నప్పుడు దేశకాల స్థితిగతులను వదలడానికి వీలులేదు. అంతటినీ ప్రతిబింబింపజేయడం రచయిత లక్షణం. తెలుగు జన జీవనంలో రచయిత ఏ అంశాన్ని తీసుకున్నా, అందులో తెలుగువారి ఆచార వ్యవహారాలు రాకమానవు. వేషభాషలు, ఆహార విహారాదులు, క్రీడలు, వినోదాలూ, పెళ్లిళ్లు, పేరంటాలు, తద్దినాలు, సంతర్పణలు, వావివరుసలు, వృత్తిప్రవృత్తులు తెలుగుజాతీయతను ప్రతిబింబించే అంశాలు.

కాలుక్రిందివరకూ వేలాడేటట్లు పింజెలుపోసిన పంచెకట్టు, ఆపైన నడుం క్రిందివరకూ కన్పించే అంగీ, భుజంమీద తుండుగుడ్డ, కాలికి తోలు చెప్పులుకొద్దిగా మొలచిన గడ్డం తెలుగు కథల్లో తరచుగా కన్పించే మగవేషధారణ. ఇక స్త్రీలు కాసంతబొట్టు, వెనక పెద్దకొప్పు లేదా పిరుదుల వరకూ జడ, ముక్కున ముత్యాల ముక్కెర, చెవులకు కమ్మలు, మెడలో దండ, చేతులకు గాజులు, కాళ్లకు కడియాలు, వ్రేళ్లకు మట్టెలు, నూలునేతచీరలాంటి వస్త్రధారణలో కన్పిస్తారు.

చెడుగుడు, బొంగరాలు, చదరంగం, కోతికొమ్మచ్చి, ఉప్పరపట్టి, బొంగరాలు, పేకాట, అనేక కథల్లో కన్పిస్తాయి. అలాగే దశావతారీ, వైకుంఠపాళి, పులిజూదం, ఓమన గుంటలు, గవ్వలాట, బాలాకట్ట, భారత రామాయణాదుల పురాణకాలక్షేపాలు, స్త్రీల వినోదపు పాటలు తెలుగు సమాజ జీవితంలో ఒక భాగమే. ఇలాంటి ఆటలు మన కథల్లో, ఎన్నో కన్పిస్తాయి. పాఠశాలకు వెళ్లకుండా గోళీగుండ్లు ఆడే పిల్లలు, (శిలువవేసిన మనుషులు - కేతు విశ్వనాథలెడ్డి) పురాణాలను హరికథలుగా, బుర్రకథలుగా చెప్పేవాళ్లు. (ఏటిపాట - గండేటి గౌరునాయుడు) పెళ్లి అనేది వయస్సు వచ్చిన స్త్రీ, పురుషుల మధ్య యేర్పడే ప్రతిబంధం (మా కనకం - మల్లాది శివరామశాస్త్రి) తల్లిదండ్రులు కూతురు పెళ్లి విషయంకోసం ఘర్షణ పడటం (ఉదాహరణ - కురుగంటి సీతారామయ్య) మునుషులు మనస్తత్వాన్ని చిత్రించడం (మనిషి మనసు - రా.సి. ఆంజనేయశాస్త్రి) ఆటవిక జాతుల్లో వుండే మూఢనమ్మకాలు (అమ్మమ్మ తల్లి - పూడిపెద్ది వెంకటరమణయ్య) పూర్వాచార పరాయణత్వాన్ని ఆసరాగా చేసుకొని భర్తను దద్దమ్మను చేసిన భార్యలు (మొదటి బహుమానం - చింతా దీక్షితులు) తెలుగు కథానికల్లో పాత్రలుగా వస్తువుగా గోచరమవుతూ వున్నాయి.

బాంధవ్య సంబంధాన్నే కాదు- స్నేహ సంబంధాన్ని సైతం నిలుపుకోవడానికి తెలుగువాళ్లు బంధుత్వం కలిపి పిలవడం అందులో కులతారతమ్యాలు వుండవు. అందరమూ సమానమేనన్నభావం చిన్న పిల్లలకు సైతం కలుగుతుంది. ఇంట్లో శుభకార్యాలు జరిగినపుడు ముత్తైదువుల్ని పేరంటానికి పిలిచి పసుపురాసినప్పుడు మెడకు గంధంపూసి బొట్టుపెట్టి తాంబూలాలివ్వడం తెలుగువారి ఆచారం. తెలుగు స్త్రీలకు ఇలాంటి వాటికి కొదువ వుండదు. పెళ్లిళ్లలో వధూవరులను చేయడం , నలుగులు పెట్టడం, పెళ్లికొడుక్కు కాళ్లు కడిగి, కన్యాదానం చేయడం, అదే సమయంలో మంగళవాయిద్యాలను వాయించడం, తాళి కట్టించడం, తలంబ్రాలు పోయడం, పూజారి వధూవరులకు అరుంధతిని చూపించడం, ఊరేగింపు జరపడం మొదలైనవి స్ఫురిస్తాయి. (ప్రాంత ఆచారాలనుబట్టి ఈ పద్ధతుల్లో కొంత వైవిధ్యం వుండవచ్చు.

అలాగే కష్టసుఖాల్లో పాలుపంచుకోవడం, అందరూ సుఖంగా బ్రతకాలనుకోనడం, పెళ్లిళ్లలో కట్నాలు చదివించడం, పనులకు వెళ్లేటప్పుడు అపశకునాలైన ఊరపిల్లి, మంగలి, కట్టెలమోపు, విధవరాలు ఎదురువస్తే తమ పనులు జరగవని ఇంటికి మరలడం, పొలాల్లో పంటలు సస్యశ్యామలంగా వున్నప్పుడు దిష్టికుండ పెట్టడం, ఎవరైనా నడివాకిట్లో తుమ్మితే తలపై నీళ్లుజల్లడం, మంత్రం వేయించడంతాయితు కట్టించుకోవడం మొదలైనవి తెలుగు కథానికల్లో కనిపిస్తాయి.

పై విషయాలను కథానికా సాహిత్యం ద్వారా పరిశీలిద్దాం. భూతాలు, దయ్యాలు లేవని, అంతా మనభ్రమ అని తెలియజేయడం ( భూతవైద్యం - కరుణకుమార, ) ఆటవిక తెగలకు సంబంధించిన శాసనాలు (అవివాహ శాసనం - టేకుమళ్ల కామేశ్వరరావు ) ఆచారం పేరుతో గూడెంలో కన్నెపిల్లల పండ్లు ఊడగొట్టించడం ( ఏళ్ల పండుగ - టేకుమళ్ల కామేశ్వరరావు), భర్తకు భార్యే స్వయంగా రెండవ పెళ్లి చేయడం (స్వయంకృతాపరాధము - కె. యస్.రాధామణి), రక్త సంబంధాలను విచ్ఛిన్నం చేసిన ధోరణులు ( సహగమనం - అనిశెట్టి సుబ్బారావు) , మూఢాచారాల ముసుగులో కాలం చెల్లిన శాస్త్రాలకు సంప్రదాయం రంగులు పూసి దురాచారాలనే సదారాలుగా చూపిన స్త్రీలు (కన్యాదాన ఫలందక్కుతుందా - అక్కిరాజు ఆంజనేయులు) ప్రాచీన ఆచారాలనే పరమావధిగా పెట్టుకొని బాల్యవివాహాలు చేయడం (వెంకాయమ్మ వివాహం - గోటేటి జగన్నాథరావు ), తెలుగు కథానిక సాహిత్యంలో విశేషంగా చోటు చేసుకొన్నాయి.

**2.2 సంసారిక జీవనం**

మానవజీవితం బాల్యం, కౌమారం, యవ్వనం, వార్ధక్యం. అనుభవించాల్సి వుంటుంది. సామాన్యంగా వ్యక్తి బాల్యంలో తల్లిదండ్రుల కనుసన్నల్లో జీవిస్తాడు. ఏది కావాలన్నా తల్లిదండ్రులపై ఆధారపడుతాడు. కాని యవ్వనంలో వాటిని తానే సాధించడానికి ఆలోచిస్తాడు. తన శక్తిని అడ్డుపెట్టడానికి ప్రయత్నిస్తాడు. యవ్వనంలో మొదటిదశ వివాహం. వివాహమైన దంపతులు 'నాకు నువ్వు నీకు నేను' అనే ధోరణిలో వుంటారు. చిన్నతనంలో తల్లిదండ్రులు తమ సంరక్షణలో పెరిగిన పిల్లలు యౌవన ప్రాయులయ్యేసరికి వాళ్లముద్దుముచ్చట్లు తీర్చడానికి ప్రయత్నిస్తారు. అందుల్లో ముఖ్యంగా వివాహం, తమపిల్లలకు మంచి సంబధం చూచి పెళ్లి చేయాలని తమ ముందువారు అనురాగంగా ఆప్యాయంగా వుండాలని కలలు కంటారు.

ఆడపిల్ల విషయంలో అయితే వారికి యుక్తవయస్సు వచ్చేసరికి తల్లిదండ్రులకు నిద్రపట్టదు. ఎలాగైనా ఒక మంచివాడిని చూసి పెళ్లిచేస్తే వాళ్లపని పూర్తి అవుతుందని అభిప్రాయపడతారు. దగ్గర సంబంధాలు వుంటే కార్యక్రమం తొందరగా అవుతుంది. లేకుండా సంబంధాలకోసం వెంపర్లాట కొనసాగిస్తారు. సంబంధం దొరికితే అబ్బాయి గుణగణాలు, విద్య, మర్యాద, గోత్రాలు అన్నీ విచారిస్తారు. అంతా మంచిదైనపుడే వారు పెళ్లి ప్రయత్నాలు కొనసాగిస్తారు. అబ్బాయి అమ్మాయి ఒకరినొకరు చూసుకోవడం, కట్నకానుకలు

నూట్లాడుకోవడం, పెళ్లిచేయడం అమ్మాయి తల్లితండ్రుల కర్తవ్యం అవుతుంది. అమ్మాయి పెళ్లి త్వరగా చేయకుంటే బంధుత్వం, స్నేహం, పరిసరాల ప్రభావం పడే అవకాశాలుంటాయి. చదువుకొన్న యువతీ యువకుల్లో పరస్పర ఆకర్షణ కు గురై వారిమధ్య ప్రేమ ప్రయత్నాలకు దారితీస్తాయి. అవి పుష్పిస్తాయి. పార్కుల్లో సమావేశం కావటం తర్వాత 'నువ్వే నా ప్రాణం , లేదంటే నే బ్రతకడం కష్టం' అనుకోవడం, భాశలు చేసుకోవడంలాంటివాటితో ఒకరినొకరు దగ్గరవుతారు. తెలియని ఆలోచనలతో ఆగని ఆవేశాలతో నిగ్రహించుకోలేని ఆకర్షణ లకు గురి అవుతారు. తరువాత ప్రేయసి ప్రియుల్లో ఎవరికో ఒకరికి మోజు తగ్గుతుంది. కులతారతమ్యాలు అడ్డువస్తాయి. ప్రేమ కరిగి సెలయేటిలో కలసిపోతుంది. ఒకరు పిచ్చివారుగా మారితే మరొకరు ధనవంతుల్ని పెళ్లిచేసుకొని సుఖంగా సంసారజీవితాన్ని కొనసాగిస్తారు. ఈ విషయాలు తెలుగు కథానికల్లో అద్దంపట్టినట్లు కన్పిస్తాయి.

స్నేహితురాలికోసం తనుప్రేమించిన వ్యక్తిని త్యాగం చేసిన యువతులు (త్యాగం- జోగారావు), పచ్చని సంసారంలో చిచ్చుపెట్టలేక తనజీవితాన్నే త్యాగం చేసుకొన్న స్త్రీలు (ప్రణయత్యాగం - దంతుర్తి లక్ష్మీనరసమ్మ), వేశ్యను ప్రేమించిన యువకుడు తల్లి నిరాదరణతో జీవితాన్ని త్యాగం చేయడం, (కపర్ది - విశ్వనాథ సత్యనారాయణ ), కూలీ నాలీ చేసుకొని జీవితం గడిపే ప్రేయసి - ప్రియులు ( చీకటి వెలుగులు - జి. యల్.సూరి), ద్వేషించిన జాతిని ప్రేమించిన యువకులు (ఎవరిదోషం - అడవి బాపిరాజు), ప్రేమించిన ప్రియురాలికోసం తండ్రి మాటనే కాదన్న కొడుకులు,(ద్వేషం - రాజారావు), గాఢంగా ప్రేమించుకొన్న యువతీయువకులు అబ్బాయి తండ్రి ధనదాహంమూలాన విడిపోవటం (రాధ - వెంకటనాగేశ్వర రావు), అన్యోన్యంగా వుండే యువతీయువకుల ప్రేమ కామాంధుడైన భూస్వామికుట్రవల్ల భగ్నం కావడం, యువతి పిచ్చిదికావడం (పశువుల కొఠం - కరుణ కుమార), ప్రేమించినవాడినే మోసంచేయడం (ఆఖరు లేఖ - పద్మావతిదేవి), తెలుగు కథానికలో ప్రతిబింబించాయి. అలాగే అల్లుళ్లను వెదకటంలో అమ్మాయిల తల్లిదండ్రులు పడేబాధలు (ఎదురు గాలి - మధురాంతకం రాజారాం), కట్నమిచ్చి పెళ్లి అయినా చెయ్యాలి కోరినంత చదువన్నా చెప్పించాలి లేకపోతే మంచి గుణాలన్నీ ఆకలిపొట్టలో ఆహుతైపోతాయి అని చిత్రించేకథలు (పాడులోకం - పాడు మనుషులు - బలివాడ కాంతారావు), పెళ్లికి ముందే కట్నం ఇవ్వడం వాయిదాల పద్ధతిలో కొనుగోలు చెయ్యడం అస్తిఎరగా చూపి ఇల్లరికం వుంచుకోవడం కొందరి పద్ధతైతే తమ పలుకుబడితో అబ్బాయికి ఉద్యోగం ఇప్పించి పిల్లనిచ్చి పెళ్లిచేయడం (యావజ్జీవ శిక్ష - కొడవటిగంటి కుటుంబరావు), కొన్ని కథల్లోని విషయాలుగా గుర్తింపు పొందాయి. ఒక సవర్ణ స్త్రీ హరిజన యువకుడిపై మోజుపడి పెళ్లి చేసుకోవడానికి ప్రయత్నిస్తే సవర్ణుల పరువు పోతుందని వారిపెళ్లికి అడ్డంకులు పెట్టడం అందుమూలంగా వారిద్దరూ ఆత్మాహుతికిలోను కావడం (మాలా మనిషి - కలవకొలను సదానంద), ఒక రెడ్డియువతి మరొక కులం యువకుని ప్రేమించి పెళ్లి చేసుకోవడానికి ప్రయత్నిస్తే అమ్మాయి తండ్రి ఆమెకు మరొకరితో వివాహం కుదుర్చడం, అది సహించలేని ఆమె నదిలో పడటం, యువకుడు అమ్మాయిని రక్షించటంకోసం నదిలోపడి ఇద్దరూ నీటి ప్రవాహంలో కొట్టుకపోవడం (ఇరువురమూ ఒకేచోటికి పోదాము - శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి) మొదలైన కథలు తెలుగునాటి ప్రేమజీవితానికి ఆయువు పట్టులు.

వివాహమన్నది స్త్రీ పురుషులిద్దరికీ సంబంధించిన విషయం. అందులో ఇద్దరూ భాగస్వాములే. ఈ వ్యవస్థ పితృస్వామిక వ్యవస్థ కాబట్టి తరాలుగా మగవాడికి ఆడవారిపై అధికారం చేసే దర్పం వుంటుంది. దాదాపు అన్నింటా మగవాడిదే పైచేయిగా వుంటుంది. అందువల్ల స్త్రీలకు ప్రాధాన్యత ఇవ్వవలెనని, వారిని అన్నింటా సమానంగా చూడాలని సమాజం గొంతు చించుకొని అరుస్తుంది. రచయితలు తమ కలాలు అరిగిపోయేలా, కాగితాలు తరగిపోయేలా, చేతులు అలసిపోయేలా రాస్తున్నారు. అంతర్జాతీయంగా మహిళా దశాబ్ది వచ్చింది. అయినా వారి పరిస్థితి ఎక్కడ వేసిన గొంగలి అక్కడిలాగే వుంది.

**2.2.1. దాంపత్యం** : వివాహం తర్వాత భార్యా భర్తలకు అసలుజీవితం ప్రారంభమవుతుంది. మానసిక అనుబంధమేగాక శారీరక సంబంధంకూడా అప్పటినుండే మొదలవుతుంది. వారి మనసులు ఒకటవుతాయి. పెనవేసుకుంటాయి. కోడలు కొత్తవాతావరణానికి అలవాటు పడాలి. కుటుంబసభ్యులతో మెలకువగా వుండాలి. కొత్తగా సంసారానికి వచ్చిన కోడలుతో అత్తింటివారు సానుభూతితోనే మెలగుతారు. ఆడబిడ్డలు ఆప్యాయత ఒలకబోస్తారు. అలా జరిగితే వారికి ఏ సమస్యా వుండదు. కాని మానవ మనస్తత్వం అంతా ఒకతీరుగా వుండదుకదా! కుటుంబాలు కూడా ఒక పద్ధతిలో వుండవు కదా! సహాయ సానుభూతులు నశించి ఈర్ష్యాద్వేషాలు మొదలౌతాయి. అలాంటప్పుడు ఆ కుటుంబం మనుగడ సాగించడం కష్టం. అమ్మాయి కట్నంతేలేదనో తెచ్చినా అది చాలలేదనో అమ్మాయి అందంగా లేదనో పనిపాటలు చేయలేదనో అత్త చిర్రుబుర్రలాడటం కనిపిస్తుంది. తన కొడుకుతో లేనిపోని అబద్ధాలు చెబుతుంది. ఇక అప్పటినుండి ఆమె జీవితం అంధకారమవుతుంది. కష్టాల కడలిలో సుడిగుండంలా తిరుగుతుంది. ఒకప్పుడు తానూ కోడలినేనన్న సత్యాన్ని అత్త మరచిపోతుంది. అత్త కుర్చీమీద కూర్చొని అన్ని అక్కడికే తెప్పించుకొని తినడం త్రాగడం చేస్తుంది. కోడలితో గొడ్డుచాకిరి చేయిస్తుంది. తన కూతుళ్లవద్ద అణిగిమణిగి తిరగమని కోడలిమీద అత్త అధికారంచలాయిస్తుంది. కోడలు తెలివి గలది అయితే ఎదురుతిరగడానికి ప్రయత్నిస్తుంది. లేదంటే పెట్టే కష్టాలన్నింటిని భరిస్తుంది. లేదా ఆత్మహత్మకు పాల్పడుతుంది. ఆమె ఆత్మహత్మ చేసుకొన్నదే తడవు అత్త తన కొడుక్కి మరో పెళ్లికూతురుకోసం, కట్నంకోసం వెంపర్లాట మొదలుపెడుతుంది.

తెలుగుకథానిక పైసమస్యలన్నింటిలోనూ ప్రతిబింబిస్తుంది. కట్నం ఇచ్చి పెళ్లిచేయలేని తండ్రికి బరువు కాలేక ఆత్మహత్య చేసుకున్న యువతి (ఎవరుబాధ్యులు - కాశీనాథుని నాగభూషణరావు), తగినంత కట్నం ఇవ్వకపోతే ఎంత అందమున్నా ఆడపిల్లకు పెళ్లికాదనే విషయాన్ని తెలియజేయడం (ఊహ ఊర్వశి - చాగంటి సోమయాజులు), లాంఛనాలు సరిగా ఇవ్వలేదని అత్తగారి వేధింపులకు గురి అయిన కోడళ్లు (కోడలు - బాలత్రిపుర సుందరమ్మ), వియ్యపువారి లాంఛనాలకోసం కోడలును వేధించిన మహిళామండలి అధ్యక్షురాలైన అత్తగారు (అభాగిని - చిలకూరి శేషగిరిరావు), మామగారి ఆస్తికి తానే వారసుడినని, దానిని తన స్వాధీనం చేయాలని భార్యను పుట్టింటికి పంపకుండా వేధించే అల్లుళ్లు (రెండువరాలు - రాజ్యలక్ష్మి) మోటారుసైకిలు కొనిస్తే గాని అత్తవారింటికి రానని ఆలిగి మరదలు పెళ్లిలో నానారభసచేసి, భార్యను, మామను సతాయించే అల్లుళ్లు (మానవతి - బాలత్రిపుర సుందరమ్మ), కట్నంకానుకల విషయంలో తగాదాపడి కోడల్నిపుట్టినింటే వుంచి ఆమెను తల్లితండ్రులను ఇబ్బంది పెట్టే అల్లుళ్లు (స్వార్థమా - సంసారమా వల్లూరి గోపాలకృష్ణ), అత్తగారి బాధలు భరించలేక జీవితంమీద విరక్తితో మరణించే కోడలు, (నిజం - కప్పగంతుల సూర్యనారాయణ), వస్తువులై, పాత్రలై, కథానికా సాహిత్యంలో కనిపిస్తున్నాయి. అలాగే అత్తకు ఎదురుతిరిగిన కోడళ్ళ కథానికలూ మనకు స్ఫురిస్తాయి. కట్నం తీసుకరమ్మన్నందుకు భర్తను ఆడబిడ్డను యెదిరించి తన వ్యక్తిత్వం, ఆత్మగౌరవం కోసం కాపురాన్నే వదలిన కోడళ్లు (కీలెరిగినవాత - శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి) కట్నం బాధలు భరించలేక పుట్టినిల్లు చేరిన కూతుళ్లు, (గౌతమి - పాలకోడేటి రామశర్మ), తన సుఖం కోసం కూతురు దాంపత్యజీవితంలో సౌఖ్యం లేకుండా చేసిన తండ్రులు (ఆడాళ్లని పెంచకూడదు - శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి), పాత్రలు తెలుగుకథానికా సాహిత్యంలో దర్శనమిస్తాయి.

అత్తగారి కథలు అనగానే కథా సాహిత్యంలో మనకు భానుమతీ రామకృష్ణ కనిపిస్తారు. వయస్సు మళ్లిన ఒక అమాయకపు అత్త ఎంత ఆర్భాటం చేస్తుందో ఈమెకథల్లో చమత్కారంగా ప్రదర్శించడం కనిపిస్తుంది. ఈ విధంగా తెలుగువారి కథానికల్లో నూతన దంపతుల ముద్దుముచ్చట్లకు అత్తగారి ఆరళ్లకు మరదళ్ల దుడుకుతనానికి కొదవలేదు.

సంసారిక జీవితంలో మరో విషయం సంతానం. ఆడపిల్లకు వివాహంకాగానే గృహిణిగా హోదా లభిస్తుంది. అప్పటినుండి ఆమె రకరకాల వ్రతాలు, నోములు, ఉపవాసాలు చేయడం మొదలవుతుంది. పెళ్లి సమయంలో నూతన దంపతులను పెద్దలు 'సంతానప్రాప్తిరస్తు' అని జీవిస్తారు. తెలుగింటి ఆడపడచులు కూడా తమకు సాధ్యమైనంత త్వరగా పిల్లలు పుట్టాలని కలలు కంటారు. అత్త కోడలు కడుపున కాసే కాయకోసం ఎదురు చూస్తుంది. ఆమె గర్భవతి కాగానే ప్రసవించేంతవరకూ రకరకాల పదార్థాలు తినబెడుతారు. రకరకాల పూజలు, ఉపవానాలు నోములు చేయిస్తారు. ఆ బిడ్డ పుట్టడంతోటే ఆమె జీవితానికి సార్థకత చేకూరుతుంది. మానవజాతి మనుగడకొనసాగుతుంది. కాని తెలుగింటి ఆడపడుచుల్లో ఎవ్వరూ పిల్లల పుట్టక గొడ్రాలిగా జీవించడానికి ఇష్టపడరు. ఆ జీవితం ఆమెకు దుర్భర దారిద్ర్యాన్ని పంచి ఇస్తుంది. అప్పటినుండే అత్తగారి ఆరళ్లు మొదలవుతాయి. పిల్లలు పుట్టలేదని తనకొడుకు ఇంకొక పెళ్లి చేస్తానంటుంది. అవసరమైతే ఆమె తన కొడుకునుండి విడాకులు ఇవ్వడానికైనా సిద్ధపడుతుంది. అంతేగాక చాలా కాలంగా పిల్లలు పుట్టని స్త్రీలు తమకు పిల్లలు పుట్టలేదని ఇతర మగవారితో సంబంధాలు పెట్టుకోవడం కూడా తెలుగు కథల్లో చిత్రితమయ్యాయి.

అలాగే సమాజ వ్యవస్థలో కేవలం పిల్లలకోసమేగాక తమ భర్త వద్ద పొందలేని సుఖాన్ని ఇతరుల వద్ద పొందడంకోసం వ్యభిచారులుగా లేదా డబ్బుకోసం వేశ్యలుగా మారటం కన్పిస్తుంది. అలాగే ఆర్థిక విషయంగా సంసారం గడపలేక ఇబ్బందులు పడుతున్న భార్యాభర్తలు కూడా కన్పిస్తారు. రాబడికన్నా ఎక్కువగా ఖర్చుపెట్టే స్త్రీ పురుషులు కథల్లో ఎదురౌతారు. సమిష్టి కుటుంబంలో బ్రతకడం ఇష్టంలేక వ్యష్టికుటుంబాలు, ఏర్పడటం అందరాని వాటికి అర్రులు చాచడం, ముచ్చటపడి పెళ్లి చేసుకున్న దంపతులకు పదారేళ్లు దాటకుండా దాంపత్యజీవితంలో ఉత్సాహం నీరుకారి పోవడం మొదలైనవి ఈ కథల్లో కనిపిస్తాయి.

ఈ సమస్యలన్నీ కథానికలో ప్రతిబింబించాయి. తమ పరిస్థితిని మరచి ఆడంబరాలకు పోయిన మధ్యతరగతి స్త్రీలు (పండుగపట్టుచీర - మం.రం) , సంతానసౌభాగ్యం ఎంతో ఆహ్లాదకరమని భావించే జీవితం (పిల్లలుగల్లయిల్లు - మునిమాణిక్యం నరసింహారావు), సంతానం అపరిమితమైతే వచ్చే ఇబ్బందులు లెక్కలేనన్ని అని వివరించే స్థితి (యింకా ఏంచెప్పాలి - వాసిరెడ్డిసీతాదేవి సంతానలక్ష్మి - కలవకొలను సదానంద), అన్ని శోకాలకన్నా పుత్రశోకం దుర్భరంగా గుర్తింపుపొందే ధోరణి (పోయింది పొల్లు - బలివాడ కాంతారావు), సంసారిగా జీవితం ప్రారంభించి పరిస్థితులదృష్ట్యా వేశ్యగా మారే స్త్రీలు (రమణి - శేషగిరిరావు), భక్తికోసం తనశీలాన్ని జమీందారికి బలిపెట్టుకోలేక అతన్ని చంపి తానూ చనిపోవడం (బలవంతం - బొందలపాటి శివరామకృష్ణ), పండుగకు సిల్కుచీర కావాలని పట్టుబట్టి నెగ్గిన మధ్యతరగతి యువతులు (సిల్కుచీర - రావు), సభలు, సమావేశాలంటూ ఇల్లును గుల్ల చేసిన యువతిజీవితం (నాగరత్నం - కొరుగంటి సీతారామయ్య), సుఖంగా బ్రతకడానికి డబ్బుకోసం అడ్డదారులు తొక్కిన వేశ్యల బ్రతుకు (జగన్నాథునిరథం - మొక్కపాటి నరసింహశాస్త్రి), డబ్బుకోసం అక్రమ సంబంధం పెట్టుకొని ఆ అక్రమ సంపాదనతో భర్తను కూడా లెక్కచేయని యువతుల స్థితిగతులు (లేడి కరుణాకరం - చాగంటి సోమయాజులు), సంతాన వాంఛతీరాలని మరొక పురుషునితో సంబంధం కలిగివుండటం (అనసరంలేని ఆపరేషన్ చలం), కోడలికి పిల్లలు లేకపోవడంతో అత్త తన పాలేరుతో కోడలుకు అక్రమ సంబంధం ఏర్పరచడం (నాగమ్మ - నిష్టల వెంకట రమణమూర్తి), వ్యక్తిత్వాన్ని ఆశలను చంపుకొని రకరకాల సమస్యలతో బ్రతికే భార్యలు, (హిందూ పాతివ్రతం - గోపీచంద్), ఒకరి భార్య మరొకరితో పిల్లలు కనడం (ఔంటరితనం - చలం), సంతానం కలగలేదని బాధపడే స్త్రీలు (గొడ్రాలు - సామవేదుల చిరంజీవమ్మ), భార్య అందంగా లేదని రెండోపెళ్లి చేసుకొనే భర్తలు (ఆత్మసమర్పణం - రాధాకృష్ణమూర్తి), రెండవభార్యను ఇంటినుండి

గెంటేసి మూడవపెళ్లి చేసుకొన్న మగవారు (ద్వితీయ కళత్రం జి.వి. కృష్ణారావు) , స్నేహితుడిమీద అనుమానంతో భార్య ప్రాణాలు తీసినవారు (ఎదురుపడకలు ఆంజనేయశాస్త్రి), భార్యను వేధించి ఇంటినుండి తరిమిచేసి తన తప్పులను తెలుసుకొని పశ్చాత్తాపడిన భర్తలు (పశ్చాత్తాపం - సుగుణ మణి), చెడు అలవాట్లకు లోనయి డబ్బుకోసం భార్యలను వేధించే భర్తలు (పుట్టుమచ్చ - రేణుకాదేవి), లేకలేక కలిగిన సంతానానికి ఏ దేవుడిపేరు పెట్టుకోవాలో తికమక పడటం (వరప్రసాదం - కొడవటి కుటుంబరావు), భార్య డబ్బు పలుకుబడి సంపాదిస్తున్నందుకు అసూయపడి అనుమానపడ్డ భర్తలు (డాక్టర్ అరుణ - చిత్తూరికోటేశ్వర రావు) మొదలైన విషయాలు వస్తువులు పాత్రలు ఈ కథానికా సాహిత్యంలో గోచరమవుతున్నాయి.

మొత్తం మీద సంసారిక జీవితంలోని తీరుతెన్నులు, సుఖదుఃఖాలు ఆప్యాయత అనురాగాలు, ఒడుదుడుకులు, ఆశనిరాశలు, జయాపజయాలు తెలుగు కథానికల్లో నిత్యం విలసిల్లుతూ వుంటాయి. సంసారిక జీవితంతో ఎదురయ్యే సమస్యలను గురించి ఆలోచించినట్లే ప్రజలు అనేక దోపిడీలకు గురి అవ్వడం తన ఆస్తినే ఇతరులు దోచుకోవడం సంసారంలో రాబడికన్నా ఖర్చులు ఎక్కువ కావడం పిల్లలను బడికి పంపించడం, వారి బ్రతుకును చక్కగా తీర్చిదిద్దడం వార్ధక్యంలో పడిన తల్లి దండ్రులను సరిగా చూసుకోవడం సాధ్యమైనంత డబ్బు సంపాదించడానికి ప్రయత్నించడం కనబడుతాయి. తాము లాభపడటంకోసం ఇతరులను బలిచేయడం ఇక మధ్యతరగతి ప్రజల విషయానికొస్తే అధిక వడ్డీలతో అనేక అప్పులు చేయడం ఆ అప్పుకు షావుకారు అతని భూమిని లాక్కోవడం మొదలైన సమస్యలు నిత్యం కనిపిస్తాయి.

మానవుడు వృద్ధాప్యంలో అన్ని సమస్యలనూ వదిలించుకొని ఇంటివద్దే వుండటం తమ కర్తవ్యం. తమ మనవళ్లు మనవరాళ్లతో ఆటలాడుతూ జీవనం సాగించడం పరికింపదగ్గ అంశం అతనికి మానసికంగా శారీరకంగా శక్తి సామర్థ్యాలు తగ్గివుంటాయి. అనారోగ్యం వల్ల శరీరం పట్టుతప్పిపోతుంటుంది. ధనార్జన లేకపోవడం వల్ల అవసరాలను తీర్చుకోలేకపోవడం ప్రతిదానికీ కొడుకుపై ఆధారపడటం, దానికి కోడలు చీదరించడం, భార్య దూషించడం కన్పిస్తాయి. అంతే గాక వృద్ధులకు చాదస్తం కూడా పెరుగుతుంది. ఆచారాలు పాటించాలనడం అధికారం చెలాయించడానికి ప్రయత్నించడం, తను మాట ఇంట్లో వినలేదని వాపోవడం జరుగుతుంటాయి. దానితో ఇంటిమనుషులు విసుగుచెంది ఆయన కనీస అవసరాలు కూడా తీర్చడానికి ప్రయత్నించకపోవడం కన్పిస్తుంది.

ఈ ధోరణిలో తెలుగుకథానికలు ప్రతిబింబిస్తాయి. సంసారం సుఖంగా గడపటానికి చిట్కాలు చేసిన ఇంటిపెద్దలు (బద్నసీహత్ - మునిమాణిక్యం) , కూతురు పెళ్లి ప్రయత్నమై భార్యపోరుపడలేని భర్తలు (అమ్మన్న పెళ్లి ప్రయత్నం - జమదగ్ని) చెప్పినట్లు వినలేదని పాలేరుమీద దొంగతనంమోపిన రైతులు (బిళ్లలమొలత్రాడు - కరుణ కుమార), ఉన్న ఆస్తులను అమ్మి శిస్తు కట్టినరైతులు (వెంకన్న - కరుణ కుమార), కూలివాడిని దోపిడి చేసిన మధ్యతరగతి వ్యక్తులు (బొడ్డుమల్లెలు - చాగంటి సోమయాజులు), పాత్రలు, వస్తువులు ఈ కథల్లో కన్పిస్తూ ఉన్నాయి.

అలాగే మధ్యతరగతి ప్రజలు తమ ప్రేమకన్నా ఆస్తిపాస్తులకే ప్రాధాన్యం ఇవ్వడం (రామభక్తుడు - చలం), డబ్బుకూ, మర్యాదకూ మధ్యవుండే సంబంధాన్ని తెలియజేయడం (పశ్చాత్తప్తుడు - కొడవటి గంటి కుటుంబరావు), డబ్బులేక చావు బ్రతుకుల్లో వున్న పెద్దనాన్నను చూడలేకపోవడం (డబ్బు-డబ్బు-డబ్బు- గోపీచంద్), మధ్య తరగతి రైతుల మనస్తత్వం చిత్రికరించడం (పేకమేడ - సూర్యారావు) , మారుతున్న పరిస్థితులకనుగుణంగా మార్పు చెందలేని స్త్రీ వల్ల సంసారిక జీవితంలో ఇబ్బందులు కలగడం (ఆశాభంగము - బాలసుందరరావు), వృద్ధులు తమ మనవరాళ్ళకు ఖర్చుపెట్టడానికి

కూడా చేతిలో డబ్బులు లేకపోవడం (ఎవరికోసం - ద్వివేదుల విశాలక్షి ), మొదలైన సమస్యలను తెలుగుకథానిక చిత్రించగలిగింది. సంసార జీవితంలోని భిన్న ప్రాంగణాలను మానవ మనస్తత్వాన్ని ప్రతిబింబింపజేస్తోంది తెలుగు కథానిక.

**2. 3. వృత్తి - ఉద్యోగం**

సమాజంలో మానవుని మనుగడకు ఏదో ఒకటి బ్రతుకుదెరువు వుండాలి. అదివృత్తి అయినా ఉద్యోగం అయినా కావచ్చు ఈ రెండింటిలో మానవుడు ఏదో ఒకటి సాధించడానికి ప్రయత్నిస్తాడు. తెలుగుదేశంలో తరాలుగా ప్రజలువృత్తిజీవనాన్ని సాగిస్తున్నారు. ఈ మధ్య కాలంలో ఉద్యోగజీవనం బాగా విస్తరించిపోయింది. తెలుగువారి వృత్తుల్లో ముఖ్యంగా వ్యవసాయం, బట్టలు నేయడం, కమ్మరం, వడ్రంగం, సాలెపని, బేల్దారి, చెప్పులు కుట్టడం, బుట్టలు అల్లడం, చేపలు పట్టడం, జంతువులను వేటాడటం వంటివి వున్నాయి. ఇవికాక కాలపరిణామం వల్ల వచ్చిన వృత్తులు వర్తకం, రాజులు, సైనికులు ఇలాంటివి ఎన్నో వచ్చాయి.

తెలుగు ప్రజలందరూ ఆధారపడి జీవిస్తున్న వృత్తి వ్యవసాయం. భూమిని సాగు చేయడం, విత్తనం వేయడం, వర్షాలు సకాలంలో వస్తాయా రావా అన్న సందేహం ప్రజలలో వుండటం వేసిన పంటను సక్రమంగా పోషించడానికి ప్రయత్నించడం మొదలైనవి జరుగుతాయి. ఈ నేపథ్యంలో అనేకమంది పాలేర్లతో ఉచితంగా వూడిగం చేయించుకోవడం కూడా కనిపిస్తుంది. పండిన పంటను అమ్మడం, ధనంప్రోగుచేసుకోవడం కన్పిస్తుంది. అలాగే ఇతరవృత్తుల వాళ్ళు వారివారి వృత్తులను చేయడంచాకలివాడు బట్టలు ఉతకడం, మంగలి వాడు తనవృత్తిని స్వీకరించడం సనాతనకాలంనుండి రావడం పరిపాటి. నేడు ఈ వృత్తుల వాళ్ళందరూ వారివారి వృత్తులను సక్రమంగా నిర్వర్తించటంలేదు. తమ వృతుల్లో రాబడి తక్కువగా వుండటంవల్ల వేరే పనులపై వారి మనస్సు లగ్నం చేస్తున్నారు. పట్టణాల్లో పాలు అమ్మటం, హోటళ్ళుపెట్టడం, కిల్లీకొట్టులు పెట్టడం, ఇతర వ్యాపార సంబంధమైన పనులను చేపడుతున్నారు. దేశంలో సార్వజనిక విద్యావిధానం విస్తరించడంవల్ల , ఉద్యోగావకాశాలు మెరుగుపడటంవల్ల కూడా రైతు విద్యారంగంవైపు పయనిస్తున్నాడు. గ్రామాలలో కష్టానికి తగిన ఫలితం లేక, అనేక వృత్తులవాళ్ళు పట్టణాల్లో చేరి వివిధ వృత్తులను చేపడుతున్నారు. రిక్షా త్రొక్కడం, తాపీపని చేయడం, మిల్లు కూలీ మొదలైనవి చేసినా వారి జీవితం దుర్భరంగా కొనసాగుతుంది. ఇక భిక్షగాళ్ళు ఎత్తని అవతారమంటూలేదు. కథలు చెప్పేవాళ్ళు వీధినాటక కళాకారులు, పిల్లవానికి గజ్జెకట్టి ఆడించడం, ముష్టి ఎత్తడం, ఆ ముష్టికోసం తమ పిల్లలకీ కాలు, చేయి తీసివేయడం, కళ్ళుపొడవటం, మూగవాళ్ళు అని అబద్ధాలు చెప్పడం మొదలైనవి మనకు కన్పిస్తాయి.

గ్రామాల్లోరైతులు ఇతర వృత్తులవారిని హీనంగా చూడటం, వారి భార్యలను మానభంగం చేయడానికి ప్రయత్నించడం, వారి అస్తులను స్వాధీనం చేసుకోవడం మొదలైనవి కన్పిస్తాయి. అలాగే పట్టణ విషయానికొస్తే కమీషన్ వ్యాపారులు, దొంగవ్యాపారులు, డాక్టర్లు కన్పిస్తారు. కొందరు తమ వృత్తిని కొనసాగిస్తే మరికొందరు ప్రవృత్తిరీత్యా వ్యక్తులను సాగిస్తారు. పడుపు వృత్తి కూడా ఇందులో భాగమే.

సమాజంలో వున్న పై సమస్యలన్నింటినీ తెలుగు కథానిక అద్దంపట్టినట్లు కథలను సృష్టించింది. సవర్ణ ధనికురాలు అవర్ణుని ఆస్తి కాజేయడానికి చేసే ప్రయత్నాలు (కయ్యు కాలువ - కరుణ కుమార), స్వలాభంకోసం జీతగాని సంసారాన్ని నాశనం చేసిన సవర్ణులు ( బంగారమ్మ కమతం - సి. యస్. రావు), ఉద్యోగం లేకుండా పొలంపనులు చేసే జీవించాలనే, వారు (వెలంవెంకడు - చా.సో), శుభ్రం చేయడానికి తీసుకెళ్లిన బట్టలను చినగకుండా ఇవ్వవలెననుకొనే రజకులు ( పిండీకృతశాటి కొలకలూరి ఇనాక్), గ్రామంలో రెండు వర్గాల మధ్య బట్టలు ఉతికి బ్రతకలేని చాకలివాడు పట్నంకు వచ్చి పట్నం పద్ధతులు తెలియక

పోలీసుల చేతుల్లో చావు దెబ్బలు తినడం (నేను బతకలేను సిన్నమ్మ - జి.ఆర్.మహర్షి ), తినడానికి తిండిలేక రిక్షాత్రొక్కి జీవితం గడిపే అభాగ్యులు (రిక్షావాలా - కరుణకుమార), పాటలుపాడి డబ్బులు సంపాదించే గ్రుడ్డివారు (గుడ్డివాడు - పులికంటి కృష్ణారెడ్డి), గ్రామాల్లో చిన్న వృత్తుల వారి భార్యలను మానభంగం చేసే సవర్ణులు (ఊరుమ్మడి బతుకులు - సి.యస్.రావు), ఆసాముల ఔద్ధత్యానికి బలైనవారు (పేదవాడి పెళ్లాం - నవీన్) , పొట్టకూటికోసం క్రూరమృగాల నోళ్లలో తలదూర్చిన అభాగ్యులు (సర్కస్‌డేరా - మదురాంతకం రాజారాం), తాపీపని చేయడంలో తన శీలాన్ని పోగొట్టుకొని కూలి తెచ్చుకున్న స్త్రీలు (నిశ్చయం - భార్గవీరావు), అడుక్కోవడమే గొప్పవృత్తి అనుకొనే వాళ్లు (దొంగవెధవ - ముక్కామల వెంకటేశ్వరరావు), ముష్టివాళ్లు గుడ్డివాళ్లను పెళ్లాడటం (ఎంపు - చా.సో),చావు బ్రతుకుల్లో వున్నవాడిని డాక్టర్లు రక్షించలేకపోవడం (డాక్టర్ - వాకాటి పాండురంగరావు), డాక్టర్ డైలమా - రావూరి భరద్వాజ) , సామాన్యులకు న్యాయంచేయాలని తపనపడే లాయర్లు (అంటరాని పొలం - ముద్దుకృష్ణ మొదలైనవి. సంప్రదాయక ఆధునిక, వృత్తులకు సంబంధించిన కథలు తెలుగుదేశంలో ప్రతిఫలిస్తాయి.

**2.3.1. నిరుద్యోగం** : సమాజంలో అన్ని అర్హతలు వున్న విద్యావంతులు స్వతంత్ర వృత్తిలేక ఉద్యోగంరాక నిరుద్యోగులుగా వున్నారు. వీరు తమ శక్తి సామర్థ్యాలు వినియోగం లేనందు వల్ల నిరాశ, అసంతృప్తి ప్రబలి దేశానికి భారంగా నిలిచారు. వీరు కాయకష్టం చేయలేక పోవడం. ఉద్యోగరంగంలో పోటీలు పెరిగి అవకాశాలు చాలకపోవడం, ప్రభుత్వం పరిశ్రమలు పెట్టకపోవడం, ఉద్యోగావకాశాలను పెంచకపోవడం నిరుద్యోగితకు కారణాలు కావచ్చు. వీరి పోషణ భారం తల్లిదండ్రులపై పడుతుంది. చివరికి వీరి బ్రతుకు అందరికీ చులకన కావడం, ఆ పరిస్థితిని సహించలేని నిరుద్యోగి జీవితం దుర్భరమవుతుంది. అభ్యర్థి అర్హతలకంటే కులమత ప్రాంతీయ దురభిమానాలు, పక్షపాతాలు, అవినీతి ప్రాముఖ్యాన్ని సంతరించుకొంటాయి.

నేడు సమాజంలో వున్న నిరుద్యోగిత కథానికా సాహిత్యానికి వస్తువయ్యింది. ఆ నేపథ్యంలో తెలుగులో చాలా కథానికలు వెలువడ్డాయి. చదివిన చదువుకు ఉద్యోగం రాక ఆత్మహత్య చేసుకొన్న నిరుద్యోగులు (నిజం - కప్పగంతుల సత్యనారాయణ) , సంపాదనలేక కుటుంబం గడువక ఆత్మహత్య చేసుకోబోయిన నిరుద్యోగులు (చుక్కాని - రావూరు), ఇద్దరు నిరుద్యోగుల పరిస్థితి (రెండింతలు - ధనికొండ హనుమంతరావు), వచ్చిన ఉద్యోగాన్ని పోగొట్టుకొన్న అభాగ్యులు మరలా దానిని సంపాదించడానికి చేసిన ప్రయత్నాలు (చెల్లనికానీ - కొడవటి, గంటి కృష్ణమూర్తి) వ్యక్తిత్వం చంపుకొని భార్య ఆస్తిమీద జీవించడం ఇష్టంలేని నిరుద్యోగులు (ఇంతలోవుంది - కొడవటిగంటికుటుంబరావు), తాత్కాలిక ఉద్యోగాలు చేస్తూ వివాహం చేసుకొని ఆ తర్వాత ఉద్యోగాలు వూడగొట్టుకొన్నవారు (కీలెరిగిన వాత - శ్రీపాద) ఈ కథలో కన్పిస్తారు.

**2.3.2. ఉద్యోగం :- 'ఉద్యోగం పురుష లక్షణం' అన్నారు పెద్దలు:** మనిషి తన స్వశక్తిపై బ్రతకడానికి ఉద్యోగం అవసరం. ఉద్యోగం ప్రభుత్వరంగ సంస్థల్లో కావచ్చు ప్రవేటురంగ సంస్థల్లో కావచ్చు వేర్వేరు అర్హతలున్నవారు వేర్వేరు స్థాయిల్లో పనిచేయడం జరుగుతుంది. ఒక వ్యవస్థలో పనిచేసేవారు ఒకరికొకరు సహకారం స్నేహం, సానుభూతి, కలిగి అందరూ ఒకే కుటుంబంగా కలసివుంటే బాగుంటుంది. కాని వారిలో అసమానతలు అధికార దాహం అధిక ధనసంపాదనలాంటి ఆలోచనలుంటాయి. దీనివల్ల వ్యక్తులు స్వార్థపరులుగా అసూయపరులుగా, కుత్సితులుగా అధికార మదాంధులుగా తయారై వాతావరణాన్ని కలుషితం చేస్తారు. అధికారం కోసం ప్రాకులాడుతారు. తోడి ఉద్యోగులపై చాడీలు చెప్పడం పై అధికారికి అతివినయ విధేయుడుగా మెలగడం అర్హతల విషయంలో, సమర్థత విషయంలో తమకే ఆధిక్యమన్నట్లు తక్కినవాళ్లందరూ

పనికి రానివారన్నట్లు ప్రచారాలు చేస్తారు. అధికసుఖాలకోసం సమాజంలో పలుకుబడిని పెంచుకోవడం కోసం ప్రమోషన్లు సంపాదించడం కోసం అవసరమైతే ఏవస్తువునైనా పై అధికారికి ఎరగా చూపడానికి ప్రయత్నిస్తారు. ఉద్యోగం సంపాదించడం సులభంకాని వచ్చిన ఉద్యోగంతో మనశ్శాంతిగా బ్రతకడం కష్టం. బ్రతకడానికి బాగుపడటానికి ఎవరూ అడ్డురారు. కాని ఆ కార్యసాధనలో అడ్డదారులు త్రొక్కితే సహించలేని వారు కొందరుంటారు. వారు అవసరమైతే బుద్ధి చెప్పడానికి కూడా సిద్ధపడుతారు.

సమాజంలో వనరులు పెరిగేకొద్దీ మానవుని అవసరాలు కూడా పెరుగుతాయన్నది సత్యం. సామాన్య ఉద్యోగులు వారికిచ్చిన జీతంలో తమజీవిత అవసరాలను తీర్చుకోలేక నానాబాధలు పడుతూ, కోర్కెలను అణచుకొంటూ, ఆశలను దిగమింగుతూ అవసరాలను వాయిదా వేస్తూ కాలంగడుపుతుంటారు. ఇదే స్థితిలో వారు తమసమస్యలసాధనకోసం సమ్మెలు చేయడం సహజం. అంతేగాక ఉద్యోగ హోదా కొందరిమీద మారకద్రవ్యంలా పనిచేస్తుంది. చిన్న ఉద్యోగులను చులకన భావంతో చూడటం కనిపిస్తుంది.

ఉద్యోగ నియామకాధికారమున్న పెద్దల్లో కొందరు స్వార్థపరులుగా, అవినీతి కోవిదులుగా వుంటారు. వారిని అభ్యర్థులు అన్ని కోణాల్లోనూ తృప్తి పరిస్తే కాని వారికి ఉద్యోగాలు రావు. అందరూ అలాగే వుంటారనడం కూడా అసత్యం. చిత్తశుద్ధితో పనిచేసే వ్యక్తులు-కూడా కొందరుంటారు. వారు సమర్థులకే ప్రాధాన్యం ఇవ్వడానికి ప్రయత్నిస్తారు. కొందరు మంచివారైనా పై అధికారులకు లోబడి వుంటారు.

దేశవాసుల అవసరాలను బట్టి రకరకాల ఉద్యోగాలు ఏర్పడ్డాయి. నౌకరునుండి అత్యున్నత ఉద్యోగి వరకూ భిన్న ధోరణుల్లో వుంటారు. కాని వారు ఎంతసంపాదించినా ఇంకా వెలితిగానే వున్నట్లు కన్పిస్తుంది. సామాన్యంగా తిండికి లేనివాడు తిండిగురించి ఆలోచించినట్లు తిండివున్నవాడు బట్టకు, బట్టవున్నవాడు గూడుకు, గూడువున్నవాడు విలాసాలకు ఆలోచించినట్లు అనే చందం మనకు ఉద్యోగాల్లో కన్పిస్తుంది. దీనికి కారణం డబ్బుమహత్యం.

సమాజంలో జరిగే ఉద్యోగ సమస్యలు కథానికలో చిత్రింపబడ్డాయి. పై వస్తువును ఇతివృత్తంగా తీసుకొని రచయితలు కథలను రచించారు. క్రింది ఉద్యోగులపై పై అధికారులు జరిపే దౌర్జన్యాలు, (512 - కరుణకుమార), కులంపేరుతో క్రింది ఉద్యోగిని వేధించిన పై అధికారులు (న్యాయానికి కాలంగాదు - విలిదండి కుడుతమ్మ), అధికారుల సమానం కోసం తనజీతాన్ని ఖర్చుపెట్టి దిగులుపడిన గుమాస్తాలు (దివాన్‌జీగారి మసాఫరు - కరుణకుమార), పై అధికారికి మర్యాద చేయబోయి ఇబ్బందులపాలైన అయ్యవార్లు (అయ్యవారిని చేయబోతే కోతయింది - కరుణ కుమార), అధికారులు తమ స్వార్థం కోసం కార్మికులను బలిచేయడానికి ప్రయత్నించడం (శ్రుతి- కేతువిశ్వనాథరెడ్డి), చాలీచాలని జీతాలతో కూతురుపెళ్ళి చేయలేక మంచంపట్టిన బడిపంతులు (ఎవరుబాధ్యులు - నాగభూషణరావు), కార్మికుల సమ్మెను దెబ్బతీయడానికి గుడిసెలకు నిప్పుపెట్టిన మిల్లుయజమానులు (మమత - బొందలపాటి శివరామకృష్ణ), ప్రమోషన్‌కోసం పైరవీలు సాగించే మధ్యతరగతి ఉద్యోగులు, (సారాయిడబ్బులు - కరుణకుమార), తాము చేస్తున్న ఉద్యోగానికి అన్యాయం చేస్తూ అక్రమంగా డబ్బులు తీసుకొనే ఉద్యోగులు (నిరుద్యోగి - విక్రమార్కుయం), సుఖజీవనం కోసం అక్రమార్జన చేసి హోదాను పెంచుకొనే అధికారులు (గెజిటెడ్ ఆఫీసర్‌భార్య - తాళ్లూరి నాగేశ్వరరావు) వచ్చిన జీతంచాలక తమకోర్కెలను తీర్చుకోలేక వాయిదా వేసే ఉద్యోగులు (ఆర్.చక్రారావుకథ - వాకాటి పాండురంగారావు), అవినీతిని ఆశ్రయించిన ఉద్యోగ నియామక అధికారులు, (రెండురెక్కలవాడు - వాకాటి పాండురంగరావు) పాత్రలు, వస్తువులు ఈ కథల్లో మనకు గోచరమవుతున్నాయి.

**2.4. సంస్కరణ దృక్పథం:** ''పందొమ్మిదవ శతాబ్దం భారతదేశానికి ఒక సంఘర్షణ యుగం. పాతకు, కొత్తకు, విశ్వాసానికీ హేతువుకు, అణచివేతకు, విజృంభణకు, నిద్రకు, చైతన్యానికి అవిద్యకు, విద్యకు,

అవమానుషత్వానికీ మానవతకు, అవకాశవాదానికీ నిబద్ధతా నిమగ్నతలకు, స్వతంత్ర వాదానికి సామ్రాజ్యవాదానికి''6 ఇలా అనేక అంశాల మధ్య భారతదేశం సంఘర్షించుకొంది.

అంతకుముందు భారతదేశం ఇంగ్లీషువారి చేతుల్లో ఉంది. అనేక సంప్రదాయాలు, ఆచారాలు, మూఢనమ్మకాలతో మగ్గుతూ వచ్చింది. ఆనేపథ్యంలో సాంఘిక అసమానతలు తొలగించడానికి అనేకమంది సంఘసంస్కర్తలు బయలుదేరారు. అందులో భాగంగా కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, రఘుపతి వేంకటరత్నం, ఉన్నవ లక్ష్మినారాయణ, చిలకమర్తి లక్ష్మీ నరసింహం, కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణ రావు మొదలైనవారు బయలుదేరారు. బ్రహ్మసమాజం, ఆర్యసమాజం, రామకృష్ణమిషన్ మొదలైన సంస్థలు వెలశాయి.

ఆనాడు సంఘం అనేక సమస్యలలో సతమతమవుతూండేది. ముఖ్యంగా స్త్రీలు సతీసహగమనం, కన్యాశుల్కం, బాల్యవివాహాల మధ్య నలిగిపోయారు. బాలవితంతువుల ఆక్రందనలు, మూఢవిశ్వాసాలు వికటాట్టహాసం చేశాయి. భార్య జీవించివుండగానే మగవాడు మరొకపెళ్లి చేసుకోవడం, ముసలివాడైనా బహిరంగవేలంలో పద్దెనిమిదేళ్ల అమ్మాయిని కొని పెళ్లిచేసుకోవడం, అదేభర్త చనిపోతే భార్య జీవితాంతం విధవరాలుగా వుండటం, ఆ అమ్మాయి ముక్కుపచ్చలారనిది అయినా అలాగేవుండాల్సిందే. పెళ్లిళ్ల సంతలో దళారీలుగా వ్యవహరించడం గౌరవమైన వృత్తిగా వుండేది. సవర్ణులు తమస్థాయికి తగ్గట్టుగా వేశ్యలనుంచుకోవడం సర్వసాధారణం వర్ణాంతర వివాహాల ఊసేలేదు. సహపంక్తి భోజనాల ప్రసక్తిలేదు. ''అసలు ఆ సాంఘిక వాతావరణమే దౌర్జన్యపూరితం వాస్తవంగా కుళ్ళి కంపుకొడుతూ స్వతంత్ర భావాల్ని మానవ సంచలనాన్ని గొంతుపిసుకుతున్న వాతావరణం''7 సమాజంలో ఎక్కువభాగం బ్రాహ్మణులు, భైరాగుల ఆధీనంలో వుండేది. వారు సంఘాన్నంతా తమ గుప్పెట్లో పెట్టుకొని తోలుబొమ్మలాట ఆడించారు. 'వారు చెప్పిందే వేదం, వారు వేసిందే పాదం' అన్నట్లు చేశారు. నాడు సంఘంలో స్త్రీ పరిస్థితి నేటికి ఇంకా కోలుకుంటున్నదని, పూర్తి ఆరోగ్యవంతం కాలేదని చెప్పవచ్చు.

ఆ సమాజిక వ్యవస్థను రూపుమాపడానికి సంఘసంస్కర్తలు ప్రయత్నించారు. వారి ప్రభావం సమాజంలో ప్రాకింది. జీవితంలో కలకాలం హాలాహలం మింగుతూ కూర్చోరాదని దానిని అమృతంగా మార్చుకోవచ్చునని నిరూపించారు. వీరేశలింగం ఆధ్వర్యంలో అనేక వితంతు వివాహాలు జరిగాయి. బాల్యవివాహాలు నిషేధించడానికి శారదాచట్టం అండగా నిలిచింది. అప్పటినుండి కులాంతర వివాహాలు జరగడం మొదలయ్యాయి. వేశ్యాసమస్యనుండి తమ భర్తలను రక్షించుకోడానికి స్త్రీలు ప్రయత్నించారు. చైతన్యవంతులుగా తయారయ్యారు. అవిద్యయే మూర్ఖతకు మూలం అని తెలిసి విద్యావంతులు కావడానికి సమస్యలను తెలుసుకొనడానికి మూఢనమ్మకాల మూలంగా తాము ఇన్నాళ్లు నష్టపోయినదానికి స్పందించారు. అప్పుడే సమాజంలో పాతకూ, కొత్తకూ సంఘర్షణ మొదలైంది. సమాజసంప్రదాయాలు తారుమారైతే సమాజం నాశనమవుతుందని ఒకవైపు సనాతనవాదులు విలపిస్తున్నా నూతన పథంవైపు పయనించడానికి సుగమంగా వున్న నాటి సమాజం వీరి మాటలు పెడచెవినపెట్టింది.

ఈ నేపథ్యంలో తెలుగులో అనేక కథలు వెలువడ్డాయి. ముఖ్యంగా కథానికకు ఆద్యుడైన గురజాడ ఈ సంఘసంస్కరణ నేపథ్యంతోనే కథలు రాశాడు. ఆయన రాసిన దిద్దుబాటు, మెటిల్డా, సంస్కర్త హృదయం, మీ పేరేమిటి, పెద్దమసీదు అనే ఐదుకథలూ సంఘసంస్కరణోద్యమంకోసం రాసినవే. అలాగే స్త్రీ సమస్యలపై అవగాహన లేని సంస్కర్తల కథలు, (సంఘసంస్కర్త - అందేనారాయణ స్వామి) , భార్యలను కొట్టే భర్తలను సంస్కరించబోయి తానే పరస్త్రీ మీద చేయివేసుకోబోయిన సంస్కర్తలు (మగవాడి దౌర్జన్యం - కొడవటిగంటి కుటుంబరావు), ఆడది రంగూన్ వెళ్లకూడదనే కట్టుబాట్లు దిక్కరించి ఇతరులకు ఆదర్శప్రాయులైన

యువకులు, (సుభద్రమ్మ - శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి), కుహనా సంస్కర్త పన్నిన కుటిల వలయాన్ని వివేకంతో భేదించి బయటపడి తాను కోరుకొన్న యువకునితో వివాహం చేసుకొన్న వితంతు యువతులు (రామలక్ష్మి - శ్రీపాద) తండ్రి చేత వెలివేయబడి యువపండితుణ్ణి వరించి పెళ్లిచేసుకొని తండ్రికే గుణపాఠం చెప్పిన వితంతు యువతులు (వెలిపెడితే అల్లుడైనాడు - శ్రీపాద ), పద్నాలుగేళ్ళయినా నిండని ఆడపిల్లకీ పదహారేళ్ళయినా నిండని మొగపిల్లవాడికి పెద్దవాళ్ళు తొందరపడి పెళ్ళిచేయటం (వయస్సు బుద్ధికూడా పెరిగాయి. - శ్రీపాద), వేశ్యాకులంలో కూడా శీలనైశిత్యంకల జాతిరత్నాల వంటి స్త్రీలుండటం (తులసిమొక్కలు - శ్రీపాద), వీరేశలింగం పంతులు వితంతు పునర్వివాహాలు విజయవంతంగా నిర్వహించిన కాలంలో సంఘసంస్కారవాదులకూ సనాతన వాదులకూ మధ్య జరిగిన ఘర్షణలు (తనదాకా వచ్చింది - శ్రీపాద), మంచి వంశములో పుట్టి మంచి సంప్రదాయాల్లో పెరిగిన వితంతువు వైరాగ్యంతో కాలం గడపడం (ఖచ్చితమైన జవాబు - శ్రీపాద), కులం కట్టుబాటు వదలి మతం మార్చుకొని పెళ్ళిచేసుకొన్న భిన్నకులాల యువతీయువకులు (సాగరసంగం - శ్రీపాద ), లోకంలో పెద్దమనుషులుగా చలామణి అయ్యేకొందరు వ్యక్తులు ఎంతటి అవినీతిపరులూ, లంచగొండులూ అయివుంటారో, సంఘంలోని వేశ్యలతో ఎటువంటి సంబంధాలుంటాయో తెలుసుకోవడం (కలుపుమొక్కలు - శ్రీపాద) , పరిస్థితులకనుగుణంగా జీవనవిధానాన్ని మార్చుకొనకుండా పాచీనాచారాలాధారంగానే బాల్యవివాహాలు చేసినవారు (వెంకాయమ్మ వివాహం - గోటేటి జగన్నాథరావు) భార్యభర్తల వయస్సులో ఉన్నతేడాలవల్ల సంసారం సజావుగా సాగకుండ ఉండటం (ద్వితీయం - కొడవటిగంటి కుటుంబరావు) ఆస్తి అంతస్తుకు ఆశపడి కన్నకూతురుకు వృద్ధ వివాహం చేసిన తల్లిదండ్రులు, ఆత్మహత్యకు గురైన ఆడపిల్లలు (చేశాడు ఎలాగైతే సంబందిం - మధుసూదనరావు ), వితంతు కూతురుల సుఖాన్ని పట్టించుకోకుండా పుర్వివాహం చేసుకొన్న వృద్ధులు, ( స్త్రీతత్వము - సుబ్బలక్ష్మిదేవి), డబ్బుమీద వ్యామోహంతో కన్నకూతురుకు కన్యాశుల్కం వివాహం చేసి బాల్యంలోనే వైధవ్యాన్ని తెచ్చిపెట్టిన తల్లిదండ్రులు (సావిత్రి స్వప్నము - బియ్యే సుబ్బారావు) వరకట్నం కారణంగా ఆడపిల్లల తల్లిదండ్రులు ఎదుర్కొనే కష్టాలు (శ్రీకృష్ణుని కృప - పట్టాభిరామయ్య ), వితంతువులపట్ల నాటి సమాజం ప్రవర్తించే తీరుతెన్నులు ( సరస్వతి కష్టములు గట్టెక్కుట - మాగంటి శకుంతలాదేవి ) , వితంతువులపట్ల సమాజం అనుసరిస్తున్న దురాచారాలవైఖరికి నిరసనగా ఆత్మహత్య చేసుకొన్న వితంతువులు (కేశవపవనమ్ - చుండ్రుపట్ల రామారావు), వేశ్య ప్రోద్బలంతో భార్యపై హత్యాయత్నం చేసిన భర్తలు ( భ్రమ - గోపాలస్వామి ) , దేవాదాసివ్యవస్థల వల్ల అధోగతి పాలవుతున్న స్త్రీలు ( హసికుడు - ఒకరు ), వంటి భిన్న ఇతివృత్తాలు, విభిన్నపాత్రలు, అనేక వస్తువులు కథానికలలో గోచరమతూవున్నాయి.

**2.5. రాజకీయ ప్రభావం:-** రాజకీయ వ్యవస్థ సమాజస్వరూపంలో ఒక అంతర్భాగం. ఆంగ్లేయులు రాజ్యాధికారం చేతబట్టిన రోజుల్లో ఎక్కువ భాగం భారతదేశాన్ని దోచుకోవడానికి ప్రయత్నించారు.

ఆ ప్రయత్నంలో భాగంగా భారతదేశంలో వారికి అవసరమైన సౌకర్యాలు చేయించారు. ఆది భారతీయులకు లాభదాయకమైంది. ఎంతోమంది నాయకులు స్వాతంత్ర్యం కోసం కృషిచేశారు. ఆ ఫలితంగా మనకు స్వాతంత్ర్యం సిద్ధించింది. స్వతంత్ర భారతదేశంలో స్వార్థపరులు ఎక్కువభాగం రాజకీయంలోకి ప్రవేశించారు. వారు నిస్వార్థపరులను రాజకీయాలలోకి రానీకుండా అణగద్రొక్క ప్రయత్నించారు. అధికారం వాళ్ళచేతుల్లో ద్విగుణీకృతం చేసుకొన్నారు. 1952లో ప్రప్రథమంగా దేశంలో సార్వత్రిక ఎన్నికలు జరిగాయి. వారు ఎన్నికల్లో యుక్తులు సాగిస్తూ, ఎత్తుకు పైఎత్తులు వేస్తూ, స్వార్థ చింతన అధికార వ్యామోహం మొదలైన వాటికి లోనైయ్యారు. స్వార్థపరులు కొందరు తమలాభంకోసం అమాయకులను పాచికలుగా

వినియోగించుకొన్నారు. పంచాయతీ వ్యవస్థ ఏర్పడిన తరువాత గ్రామీణ ప్రాంతాల్లోకి రాజకీయ ప్రభావం పూర్తిగా వ్యాపించింది. ప్రజల్లో రాజకీయ అవగాహన పెరిగింది. దాన్ని సుసంఘటితం చేసి సామాజిక లక్ష్యసాధనకు నేతృత్వం వహించవలసిన నాయకులు, స్వార్థంకోసం అధికార దర్పంకోసం, ఎత్తుగడలు వేసి ప్రజల విశ్వాసం కోల్పోయారు. ఆ స్థలంలో సరికొత్త నాయకులు ప్రవేశించారు. వారిధోరణికూడా అలాగే అయిపోయింది. నేడు సమాజంలో నిస్వార్థ రాజకీయనాయకులు దీపం పెట్టి వెతికి చూసినా కనిపించరు. ఎన్నికల్లో గెలచిన రాజకీయ నాయకులు దేశాన్ని ప్రగతి పథంవైపు నడిపించవలసిన వారు నేడు అధికార దాహంతో ఒకరికొకరు అంతఃకలహాలతో అభివృద్ధి గురించి ఆలోచించలేదు. రాజకీయనాయకుల కలహంలో దేశాభివృద్ధి బలైపోతోంది. దేశానికి స్వాతంత్ర్యం వచ్చి ఐదుదశాబ్దాలవుతున్నా దానికి తగినంత అభివృద్ధి కనబడటంలేదు. దేశంలో ఇంకా పేదరికం, నిరుద్యోగం విలయతాండవం చేస్తున్నాయి. అనేక మంది అమాయకులు అన్యాయాలకు గురవుతున్నారు. శక్తి సామర్థ్యాలు వున్నవారు తగిన స్థానాన్ని అందుకోలేకపోతున్నారు. అన్ని రంగాలలోను పోటీ అధికమైంది. ఈ రాజకీయ నేపథ్యం నుండి తెలుగులో అనేక కథానికలు వెలువడ్డాయి.

పరతంత్రపాలనలో దారిద్ర్యాన్ని బానిసత్వాన్ని అనుభవిస్తున్న రచయితలు తమ కాలం పట్టి రచనలు చేయడం మొదలు పెట్టారు. మొదటి ప్రపంచయుద్ధానంతరం వెలువడ్డ తెలుగుకథానికల్లో రాజకీయ చిత్రణ కన్పిస్తుంది. రెండవ ప్రపంచయుద్ధానంతరం తెలుగుకథానిక ఫలవంతమైంది. నేడు ఇది వృద్ధిచెంది అనేక శాఖోపశాఖలుగా విస్తరించింది. తెలుగుకథల్లో చక్కగా రాజకీయ స్పృహ కనపరచినవారు గోపీచంద్ (దేశం ఏమయ్యేట్టు, పీడిత హృదయం), రెండవ ప్రపంచయుద్ధకాలంలో విశాఖపట్టణం మీద జపాన్ బాంబుదాడిని తెలియజేసే కథలు ( బాంబులు పడిననాడు - సి. ఈశ్వరరావు), యుద్ధానుభవాలు చెప్పిన మిలిటరీ కాప్టన్లు ( విజయోత్సవం - క్రొవ్విడి లక్ష్మన్న ), యుద్ధకాలంలో అధికమైన తెలివిని ప్రదర్శించి ప్రాణాలు కోల్పోయిన పిరికివారు, (పిరికివాడు - త్రిపురనేని గోపీచంద్ ), రెండవ ప్రపంచయుద్ధకాలంలో రష్యా గెలిచినట్లు జర్మనీ ఓడినట్లు ఇండియాలో సోషలిస్టు రాజ్యంవస్తున్నట్లు కలలు కన్న వాళ్ళు ( భల్లూకస్వప్నం - చాగంటి సోమయాజులు), రాజకీయ నాయకులు స్వార్థానికి బడుగువర్గాలవారిని బలి చేయడం (పావులు పాములుగా మారినవేళ - సి. యస్. రావు ), గ్రామాల్లోన్ని ఎన్నికలచిత్రణ (గోడల్లేని జైలు - రావూరి భరద్వాజ ), అధికార దర్పం చూపించిన రాజకీయ నాయకులు ప్రజల్లో విశ్వాసాన్ని కోల్పోవడం ( ఇస్‌ఝుండేకే నీచే - కలవకొలను సదానంద), మధ్యతరగతి రాజకీయకుడిచేతిలో బలైన రిక్షావాళ్ళు ( కోటిగాడు స్వతంత్రుడు - పులికంటి కృష్ణారెడ్డి ), అలాగే స్వార్థం కోసం సమాజాభివృద్ధికి నోచుకోని రాజకీయనాయకులు కేవలం ఎన్నికల సమయంలోనే ప్రజల సమస్యలను గురించి ఆలోచించే నాయకులు తమ ఆధిపత్యం కొనసాగించేందుకు అడ్డువచ్చిన సామాన్యజనాన్ని అణచివేసే బడానాయకుల పావులు కథానికా సాహిత్యంలో ఎక్కువగా దర్శనమిస్తాయి.

**2.6 జాతీయోద్యమం:**

దాదాపు మూడు శతాబ్దాలకాలం భారతీయులు పారతంత్ర్య పాలనను అనుభవించారు. ఆ అనుభవంతో తమ సంపదనే కొల్లగొడుతూ తమపైనే ఆధిపత్యాన్ని చెలాయిస్తున్న ఆంగ్లేయులను చూసి సహించలేకపోయారు. అనేకమంది నాయకులు స్వరాజ్యంకోసం నాయకత్వం వహించారు. ఆంగ్లవిద్యను నిరసించారు. వారి వస్తువులను కూడా బహిష్కరించారు. 1857 ప్రాంతంలోనే భారతీయులు ఆంగ్లేయులపై తిరుగుబాటు చేశారు. అదే మొదటి స్వాతంత్ర్య యుద్ధం దేశవ్యాప్తంగా అనేక రకాల ఉద్యమాలు ప్రారంభమయ్యాయి. ఆ ఉద్యమాలు ఉధృతమై ప్రజలను సభలు సమావేశాల్లో పాల్గొనేలా చేశాయి.

ప్రచారం హోరెత్తి జనం చైతన్యవంతులయ్యారు. ఇందుకు విరుద్ధంగా బ్రిటీష్ ప్రభుత్వం సభలు, బహిరంగ సమావేశాలు జరుపకూడదని శాసనాలు చేసినప్పటికీ భారతీయులు వాటిని ఉల్లంఘించారు. అనేకమంది జైలు పాలయ్యారు. హతులయ్యారు. దీనితో ఉద్యమం బలమైంది కాని అణచబడలేదు.

ఆనాడు దేశంలో జరుగుతున్న ఉద్యమాలకు ఆంధ్రరాష్ట్రం కూడా స్పందించింది. అనేక ఉద్యమాల్లో పాలుపంచుకుంది. నాడు తెలంగాణా స్థితి భయంకరంగా ఉండేది. దొరల దురాగతాలు సహించలేనివిగా వుండేవి. అధికారుల ఆగడాలకుఅంతులేకుండేది. అనేకమంది సామాన్యప్రజలు ఒకవైపు ప్రభుత్వం విధించిన పన్నులు చెల్లించలేక మరోవైపు ఆకలితో అలమటిస్తూ పరువు పోగొట్టుకోలేక ఆత్మహత్య చేసుకొన్నారు. మరికొంతమంది ప్రజలు తాము మోసపోతున్న విషయాలను తెలుసుకోవడానికి ప్రయత్నించారు. స్వాతంత్రోద్యమంకోసం ఊరేగింపులు, సమ్మెలు, సత్యాగ్రహాలు చేశారు. కరుడుగట్టిన మనస్తత్వాలతో అజ్ఞానంతో అమాయకత్వంతో వున్న ప్రజానీకాన్ని నాయకులు తమ ఉపన్యాసాల ద్వారా, సత్యాగ్రహాల ద్వారా ఉత్తేజితుల్ని జేశారు. స్వాతంత్ర్యాన్ని సాధించడానికి ప్రయత్నించారు. ఈ వస్తువు కథానికా సాహిత్యానికి ప్రాతిపదిక అయ్యింది. ఈ నేపథ్యంతో అనేక కథలు వెలువడినాయి. విదేశీ వస్తు బహిష్కరణ వుద్యమాన్ని ప్రతిబింబించేకథలు (సేవాధర్మం - కరుణకుమార), ఉద్యమకారులమీద అమానుషంగా కాల్పులు జరిపిన పోలీసులు, (సర్కిల్ ఇన్‌స్పెక్టరు - జమదగ్ని), గాంధీజీ పిలుపునందుకొని ఉద్యమంలో పాల్గొని జైలుకెళ్లిన అభాగ్యులు (అనిర్వచనీయఖ్యాతి - జి.వి.కృష్ణారావు), వ్యక్తి ప్రేమకన్నా ఉద్యమానికి ప్రాధాన్యతనిచ్చిన స్త్రీలు (సుశీల - చలం), జాతీయోద్యమ కాలంలో దేశంలోని రాజకీయ పక్షాల అనైక్యతను ప్రతిబింబించటం (దేశం ఏమయేటట్లు - గోపీచంద్), ఉద్యమంలో పాల్గొనే వాళ్లకు సమస్యలపట్ల అవగాహన వుండాలని తెలియజేయడం (ఇలా జరిగేను - భావరాజు నరసింహారావు), సంఘ సంస్కరణ స్వాతంత్రోద్యమాలను గురించి ఆలోచింపజేయడం (పూర్వజన్మ దాంపత్యం - నరసింహాచార్యులు), సైమన్ కమీషన్‌కు వ్యతిరేకంగా ప్రదర్శన జరిపినందుకు సమాజం నుండి బహిష్కరింపబడిన వ్యక్తులు (నే ధన్యనైతి - గుమ్మడిదల దుర్గాబాయి), హిందూముస్లింల అనైక్యతలు (ఎవరి అదృష్టం - వేంకటరాజ్యలక్ష్మి) , కన్నతల్లి పోషణార్థం జాతీయోద్యమానికి దూరమైన కొడుకును తనచావుద్వారా కర్తవ్యం బోధించిన మాతృమూర్తులు (త్యాగిని - మైదవోలు పద్మావతి), జాతీయోద్యమంలో భాగంగా జరిగిన మద్యపాన వ్యతిరేక కార్యకలాపాలను చిత్రిస్తూ కొంతమంది చైతన్యవంతులు కావడం (దోషపరిహారం - నరసింహం), స్వాతంత్రోద్యమంలో పాల్గొని సర్వస్వం పోగొట్టుకొన్న నాయకులు (అప్పుడు, ఇప్పుడు - వెంకటాచలం), జాతీయోద్యమంలో ధైర్య సాహసాలను సమయస్ఫూర్తిని ప్రదర్శించిన స్త్రీలు, (ఇదికథకాదు - తాడి నాగమ్మ), ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని జైలుపాలైన యువతీయువకులు (నీలవేణి - రాయసం వేంకటశివుడు), విభిన్నమైన కథలు విశేషమైన పాత్రలు, సన్నివేశాలు తెలుగు కథానికా సాహిత్యంలో రూపుదిద్దుకొన్నాయి. తెలంగాణా ఉద్యమకథలు దొరల దౌర్జన్యాలకు వ్యతిరేకంగా ఎదురుతిరిగిన సామాన్య ప్రజలు, (మానవుళ్లోకూడానా - చినవెంకట రామారావు), పంటలు పండక కౌలుబకాయిలు చెల్లించలేక అవమానాలపాలై ఆత్మహత్యలకు పాల్పడ్డ రైతులు (ఇజ్జత్ - భాస్కరబట్ల కృష్ణారావు), దొరలదోపిడీకి గురై వూరొదలి పోయిన బ్రాహ్మణులు (అంతా ఏకమైతే - వట్టికోట అళ్వారుస్వామి), పోలీసుల దౌర్జన్యాలు (సంఘంప్రతులు - సురవరం ప్రతాపరెడ్డి), కనిపించే కథలు వెలువడ్డాయి.

**2.7 స్త్రీవాదం**

ఆంగ్లంలో 'Feminisem' అన్న పదానికి అనువాదం స్త్రీవాదం. ఈ ఉద్యమం దాదాపు మానవుడు పుట్టినప్పటినుండి స్త్రీని గురించి ఆలోచింపజేసేది''8 ప్రాచీన కాలంలో అనేకమంది తత్వవేత్తలు

స్త్రీలను గురించి ఆలోచించారు. స్త్రీలపట్ల కట్టుబాట్లు సంప్రదాయాలను పెంచారు. వారు చేసిన ప్రతిపాదనలు పురుషునికి అనుగుణంగా మలచారు. దానిఫలితంగా స్త్రీలు అనేకతరాలుగా గాఢాంధకారంలో మునిగారు. తమబ్రతుకులు మారక మార్చుకొనే తీరు తెలియక వుండిపోయారు. ఈ నేపథ్యంలో అనేకమంది స్త్రీవాద రచయితలు ఉద్భవించారు. వారు స్త్రీని గురించి ఆలోచించటం మొదలుపెట్టారు. తరతరాలుగా వారికి సంఘంద్వారా పురుషుడి ద్వారా జరుగుతున్న అన్యాయాలను పసికట్టారు. పూర్వం ఎక్కువ భాగం స్త్రీలు పురుషుల చేతిలో ప్రతిమలయ్యారని, ఎక్కువభాగం పురుషుడిని ఆకర్షించడానికి చేసుకొనే అలంకరణకే ప్రాధాన్యతనిచ్చారని తలచారు. మాతృత్వ విషయంలో కూడా స్త్రీలు ఆలోచించారు. కనటం, పాలివ్వడం శారీరకపనులని, పెంచడం భార్యాభర్తల కర్తవ్యం అని నిర్ధారించారు.

ఈ నేపథ్యంలో స్త్రీవాదం సాహిత్యవస్తువయ్యింది. పురుషులతో పాటు స్త్రీలుకూడా సమానులన్న అభిప్రాయం వెలువడింది. ఈ విషయంపై అనేక దేశాల్లో అనేక రకాల ఉద్యమాలు బయలు దేరాయి. దీనికి కారణం లైంగిక తృప్తి, సంతానోత్పత్తి, ఆర్థిక విషయాలేనని స్త్రీ వాదులు గుర్తించారు. సమాజంలో ఆర్థిక స్థితిమారితేనే స్త్రీ జీవితంలో మార్పువస్తుందన్నారు. సంతానోత్పత్తి విషయంలో కాని, పిల్లల పెంపకంలో కాని, ఇంటిచాకిరి విషయంలో కాని, లైంగిక స్వేచ్ఛలో కాని మార్పురానంతవరకూ స్త్రీలు బలయ్యారు. ఇది అన్యాయమని స్త్రీ విముక్తికోసం రచనలు చేశారు. పితృస్వామిక సామాజిక కార్మిక వ్యవస్థలో పీడనకు, దోపిడీకి గురి అయ్యే స్త్రీలు తాము బానిసలుగా వున్నామని తెలుసుకొని దాస్య విముక్తులవడానికి ప్రయత్నించారు. శ్రామికవర్గవిముక్తి భాగంగా స్త్రీ విముక్తి లో ఎలా వుంటుందో విశదంగా తెలుసుకొన్నారు.

స్త్రీల సమస్యల విషయంలో పూర్వంకంటే నేడు అవగాహన పెరిగింది. స్త్రీలపక్షాన ఆలోచించే చైతన్యం పెరిగింది. స్త్రీలు తమ అనుభవాల గురించి తామే సాహిత్యం సృష్టించుకొంటామని చెబుతున్నారు. ప్రజాస్వామిక ఉద్యమాలు ఫలవంతం చెందుతున్న నేటి పరిస్థితులలో స్త్రీల విషయంలో ప్రజలకు లోలోపల ఎంత వ్యతిరేకతలున్నా బయటికి సాహసించి చెప్పలేకపోతున్నారు. ప్రస్తుతం స్త్రీల విషయాలను స్త్రీ దృష్టికోణం నుండి చుడాలని ప్రతి పురుషునికి కుటుంబంద్వారా సంక్రమించిన అధికారాలు చెలాయించడానికి వీలులేని కొత్త సంబంధాలు స్త్రీ పురుషుల మధ్య వుండాలని అభిప్రాయపడుతున్నారు. పెళ్లితో సంబంధం లేకుండా వున్న సాహచర్య సంబంధాలను స్త్రీ పురుషులు నెలకొల్పుకోవాలనడంలోనూ ప్రేమ విఫలమయినపుడు ఆ సాహచర్య సంబంధాలనుండి వైదొలగడానికి స్త్రీకి స్వేచ్ఛ వుండాలని స్త్రీ వాదులు వాదిస్తున్నారు. మరోగమ్మత్తు ఏమంటే ''స్త్రీల విషయాలను స్త్రీలే చెప్పుకోవాలి. పురుషులు చెప్పడానికి ఏ అధికారం లేదని వాళ్లు గట్టిగా విశ్వసిస్తున్నారు''9 ఈ నేపథ్యం కథానిక రచనలో వస్తువయ్యింది. స్త్రీల విషయాలను అనేక కోణాలనుండి రచయితలు రచయిత్రులు వారి సమస్యలను చిత్రిస్తున్నారు. ప్రముఖంగా ఈ దశకంలో స్త్రీ వాదం మంచి ఊపు అందుకుంది. అనేకమంది రచయితలు, ముఖ్యంగా స్త్రీలు రచనలు చేస్తున్నారు. ఈ నేపథ్యంతో వచ్చిన కథానికలను పరిశీలిద్దాం. సంసారం సుఖంగా సాగడానికి చేసే ప్రయత్నాలు (బద్‌నసీహత్ - మునిమాణిక్యం నరసింహారావు), పురుషాధిపత్యానికి బలైన స్త్రీలు (యవ్వనం-తిలక్), ప్రేమించిన పురుషుడికి అక్రమ సంబంధం మంచిది కాదని చెప్పిన స్త్రీలు, (వేంబు-తాతా కృష్ణమూర్తి, స్త్రీ పురుషుల మనస్తత్వాలు - ఆంజనేయశాస్త్రి), స్వేచ్ఛకోసం భర్తను వదిలేసి కోరుకున్న వాడితో లేచిపోయిన స్త్రీలు (స్వేచ్ఛ-కుటుంబరావు), స్త్రీకి స్వేచ్ఛనివ్వాలని చెబుతూనే తనభార్యకు స్వేచ్ఛ నివ్వని పురుషుడు (స్వేచ్ఛాప్రణయి-కృష్ణారావు), స్త్రీ పురుషులిరువురూ సమానులేనని భర్తతో వాదించిన స్త్రీలు (అర్థాంగి-చినహనుమాయమ్మ), బాధ్యతను మరచి ఇల్లును గుల్లచేసిన భార్యలు

(నా రత్నం-కురుగంటి సీతారామయ్య) , పురుషాధిక్యసమాజంలో స్త్రీలహక్కులను పురుషులు కాలరాయడం (పునఃస్త్రీ పునర్వివాహం-యల్లాప్రగడ సీతాకుమారి), స్త్రీలకు వ్యక్తిత్వం లేదని విమర్శించిన పురుషులు (చట్టసభల్లో మెజారిటీ మీదేగా-కనుపర్తి వరలక్ష్మమ్మ), తనుచేసిన తప్పులకు స్త్రీలను నిందించే పురుషులు (ఆడలేక మద్దెలమీద పడి కొట్టుకోవడమా (కుందాళ, కమలమ్మ స్త్రీలమీద అవగాహనలేని సంఘుసంస్కర్తలు ) (సంఘ సంస్కర్త-అందే నారాయణస్వామి) ఈ సమాజంలో ఎదురౌతున్న సందర్భాలు గమనార్హంగా ఉన్నాయి.

ఆధునిక యుగంలో కూడా మతగ్రంథాలాధారంగా కూతుళ్ళకు బాల్యవివాహాలు చేయడం (పశ్చాత్తాపము-చెరుకుపల్లి శివరామయ్య), పసితనంలో జరిగిన వివాహం భవిష్యత్తులో ఎలాంటి పరిస్థితులకు దారితీస్తుందో తెలియజేయడం(ఎవరిని మెచ్చుకొందురు-శివరామకృష్ణ ప్రసాద్), దురాచారాల పేరుతో స్త్రీజాతిని అణగద్రొక్కడానికి పురుషులు చేసే ప్రయత్నాలు (కన్యాదాన ఫలం ఫలందక్కుతుందా - అక్కిరాజు ఆంజనేయులు), సంసారజీవితంలో ఎన్ని వున్నా ఐదవతనం తక్కువైతే ఆ సంసారం సజావుగా జరగదని తెలియజేయడం ( గ్రహచారం - యనమండ్ర సాంబశివరావు), వృద్ధ వివాహం వల్ల స్త్రీ పురుష సంబంధాలలో తలయెత్తే అసంతృప్తి (పిత్ృమారకము- గాడేపల్లి రామ్మూర్తి) , డబ్బుకాశపడి తల్లిదండ్రులు కూతురికి కన్యాశుల్కం వివాహం చేయడం (మనీపర్సు మహత్యం - కాత్యాయనీదేవి), స్త్రీ విద్యను వ్యతిరేకించిన ఛాందసవాదులు (కళ-బ్నాస్టర్ కేతిరాజు), కట్టుకున్న భర్త తిరస్కరించినా ధైర్యంగా జీవితాన్ని గడుపుతున్న స్త్రీలు, (నా క్రొత్త స్నేహితురాలు - వేలూరి ఇందిర), కాల్పనిక ధోరణిలో సాగిన అవగాహనలేని ప్రేమకథలు (విజయవిలాసం - రాజా), తమ సమస్యలను కన్నతల్లి దగ్గర చెప్పుకోలేని అసమర్థులు (శత్రువులెవరు - ఓల్గా), మాతృత్వానికి సమాజ నిర్బంధాలకు మధ్య నలిగిన వితంతువుల జీవితం (వితంతువు - చలం), స్త్రీ సంతాన వాంఛకు భర్తతోమాత్రమే స్త్రీకి శరీరవాంఛ పరిమితం కాదనడం ( అవసరంలేని ఆపరేషన్ - చలం), లైంగిక సంతృప్తికోసం భర్తను ఉద్యోగాన్ని వదలి ప్రియునితో వెళ్ళినవాళ్ళు (స్టేషన్‌పంపు-చలం), కథానికం సాహిత్యంలో ప్రత్యక్షం కావటం కళ్లార చూడవచ్చు.

**2.8 పర్యావరణం**

మానవుని మనుగడతోముడివడివున్న పర్యావరణాన్ని పరిరక్షించుకోవడం సమాజ బాధ్యత. ఇటీవలి కాలంలో వనరులను అభివృద్ధిపేరుతో కేవలం ముడిసరుకులుగా వినియోగిస్తున్నారు. దీనివల్ల వనరుల క్షీణత ఎక్కువైంది. గిరిజనులు ఆటవీసంపదనంతా తమజీవన భృతికోసం వినియోగించుకొంటున్నారు. దానికితోడు పట్టణాల్లో పరిశ్రమలు ఎక్కువగా నిర్మింపబడటం వల్ల వాటిలోని వ్యర్థ పదార్థాలు వాతావరణంలో కలుషితమవుతున్నాయి. అనేక పారిశ్రామిక వాడల్లో కాపురం చేస్తున్న శ్రామికులు అనారోగ్యానికి గురవుతున్నారు. మనకు జీవనాధారాలైన నదుల్ని నిస్సంకోచంగా కలుషితం చేస్తున్నారు. ''పరిశ్రమల సంగతి ఆలా ఉంచి వ్యక్తిగతస్థాయిలో నదీజలాలను ఘోరంగా కలుషితం చేస్తున్న ఘనత మనకేదక్కుతుంది''10 కేవలం స్నానం చేయడానికి త్రాగడానికి పంటలు పండించడానికి ఉపయోగించుకొనే నీరు నేడు అనేకరకాల పరిశ్రమలకు అనేకరూపాల్లో వినియోగిస్తున్నారు.

వీటికితోడు కొండప్రాంతాల్లో పచ్చదనం తరిగిపోయింది. ఒకప్పుడు అభయారణ్యాలుగా దర్శనమిచ్చే కొండలు లోయలు నేడు రాళ్ళు కొండలుగా కనబడుతున్నాయి. ''మానవుల మనుగడకు దోహదపడిన ప్రకృతిని ఈనాడు మానవుడే స్వార్థంకోసం నాశనం చేసిన పరిస్థితి సత్యం. ఈ వినాశనానికి కారకులు ప్రజలే'' 11 అంతేగాక తినే పదార్థాల పంటల దిగుబడులకోసం అనేక రకాల క్రిమిసంహారక మందులను ఉపయోగించుకోవడం వల్ల కూడా ఆ పదార్థాలు కొంతవరకూ మానవక్షీణతకు దోహదం

చేస్తున్నాయి. మరోవిషయం- మన సంపదను మనం సరిగా వినియోగించుకొనడం లేదు. చరిత్ర పూర్వాయుగాల్లో మానవుడు పంచభూతాల్ని చూచి భయపడేవాడు. క్రమంగా భయం ప్రకృతిపట్ల నమ్రతా భావానికి దారితీసింది. తరువాతిదశలో ప్రకృతితో స్నేహభావం ఏర్పడింది. ఈ అనుబంధం విచ్ఛిన్నంగా సాగింది. శాస్త్ర సాంకేతిక రంగాల్లో అభివృద్ధి చెందడం వల్ల ప్రకృతిని లోబరుచుకోవడానికి ప్రయత్నించడం వల్ల అది ఎదురు తిరిగి మానవునికి హాని చేయడం మొదలుపెట్టింది.

నేడు పర్యావరణం గురించి ఉద్యమాలు వస్తున్నాయి. ఈ ఉద్యమాలు ప్రచారాలు పారిశ్రామిక అభివృద్ధిని ప్రశ్నించడమేకాక అభివృద్ధికి కొత్త నిర్వచనాన్ని కల్పిస్తున్నాయి. ఈ క్రొత్త దృక్కోణాన్ని ప్రాముఖ్యం చేయడంలో నిర్వహించిన ఉద్యమాలు స్ఫూర్తినిస్తున్నాయి. ప్రపంచవ్యాప్తంగా ప్రసిద్ధిగాంచిన చిప్‌కో ఉద్యమం నర్మదా ఆనకట్టకు వ్యతిరేకంగా జరుగుతున్న ఉద్యమాలు పునాదిగా నిలిచాయి. ఎంతోమంది సంస్కరణవాదులు పర్యావరణ కాలుష్యం గూర్చి గొంతు చించుకొంటున్నారు.

మన పరిసరాలు మనస్వంతం. మన పరిసరాల్ని మనమే కాపాడుకోవాలి. ప్రకృతి వినాశనంతో లాభపడేది సంపన్న వర్గాలైతే బాధపడేది అశేషంగా వున్న నిరుపేదలే. ఈ వర్గం ప్రజలు ప్రకృతిని కాపాడేందుకు ప్రయత్నం చేయనంతవరకు పర్యావరణ విఘాతం కొనసాగుతూనే వుంటుంది. సర్వజనావళి పర్యావరణాన్ని పరిరక్షించడానికి ప్రయత్నించాలి. అప్పుడే మానవ మనుగడ సాఫీగా జరిగిపోతుంది. ఇలాంటి పర్యావరణం సాహిత్యంలో వెలువడినప్పటినుండి ప్రకృతితో సంబంధం కలిగివుందన్న విషయం తేటతెల్లమయ్యింది. తెలుగు కథానికలో కూడా పర్యావరణం కథా వస్తువయ్యింది. ఈనేపథ్యంతో వచ్చిన కథానికలను పరిశీలిద్దాం. చెట్టు మీద మమకారం కలిగివుండాలని చిత్రించడం( చింతచెట్టు - డా.రాసాని), నేలమీద ఆప్యాయత వొలకపోయడం (నేలమొట్టింది - కో.రా), పర్యావరణాన్ని రక్షించడం (మొక్క- జె.బుచ్చిబాబు), రాయలసీమలో క్షామ పరిస్థితులను గురించి తెలియజేయటం (మీకోనమస్కారం-కొలకలూరి ఇనాక్), కథానికా సాహిత్యంలో ఉంది. వీరేగాక ప్రకృతి, పర్యావరణం, కాలుష్యం గురించి, దాని ప్రమాదం గురించి పాండ్రంకి సుబ్రమణి, ద్విభాష్యంరాజేశ్వరరావు కథలను రాస్తున్నారు.

**2.9 అభ్యుదయం :**

తెలుగు కథానిక ఉద్భవించిన కాలంలోనే సమాజంలో మూఢవిశ్వాసాలు సాంఘిక దురాచారాలు అలుముకొన్నాయి. కుల విచక్షణ శ్రుతిమించి రాగానపడింది. స్త్రీ వంట ఇంటికి మాత్రమే పరిమితమయ్యింది. పురుషుడు ఇంటిపెద్దగా సంపాదనా కర్తగా వ్యవహరించాడు. వీరుపేదలు, నిస్సహాయులు నిమ్నకులస్థులకు సమాజంలో జరిగే అన్యాయాలు మితంకాలేక పోయాయి. ఈ స్థితిలో సమాజంలోని మానవులలో పరస్పర సంబంధాలు నెలకొనాలనీ, కులమత ప్రమేయం లేకుండా అన్నిస్థాయిల వారికీ అన్ని సౌకర్యాలు ఒనగూర్చాలని, పేదవారు ఆర్థికంగా మెరుగుపడాలని, సమాజం శక్తివంతమైనదిగా పుంజుకోవాలని రచయితలు ఆశించారు. సమాజంలో ఉన్న సాంఘిక దురాచారాలను, సమూలంగా నాశనం చేయడానికి ప్రయత్నించారు. నూతన వ్యవస్థను సృష్టించడంకోసం ఆరాటపడ్డారు. అది అందరికి శ్రేయస్కరమనుకొన్నారు. సమాజంలో వున్న వాస్తవ స్థితిగతులను అవగాహన చేసుకొని వాటిని చక్కదిద్దడానికి ప్రయత్నించారు. వ్యవస్థ మారుతుండడంవల్ల బ్రతుకుదెరువులోకూడా మార్పు వచ్చింది. మానవుడు జీవితాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాడు. నూతన వ్యవస్థపై మోజు చూపించాడు. నూతన పద్ధతులను అనుసరించాడు. నేడు మానవుని ఆలోచనాపరిధి హద్దులు దాటిపోయింది. సాంకేతిక పరిజ్ఞానం కావలసినంత అభివృద్ధి చెందింది. తత్ఫలితంగా సంపదకూడా పెరిగింది. ''అభ్యుదయకామనకు మూలం వాస్తవస్థితి గతుల అవగాహన. ఆ అవగాహన హృదయాన్ని స్పందింపజేసినపుడు ఆ పరిస్థితులు ఆ విధంగా

ఉండటానికి హేతువులేమిటన్న జిజ్ఞాస మొలకెత్తుతుంది. వాటిని చక్కదిద్దవలసిన ఆవశ్యకతను చాటిచెప్పుతుంది''30. ఇది సమాజాభివృద్ధికి తోడ్పడుతుంది.

అభ్యుదయం అన్నది మానవజాతి పురోకమనానికి చాలా అవసరం. చిత్తశుద్ధితో మనిషి అనుసరించే ముఖ్యమైన ఆలోచనాపద్ధతి మానవుడు సాధించాలనుకొన్న అంశాన్ని చేరుకొనేదాకా తపనపడాలి. కాని నిరాశపడరాదు. అప్పుడే అతడు చైతన్యవంతుడు కాగలడు. ఈ జాగృతి సమాజంలోని అన్ని రంగాల్లోనూ రావాలన్నది కథానికా రచయితల తపన. ఈ నేపథ్యంతో ప్రతిబింబించే కథలను పరిశీలిద్దాం.

సంసారంలో ఎన్ని వున్నా ఐదవతనం తక్కువైతే ఆ సంసారం సజావుగా సాగదని తెలియజేయడం (గ్రహచారం - సాంబశివరావు), వరకట్నం ఆధారంగా ఆడపిల్లల తల్లితండ్రులు ఎదుర్కొనేకష్టాలు (శ్రీకృష్ణుని కృప - పట్టాభిరామయ్య), కన్యాశుల్కం బాల్యవివాహాలకు వ్యతిరేకంగా ప్రభుత్వం శారదా చట్టం తీసుకువస్తున్న సమయంలో తొందరపడి చిన్న ఆడపిల్లలకే వరకట్నమిచ్చి పెళ్ళిచేసిన తండ్రులు (కమల పెండ్లి - జమ్మి శేషగిరిరావు), స్త్రీలను ప్రోత్సహిస్తే గొప్ప విద్యావంతులు కాగలరని తెలియజేయడం (విమల వివేకము - ఆంధ్రరంగారావు), స్త్రీ పురుషుల సంబంధాలమీద ఆర్థిక పరిస్థితుల ప్రభావాన్ని తెలియజేయడం ( విజయలక్ష్మి - వేంకట కృష్ణారావు), జాతియోద్యమంలో చురుకుగా పాల్గొన్న స్త్రీలు (నారీహృదయం - పెమ్మరాజు రాజగోపాలము), మూఢాచారాలు, సంప్రదాయాలపేరుతో దేవుడికి జరిగే పూజలు, బలి వంటి విషయాలు సమాజశ్రే యస్సుకు మంచివికాదని తెలియజేయడం (మొక్కుబడి - కరుణ కుమార) , ప్రతిదాన్ని కాలంతోపోల్చి - యాంత్రికంగా తయారైన యాంత్రిక మనుష్యులు, (గడియారపు గుండెలు - బాలగంగాధర తిలక్) పాత్రలుగా, పరిస్థితులుగా, వస్తువులుగా కథానికలు తెలుగుసాహిత్యంలో సృష్టి పొందాయి.

**2.10 దళితవాదం**

ఆంధ్రప్రదేశంలో ఈ దశకంలో ఈ వాదం ఉన్నత స్థితిని అందుకొంటున్నది. శతాబ్దాల తరబడి దీనహీన స్థితుల్లో జీవించారు. బానిసలుగా, పాలేర్లుగా యాజమానులు చెప్పిన పనులు చేస్తూ వాళ్ల మోచేతినీళ్ళు త్రాగుతూ బ్రతికారు. తినడానికి తిండిలేక, వుండటానికి ఇళ్ళులేక దేశ ద్రిమ్మరులై తిరిగారు. సమాజంలోని బ్రాహ్మణులు ఆచారాలని, సంప్రదాయాలనూ సృష్టించి హరిజనులను దూరంగా వుంచడానకి సాధ్యమైనంతవరకు ప్రయత్నించారు. హరిజనులు హిందువులు కాదని వాదించారు కూడా. హరిజనులు కూడా ఈ సిద్ధాంతాలను గ్రుడ్డిగా నమ్మి తాము సవర్ణులకు సేవచేయడం కోసమే పుట్టామని భావించారు. చదువుకోరాదని, కష్టించి పనిచేయడం తమ వంతని తలచారు. వీరి మూర్ఖత్వానికి సవర్ణులు జాలిపడలేదు. దయచూపలేదు. ఆపై హీనంగా చూశారు. వీధుల్లో ఎదురుపడినా అసహ్యంచుకొనేవారు. బావి నీళ్ళు దేవాలయ ప్రవేశం, విద్యలను వీరికి దూరంగా ఉంచారు. వీరికి కష్టానికి తగినఫలితం కూడా సవర్ణులనుండి దక్కేదికాదు. హరిజనస్త్రీలకు యెంతమాత్రం రక్షణ వుండేది కాదు. హరిజనులు ఇన్ని విషయాల్లో సతమతమవుతూ గాఢాంధకారంలో మగ్గారు.

ఈ స్థితిలో ఆంగ్లేయులు భారతదేశంలో ప్రవేశించారు. భారతీయుల కులాల అంతరాలను చూసి, వారు మతప్రచారాన్ని మొదలుపెట్టారు. దేవుని సన్నిధిలో అందరూ సమానమేనని చాటారు. భారతదేశంలోని హరిజనులను తమ మతంలోనికి ప్రవేశం కల్పించడానికి ప్రయత్నించారు. హరిజనులు క్రైస్తవం పుచ్చుకొని తాము ఇంతకాలంగా అనుభవించిన స్థితిని తెలుసుకొన్నారు. తామూ సమాజంలో మనుషులేనని అనుకొన్నారు. ఆంగ్లేయుల సహాయంతో విద్యనార్జించడానికి మొదలుపెట్టారు. అయితే అక్కడ కొన్ని అవసరాలు తీరినా కులపరంగా న్యాయం జరుగలేదు. హరిజన క్రైస్తవులుగానే చూడబడ్డారు.

సమాజంలో పీడింపబడేవాళ్లు వున్నంతవరకూ పీడించే వాళ్లు వుంటారని తెలుసుకున్నారు. వీరికి సహాయంగా 19వ శతాబ్దంలో వచ్చిన సంఘ సంస్కరణోద్యమం ఫలితంగా అనేక మంది సంఘ సంస్కర్తలు బయలుదేరారు. అంటరానితనాన్ని రూపుమాపడానికి నడుం బిగించారు.

ముఖ్యంగా గాంధీ, అంబేద్కర్ రాజకీయ రంగప్రవేశం చేయడం హరిజనుల జీవితాలకు నూతనశకం ప్రారంభమైంది. గాంధీ హరిజన సమస్యను రాజకీయసమస్యగా చేశాడు. ఈ సమస్య పరిష్కారానికి దేశవ్యాప్తంగా కృషిచేయవలసిన అవసరం వచ్చింది. గాంధీకి పూర్వమే ఆంధ్రదేశంలో బయలుదేరిన సంఘసంస్కరణోద్యమం హరిజనులకు బడి, గుడుల ప్రవేశానికి కృషిచేసింది. ''హిందువులను హిందువులు అంటరానివారుగా చూడటం హిందూ మతానికి గొప్ప కళం''14 అని గాంధీ అన్నాడు. హరిజనుల స్థితి సాధ్యమైనంతవరకూ మార్చాడు.

అప్పటినుండి హరిజనులు అన్ని రంగాల్లోనూ సమానత్వం సాధించడానికి తమదైన సమాజాన్ని స్థాపించుకోవడానికి ప్రయత్నించారు. ప్రభుత్వం కూడా వీరికోసం అనేకచట్టాలను తీసుకువచ్చింది. రాజకీయంగా ఉన్నతస్థాయిని అందించడానికి వారి ప్రమాణాలను పెంచడానికి ప్రయత్నించింది. క్రైస్తవమతం విద్య నేర్పించింది. దీనితో హరిజనులు తరాలుగా చేస్తున్న పాలేరువృత్తికి స్వస్తిచెప్పి భూవములను సంపాదించుకొని వ్యవసాయం ఇతరవృత్తులను చేపట్టారు. విద్యావంతులై ఉద్యోగాలను అందుకొని సవర్ణులతో సమానంగా వుండగలిగారు. సవర్ణులు చేసేదురాగతాలను ఎదిరించడం మొదలుపెట్టారు. ఈ విషయాలన్నీ తెలుగు కథానికా సాహిత్యంలో వస్తువులయ్యాయి. రచయితలు అనేకమంది ఈ సమస్యపై రచనలు చేశారు. వారిపై సానుభూతి వర్షాన్ని కురిపించారు. హరిజనులు చైతన్యవంతులు కావడానికి సాహిత్యం కూడా తమవంతు సహాయాన్ని అందించిందనడానికి ఈ కథానికలే ఆధారం. ఈ నేపథ్యంలో వచ్చిన కథానికలను పరిశీలిద్దాం.

పరిశోధన ఈ ప్రత్యేక సాహిత్య శాఖమీదనే జరుగుతూ ఉంది. కాబట్టి దీన్ని విశాల నేపథ్యంతో పరిశీలించడం కుదురుతుంది.

పై విషయాలన్నింటినీ చూసినట్లైతే కథానికా సాహిత్యానికి సమాజం ఆధారం. కాలానుగుణంగా సమాజంలో మార్పురావడం సహజం. సమాజానికి దూరంగా మానవుడు వుండలేడు. కనుక సమాజ ప్రభావం వ్యక్తిపై పడటం ఖాయం. సమాజ అవసరాలకు అనుగుణంగా దేశకాల పరిస్థితుల కనుగుణంగా కథానికా సాహిత్యంలో మార్పువచ్చింది. రచయితలు కూడా సమాజాన్ని అనుసరించే కథారచన చేయగలిగారు.

భారతీయ సంస్కృతిలో ఈ వర్ణవ్యవస్థ అనేక సంవత్సరాలుగా హిందూజాతికి ఒక అడ్డుగోడగా నిలిచింది. దీనికి మూఢనమ్మకాలు, ఆచార సంప్రదాయాలు తోడవడం వల్ల వాటికి గట్టిపునాది ఏర్పడింది. వారి జీవితాలు సుసంపన్నం కావడానికి కావలసిన ఏర్పాట్లు ఎంత ప్రయత్నించినా సుస్పష్టంగా విశదం కావటంలేదు.

**2.10.1. సాంఘిక జీవనం:** ''దళితులు ముట్టుకుంటేనే అంటరానితనం సోకి మైలపడేట్లు భావించే అమానుషమైన సాంఘిక వ్యవస్థను మనువుసృష్టించాడు. అంటరానితనం ధర్మసమ్మతమేనని పూరిశంకరాచార్యుడు''15 ప్రకటించాడు. సమాజంలో హరిజనులు చాలాహీనంగా చూడబడుతూ కేవలం సవర్ణుల పశువుల కొట్టాలకే పరిమితమయ్యారు. జీవితాంతం అగ్రవర్ణాల పొలంలో పనిచేస్తారు. కానీ వాళ్ల ఇళ్లల్లోకి ప్రవేశించరు. కనీసం వాళ్ళ పాత్రలు అంటుకోవడానికి కూడా అవకాశం ఉండదు. కాలం అంతగా అభివృద్ధిచెందక మునుపు హరిజనులు బ్రాహ్మణ వీధుల్లో సంచరించేవారు కాదు. వీరికి బడికూడా

నిషిద్ధం. ఒకవేళ హరిజనులందరూ ఏకమై తమ సమస్యలను తీర్చుకోవడానికి ప్రయత్నిస్తే సవర్ణులే వారిమధ్య స్పర్ధలుపెట్టి వారిని విడదీయడానికి ప్రయత్నించేవాళ్లు. వారు ఆపదల్లో వున్నప్పటికీ సవర్ణులు వారిని ఆదుకోరు. కారణం వారిని అంటకూడదనే నియమం, కనిపించని చట్టం, కఠోరశాసనం.

హరిజనులలో తిరుగుబాటు స్వభావం నశించింది. హిందూ జాతివారిని నిలువుదోపిడీ చేసింది. వీళ్ళను చాతుర్వర్ణాలు వెలివేయడం వల్ల మాంసభక్షణ, మద్యపానం, నరహత్యాది దురభ్యాస దుష్కృతులకు లోనయ్యారు. ధనిక వర్గ దాస్యాంధకారంలో హైందవమత నిరంకుశత్వంలో జీవించలేక పలుప్రాంతాలకు వలసవెళ్లారు. సంఘంలో వీరు నీచాతినీచ వృత్తులకు తలవొగ్గి నేడు తినడానికి తిండిలేక కట్టడానికి బట్టలు లేక నివసించడానికి గుడిసెలు లేక దేశదిమ్మరులై తిరుగుతున్నారు. వీళ్లకోసం ప్రభుత్వం అనేక శాసనాలను రూపొందించింది.

కాని అవి శాసనాలుగా అయ్యాయి. కాని నిజజీవితంలో అమలుకాలేదు. ఎందు కంటే , చట్టాలను చేసేవాళ్లు, వాటిని అమలుపరిచేవారు సవర్ణులే. వాళ్లకు హరిజన సేవలు అవసరం. కాబట్టి వారి శృంఖలాలను తెంచడానికి ప్రయత్నించరు. కాలగమనంలో కొందరు అభివృద్ధి చెందుతున్నారు. తమ బ్రతుకులు మార్చుకోవడం కోసం క్రైస్తవ మతంలోకి ప్రవేశించారు. అక్కడ వీరికి విద్యా, వైద్య, ఉద్యోగాలు లభించాయి. కాని క్రైస్తవులు మతపరంగా సమానంగా చూడలేదు. అక్కడకూడ వీరు హరిజన క్రైస్తవులుగానే చూడబడ్డారు. అక్కడ వీరి ఆశలు పెరిగాయి. కాని తీరేమార్గం కన్పించలేదు. ఇక ప్రతిఘటిస్తే కాని ఫలితం దొరకదని తెలుసుకున్న హరిజనులు సవర్ణులపై తిరగబడటానికి ప్రయత్నాలు కొనసాగిస్తున్నారు.

హరిజన స్త్రీ జీవితం గాఢాంధకారంలో మునిగిపోయింది. సవర్ణులు హరిజనుల స్త్రీలపై చేసే కిరాతకాలు, అన్యాయాలు లెక్కపెట్టడానికి సాధ్యంకాదు. తమ భర్తలముందే వాళ్లను అవమానాలపాలు చేశారు. తన పాలేర్ల భార్యలపై సగం హక్కు ఉందని సవర్ణులు వాదించే అంత అహంకారం చూపారు. అందువల్ల, వీరి శీలం సాంఘికంగా దోపిడికి గురి అయ్యింది. అనేకమంది నిరాశ్రయులయ్యారు. బలిపశువులయ్యారు. అయినా హరిజనులు భూస్వాములను ప్రతిఘటించాలన్న ఆలోచన రాక, వచ్చినా ప్రతిఘటించే శక్తిలేక నిస్సహాయతతో వుండిపోయారు.

హరిజనులు తరతరాలుగా విద్యకు వెలివేయబడ్డారు. అవసరమయితే సవర్ణులు హరిజనులను చదువవద్దని శాసించగలిగేవాళ్లు. అంతేగాక పూర్వం గ్రామాలలో పాఠశాల పెట్టించేవాళ్లుకాదు. సవర్ణుల పిల్లలను మాత్రం చదువు నిమిత్తం పట్టణాలకు పంపేవారు. హరిజనులు చదువుకోకూడదని వారిచేత నమ్మించేవారు. హరిజనుల నాలుకతో సరస్వతిని ఉచ్చరించరాదనేవాళ్లు. ఈ స్థితిలోనే క్రైస్తవులు భారతదేశంలో ప్రవేశించడం హరిజనుల జీవితాలలో ఒక కొసమెరుపు మెరిసింది. అంతవరకు విద్యకు నోచుకొని నిర్భాగ్యులు, అప్పటినుండి విద్యకు చేరువయ్యారు. అయినా ఉన్నత విద్యను అభ్యసించేవాళ్లు తక్కువే. ప్రాథమిక విద్య కూడా సాఫీగా జరగడానికి ప్రయత్నాలు జరుగలేదు. దానికి కారణం తల్లిదండ్రుల స్థితి, అంటరానితనం నుండి బయటపడాలంటే హరిజనులకు విద్య అవసరం. ఈవిషయం తెలుసుకొన్న అగ్రవర్ణాల వాళ్లు వీరు విద్యావంతులైతే తమపై తిరగబడతారని, తరతరాలుగా వస్తున్న పెత్తందారితనం మాసిపోతుందని తలచారు. అందుకే ఇప్పటికీ గ్రామాల్లో వీరికి బడి నిషేధం ఉంటుంది. ఒకవేళ బడికి వచ్చినా ఉపాధ్యాయుడు వీరిని బడిబయటే కూర్చోబెడతాడు. సాధ్యమైనంతవరకు వారిని దూరంగా వుంచడానికి ప్రయత్నిస్తాడు.

**2.10.2. ఆర్థిక జీవితం** : ''ధనమున్న చోట గౌరవముంటుంది. ప్రతిభ ఫలిస్తుంది. బలం చేకూరుతుంది. సౌందర్యం వన్నెకెక్కుతుంది. కులం, ధనం పరస్పర ప్రభావితాలు''16 సవర్ణులు హరిజనులకు కులంతోపాటు ధనంను కూడా అందివ్వకుండా అస్పృశ్యతను, స్వార్థవైదిక సంస్కృతిని

ఆయుధంగా చేసుకున్నారు. విద్యకు, పారిశ్రామిక వృత్తులు మొదలైన ఆర్థిక సంబంధమైన పనులనుండి వారిని దూరంచేయడానికి ప్రయత్నించారు. ఈ ప్రయత్నంలోనే హరిజనులు ఆర్థికంగా నలిగియున్నారు. కేవలం చెప్పులు కుట్టడం, పాలేరుతనం చేయడంలోనే వారి జీవితాన్ని ముడివెట్టుకున్నారు. దానివల్ల హరిజనులు సవర్ణుల ఇళ్లల్లో పాలేర్లుగా వుంటూ వారిచ్చిన డబ్బుతో జీవిస్తున్నారు. తమ కూలీరేట్లు పెంచమని అడగడానికి కూడా స్వేచ్ఛలేకుండా కట్టు బానిసలుగా వుంటున్నారు. సవర్ణులు దీనిని ఆసరాగా తీసుకొని అప్పుపేరుతో వీరికి డబ్బు ఇచ్చి వడ్డీపేరుతో మొత్తాన్ని పెంచి బాకీ తీర్చలేని మొత్తంగా తయారుచేసి జీవితాంతరం పాలేర్లుగానే వుంచుకుంటున్నారు. వీరు సరైన ఆహారం లేక ఆరోగ్యం చెడినా పనులు చేస్తూ సాధ్యమైనంత తొందరగా జీవితాల్ని చాలిస్తున్నారు. అవసరమైతే సవర్ణులు వీరిని హతమార్చేదానికికూడా వెనకాడేవాళ్లు కాదు. ఈ అధికారబలంతో వీరిపై కుట్రలు పన్నేవాళ్లు. అరకొరగా ఉన్న హరిజన భూములను అప్పుపేరుతో సవర్ణులు తమపరం చేసుకున్నారు.

కాలక్రమంలో అనేకమంది సంఘ సంస్కర్తలు బలి అవుతున్న హరిజనులపై దృష్టి సారించారు. మహాత్మాగాంధీ హరిజనులకోసం 'హరిజన్' అనే పత్రికను స్థాపించాడు. ప్రభుత్వం కూడా వీరి మనుగడకోసం అనేక ఆర్థిక సంక్షేమ పథకాలను ప్రవేశపెట్టింది. అన్నింటికీ విద్య మూలమని వారిని విద్యావంతులను చేయడానికి ప్రయత్నించింది. అయినా హరిజనుల పాలేరుతనం నశించలేదు. ఆర్థికంగా వారి స్థితి మెరుగుపడలేదు. హరిజనుల్లో కూడా ఒక వర్గమే వీటిని అనుభవిస్తుంది. కులం మానవ సమాజంనుంచి పుట్టి హెచ్చుతగ్గులను సంతరించుకొని సమానైక్యతను ముక్కలు చేసింది.

మరో విషయం ఏమంటే- వీరి ఆలోచన చైతన్యానికి సవర్ణులు అడ్డుకట్ట వేస్తున్నారు. వీరికి వైద్య, పారిశుధ్య సౌకర్యాలు అంతగా లేవు. వీరి చేతపనులు పూర్తిగా మూలపడ్డాయి, ఒకవేళ వుండినా అంతంత మాత్రానే వున్నాయి. సమాజాన్ని ఎదిరించి నిలబడాలనే ధోరణిలేక సమాజంతో రాజీపడే ధోరణే కన్పిస్తుంది. అందువల్లనే ఆకలిచేత దారిద్ర్యము చేత పీడింపబడినవాళ్లు, గ్రామాల్లో పంటలు పండక అప్పులు చెల్లింపలేక పీడింపబడుతున్న వాళ్లు, చదువుకోవాలని ఇష్టమున్నా ఆర్థిక పరిస్థితుల వాల్ల బడికి వెళ్లలేని పిల్లలు కనపడతారు.

**2.10.3. రాజకీయ జీవితం :-** కుల వ్యవస్థ బలిష్టమైపోయి పాలనా యంత్రాంగం మీద తన ప్రభావాన్ని కనపరుస్తుంది. లౌకికత్వమే నిరర్థకమైపోయింది. వీరికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కరువయ్యాయి. పాలక వర్గాల అండదండలతో అగ్రవర్ణాలు, భూస్వాములు హరిజనులను హింసించారు. వారి నివాసాలను తగులబెట్టటం లాంటి అమానుష కృత్యాలు ఎన్నో చేస్తున్నారు. స్వప్రయోజనాల కోసం హరిజనుల్లో కలహాలను సృష్టించి వాళ్లమీద ఆధిపత్యాన్ని చెలాయించారు. రాజకీయంగా వారిని అథఃపాతాలానికి త్రొక్కివేశారు. వీరు ఓటుహక్కు వినియోగించుకోవడంలో కూడా స్వతంత్రతను కోల్పోయారు. ఓటు విలువ ఏమిటో తెలియని హరిజనులు ధనవంతులైన సవర్ణులే రాజకీయనాయకుల పదవులకు అర్హులనుకున్నారు. అంతేకాక సవర్ణులు హరిజనులను మనుషులుగానే గుర్తించరు. ఇంక వారి అధిక్యాన్ని సహించగలరా ? అందువల్లనే నేటికీ సమాజంలో హరిజనుల రాజకీయ జీవితంలో మార్పులేదు. వీరు తమ పూర్వీకుల జీవిత విధానాన్ని మార్చుకోలేరు. జీవితాన్ని గూర్చి అవగాహనేలేదు. ఒకవేళ తెలిసినా కొందరికి మాత్రమే. వీరికి ఎన్నికల్లో ఎవరికి ఓటువేయాలో తెలియదు. కొంతమంది హరిజనులు కొద్దో గొప్పో విద్యావంతులై రాజకీయ పరిజ్ఞానం తెలిసినవారు తగిన సహాయ సహకారాలు లేక వూరుకున్నారు. సవర్ణులను ఎదిరించి బ్రతకలేక పోతున్నారు. ఇలాంటి జీవితానికి అలవాటుపడిన హరిజనులు ఎన్నికల్లో సవర్ణులతో పోటీ చేయలేక పోతున్నారు. వీరి క్షేమం కోసం ప్రభుత్వం రాజకీయంగా కొంత అవకాశాన్ని అందించింది. హరిజనులకు రిజర్వు చేయబడడానికి నియోజక వర్గాల్లో పోటీచేసే హరిజనులు ఎక్కువ

భాగం సవర్ణుల అండదండలున్నవారే వుంటున్నారు. వీరు ధైర్యంగా తమ నాయకుడి ముందు కూర్చొవడానికి వెనుకాడతారు. ఇక అభ్యుదయం పొంది ముందుకు ఎలా వెళ్లగలరు? తమ కార్యాలను ఎలా చేపట్టగలరు అందువల్లనే వీరిని అడ్డుపెట్టుకొని సవర్ణులే అధిక ప్రయోజనం పొందుతున్నారు. సంపూర్ణమైన రాజకీయ పరిజ్ఞానం కలవారు, ధనంతో తగిన అండదండలతో హింసకు చోటివ్వక శక్తి యుక్తులతో సవర్ణులతో పోటీచేసి గెలుపొందగలవాళ్లు అరుదు. ఒకవేళ అలాంటి వారుంటే సవర్ణుల యుక్తులకు బలికాక తప్పదు. అందువల్లే వీరు రాజకీయంగా అంతగా అభివృద్ధి చెందలేకపోతున్నారు. మరో విషయం ఏమంటే- రిజర్వేషన్ పేరుతో సవర్ణులు తమ పాలేర్లను పదవుల్లో వుంచడం వల్ల వారు అటు కూలీకి వెళ్లలేక ఇటు ఘనంగా బ్రతకలేక చావు బ్రతుకుల మధ్య కొట్టుమిట్టాడుతున్నారు.

## అధస్సూచికలు

1. కథానిక స్వరూపస్వభావాలు - పోరంకి దక్షిణామూర్తి పుట 457
2. కథానిక స్వరూపస్వభావాలు - పోరంకి దక్షిణామూర్తి పుట 461
3. Sociology J.L. Kachroo పుట 2
4. సమాజశాస్త్రం పుట 2
5. కథానిక స్వరూప స్వభావాలు - పోరంకి దక్షిణామూర్తి పుట 485
6. గురజాడ తొలి కొత్త కథలు - ఆర్.చంద్రశేఖర రెడ్డి పుట 1
7. గురజాడ తొలి కొత్త తెలుగుకథలు - ఆర్.చంద్రశేఖర రెడ్డి పుట 3
8. స్వేచ్ఛ- ఒక పరిశీలన - పి. సావిత్రమ్మ పుట 13
9. చలం ఫెమినిస్టులకు దగ్గరివాడు - కాత్యాయని విద్మహే ఆంధ్రజ్యోతి డైలీ అక్టోబర్ 10, 1994
10. పర్యావరణ భారతి - తల్లావజ్ఝల పతంజలిశాస్త్రి, పర్యావరణ త్రైమాసిక పత్రిక మార్చి, జూన్ 1994.
11. దర్పణం - అనంత పర్యావరణ పరిరక్షణ సమితి మాసపత్రిక జనవరి, మార్చి, 1994.
12. దర్పణం - అనంత పర్యావరణ పరిరక్షణ సమితి మాసపత్రిక జనవరి, మార్చి, 1994.
13. కథానిక స్వరూప స్వభావాలు - పోరంకి దక్షిణామూర్తి పుట 600
14. ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ - కొడాలి ఆంజనేయులు పుట 415
15. మనుధర్మశాస్త్రం - శూద్ర బానిసత్వం- సి.వి.పుట 115
16. హరిజనాభ్యుదయం - ఆధునికాంధ్ర కవిత్వం - కల్లూరి ఆనందరావు పుట 455.

## 3. తెలుగు కథానిక-హరిజన జీవితం

నాడు సమాజం కృషి జీవితం కావడం కోసమో లేదా కొంతమంది తమ ఉనికిని కాపాడుకోవడం కోసమో కులవ్యవస్థను సృష్టించారు. ఈ కులవ్యవస్థ రాను రాను సమాజంలో హరిజనుల పాలిట శాపంగానూ సవర్ణుల పాలిట కల్పతరువుగానూ మారిపోయింది. ఈ శాపమే హరిజనులకు గడ్డు స్థితిని ప్రసాదించింది. ఈ సమాజం వీరితో అడ్డమైన ఊడిగం చేయించుకొంటుంది. మానవజాతిలో హరిజన జాతి ఒకటని వారు తమతో సమానమని సవర్ణులు భావించలేదు. ఈ అసమానతే హరిజనుల్ని ఎదగనీయకుండా చేసింది. అసమర్థులను చేసింది. యుగాలుగా అచేతనులుగా అసమర్థులుగానే ఉండిపోయారు సుదీర్ఘ కాల పరిణామంలో మార్పులు సంభవించటవల్ల సంఘ చైతన్యం కోసం ఉద్భవించిన సంఘసంస్కర్తలు సంఘంలోని హరిజనుని జీవితాన్ని నొక్కి చెప్పారు. హరిజనుడికి, తాను ఎదగవలసిన స్థితిని గుర్తుచేశారు. ఈ నేపథ్యంలోనే ఈ శతాబ్దంలో పుట్టిన కథానికా సాహిత్యంలో హరిజనుడి జీవితం సాహిత్య వస్తువైంది. కథానికా ప్రక్రియలో ప్రతిబింబించిన హరిజనుల జీవనస్థితి గతులు ఆర్థిక రాజకీయ సాంఘిక దోపిడీని విశ్లేషించటంలో పలువురు రచయితలు పలుధోరణులను అన్వేషించారు అవలంబించారు. స్థూలంగా వీరిని రెండు వర్గాలుగా విభజించవచ్చు:

1. తమ సమస్యలను తాము చిత్రించుకొనిన హరిజన కథారచయితల మార్గం హరిజన సమస్యను చిత్రించిన హరిజనేతర కథారచయితల మార్గం కంటే కొంత వాస్తవంగానూ చైతన్యవంతంగానూ ఆలోచనాత్మకంగానూ ఉంటుంది. అందువల్ల హరిజన జీవిత అభ్యుదయాన్ని కాంక్షించిన కథానికలను హరిజన కథారచయితల కథానికలు హరిజనేతర రచయితల కథానికలుగా వేరు చేయటం జరిగింది. ఈ ప్రయత్నంలో హరిజన అభ్యదయదృక్పథం సంపూర్ణ స్వరూప స్వభావాలు గోచరమయ్యే అవకాశం ఉంది.

2. హరిజన కథారచయితల కథానికలు - హరిజన కథారచయితలు సృష్టించిన కథానికలు విశాల కాలనేపథ్యం నుండి సమస్యా పూర్వరంగంనుండి సమస్త తత్త్వం నుండి పరిశీలింపవచ్చు. వీరికథలు సాధమైనంతవరకు హరిజనులకు సమాజం ఇచ్చేస్థితిని స్వీకరించి రాసినవే. ఇందులో ఎక్కువపాళ్ళు వాస్తవికత ఉంటుంది. కథల్లో వీరి జీవితాలు ఇతరులపై ఆధారపడినట్లు ఉంటుంది. వీరి కథానికలను పరిశీలిద్దాం.

**3.1.1. సాంఘికజీవనం** :- మానవుడు చేసే ప్రతిపనిమీద సంఘ ప్రభావం ఉంటుంది. వర్ణ వ్యవస్థ కారణంగా నేడు సమాజంలో వ్యక్తి చేసేవృత్తి కారణంగా తగిన విలువను ఆపాదించుకొంటున్నాడు. తరాలుగా హరిజనుడు తన దైన్యమైన వృత్తి కారణంగా ఈ సంఘంచేత వెలివేయబడ్డాడు. అసమానుడుగా చేయబడ్డాడు. తన జీవితమంతా నిరాశామయంగానే గడిపాడు. గడుపుతున్నాడు.ఈ నేపథ్యంలో వచ్చిన కథానికలను పరిశీలించటం ప్రస్తుత కర్తవ్యం.

**3.1.1.1. అయ్యోపాపం** :- అస్పృశ్యతా సమస్యకులోనయి అక్కడక్కడ వారికి జరుగుతున్న అవమానాలకు హృదయం చలించి ఆవేదనతో వ్రాసిన కథ ఇది. రచయిత్రి గొట్టుముక్కల మంగాయమ్మ ఈమె మొట్టమొదటి దళితకథా రచయిత్రి. హరిజనులపై బ్రాహ్మణుల వైఖరి ఈ కథలో ప్రధానాంశం. అస్పృశ్యత కారణంగా గ్రుక్కెడు మంచినీళ్ళకు నోచుకోని మాలదంపతుల కథ. అన్నపూర్ణ, భాస్కరులు భార్యాభర్తలు. అన్నపూర్ణ తల్లి అనారోగ్యంతో ఉందని తెలిసి ఆమెను చూడడానికి ఆ దంపతులు బయలుదేరారు. వేసవికాలం కావటం వల్ల తీవ్రమైన ఎండవల్ల దారిలో దాహంవేసింది. వారి దాహార్తి తీర్చుకోవడం కోసం దారిప్రక్కల నీటి గుంటలకోసం వెదుకుతూపోతున్నారు. ఒకచోట బ్రాహ్మణుడు పెట్టిన చలివేంద్రం కనిపించింది. అక్కడికి వెళ్ళిన వారికి చల్లటి మజ్జిగతో దాహంతీర్చి, విసనకర్రలతో

సేదతీర్చుతున్నారు. అన్నపూర్ణ, భాస్కరులు దాహం తీర్చుకోవటం కోసం అక్కడికి వెళ్ళగానే వీరి కులాన్ని తెలుసుకొని ''ఇక్కడ మాలముండోళ్ళకి దాహమియ్యరు. మాకు మైలగాదూ మీకు నీళ్ళోస్తే పందిరి తాకపోకండి''? అన్నాడు బ్రాహ్మణుడు. చేసేది లేక ఆ దంపతులు అగ్రహారంలో మరో చలివేంద్రం దగ్గరికి వెళ్ళినా అదేపరిస్థితి ఎదురైంది. వారు నడి బ్రాహ్మణ వీధిలో వెళ్ళుతున్నారని తెలిసిన బ్రాహ్మణ స్త్రీ తన నౌఖరుతో వాళ్ళను ఊరిబయటకు గెంటించింది. ఊరిబయట చెట్టు క్రిద దాహార్తితో పడి వున్న ఆ దంపతులకు ఒక సాయిబు దాహార్తి తీర్చాడు. ''అన్నపూర్ణ'' ఈ రోజు పెట్టని రోజులు కాబోలు పురిసెడు నీళ్ళు కరువ 2'' య్యాయని అన్నది. అందుకు భాస్కరుడు'' పెట్టని రోజులని పూర్వకర్మ ఫలితాలని యీ దొంగవేదాంతాన్ని మనకోసమే కల్పించారు - మన రక్త మాంసాలన్నీ బాగా పిండుకొని మనకు మంచినీళ్ళైనా దొరక్కుండా చేస్తున్నందుకు మనము నోరుమూసుకొని వూరుకోవడానికి. యిట్లాంటి పిచ్చిమాటలు నమ్మబోకు పూర్ణా3'' అంటాడు.

వ్యధా భరితమైన హరిజనుడి జీవితం నుండి బయట పడిన వేదాంత సారాంశం ఈ కథ. భాస్కర్ అన్న మాటలు వాస్తవం సవర్ణులు వారి అవసరాలకు అనుగుణంగా ఎన్నడో రాసిపెట్టిన శాస్త్రాలను ప్రామాణికంగా తీసుకొని అస్పృశ్యులను శతాబ్దాల తరబడి అవమానిస్తున్నారు. హింసిస్తున్నారు ప్రాచీన సమాజానికి ఆనాడు ఉద్భవించిన శాస్త్రాలు ప్రామాణికం అయితే అయి ఉండవచ్చు కాని, ఆధునిక యుగంలో కూడా వాటి ప్రకారం సమాజంలోని మానవులను తెగలుగా విభజించడం సమాజ విచ్ఛిత్తికి కారణం అవుతుందని సవర్ణులు గుర్తించలేకపోయారు. సాటి మానవులు తమపై చూసే వైఖరి భావానికి నిరసించిన కొందరు తమ సామాజిక హోదాను పెంచుకోవడానికి వెనుకాడలేదు. దీనిద్వారా హిందూమతంలోని హరిజనులు పలుమతాల్లో వ్యక్తిస్వేచ్ఛ కోసం చేరారు అని ఈ కథ దృక్పథం. మతం వేరయినా ఒక మహమ్మదీయుడు వారి దాహార్తిని తీర్చాడు. తోటి హిందువులు వారి దాహం తీర్చటానికి కులం అడ్డువచ్చింది. కనీసం వారిని ఇళ్ళుహదరిదాపులకు రానీయకుండా తరిమారు.

**3.1.1.2. ఊరబావి**: హరిజనులు తమత్రాగునీటి సమస్యను పరిష్కరించుకొన్న కథ. రచయిత కొలకలూరి ఇనాక్. రాముడు, చిదంబరం తండ్రికొడుకులు. చిదంబరానికి భార్య ఉంది. ఆమెది అన్యాయాన్ని ఎదిరించే మనస్తత్వం. చిదంబరం అన్యాయాన్ని ఎదిరించే మనస్తత్వం ఉన్నా తండ్రి పోసిన పిరికి మందు కారణంగా ఎదిరించలేకపోవటం అతని సహజ అలవాటు అయింది. ఒకసారి చిదంబరం భార్య ఊరబావికి నీళ్ళకెళ్ళితే సవర్ణుడు ఆమెపై చేయివేస్తే చాచి చెంప మీద కొట్టింది. చిదంబరం కూడా అప్పుడు ఊరిప్రజలపై తిరగబడటం వల్ల వారి ఆగ్రహానికి గురయ్యాడు. ఎండాకాలంలో హరిజనులు, సవర్ణులు ఒకే బావినీళ్ళు త్రాగాల్సివచ్చింది. హరిజనులు బావినీళ్ళను అంటుకోకుండా సవర్ణులు బావిలో నీళ్ళు చేది హరిజనుల కుండలలో పోయటం సహజమైంది. ఆ బావిలో చిదంబరం ఎద్దు దట్టెం వ్రేలాడదీశాడన్న నెపంతో మునసబు రాముడిని చిదంబరాన్ని చావడిలో కట్టివేసి చావబాదాడు. చేయని నేరాన్ని వారిపై మోపాడు. హరిజనులను బావిలోనున్న ఎద్దు దట్టెంను తీసివేయమన్నారు సవర్ణులు. రాముడిని చిదంబరాన్ని కొట్టినందుకు హరిజనులు దట్టెంను తీయడానికి నిరాకరించారు. సవర్ణులే ఆ ఎద్దు దట్టెంను తీయబోయి ఒకరు మరణించారు. ఆ రాత్రి చావడిలోనున్న రాముడు చిదంబరాలకు కట్లు విప్పి, మునసబును చావబాది, అతని గడ్డి వాములకు నిప్పు అంటించి ఇళ్ళు చేరినది చిదంబరం భార్య అని, ఎద్దు దట్టెంను తీసి బావిపూడిక తీసి ఊరబావిని సొంతం చేసుకొన్న పల్లె ప్రజలకు తెలిసివచ్చింది.

ఈ కథానిక బానిస జీవితానికి అలవాటు పడిన హరిజనులు తమ హక్కులను సాధించుకోగలమని, అందుకోసం రహస్య పోరాటం చేయగలమని నిరూపించింది. రాముడు చిదంబరం చేయని నేరానికి శిక్షను

అనుభవించినా ఫలితాన్ని సాధించగలిగారు. రాముడు హరిజనులకు జరుగతున్న అన్యాయాలు తెలిసినవాడు, తెలియని మూర్ఖుడు కాదు. తెలిసి ఏమైనా చేస్తే వచ్చే ప్రమాదం నుంచి తప్పించుకోవటానికి తెలియనట్లుండే సంప్రదాయవాది. సమస్యతెలిసినా సవర్ణులను ఎదిరించే ధైర్యం లేక, వెళ్ళి వాళ్ళ చేతుల్లో చావలేక ఇష్టంలేక కష్టంతో మనస్సును చంపుకొని బతికే మనస్తత్వం అతనిది. పుటిపెరిగిన చోటు వేరుకావటం తమ పుట్టింటి గుణాలు తనలో నిలిచిఉండటం తన శీలం ఆత్మగౌరవం భంగం కలగటం భరించలేకపోయి చిదంబర భార్య తన భర్త మామ చేయలేని పనిని చేసింది. ఈ కథలో స్త్రీ చైతన్యం స్పష్టంగా కనిపించింది. హరిజనులు తమకు హక్కులు కావాలని అరిస్తే రావని, వాటిని హింసకు గురైనా సరే తప్పని సరి పరిస్థితులు సృష్టించి గత్యంతరం లేనిస్థితిలో హక్కులను సాధించుకోవాలన్న దృక్పథం ఉంది.

సుప్రసిద్ధ కథారచయిత సింగమనేని నారాయణ ఊరబావి కథపై స్పందిస్తూ ఇనాక్‌కు ఒకలేఖ (18-03-95) వ్రాశాడు: '' రెండునెలలుగా నాకు ఒకటేపని కనిపించిన సాహితీమిత్రులందరికీ మీ ఊరబావి కథను గురించి గొప్పగా చెప్పటం. రెండునెలల క్రితం హరిజన కథల సంకలనంకోసం కొన్ని కథలు చదువుతూ మళ్లీ మీ ఊరబావిని చదివాను. ఎప్పుడో 25 ఏళ్ళక్రితం చదివిన కథ. అప్పుడు చదవటంవేరు, ఇప్పుడు చదవటంవేరు కదా! కథ చదవటం పూర్తికాగానే కొన్ని గంటలపాటు కథావస్తులో మునిగిపోయాను ఎంతగొప్పకథ ఎంతగొప్పశిల్పం అనివందసార్లు గొనుక్కున్నాను. కథలో చిత్రించిన వాతావరణం, పాత్రల సంచలనాలు, ప్రాణవంతమైన భాష, ముఖ్యంగా సమస్యను ఆవిష్కరించిన తీరూ వర్గ సంబంధాలూ వీటి అన్నిటి వెనుకా రచయిత కంఠస్వరం... నన్ను ఎంత ముగ్ధుణ్ణి చేశాయో! అనుభవించి పలవరించు అంటారే - ఆ స్థితిలో ఆకథను నిజంగా నేను పలవరించాను. కథ చివరలో అటకమీద వాలుగుతాళ్ళు కన్పించటం లేదనే ఒక చిన్న వాక్యంతో ఎంత అద్భుతమైన గొప్ప శిల్పాన్ని మీరు పాటించారు! ఎంత పెద్ద కథయినాసరే ఊరబావిని మించిన దళిత కథ లేదు. ఆ కథనే త్రిక చెర్చమని సంకలనకర్తకు సూచించాను. భారతీయభాషల్లో ఏ గొప్ప కథకూ పోలేనిపోని కథగా దీన్ని నేను గౌరవిస్తాను. గతనెల మధురాంతకం గారు వచ్చినపుడు ఇదే విషయం ఆయనతో అన్నాను. నిజమే, ఆయనకు రావాల్సిన కీర్తి రాలేదు. అని ఆయన నొచ్చుకొన్నారు. ప్రతిసాహితీ మిత్రునికీ కథారచయితకు ఆ కథను చదవండి అని పదేపదే చెబుతూ వస్తున్నానీమధ్య. ఈ కథ ఇంగ్లీషులోకి ఈ సమయంలో అనువాదం జరగాల్సి ఉంది. అనువదించడానికి దయచేసి మీరే ప్రయత్నించండి.''

''నిజానికి ఇనాక్ ఊరబావి కథ అటు వస్తుపరంగానూ ఇటు శిల్పపరంగానూ గొప్ప పరిణామాల్ని సృష్టించిన కథ. ప్రపంచంలోని పలుభాషల్లోకి తర్జుమా జేయదగిన కథ. ఇప్పుడిప్పుడే ఊపందుకొంటున్న దళిత స్త్రీవాదానికి తొలి ప్రతీక ఆ కథ. 1969లో ఇనాక్ ఈ కథ రాశాడంటే చాలా ఆశ్చర్యకరంగా ఉంటుంది'' (పరిధులూ - ప్రమేయాలు - లక్ష్మీనరసయ్య, ఆంధ్రజ్యోతి 3-12-1995)

**3.1.3.3. ఆకలి**: ఆహారసంపాదనలో ప్రాణాలను కోల్పోయిన హరిజనబాలిక కథ రచయిత కొలకలూరి ఇనాక్. చిన్నిది బీదకుటుంబం. ఆ కుటుంబంలో ముగ్గురు పిల్లలు భార్యాభర్తలున్నారు. తల్లి గర్భవతి. కూలికోసం తండ్రి పక్కూరికి వెళ్లాడు. అతడు కూలితెస్తే అమ్మ అన్నంతెస్తే చిన్నికుటుంబానికి తిండి దొరుకుతుంది. ఆ కుటుంబం మూడురోజుల నుండి ఆహారం తినలేదు. చిన్ని మంచినీళ్ళుత్రాగి తండ్రిరాకకోసం ఎదురుచూస్తూ రోడ్డుచేరింది. ఒకసారి రోడ్డుమీద ఆటలాడుతూ లారీ కింద పడింది. ఆసుపత్రి పాలైంది. లారీ ఓనర్ ఆరునెలలపాటు చిన్నికుటుంబాన్ని ఆసుపత్రిలో రకరకాల తిండిపెట్టి పోషించాడు. చిన్ని ఆసుపత్రిపాలైంది. ఆమెకు పట్టెడు మెతుకులు కరువయ్యాయి. చిన్నికి మరలా ఇదే ఆలోచన వచ్చింది. ఆశపడి లారీ క్రిందపడి చనిపోయింది. శాశ్వతంగా ఆకలిని పోగొట్టుకొంది.

ఈ కథలో హరిజనుల ఆర్థికస్థితి స్ఫురిస్తుంది. నిత్యం కూలికి వెళ్ళితేగాని పూటగడవని బ్రతుకులు వారివి. తెచ్చిన కూలి ఏపూట కాపూటకు మాత్రమే సరిపోవడమే ఎక్కువ. చిన్ని ఆకలి తీర్చుకోవడానికి తన ప్రాణాన్నే పణంగా పెట్టుకుంది. అనుకోకుండా జరిగిన లారీ ప్రమాదం ఆకలితీరటం గుర్తించిన చిన్ని, ఆకలి తీరటం కోసం లారీ ప్రమాయం కావాలనుకుంటే, ఆకలితీరక పోగా మరణం సంభవించటం రచయిత ఈకథలో చిత్రికరించాడు. తిండుకోసం సర్వప్రాణులు యుద్ధం చేస్తుంటే కర్మపేరుతో కట్టుబడి ఉండే నైరాశ్య స్థితి నుండి మేల్కొని ఒక పసిప్రాణి అన్నంకోసం చేసిన తీవ్రకృషి ప్రాణహానిగా మారినా సరే ప్రయత్నం తమపరిధిలో ఖచ్చితంగా చేయమని ఈ కథ బోధిస్తుంది. ఆకలికి చావు పరిష్కారం కాదని, అవసరమైతే పలుప్రాంతాలకు వలసవెళ్లైనా కష్టపడి పనిచేసి తమ ఆకలిని తీర్చుకోమని ప్రబోధిస్తుంది.

3.1.1.4 సూర్యుడు తలెత్తాడు : సవర్ణులు హరిజనుల పట్ల ప్రవర్తించే తీరును సూచించే కథ. రచయిత కొలకలూరి ఇనాక్. రాముడికి భార్య, కొడుకు, కూతురు ఉన్నారు. రాముడు పొలంపని చూస్తాడు. రాముడు బ్రతికి ఉండగానే అతని శరీరం అస్థిపంజరంలా తయారైంది. రాముడు తనకుటుంబాన్ని గురించి ఆలోచించడు. పొలం గురించి ఆలోచిస్తాడు. రాముడి భార్య సీత ఊరియువకుడు చేయిపట్టుకొన్నాడని ఉరిపోసుకొంది. రాముడు బాధ పడలేదు. తన భార్యకు జరిగిన అన్యాయానికి ఎదురు తిరగలేదు. పొలంపనికి వెళ్ళాడు. తన కూతురును ఊరియువకుడు అనుభవిస్తే మగపిల్లవాడికి జన్మనిచ్చి చనిపోయింది. దానికి తన కొడుకు ప్రతిఘటిస్తే సవర్ణులు వాడిని తరిమి తరిమి చంపారు. రాముడు తన కుటుంబానికి జరిగిన అన్యాయాన్ని ఖండించలేదు. పొలాన్ని వదల్లేదు. అప్పుపేరుతో చింతయ్య రాముడి పొలాన్ని కాజేశాడు. అన్యాయమని రాముడు అరవలేదు. ఒకరోజు చెరువు గట్టున నీటిలోని సూర్యుని ప్రతిబింబాన్ని చూశాడు. సూర్యుడు గిలగిలా కొట్టుకొంటూ పైకి వస్తున్నట్లు కన్పించాడు. రాముడిలో జ్ఞానోదయమైంది. ఈ బ్రతుకులిట్లా తగుల బడటానికి వీళ్ళేదని రాముడు అగ్గిపెట్టె పుచ్చుకొని ఊరివైపువెళ్ళాడు.

ఈ కథ హరిజనుడుకీ, భూమికీ మధ్యనున్న సంబంధాన్ని తెలియజేస్తుంది. సవర్ణులు హరిజనుల శక్తిని పీల్చిపిప్పి చేసి తమ కాళ్ళక్రింద చెప్పుల్లాగ భావిస్తూ వారి సంసారం మీదపడి ఇష్టమైనట్లుగా దోచుకొన్నారు. కాని, రాముడిలో చలనం లేకపోయింది. నిస్సహాయుడు కూడ సమయం సందర్భం వత్తిడి తెస్తే ఎలాంటిస్థితిలో చైతన్యవంతుడవుతాడో ఈ కథ తెలుపుతుంది. సూర్యుడు లాగా తలవంచుకుపోయే రాముడు ప్రాణంపోతే, శీలంపోతే చలించకపోయినా ఆర్థికస్థితికి పునాది అయిన భూమి పోతే చలించకపోతే న్యాయం కాదని భూమికోసం ఒకడు పదిమందితో తలపడటం కష్టంకాబట్టి దాపరికంగానైనా ప్రతీకారం తీర్చుకోబూనటం ఈ కథ తెలుపుతుంది.

ఈ కథానికలో ముగింపు విశిష్టంగా ఉంది. రాముణ్ణి సూర్యుడితో పోల్చటం పరిశీలింపవలసి ఉంది. సూర్యుడు ఆకాశంలోంచి భూమిని చూస్తూ తలవంచుకొని గమిస్తుంటే రాముడు భూమిని చూచుకొంటూ తలదించుకొని నడుస్తున్నాడు. రాముడు తలదించుకోవటానికి తనజీవితంలోని అన్ని సంఘటనలూ సహాయ పడ్డాయి కానీ , చూచుకోవటానికి భూమిలేకుండా పోయినప్పుడు రాముడికి ఊరు కనిపించింది. ఆకాశంలో సూర్యుడు చెరువులో పడి అలల్లో గిలగిల కొట్టు కొంటూ కన్పిస్తే రాముడు అశక్తతతో అల్లాడిపోయాడు. అగ్గిపుల్ల గీసి చూస్తే కాంతి ముఖంమీదపడి రాముడి ముఖం అస్తమించే సూర్యుడి ముఖంలో కనిపించింది. రాముడు సూర్యుడయ్యాడు. జరిగిన కర్మకాండకు సాక్షి అయ్యాడు. హరిజనుల జీవితాలు ఇంకా తగులబడడానికి వీలులేదని తీర్మానించుకొన్నాడు. ఈ జీవితాలు తగులబడకుండా ఉండాలంటే తగులబడక తప్పని జీవితాలు ఊరినిండా ఉండటం కర్మ సాక్షికి కనిపించింది. రాత్రికాగా సూర్యుడు పడమటికి పోగా ఈ సూర్యుడు అగ్గిపుల్లల పెట్టెను సూర్యుడి వంశాంకురాలను తీసుకొని

ఊళ్ళోకి పోవటం ఊరిని వెలిగించటానికే! హరిజనుల జీవితాలు వెలగటానికి దుర్మార్గ సవర్ణుల జీవితాలు తగులబడక తప్పదన్న సత్యం ఈ కథ ప్రస్ఫుటీకరిస్తుంది.

**3.1.1.5 సంస్కరణం** :- హరిజనుల యెడ బ్రాహ్మణులు ప్రవర్తించే తీరును సూచించే కథ. రచయిత కొలకలూరి ఇనాక్ కందుకూరి వీరేశలింగం సంస్కరణ వాది. అతడు ప్రవేశపెట్టిన సంస్కరణలకు నూరేళ్ళు నిండిన కారణంగా అతని స్మృతికోసం సంస్మరణ సభ పెట్టారు. సభకు ప్రభాకర్‌జీ ముఖ్య అతిథిగా వచ్చాడు. ప్రభాకర్‌జీ హరిజనుడు సంఘ సంస్కర్త స్వాతంత్ర్యోద్యమంలో అనేక సార్లు జైలుకెళ్ళాడు. గాంధీ వెంటతిరిగి తన యావదాస్తిని ఉద్యమానికి పణంగా పెట్టాడు. అలాంటి ప్రభాకర్‌జీ సభకు ముఖ్య అతిథిగా వచ్చాడు. కలెక్టర్ కూడా సభకు వచ్చాడు. అతనుకూడా హరిజనుడు. ప్రభాకర్‌జీని అందరూ గౌరవించారు. కాని, వేదికవద్దనున్న బ్రాహ్మణులు గౌరవించలేదు. సభ మొదలై కందుకూరిమీద ఉపన్యాసాలు మొదలయ్యాయి. తర్వాత ప్రభాకర్‌జీ కందుకూరి విగ్రహానికి పూలమాల వేశాడు. అది సహించని బ్రహ్మణులు విగ్రహం మెడలో పూలమాలను తీసి, విగ్రహం అపవిత్రమైందని నీటితోనూ పాలతోనూ శుద్ధిచేశారు. ''పంతులు జీవించి దుఃఖించాడు. గతించీ దుఃఖించాలా'' అన్నారు. ఈ లోగా అక్కడేవున్న కలెక్టర్ పూలమాలను తీసి విగ్రహం మెడలో వేశాడు. దానిని ఎవరూ తాకకుండా పోలీసులను కాపలా ఉంచాడు. సంస్కర్త చేసిన పని భరించలేక పోయినా బ్రహ్మణులు అధికారి చేసిన పనికి తలలు వంచుకొన్నారు.

ఒక సంఘ సంస్కర్త విగ్రహాన్ని మరో సంఘ సంస్కర్త గౌరవిస్తే ఆ గౌరవాన్ని హరిజనుడి గౌరవంగా భావించి సనాతనులు తిరస్కరించారు. పైగా విగ్రహాన్ని శుద్ధిచేశారు. ఒక అధికారి సంస్కర్తను గౌరవిస్తే హరిజనుడైనా ఈ సనాతనులు గౌరవించారు. సంస్కర్తను అంగీకరించనివాళ్ళు అధికారాన్ని అంగీకరించారు. అధికారంతో చేసిన పని ఆమోదం పొందింది. మంచిమనస్సు మంచిమనస్సుతో చేసినపని తిరస్కారంపొందింది. ఇది సంఘంలోని స్థితి నిజానికి అధికారిని కాక సంస్కర్తను గౌరవించాలి. అలాజరుగకపోవటం సంఘంలోని పెద్దలోపం దీనిని తూర్పారబట్టడానికి రచయిత ఈ కథ వ్రాశాడు. ఈ కథలో బ్రాహ్మణులు సహజంగానే హరిజనుల్ని అంటరాదని అనటమూ హరిజనుల విషయంలో సంస్కర్తవిగ్రహం కూడా అంటు తగిలిందని పరిశుభ్రం కావించే ప్రయత్నంమీద తిరుగుబాటుగా మరో అంటరాని అధికారితో విగ్రహం పవిత్రతను కాపాడటం ప్రధానాంశం.

**3.1.1.6. పాపానికి జీతం** :- హరిజనస్త్రీలపై సవర్ణుల దౌష్ట్యాన్ని చిత్రించిన కథ. రచయిత జి. భాను. ఎల్లమంద అరుంధతి భార్యాభర్తలు. వారికిద్దరు పిల్లలు . ఎల్లమందవృత్తి చెప్పులు కుట్టటం. ఒకరోజు ఎల్లమంద చెప్పులు కుట్టి అరుంధతి చేత భుజంగారావు ఇంటికి ఆ చెప్పులను పంపాడు. ఆ సమయంలో భుజంగరావు తప్ప ఇంట్లో ఎవరూ లేరు. అరుంధతిని గొడ్లపాకకువెళ్లి గడ్డివేయమన్నాడు. ఆ వెంటనే భుజంగరావు గొడ్లపాకకు వెళ్ళి అరుంధతిని అనుభవించబోయాడు. అతనిబారి నుండి తప్పించుకొన్న అరుంధతి నాభర్తతో చెప్పి నీ అంతు చూస్తానని ప్రతినబూనింది. ఈ విషయం ఎల్లమందకు తెలిస్తే తన ప్రాణాలుండవని తెలుసుకొన్న భుజంగరావు అరుంధతిని హత్యచేశాడు. శవాన్ని తన దొడ్డిలోనే పూడ్చాడు. ఆ రాత్రికి అరుంధతి ఇంటికి రాలేదని ఎల్లమంద భుజంగరావు ఇంటికి వెళ్ళాడు. భుజంగరావు అరుంధతి చెప్పులు ఇచ్చి అప్పుడే వెళ్లిందని దొంగరెడ్డిగానికి అరుంధతికీ సంబంధం వుందని అబద్ధాలు చెప్పాడు. ఎల్లమంద సారాయి త్రాగటానికి డబ్బు ఇచ్చి పంపాడు. ఆతర్వాత రెండురోజులకు భుజంగరావు కాలికి కొత్త చెప్పు తగలడంవల్ల పుండు అయింది. అతనికి చక్కెరవ్యాధి వుండటం వల్ల ఆపుండు ఎక్కువయి, కాలుకు ఆపరేషన్ చేసే పని వచ్చింది. డాక్టర్ ఆపరేషన్ చేస్తుండగా భుజంగరావుకు అరుంధతి కన్పించి చనిపోయాడు.

అసమ సమాజవ్యవస్థలో అలసత్వం వ్యక్తి క్షీణతకు ఎలా దారితీస్తుందో తెలిపిన కథ. పొట్ట కూటికోసం ప్రాణప్రదంగా చూసుకొన్న వృత్తే అతని కుటుంబాన్ని నాశనం చేసింది. హరిజనుల శ్రమతో తృప్తిపడని సవర్ణులు వాళ్ల మానప్రాణాలను కూడా అలవోకగా కాజేయటం పరిపాటి. ఇలాంటి వ్యవస్థనుంచి తమను తాము రక్షించుకోమని అవసరమైతే సవర్ణుని రహస్యమార్గంగానైనా అంతం చేయటానికి ప్రయత్నించమని ఈ కథ ప్రబోధిస్తుంది. ఈ కథ కరుణకుమార వ్రాసిన 'కొత్తచెప్పులు' కథను తలపిస్తుంది.

**3.1.1.7. ఏది గవ్యం :-** హరిజన దాస్యత్వాన్ని తెలిపే కథ. రచయిత కొలకలూరి ఇనాక్. రవి, రాము ఒకే తరగతి విద్యార్థులు . ఒక రూంలో ఉంటున్నారు. వారిద్దరూ బంధువులు. రవి ధనవంతుడు. పైగా అతనికి స్కాలర్‌షిప్ వస్తుంది. రాము బీదవాడు. తండ్రిచేసే అటెండర్ ఉద్యోగం కారణంగా అతనికి స్కాలర్‌షిప్ రాదు. రవి పనులన్నీ రాము చేస్తాడు. రాము తాతముత్తాతలు రవితాత ముత్తాతలను కాపాడుతూ చనిపోయారు. కాని రాముతండ్రి ఆ ఊబినుంచి తప్పించుకొని పట్నంచేరి ఉద్యోగం చేస్తున్నాడు. కాని రాము ఇంత చదువుకొని తనతాత, ముత్తాతల లాగా రవివద్ద బానిసగా బ్రతుకుతున్నాడు. ప్రభుత్వం మారింది. విద్యార్థులకు స్కాలర్‌షిప్ రాలేదు. సమ్మెలు, ధర్నాలు చేయడం మొదలుపెట్టారు. రవి సమ్మెలో పాల్గొంటే రాము అతనిని రక్షించబోయి గతించాడు. ఈ చదువుకొన్న బానిస బ్రతకటంకంటే చావటమే మేలని ఈ కథానిక సందేశం అందించింది.

సమాజంలో హరిజనులు తరాలు మారినా బానిసత్వంలో మ్రగ్గుతూ, కాలాన్ని చాలిస్తున్న వైనాన్ని ఈ కథ అందిస్తుంది. నేటి హరిజనుడు ఆర్థికంగా పతనావస్థలో వున్న స్థితిని ఆ ప్రయత్నంలోనే ఏతీరులో బానిసగా బ్రతకాల్సి వచ్చిన స్థితిని తెలిపిన కథ ఇది. కథలో రాము కుటుంబం రవి కుటుంబానికి ఆర్థికంగా బానిసయింది. ఆప్రయత్నంలో తండ్రి తప్పించుకొన్నాడు కాని కొడుకు తప్పించుకోలేకపోయాడు. తండ్రి ప్రయత్నం కొడుకుతరంలో నిలువలేకపోయింది. హరిజన విద్యావంతులు తాతముత్తాతల బానిస మనస్తత్వాన్ని జీర్ణించుకొని పతనం కావద్దని, నలుగురితో సమానంగా జీవించే ధైర్యాన్ని పొందమని హెచ్చరించిన కథ ఇది.

**3.1.1.8. వేపచెట్టు :-** ఉన్నతవిద్యను అభ్యసించిన హరిజనుల్లోని మూర్ఖత్వాన్ని సూచించిన కథ. రవి ఏడవతరగతి పూర్తిచేసి తన ఆర్థిక స్థితి దృష్ట్యా చదువుకు స్వస్తి చెప్పి ఉద్యోగం కోసం ఎంప్లాయ్‌మెంటు ఆఫీసు చుట్టూ తిరుగుతున్నాడు. జీవితంలో ఎప్పుడైనా ఉద్యోగం రాకపోతుందా అని ఆశిస్తున్నాడు. రోజూ అన్నం తింటాడో లేదో గాని, కాఫీ త్రాగుతాడు. ఒకరోజు ఎంప్లాయ్‌మెంటు ఆఫీసు వద్ద రవి తనవద్ద ఫ్లాస్కులోనున్న కాఫీని తోడి మిత్రునికి ఇచ్చాడు. అతను త్రాగి ఒక పావలా ఇచ్చాడు అప్పటినుండి రవి కాఫీ అమ్మటం మొదలుపెట్టాడు. అక్కడే హోటల్‌ను ప్రారంభించాడు. ఆఫీసు వచ్చిన నిరుద్యోగులకు సలహాలు ఉచితంగా ఇస్తూ కాఫీకి డబ్బు తీసుకొనేవాడు. ఒకనాడు ఒక హరిజన నిరుద్యోగి రవి హోటల్‌కు వచ్చాడు. అతను డాక్టర్ కోర్సు పూర్తిచేశాడు. ఆఫీసులో రెన్యూవల్ చేయించడానికి వచ్చాడు. అతనిని చూసిన సిరంజి, స్టెతస్కోప్‌ను ఎక్కడైనా దొంగలించి ఆసుపత్రి ప్రారంభించమని సలహా ఇచ్చాడు హోటల్ యజమాని రవి.

కథలో రవి ఎదుటివాడి సహాయం లేకుండా చదువులేకపోయినా స్వతంత్రంగా బ్రతకగలుగుతున్నాడు. తానే పదిమందికి తన హోటల్లో ఉద్యోగాలిచ్చాడు. ఒక హరిజనుడు డాక్టర్ కోర్సు పూర్తిచేసినా తన చేతిలో ఉపాది కల్పించుకొనే వృత్తి వున్నా ఎంప్లాయ్‌మెంటు ఆఫీసుచుట్టూ తిరగటం అతని మూర్ఖత్వానికి ప్రతీక. కర్మసిద్ధాంతం పేరుతో నైరాశ్యం ముసుగులో కర్తవ్యతా విమూఢులవుతున్న విద్యావంతులైన హరిజనయువకుల్ని స్వయంకృషితో అభివృద్ధి చెందమని ప్రబోధించిన కథ.

**3.1.1.9. బంచరాయి** : - హరిజనులు చైతన్యవంతులుకాబోతే స్వార్థంతో వారికి అడ్డుతగిలిన సవర్ణుల కథ. రచయిత బోయ జంగయ్య. ఆ గ్రామంలో హరిజనులు ఎక్కువ. వారికున్న సౌకర్యాలు తక్కువ. సవర్ణుల పిల్లలు పట్నంవెళ్ళి చదువుకొంటారు. హరిజనులపిల్లలకు మాత్రం కూలీ, నాలీ తప్పనిసరి. మిగులుభూములు హరిజనులకు పంచాలన్న ప్రభుత్వం సలహామేరకు ఆ గ్రామ హరిజనులు దేవాలయ భూములను సాగుచేస్తున్నారు. ఈ ప్రయత్నంలో. హరిజనవిద్యార్థి గోపాలం మండలంలో మాట్లాడి భూమి తమకు వచ్చేట్లు చూశాడు. ఈ విషయం గ్రామప్రజలకు తెలిసింది. రామిరెడ్డి ముందు చూపుతో తనకు ఓట్లు వేస్తారన్న నెపంతో హరిజనులకు పొలం ఇవ్వడానికి అంగీకరించినా కరణం నిరాకరించాడు. కరణం రామిరెడ్డితో ''ఆ భూమి చాలా విలువైనది. రేవుప్రొద్దున మన కొడుకులు చదవలేకపోతే ఆ భూమిలో మనం ఇండస్ట్రీ పెట్టవచ్చు, చివరకు కోళ్ళఫారం అయినా పెట్టోచ్చు''6 అన్నాడు. కరణంరామిరెడ్డి తో పాటు గ్రామ ప్రజలు వచ్చిపొలం సాగు చేసుకోవద్దన్నారు. ఈ భూమి పూజారులే అనుభవించాలన్నారు. ఈలోగా హరిజనులు భూమినా సాగు చేస్తుండగా ఒక విగ్రహం బయటపడింది. ఒక స్త్రీకి పూనకం వచ్చి హరిజనులను భూమి సాగుచేయవద్దని చెప్పింది. ఆ రాత్రికి హరిజన గుడిసెలు దగ్ధమయ్యాయి. హరిజనులపై దేవుడు అగ్రహించాడని సవర్ణులమాట. ఇది అన్యాయం అని గోపాలం అంటే సవర్ణులు ఎగతాళిగా చూశారు.

ప్రభుత్వం మిగుల భూములు పంపిణీ క్రింద భూములలేని పేదలకు భూములను పంపిణీ చేసింది. ముఖ్యంగా ఈ పథకం హరిజనులకు ఉద్దేశించినదే. కాని ఈ పథకాలు అందవలసినవాళ్ళకు అందలేదనే దృక్పథాన్ని ప్రబోధించిన కథే ఇది. హరిజనుల చైతన్యాన్ని ఆశించే ప్రభుత్వం, వాళ్ళకు కొన్ని పథకాలను నిర్దేశించినా ఆ కార్యాలు రూపుదిద్దుకోవాల్సింది సవర్ణుల ద్వారానే కావున ఆ సవర్ణులు హరిజనుల క్షేమం కాంక్షించలేదు. సరికదా, ఇంకా అంధకారంలోకి పడత్రోస్తున్నారనే విషయాన్ని తెలిపిన కథ. ఈ కథలో హరిజన గోపాలం చైతన్యవంతంగా భూములను సాధిస్తే హరిజనవాడనే దగ్ధం చేశారు సవర్ణులు. పైగా దేవుడు దైవం అనేమాటలతో వాళ్ళను భావవాదంలోకి నెట్టారు. ఈ ప్రయత్నంనుంచి చైతన్యవంతులు కమ్మని ఉద్బోధ ఈ కథ.

**3.1.1.10. ఇంకానా-ఇకపైసాగవు** :-తమ కష్టానికి తగిన ఫలితాన్ని ఆశించబోయిన హరిజనులు విఫలం కావటాన్ని చిత్రించిన కథ ఇది. రచయిత బోయ జంగయ్య. రంగన్న హరిజనవాడకు పెద్ద. చైతన్యవంతుడు. తాము చేస్తున్న కష్టానికి ఫలితం రావటంలేదని తనవాళ్ళచే సమ్మె చేయించాడు. హరిజనులు సవర్ణులకు కూలీకి వెళ్ళటంలేదు. సవర్ణులు మథనపడ్డారు. హరిజనులను దెబ్బతీయాలనుకొన్నారు. గ్రామ దొర రామచంద్రారెడ్డికి కరణం ఒక ఆలోచనకు వచ్చాడు. అప్పటికి హరిజనులకు ఐదురోజులనుండి కూలీ లేని కారణంగా తిండిలేదు. ఆ రాత్రికి కరణం హరిజనులను పిలిపించి రెడ్డి ఇంట్లోని జొన్నలను ఇచ్చాడు. తెల్లవారి జొన్నల దొంగతనం పేరుతో హరిజనులను పోలీసుస్టేషన్‌కు తీసుకెళ్ళారు. చేయనినేరానికి శిక్ష పడినందుకు హరిజనస్త్రీలు దొరఇంటిపై పడ్డారు.

సవర్ణుల ఆలోచనావిధానాన్ని దమననీతిని కుట్రా కుతంత్రాలను బయట పెట్టినకథ ఇది. కథలో హరిజనులు కష్టానికి ప్రయోజనాన్ని ఆశిస్తే సవర్ణులు హర్షించలేకపోయారు. పైగా వాళ్ళపై నేరంమోపి అబాసుపాలు చేశారు. జైలు పాలుచేశారు. సవర్ణుల స్వార్థం కోసం హరిజనులను ఏమైనా చేయగలరని, ఎలాగైన వినియోగించుకోగలరని, అలాంటి వారి ప్రయత్నంలో బలికావద్దనే రచయిత తపన ఈ కథలో వుంది. హరిజనులు సవర్ణుల ఎత్తుకు పై ఎత్తువేసి తమ హక్కులను కాపాడుకోమనే ప్రబోధం ఈ కథలో ఉంది.

**3.1.1.11. రుధిరమథనం** :- సవర్ణుని దురాగతాలను భరించలేక ఊరువదలిన హరిజన దంపతుల కథ. రచయిత జి. భాను. అరుంధతి పోలయ్యలు భార్యా భర్తలు. పోలయ్య వృత్తి చెప్పులు కుట్టడం. ఒక రోజు

పోలయ్య తన దొర కామయ్యకు రెండురోజుల్లో చెప్పులుకుట్టి ఇస్తానని చెప్పిరమ్మని తన భార్యను పంపాడు. అరుంధతి ఈ విషయం కామయ్యకు చెప్పడానికి వెళ్ళి, తన అందంతో కామయ్యను కామింపజేసింది. ఎలాగో కామయ్య బారినుండి తప్పించుకొన్న అరుంధతి తన భర్తతో ఊరువదలివెళ్ళిపోయి గ్రామపొలిమేరలో ఒక పొలంగట్టున కాపురంపెట్టారు. ఒకరోజు కామయ్య కొడుకు కొండలరావు రహదారిలో మోటర్ సైకిల్ పై వెళ్ళుతుండగా తీవ్రప్రమాదానికి గురయ్యాడు. అరుంధతి కొండలరావు పరిస్థితిని చూసి ఆసుపత్రికి తీసుకెళ్ళి తనరక్తం ఇచ్చి అతనిని బ్రతికించింది. ఈ విషయం తెలుసుకొన్న కామయ్య అరుంధతి పాదాలపైబడి క్షమించమని వేడుకొని వారిని తన ఊరిలోనే కాపురం ఉండమని చెప్పాడు.

కులంతోపాటు డబ్బున్నవారికి అహం అలక్ష్యం వుంటాయి. కులంలేని నిరుపేదకు అనురాగం ఆప్యాయతలు పుష్కలంగా కన్పిస్తాయి అనే దృక్పథం ఈ కథ కథలో అరుంధతి కొండలరావును సాటిమనిషిగా తలంచింది. అతని స్థితిని గమనించగలిగింది. ప్రాణాపాయస్థితి నుండి రక్షించింది. కామయ్యకు బుద్ధివచ్చేలా చేసింది. అతని అహాన్ని తన ఉత్తమ గుణం చేత దెబ్బతీసింది. హరిజనులు సవర్ణులను బుద్ధి బలంతో దెబ్బతీయాలి కాని, గుండెబలంతో దెబ్బతీయరాదనే ఆలోచనను అందించిన కథ ఇది.

**3.1.1.12. ఇది కళా** :- బాధామయ హరిజన జీవితాన్ని చిత్రించిన కథ. రచయిత బోయజంగయ్య. మల్లయ్యది బీదకుటుంబం తను చిన్నతనంలో తండ్రి కూలీ, నాలీ చేయటం చెప్పులు కుట్టటం వల్ల సంసారాన్ని సాగించేవాడు. హరిజనులప్రగతికోసం బంజరు భూమి పంపిణీ జరిగింది. ఆభూముల్లో పంటరాక హరిజనులు వదిలిపెట్టారు. ఒకసారి పటేలు కొడుకు హరిజనులపై పాతకక్షతో వాడను తగులబెట్టాడు. ప్రభుత్వం హరిజనుల సంక్షేమంకోసం కొన్ని పథకాలను ప్రవేశపెట్టింది. ఆ పథకంలో భాగంగా మల్లయ్యకు బర్రెను ఇచ్చారు. ఆ బర్రెను ఇవ్వడంలోనే పంచాయితీ ప్రసిడెంటు వి. డి. ఓతో కలిసి నాలుగువేల రూపాయలు ఖరీదున్న బర్రెను ఆరువేలు అని చెప్పి రెండువేల రూపాయలు మ్రింగేశారు. ఆ బర్రెను పోషించటంలోనే మల్లయ్య తన ఆస్తినంతాపోగొట్టుకొన్నాడు. చివరికి బర్రె చనిపోయింది. గ్రామంలో తమ బ్రతుకుమారదని తలంచిన మల్లయ్య పట్నంచేరి చౌరాస్తా వద్ద చెప్పులు కుట్టడం మొదలు పెట్టాడు. నిత్యం పనిచేస్తేగాని పూటగడవదు. అప్పుడప్పుడు పట్నంలో జరుగుతున్న సమ్మెలు అతని కుటుంబాన్ని ఆకలితో చంపేవి. ఇలా ఆలోచిస్తూండగానే ఒక కోతి మల్లయ్య వద్దకు వచ్చి సలాంచేసి డబ్బు అడిగింది. మల్లయ్య సంతోషంతో ఒక పావలా ఇచ్చాడు.

సవర్ణ దలారీ నేతృత్వంలో దళితులు తమకు రావాల్సిన రాయితీలను పోగొట్టుకొంటూ ఆ ప్రయత్నంలో అరకొరగావున్న తమ ఆస్తులు కూడా పోగొట్టుకొని బికారులవుతున్నారనడానికి నిదర్శనం ఈ కథ. ఈ వ్యవస్థ దలారీల చేతుల్లో కీలుబొమ్మఅని, ప్రభుత్వం ప్రకటించే రిజర్వేషన్లూ రాయితీలు కంటితుడుపే నంటుంది ఈ కథ. అలాగే సంఘంలో పొడుచుక వచ్చే స్పర్ధలను కూడా విశ్లేషించిన కథ. అసమసమాజ వ్యవస్థలో మనిషి మనిషికీ మధ్య ఒక గూడే శత్రుత్వం వ్యవస్థను ఎంతవరకు తీసుకెళ్ళుతుందో అది సామాన్యునికి ఎలాంటి విపత్తును కలిగిస్తుందో ననే రచయిత భయం ఈ కథ.

**3.1.1.13. ఎర్నీళ్ళు** :- హరిజన బాలులని ఆకలిస్థితిని అభివర్ణించిన కథ . రచయిత కొలకలూరి ఇనాక్. చింతడికి నాలుగేళ్ళు . దిగంబరంగా ఉంటాడు. వాని తల్లి నిత్యం కూలీకి వెళ్ళితేగాని అన్నంరాదు. తల్లి ఉదయాన్నే కూలికెళ్ళింది. చింతడు ఉదయాన్నే లేచి ఇంట్లో తినడానికి అన్నంలేక మంచినీళ్ళు త్రాగి అమ్మ కూలీకి వెళ్ళినవైపుగా వెళ్ళి వంకలో నాలుగు దారులు కలిసేచోటు ఎర్రటిఎండలో అమ్మకోసం కూర్చున్నాడు. వాడికి ఆకలి తప్ప ఎండ కనిపించలేదు. అక్కడే దిష్టి తీసి ఉంచిన వస్తువులను చూశాడు. అక్కడ ఉప్పు, మిరపకాయలు, నిమ్మకాయలు కనిపించాయి. వాటిని భయంలేకుండా ఇంటికి తీసుకొని వచ్చి నిమ్మరసం చేసుకొని కొంత తాగి, కొంత అమ్మకు పెట్టి నిద్రపోయాడు.

కలరా, ధూమంలాంటి భయంకర రోగాలతో బాధపడేవారికి దిష్టితీస్తారు. అలా చేసి దారిలో పెడితే దానిని ఎవరైనా దాటితే అతనికి ఆ వ్యాధులు సంభవిస్తాయని సమాజ అభిప్రాయం. అలాంటి చోటికి పెద్దలు తమ పిల్లలను పోనివ్వరు. అలాంటిది చింతడు ఆ వస్తువుల చేతనే తన ఆకలి తీర్చుకోవటం కథలో విశేషం. హరిజనులు కర్మ సిద్ధాంతం మీద అంధవిశ్వాసాలమీద తిరుగుబాటు ఈ కథ.

**3.1.2 పాకీ జీవితం** :- హరిజనుల పాకీ జీవితాన్ని చిత్రిస్తూ వచ్చిన కథానికను పరిశీలిద్దాం.

**3.1.2.1 పశ్చాద్భూమి** :- పాకీ జీవితాన్ని చిత్రించిన కథ. రచయిత కొలకలూరి ఇనాక్. రాంకోటి కుటుంబం పాకీపని చేస్తుంది. అతనికి ముగ్గురు కొడుకులు. ఇద్దరు విద్యావంతులై పట్నంలో ఉద్యోగం చేస్తున్నారు. చిన్నవాడు మాత్రం తండ్రి వృత్తిని వంశపారంపర్యంగా నిర్వర్తిస్తున్నాడు. గ్రామంలోని పాకీగొడ్లల్లోని పల్లికను తీసుకొని గ్రామం వెలుపల దానిని దిబ్బలుగా కట్టి ఎరువు కాగా అమ్ముతారు. పెద్దకొడుకు రంగన్న పట్నంలో చాలీ చాలని జీవితంతో తమ కులాన్ని చెప్పుకోలేక సంసారాన్ని సాగిస్తున్నాడు. రెండవవాడు చింతడు కలెక్టర్ ఆఫీసులో యు.డి.సి. అతనిలో ఎవరినీ ఖాతరు చేయని గుణం ఉంది. కులంపేరు ధైర్యంగా చెప్పుకోగలడు. సవర్ణులు తమ పంటలకు రాంకోటి ఎరువుగా తీసుకెళ్ళుకారు కాని, అతనిని అంటుకోరు. ఒకసారి రాంకోటి పట్టణంలో వున్న తన కొడుకులను చూడటానికి వెళ్ళి రైళ్ళో తిరిగి వస్తున్న సమయంలో అతని వాంతులు భేదులు అయితే తోడి ప్రయాణికులు సహించలేక అతనిని దారిమధ్య స్టేషన్‌లోనే దింపేశారు. అందరి మురికిని శుభ్రం చేసే రాంకోటి అనారోగ్యంగా ఉన్నపుడు అతని మురికిని శుభ్రం చేయకపోతే సరవాలేదు. భరించలేక పోవటం ఘోరం ఎరువును దొంగలిస్తున్న వాళ్ళను ఆపడానికి ప్రయత్నించి పెంటగుంతలో పడి చావు బ్రతుకులమధ్య కొట్టుమిట్టాడుతుంటే అక్కడున్న సవర్ణులెవరూ రక్షించలేదు. వీళ్ళకు రాంకోటి శ్రమకావాలి కానీ రాంకోటి వ్యక్తి అక్కరలేదు. చివరకు రాంకోటి చిన్న కొడుకు అతనిని చావునుండి రక్షించాడు.

పాకీస్థలం అంటేనే పవిత్రమైన చోటు. ఈ విశ్వంలో అపవిత్రమైన స్థలాన్ని అంతా పవిత్రం చేసేవాడు పాకీవాడు. రాంకోటి అలాంటి పాకీ పని చేస్తున్నా సమాజం అతని కుటుంబాన్ని దూరంగా ఉంచింది. అతను అనారోగ్యంతో బాధపడినా తీవ్ర ఇబ్బందులకు గురైనా చావుబ్రతుకుల్లో ఉన్నా సమాజం అతనిని అస్పృశ్యునిగా చూసి దూరంగా ఉంటుంది.

సమాజంలో కంపునంతా తీసే రాంకోటి ఒకసారి ఆ కంపుకు గురైతే ప్రయాణికులు సహించలేకపోవటంకంటే కంపు లేదు. వీరందరి కడుపులు కంపునిక్షేపాలని గుర్తుకురాదు. ఇది అతను సమాజానికి చేస్తున్న సేవకు కానుక. రచయిత ఈ కథ ద్వారా సమాజం అంతా కల్మషమైందని, అది పవిత్రమైన నవసమాజం కావాలని అభిప్రాయపడాడు. అలాగే హరిజనులు తమ భయాలు విడిచిపెట్టి తమ ఆస్తిని రక్షించుకోవాలని తమకు తామే కాపాడుకోవాలని సవర్ణులు ఎవరూ కాపాడరని సవర్ణులు మోసంచేస్తారని వారిమోసానికి గురికావద్దని తమ వృత్తిని దైవంగా భావించుకోవాలని స్వశక్తితో బ్రతకమని అలా బ్రతుకుతున్న వాళ్ళల్లో కులంపేరు చెప్పుకోలేక సతమతయ్యే వాళ్ళకంటే నిర్భయంగా తమ కులంపేరు చెప్పుకోగల సామర్థ్యం కలిగి జీవించమని ప్రబోధించాడు. అట్టడుగు జీవితాలను అతిరమ్యంగా సహజంగా నిర్భయంగా చిత్రించగలిగే సాహసం గొప్ప వ్యక్తిత్వాన్ని తెలుపుతుంది . ఈ కథానిక తెలుగు సాహిత్యంలో మునుపెన్నడూ ఏ రచయితా పరికించని చోటును భద్రంగా పవిత్రంగా అక్షరసత్యంగా వాస్తవికతా దర్శనంగా అందించిన ఆణిముత్యం.

**3.1.3 మతాంతర జీవితం** :- ప్రాచీనకాలం నుండి భారతదేశం హిందుదేశంగా ఖ్యాతి పొందింది. కాలానుగుణంగా హిందూమతం ఆదికాలపు పవిత్రతను కోల్పోయి గుడ్డి సంప్రదాయాలు ఆచారాలూ

పెల్లుబుకి కలగాపులగంగా కలిసిపోయింది. నిర్హేతుక కార్యకలాపాలకు, మూఢాచారాలకూ నిలయంగా క్రూరమైన సాంప్రదాయాలతో సాలెగూడుగా మారిపోయింది. హిందూసమాజం అనేక వర్గాలుగా విడిపోయి ఒక వర్గాన్ని అస్పృశ్యులుగా చిత్రించి వారిని సమాజంనుండి వెలివేసింది. ఈ దశలో భారతదేశానికి వచ్చిన ఆంగ్లేయులు హిందూమతంలోని వర్గాల అనైక్యతను అవకాశంగా తీసుకొని తమ స్థానాన్ని బలపరచుకోవడం కోసం మతాంతరీకరణకు పూనుకొన్నారు. అంతవరకూ దాస్యత్వాన్ని పొందిన హరిజనులు తమ బ్రతుకు మార్చుకోవడంకోసం క్రైస్తవమతాన్ని పుచ్చుకొన్నారు. దీనివల్ల హరిజనులకు కొన్ని సౌకర్యాలు ఒన గూడినా అక్కడకూడా క్రైస్తవ హరిజనులుగానే చూడబడ్డారు. మిషనరీలు ప్రారంభించిన మతాంతరీకరణ హిందూమతాన్ని ఉత్తేజితుల్ని చేసింది. పలు క్రైస్తవ హరిజనులు జీవితాలను గురించి మతాంతర కథలు వచ్చాయి. వాటిని పరిశీలిద్దాం.

**3.1.3.1 ఇదేంన్యాయం** :- సంప్రదాయాలతో కాలంగడిపే భిన్నమతాల యువతీ యువకుల వివాహాన్ని చిత్రించిన కథ. రచయిత కొలకలూరి ఇనాక్. రామశాస్త్రి ప్రధానోపాధ్యాయుడు. అతనిభార్య లక్ష్మి. కొడుకుప్రభాకర శాస్త్రి. తండ్రి ఎంత నాగరికంగా ఉంటాడో కొడుకు అంత అనారగరికంగా ఉంటాడు. వీరి కుటుంబానికీ , సబ్ఇన్స్పెక్టర్ డేనియల్ కుటుంబానికీ సన్నిహిత సంబంధం ఉంది. డేనియల్ కూతురు లత ఆమెకు తన మతం పట్ల అభిమానం ఎక్కువ. ప్రభాకరశాస్త్రి లత ఇద్దరూ ఒక కళాశాలలో విద్యార్థులు ఇద్దరూ రెండు ధృవాలు పరిస్థితులు మారి ఇద్దరూ ప్రేమించుకొన్నారు. వివాహం చేసుకొన్నారు. తమ పద్ధతులను మార్చుకొన్నారు. ఇరువురి తల్లిదండ్రులు ఆనందించారు.

ఆర్థిక సమానతలు సాధించగలిగితే కులనిర్మూలన కొంతవరకూ జరుగుతుందనే దృక్పథం ఈ కథ. కథలో ప్రభాకరశాస్త్రి, లతల కుటుంబాలు రెండూ ఆర్థికంగా సమానమే ఆర్థికంగా ఒకరి అవసరం మరొకరికి ఉండదు. కథలో అన్నింటా సమానంగా వున్న ప్రభాకరశాస్త్రి లతలు ప్రేమించుకోగలిగారు, పెళ్ళి చేసుకొన్నారు. కథలో సనాతన ఆచారాలకు స్వస్తిచెప్పి మారుతున్న సమాజానికి అనుగుణంగా మారవలసి ఉంటుందని ఆర్థికంగా సంపన్నమైన కుటుంబాలు సంబంధం కావాలనుకొన్నవాళ్ళు కులం పరిధిని మట్టిపాలు చేయవచ్చుననే సూత్రం కన్పిస్తుంది.

**3.1.3.2విష్ యు హేపీ క్రిస్మస్** :- క్రైస్తవుల శాంతిస్వభావాన్ని చిత్రించిన కథ. రచయిత కొలకలూరి ఇనాక్. ఆ రోజు క్రిస్మస్ పర్వదినం. చర్చిలో క్రిస్మస్ వేడుకలు జరుగుతున్నాయి. అక్కడికి జీవరత్నం శిఖామణి వచ్చారు. వారు ఆగర్భ శత్రువులు . ఇద్దరూ కళాశాల ప్రిన్సిపాల్స్గా పని చేస్తున్నారు. చాలా కాలం నుండి చర్చి ఆస్తికోసం వారిమధ్య తగాదా బయలుదేరింది. వారి వర్గాలు కోర్టుచుట్టూ తిరగటం మొదలుపెట్టారు. మణిరత్నాల తల్లిదండ్రులు హరిజనులుగా కటిక దారిద్ర్యాన్ని అనుభవించి క్రైస్తవాన్ని పుచ్చుకొన్నారు. మణిరత్నాలు క్రైస్తవంలోనే ఉంటూ విద్యనార్జించి ఉద్యోగం సంపాదించారు. చర్చి ఆస్తికోసం ప్రస్తుతం ఘర్షణ పడుతున్నారు. అలాంటి మణి రత్నాలు చర్చికి వచ్చారు. చర్చిప్రాంగణంలో ఏమి జరుగుతుందోనని ప్రజలు ఆందోళన చెందుతున్నారు. మణిరత్నాలు తమపూర్వపు కలతలు మరచిపోయి విష్ యు హేపీ క్రిస్మస్ చెప్పుకొన్నారు.

హరిజనులు క్రైస్తవులుగా మారితే సమాజంలో వారు పోరాట గుణంను కలిగి వుంటారని ఆర్థిక సుస్థిరత్వం కోసం ఎంత ఘర్షణ పడినా కొంత మానవతాదృష్టి కొంత ప్రేమస్వభావం, క్రైస్తవులయిన హరిజనుల్లో ఉంటుందని తెలిపే కథ ఇది. కథలో బద్ధశత్రువులైన మణిరత్నాలు చర్చిలో ఏకం కావటం క్రైస్తవ శాంతియుత మనస్తత్వానికి ప్రతీక అని ఈ కథ తెలుపుతుంది.

**3.1.3.3 క్రిస్మస్ శుభాకాంక్షలు:** - క్రైస్తవుల శాంతియుత జీవనాన్ని ప్రబోధించిన కథ. రచయిత కొలకలూరి ఇనాక్. ఏసురాం హిందూ క్రైస్తవుడు రాజకీయాల్లో ఆరితేరినవాడు. ప్రస్తుతం మిషన్ కార్యదర్శి. ఇంతవరకూ ఆ పదవికి ఏకగ్రీవకంగానే ఎన్నికవుతూవస్తున్నాడు. క్రిస్మస్ రోజున చర్చికి వచ్చాడు. ఫాదర్ ప్రసంగం మొదలైంది. ఏసురాం దగ్గరనే ఆనందం కూర్చున్నాడు. ఏసురాంను కుశలప్రశ్నలు వేస్తున్నాడు. రాజకీయం గురించి మాట్లాడుతున్నాడు. ఏసురాం ఆనందం తనపదవికి అడ్డువస్తాడనుకొన్నాడు. చందా ఆనందం చేతిలోని చందా సంచి తీసుకొని, అతనిని గాయపరిచాడు. ఆగాయంతోనే చందా వసూలు ప్రారంభమైంది. ఆనందం చందాసంచిపట్టాడు. ఏసురాం కోపంచెంది ఆనందం చేతిలోని చంద సంచి తీసుకొని అతనిని గాయపరిచాడు ఆ గాయంతోనే ఆనందం బయటకువచ్చి అందరికీ క్రిస్మస్ శుభాకాంక్షలు తెలుపుతున్నాడు. ఫాదర్ ప్రసంగం ముగించుకొని ఏసురాం బయటకు రాగానే ఆనందం అతనికి క్రిస్మస్ శుభాకాంక్షలు తెలిపాడు.

ఈ కథలో క్రైస్తవులకు శాంతితోపాటు ఇతరులను ప్రేమించేగుణం ఉంటుందని తెలుపుతుంది. అందరూ దేవునిబిడ్డలుగానే మెలిగి, దేవుని సూత్రాలకు నిబద్ధులై వుండాలనడానికి ఈ కథ తార్కాణం.

## 3.2 హరిజనేతర రచయితల కథానికలు.

హరిజన జీవితాన్ని ప్రతిబింబిస్తూ అనేకమంది హరిజనేతర రచయితలు కథానికలను రచించారు. వీరి కథలు సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా, స్త్రీపరంగా వున్నాయి. హరిజనులు తమ సమస్యను చిత్రించే తీరుకూ హరిజనేతరులు హరిజనసమస్యను చిత్రించేతీరుకూ కొంత భేదం ఉంటుంది. హరిజనరచయితల కథానికల్లో వాస్తవికత ఉంటుంది. హరిజనేతర రచయితల కథల్లో సంస్కరణ దృష్టితో పాటు జాలి, దయ పుష్కలంగా కన్పిస్తాయి. హరిజన సమస్యను గురించి హరిజనులకు తెలిసినంతగా హరిజనేతరులకు తెలియకపోవచ్చు. హరిజనేతరుల కథానికల్లో సవర్ణుల దాన ధర్మాలు, దయాగుణం మెండుగా వుంటాయి. వీరి కథానికా సాహిత్యాన్ని పరిశీలిద్దాం.

### 3.2.1 మానవతా దృష్టి

**3.2.1. పుల్లంరాజు₂** :- కథానికలలో మొట్టమొదట హరిజన జీవితాన్ని చిత్రించిన కథ. సమాజంలో వాస్తవ పరిస్థితులు తెలుసుకోకుండా అస్పృశ్యతను రూపుమాపడానికి చేసే శాసనాలు నిష్ప్రయోజనమని, ప్రజలలో మానసిక పరివర్తన అవసరమని, అపుడే ఈ శాసనాలు ఉపయోగపడుతాయని నిరూపించిన కథ. రచయిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి. ఇందులో హరిజన పాత్రలు స్పష్టంగా కన్పించవు.

బొంబాయిలో జరిగిన అస్పృశ్యతా నివారణ సభలు చూసి వచ్చిన పుల్లంరాజు తన రాజ్యంలో అస్పృశ్యతను రూపుమాపదలచి తనమంత్రి సహాయంతో మారువేషంలో ప్రజల్లోకి వెళ్ళుతాడు. చక్రవర్తి ఆశయాన్ని వివరిస్తూ అంటరానితనం ప్రజల్లో వుండకూడదని, బహిరంగంగా వున్న నూతులూ, చెరువులూ, అందరూ స్వేచ్ఛగా వాడుకోవచ్చునన్నాడు. ''మొదట మాలలు మాదిగలూ మాకందరికీ సమానంగా అస్పృశ్యలై వున్నారు''7 అయినా మీలో మీకు భేదాలున్నాయి. ముందు మాదిగలు మాలల నూతులూ వగైరాలూ వుపయోగించుకోవాలి. వారం రోజుల తర్వాత మీరందరూ సవర్ణుల బావిలో నీళ్ళు తీసుకోమన్నాడు రాజు. అందుకు మాలలు ''మా నూతుల్లో నీళ్ళు మాదిగల్ని తోడనివ్వం''8 అనేక విధాల మా కులం వారి కులం కన్నా గొప్పది. అలా కాదంటే రాజ్యంలో నుంచి లేచైనా పోతాం అంటారు. మాలలూ, మాదిగలూ యుద్ధానికి సిద్ధపడుతున్న సమయంలో రాజుమారువేషం వదిలి వారి ముందుకు వస్తాడు. ''మహా ప్రభో! మాకులం చెరపకండి. మా పరువు తీసెయ్యకండి. మాలలూ,

మాదిగలూ ఒక నూతి నీళ్ళుతాగడం ఎప్పుడైనా వుందా దొరా ? కలపడానికి అవసరం రానివ్వకండి''[9] అంటూ మాలలు చక్రవర్తిని ప్రార్థిస్తారు. ఈ సమస్యను తెలుసుకొన్న రాజు అస్పృశ్యతా నివారణ ప్రయత్నం అంతటితో కట్టిపెట్టాడు.

అస్పృశ్యతను రూపుమాపడానికి రాజు సంస్కరణ ప్రవేశపెట్టితే అది ఆదిలోనే విఫలమయ్యింది. రచయిత ఈ కథ ద్వారా ముందు హరిజనులలోనే సమానత్వం రావాలంటాడు. అస్పృశ్యతలో కూడా అస్పృశ్యత వుంది. దానిని సమాజం నుండి వేరు చేయాలంటాడు. సమాజ స్థితి గదులు తెలుసుకొని చైతన్యం కోసం ఉద్యమించాలంటాడు. హరిజనులలో అందరూ సమానులే అనే ఆలోచన రానంతవరకూ ఈ పని సాధ్యపడదని ఈ కథ ఉద్బోధిస్తుంది.

ఈ కథలో రచయిత స్పష్టంగా అవగాహన లోనికి రాకపోవటం గమనార్హం. కేవలం హరిజనులపై ఏహ్యాభావంతోనే ఈ కథను రాశాడు. సమాజంలో ఏ మతంలో కొట్లాటలు లేవు ఏ కులంలో ఘర్షణ లేదు ప్రతికులంలోనూ హెచ్చు తగ్గుల విషయంలో అభిప్రాయ భేదాలున్నాయి. ప్రత్యేకంగా హరిజనుల్లోనే అంతర్గత కలహాలున్నాయనడం రచయిత అవగాహన లోపంగా కనిపిస్తుంది. ప్రతికులంలోనూ ఉపకులాలు ఉండటం, ఉపశాఖలు ఉండటం, వాటిలో అంతర్గత అసమానతలుండటం సామాన్య విషయమే. ప్రతికులంలోనూ అంతర్గత అసమానతా వైరుధ్యాలు హరిజనుల ఉపకులాలలోనూ ఉన్నాయి. హరిజనుల లోనూ, అసమానతల వైరుధ్యాలు గోచరమవుతాయి. ఈ విభేదం హరిజనులకే ప్రత్యేకం కాదు. సమాజం మొత్తంలో సమసిపోవలసిన కులాంతర్గత విభేదాలు హరిజనులలో మాత్రమే పోవాలనుకోవటం హాస్యాస్పదం.

**3.2.1.2. నిరంజనశాస్త్రి** :- హరిజనులంటే దూరంగా వుంచడానికి ప్రయత్నించే బ్రాహ్మణులలో కూడా హరిజనోద్ధరణ కు పాటుపడటానికి ప్రయత్నించే బ్రాహ్మణ యువకుని కథ. రచయిత రాయసం వేంకట శివుడు. నిరంజన శాస్త్రి గోవిందుడు విద్యార్థి దశ నుండి స్నేహితులు. పాఠశాలకు సంబంధించిన అన్ని విషయాలలోనూ నిరంజన శాస్త్రి ప్రథమ శ్రేణిలో వుంటాడు. ఈ విషయమే నిరంజన శాస్త్రి పై గోవిందునికి అసూయను పెంచింది. నిరంజన శాస్త్రి తన విద్యను ముగించి తండ్రి ప్రోద్బలంతో దొరవారి కొలువులో ఉద్యోగం కోసం ప్రయత్నించి. సంపాదిస్తాడు. కాని ఉద్యోగంలో చేరడానికి ఇష్టంలేక చేరిన రోజే ఉద్యోగానికి రాజీనామా చేసి సహాయనిరాకరణోద్యమంలో చేరాడు. తన కొడుకు చేసిన నిర్వాకానికి తండ్రి పరంధామ శాస్త్రి బాధపడ్డాడు. నిరంజన శాస్త్రి ''దేశకాలవైపరీత్యములను బట్టి తల్లిదండ్రుల మాట వినుటయే గాక దేశమాత ఋణము తీర్చుటయు పుత్రుని కర్తవ్యమని ''[10] అభిప్రాయ పడ్డాడు. నిరంజన శాస్త్రి పై అసూయను పెంచుకొంటున్న గోవిందుడు ప్రజల చేత జేజేలు కొట్టించుకోవడానికి ఉద్యమంలో పాల్గొని జైలు పాలయ్యాడు. ఉద్యమం మధ్యలోనే ఆగిపోవడంతో నిరంజన శాస్త్రి సాగిలేటి ఒడ్డున పంచమాశ్రమాన్ని నిర్మించి హరిజనులకు విద్యాబోధన చేయడం మొదలుపెట్టాడు. ఉన్నత కులంలో పుట్టిన శాస్త్రి తమ కోసం జీవితం త్యాగం చేస్తున్నాడని తెలిసి హరిజనులు అతనిని తండ్రితో సమానంగా గౌరవించారు. నిరంజన శాస్త్రి పొందుతున్న ఆదరణను చూసిన గోవిందుడు అతని మిత్రుడు గోపాల్‌సింగ్ అసూయతో భూస్వాముల మీద తిరగబడమని హరిజనులకు చెబుతూ, గ్రామంలో భూస్వాముల వద్దకు వెళ్ళి నిరంజనుడు మీమీదకు హరిజనులను ఉసిగొల్పుతున్నాడని చెప్పారు. దీనితో గ్రామస్థులు హరిజనులపై యుద్ధానికి సన్నద్ధులైనారు. ఈ లోగా నిరంజనుడు వారివద్దకు వచ్చి హిందూమత సమ్మేళనం, నిమ్న జాత్యుద్ధరణ గురించి వివరించి యుద్ధాన్ని వారించాడు. చివరకు తన పాచిక పారలేదని తెలిసిన గోవిందుడు తన మిత్రుడు గోపాల్ సింగ్‌తో కలిసి శాస్త్రిని హత్య చేశాడు.

నిరంజన శాస్త్రిపై గోవిందుని అసూయ చివరకు చేదు అనుభవాలను మిగిల్చింది. గోవిందుడు శాస్త్రిని అధిగమించాలని ప్రయత్నించాడు. కాని ఫలితం లేకపోయింది. ఈ కథానికలో నిరంజన శాస్త్రి అగ్రవర్ణాలకు హరిజనులకు సమానత్వాన్ని సాధించడానికి ప్రయత్నించాడు. తరతరాల అంతరాల్ని నిర్మూలించడానికి సవర్ణుల సహకారాన్ని అర్థించాడు. తన కొడుకు ప్రయోజకుడై ధనాన్ని హోదాను సాధించలేక పోయాడని తపన పడ్డ పరంథామ శాస్త్రికి తన కొడుకు కు జాతి ఇచ్చిన గౌరవాన్ని గుర్తించలేకపోయాడు. మంచి మనస్సుతో చేసిన ఒక కార్యం సాధ్యమైంది. చెడ్డ మనస్సుతో తలపెట్టిన కార్యాలు సఫలంకాలేదు సరికదా , అవమానపాలు కావడం కన్పిస్తుంది.

**3.2.1.3. యారమ్మ** :- అస్పృశ్యత కారణంగా వైద్యానికి కూడా నోచుకోని హరిజన యువతి కథ. రచయిత అరవ వేంకటస్వామి. వెంకడు మాలకులస్థుడు. అతని కూతురు యారమ్మ. ఆమె వారంరోజుల నుండి మంచం పట్టింది. ఆ ఊరికి నాటువైద్యుడు పూజారి గవురయ్యే శరణ్యం. కూతురుకు మందుకోసం వెంకడు గవురయ్య ఇంటికెళ్ళగా అతని భార్య ''ముందు నాకు కనపడి నా మడి తగుల బెట్టావు నీ మొహం మండా! మాల పీనుగవు''11 అని అంటుంది. వెంకడు గవురయ్య గుడివద్ద వున్నాడని తెలిసి అక్కడికి వెళ్ళుతుండగా దారిలోనే గవురయ్య ఎదురుపడి ''ఓరి నీదుంపతెగా ! నీ ఇల్లువల్లకాడు కాను, దిక్కుమాలిన పీనుగ ఇలా బ్రాహ్మణ వీధికి తగుల బడినావేమిరా ! స్వామికి అమంగళం అయిపోయింది''12 అన్నాడు. మందుకోసం రాత్రికి రమ్మన్నాడు. రాత్రి మందు కోసం వెళ్ళిన వెంకడితో మిమ్మల్ని చంపినా పాపంలేదు. గాంధీ మహాత్ముడు. ఏదో చెప్పాడని తెగనీల్గుతున్నారు అన్నాడు. ఆ మాటలు వింటున్న ఎదురింటి కాలేజి విద్యార్థి రామారావు మాటలకు అడ్డు తగిలి గాంధీ గారిని గురించి దురభిప్రాయ పడుతున్నారనీ హరిజనులను నీచంగా చూడవద్దని అన్నాడు. చేసేది లేక గవురయ్య మందు వూరికే ఇవ్వటం కుదరదన్నాడు. రామారావు పట్నం డాక్టర్ కోసం ప్రయత్నించి విఫలమై గవురయ్యకి కొంత డబ్బు ఇచ్చి వెంకడికి మందు ఇప్పించాడు.

కులానికి రోగానికి ముడిపెట్టి అనారోగ్య స్థితిలో వున్న యారమ్మకు పూజారి గవురయ్య మందివ్వడానికి నిరాకరించాడు. మతాలు కేవలం మానవ కల్పితాలే అన్నది గవురయ్య తెలుసుకో లేకపోయాడు. గాంధీజీ అస్పృశ్యతా నివారణకు చేసిన కృషి గవురయ్య లాంటి సనాతనులను సంస్కరించలేకపోయినా రామారావు లాంటి యువతీ యువకులను ప్రభావితం చేసి అస్పృశ్యతను నివారించడానికి ప్రయత్నించింది. గవురయ్య లాంటి సనాతనవాదులను ఆ దేవుడే రక్షించలేడు. వారి శరీరమంతా సనాతనాచారాలతో మొద్దుబారిపోయిందని చెప్పడానికి రచయిత ఈ కథ ద్వారా తపన పడ్డాడు.

**3.2.1.4. గ్రుక్కెడు నీళ్ళు** :- అంటరానివాడని తలచి బ్రాహ్మణ కుటుంబంచే అవమానింపబడిన వెంకడు ఆపద సమయాల్లో వారిని ఆదుకొని కన్న కొడుకుగా ఆదరణ పొందిన హరిజనుని కథ. రచయిత బందా కనకలింగేశ్వర రావు. మహాలక్ష్మమ్మ మడినీళ్ళు తెస్తున్న సమయంలో వెట్టి వెంకటప్ప ఎదురయ్యాడు. అందుకు మహాలక్ష్మమ్మ ''దూరంగా వుండరా కళ్ళు కనపడ లేదా ! మా యీ స్వరాజ్యం వచ్చిందని మండిపోతున్నావేం ''13 అని అంటుంది. ఇంటి కెళ్ళి ఈ విషయం భర్త బ్రహ్మయ్యతో చెప్పి వెంకటప్పను పిలిపించి బండబూతులు తిట్టించి, చెప్పుతో కొట్టించింది. బ్రహ్మయ్యకు కొడుకులు లేరు. కొన్ని రోజుల తర్వాత బ్రహ్మయ్యకు కలరావచ్చి చనిపోగా శవాన్ని దహనం చేయడానికి ఎవరూరాలేదు. బంధువులు కూడా దూరంగా వుండిపోయారు. శవాన్ని తీసుకెళ్ళడానికి మహాలక్ష్మమ్మ వెంకటప్ప సాయాన్ని తీసుకొంది. మరుసటి రోజే వెంకటప్పకు కలరా వస్తే మహాలక్ష్మమ్మ తన ఇంటికి తీసుకెళ్ళి సేవలు చేసి బ్రతికిస్తుంది. చివరకు మహాలక్ష్మమ్మ చనిపోతూ తన ఆస్తినంతా అస్పృశ్యతా నివారణకు ఖర్చుపెట్టమన్నది. వెంకటప్పతోనే గ్రుక్కెడు నీళ్ళు పోయించుకొని ప్రాణం విడుస్తుంది.

గాంధీజీ స్వరాజ్యంలో భాగంగా కులమతాలను రూపుమాపి వారిని సంఘటిత పరచి ఆంగ్లేయులను పారద్రోలడానికి తపనపడ్డాడు. కథలో మహాలక్ష్మమ్మ బ్రాహ్మణులు హరిజనులంటే దూరంగా వుంచే ఆ కాలంలోనే అవసర నిమిత్తం మహాలక్ష్మమ్మ వెంకటప్ప సహాయం కోరింది. కష్టాల్లో బంధువులు సహాయపడర ని తెలుసుకుంది. తనకు అపకారం తలపెట్టినా ఆమెకు ఉపకారం చేశాడను కొన్న వెంకటప్పను కన్న కొడుకుగా స్వీకరించి చివరికి అతని చేతుల్లోనే ప్రాణం విడిచింది. ఈ కథ ద్వారా రచయిత హరిజనులను హింసించే బ్రాహ్మణులు గాక, తోడి మానవునిగా గుర్తించే కరుణామూర్తులు వారిలో కూడా వుంటారని తెలియజేశాడు.

**3.2.1.5. సంసార సాగరం**:- అస్పృశ్యత కారణంగా సంసార జీవితంలో సుఖశాంతులను పోగొట్టుకున్న యువకుని కథ. రచయిత కాళహారు వేంకటేశ్వర రావు. విశ్వనాథం బ్రాహ్మణుడు, ఉద్యోగి. సమాజంలో వచ్చే మార్పుల కనుగుణంగా ప్రవర్తించేవాడు. అతని భార్య సుందరమ్మ ఛాందసురాలు, సనాతనాచారాలను పాటించడంలో మేటి. ఒకనాడు విశ్వనాథం ఆపీసు నుండి రాత్రి చలి, వర్షంలో తడుస్తూ ఇంటికి వస్తాడు. తలుపుతీయమని తొందర చేస్తాడు. సుందరమ్మ వాకిలిని చాకలివాడు తాకాడని నిద్రపోతున్న తన కొడుకును పదిసార్లు తట్టిలేపి వాడిచేత తలుపు తీయిస్తుంది. తలుపు తీసిన పిల్లవాడిని ఆ చలిలోనే చన్నీటి స్నానం చేయిస్తుంది. ఒక రోజు విశ్వనాథం ఆఫీసుకు పోయే తొందరలో సుందరమ్మను పెట్టెలోని కోటు తీయమంటాడు. కాని ఆమె తీయదు. కారణం ఆ కోటుపై విశ్వనాథం తెచ్చిన పుస్తకం వుంటుంది. దానిని దృష్టిలో పెట్టుకొని ''ఇందా కా మాలాడు తెచ్చిన పుస్తకం కదూ, అదీ. మాల ముండా కొడుకులు తెచ్చిన పుస్తకం ఇంట్లో పెట్టుకుంటూారటండి''14 అంటుంది. విశ్వనాథం సాయంత్రం ఇంటికి వస్తే అంటరానివాడిగానే చూసేది'' అడ్డమైన మాలాళ్ల దగ్గర నుంచి వెళుతారుబాబు ! మీ బట్టలు ముట్టుకుంటే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి కూడాను''15 అని అంటుంది. భార్య చూపే నిరాదరణ వల్ల విశ్వనాథానికి ఇంటికి రావడం ఇష్టముండడు. దురలవాట్లకు లోనవుతాడు. ఒకసారి పేకాటలో ఘర్షణపడి ప్రాణం మీదికి తెచ్చు కుంటాడు.

నాడు బ్రాహ్మణులు సనాతన ఆచారాల పేరుతో హరిజనులను దూరంగా వుంచారు. సంసార జీవితంలో భార్యాభర్తల మధ్య పరస్పర స్నేహ సహకారాలు అవసరం. అవి వున్నప్పుడే సంసార నౌక సుఖంగా సాగిపోకలదు. అయితే కథ ఇందుకు భిన్నమైనది. అస్పృశ్యులని, వారిని తాకరాదని, తాకిన వారు కూడా అంటరాని వారని, అర్థ పర్థంలేని మాటలు సుందరమ్మ మాట్లాడి తన భర్త అనే ఆలోచన కూడా లేకుండా అతడు హరిజనులను తాకుతాడని తలచి దూరంగా వుంచడానికి ప్రయత్నించింది. భర్తపట్ల మూర్ఖంగా ప్రవర్తించింది. అతనిని చెడు అలవాట్లుకు బానిసగా చేసింది. దీనికి కారణం సుందరమ్మకు శాస్త్రీయమైన దృష్టిలోపించి అజ్ఞానంతో ప్రతిదానికి అస్పృశ్యతను పాటించడం.

**3.2.1.6. అంటరాని బాలిక** :- రూప హరిజన యువతి. ఆమె తండ్రి హింగూ, రూప జ్ఞాను ఇంట్లో పనిమనిషి. జ్ఞానుకు రూప అంటే ఇష్టం. ఒక రోజు రూప జ్ఞాను ఇంట్లోపని చేస్తుండగా తన లంగా నీటి బిందెలను తగిలింది. అందుకు జ్ఞాను తల్లి రూపను దూషించి కొట్టింది. రూప ఏడుస్తూ ఇంటికి వెళ్ళిపోయింది. జ్ఞాను రూపను తన తల్లి కొట్టినందుకు అమెను నిందించాడు. ఒకసారి హింగూకు జబ్బు చేసింది. జ్ఞాను హింగూ ఇంటి కెళ్ళి తాను చేయగలిగిన సహాయం చేశాడు. రూప కుటుంబం కోసం అగ్రవర్ణాల సహాయాన్ని అర్థించాడు. అందుకు వారు ''బాబూ, మనవాళ్ళన్నా అయితే సహాయం చేతుము. ఎవరో అంటరాని వాళ్లకెట్లా సహాయం చేయగలము''16 అన్నారు. అంతేగాక రూప, జ్ఞానూలపై వదంతులను పుట్టించారు. ఒక రోజు రూపను ఒక సవర్ణుడు తన ఇంటికి భోజనానికి పిలిపించి అసభ్యంగా మాట్లాడి ఆశలు చూపాడు. రూప అతనిని ఏమీ అనలేక నిస్సహాయతతో ఏడుస్తూ తన బాధను జ్ఞానువద్ద వెళ్ళబుచ్చింది.

కొన్ని రోజులకు జ్ఞానూ తల్లికి కలరా సోకింది. రూప ఆమె వద్దనే వుండి పరిచర్యలు చేసింది. ఆమె కలరానుండి కోలుకోగానే జ్ఞానూకు సోకింది. రూప మరీదగ్గరుండి జ్ఞానూకు సేవచేసింది. జ్ఞాను అరోగ్యం నుండి కోలుకోగానే రూప ఆ రోగానికే చిక్కుకొని బలి అయ్యింది.

రూప సవర్ణుల చేత అసహ్యాంపబడింది. అంటరానిదిగా దూరంగా వుంచబడింది. ఆపద సమయాల్లో జ్ఞాను కుటుంబాన్ని ఆదుకుంది. తనకు అపకారం తలపెట్టిన వారికి ఉపకారం తలపెట్టింది. ఆ ఉపకారంలోనే ఆమె ప్రాణాలను త్యాగం చేసింది. హరిజనులను సవర్ణులు నీచంగా చూసినప్పటికి వారు సవర్ణులపై జాలి కరుణ కలిగివుంటారని ఈ కథ తెలియజేస్తుంది. రూప కులంతక్కువయినా మంచి గుణం గల వ్యక్తిగా చిత్రించబడింది.

**3.2.1.7. కొత్త చెప్పులు** :- భూస్వాములు హరిజనులపై చేసే దౌర్జన్యాలను చిత్రించే కథ. రచయిత కరుణ కుమార. ఆ ఊరి భూస్వామి చిన్నపరెడ్డి ఆ ఊరిలో అతని మాట వేదవాక్కు. ఆ వూరి మాదిగకులపెద్ద ఆదిగాడు. భార్య నరిసి. ఇద్దరు పిల్లలు. కొన్ని రోజుల క్రితం ఆదిగాడు కలరా తగిలి చనిపోయాడు. నరిసి భర్తపోతూ అతనిచ్చి పోయిన నాలుగు రైతుల ఇళ్ళను ఆశ్రయించుకొని బ్రతుకుతుంది. ఒక రోజు చిన్నపరెడ్డి కోరిక మెరకు చెప్పులు తీసుకరావడంలో ఆలస్యం చేసిన నరిసిని ''నిన్న తీసుకొని వస్తానని చెప్పి ఇంతవరకూ తీసుకరాకుండా ఎందుకు ఆలస్యం చేశావే రండా.. ఊ లంజా! నీకాముదం చిక్కలేదా ? తెస్తానన్న వేళకు లేక ఇంత అలక్ష్యమా? మాదిగలంజ కింత కొవరమా'' అని తిట్టడమే గాక చేతిలో వున్న కర్రతో నరిసిని చంపి వేసి, కడుపు నొప్పికి తాళలేక ఆత్మహత్య చేసుకుందని పోలీసు రిపోర్టు రాయించాడు. నరిసి తెచ్చిన కొత్త చెప్పుల వల్ల చిన్నపరెడ్డి కాలికి పుండు అయి పెద్దది కావడం వల్ల అతను మంచం పట్టాడు. అతని ఎద్దు చచ్చిపోయింది. సమయం కోసం ఎదురు చూస్తున్న మాదిగలు, చచ్చిన ఎద్దును తీసుకపోవడానికి నిరాకరించారు. హరిజనులంతా నరిసి హత్యకు ప్రతీకారం తీర్చుకున్నారు. సవర్ణులే ఎద్దు శవాన్ని పారవేశారు. చిన్నపరెడ్డి కాలికి పుండు పెద్దదై ఆపరేషన్ చేయడం వల్ల చనిపోయాడు. నరిసి చావుకు ఫలితాన్ని అనుభవించాడు.

కాలానుగుణంగా అనుకొన్న కార్యక్రమాలు జరగకపోవచ్చు. నరిసి చెప్పులు కుట్టించుకరావడానికి పరిస్థితులు అనుకూలించలేదు. అంతమాత్రాన ఆమెపై ఆగ్రహించి చంపరాదు. అలా చేయడం భూస్వామి పొగరుతనమే. వృత్తుల పేరుతో వెలివేయడం, వారిని హీనంగా చూడటం సమాజ పతనానికి దారితీస్తుంది అని ఆలోచించలేకపోవటం నరిసి చనిపోయినప్పుడు కూడా ధనం వున్న వాడిదే బలం అన్నట్లు శవపంచాయతీ రెడ్డికి అనుకూలంగా వచ్చింది. ''సమాజంలో ప్రజలందరూ సమాన హోదాతో పరస్పర సహాయ సహకారాలతో ఉన్నప్పుడే సామాజిక జీవనం సాధ్యమవుతుంది.'' ఈ కథానికలో కేవలం అస్పృశ్యులపై ఉన్న నిర్లక్ష్యభావంతో చిన్నపరెడ్డి ప్రవర్తించటం అందుకు మాదిగలు ప్రతికారం తీర్చుకోవడం లాంటి పనులు సామాజిక జీవనానికి భంగం కలిగిస్తాయి. సమాజంలో మనుష్యులందరూ సమానమేనన్న అభిప్రాయం కలిగినప్పుడే సహజీవనం సాధ్యమవుతుంది.18.

**3.2.1.8. కయ్య కాలువ** :- హరిజనుల ఆస్తిని అగ్రవర్ణాల వారు కాజేయడానికి ఎత్తుగడలు వేసిన కథ. రచయిత కరుణకుమార. మహాలక్ష్మమ్మ ఆస్తి పరురాలు. భర్తపోతూ ఆస్తినంత తన పేర రాయించాడు. ఆ ఊరిలో నే తన చెల్లెలు కొడుకు రామిరెడ్డి సహాయంతో పొలాన్ని పైరు ఎక్కించేది. ఆ ఊరిలోనే మాలకొండడు. పూర్వం లక్ష్మమ్మ ఇంట్లోనే పాలేరుగా చేశాడు. ప్రస్తుతం స్వతహాగా కొంత బంజరు భూమి సంపాదించి సాగుచేసి పొలం పెట్టాడు. ఆ భూమి లక్ష్మమ్మ భూమి క్రిందనే వుండటం వల్ల ఆమె ఆ భూమిని కాజేయడానికి ప్రయత్నిస్తోంది. ఒక యేడు కొండడికి పుట్టెడు వరి ధాన్యం అయ్యింది.

మహాలక్ష్మమ్మకు నూరు బస్తాల ధాన్యం అయ్యింది. అయినా ఆశ తీరక కొండడి పొలాన్ని బేరమాడింది. పది రూపాయలకు ఇమ్మంది. అందుకు కొండడు నిరాకరించాడు. మరుసటి యేడు లక్ష్మమ్మ కొండడి పొలానికి నీళ్ళు వదలలేదు. పొలంలోకి పోవడానికి కూడా కొండడికి దారి ఇవ్వలేదు. కొండడు లక్ష్మమ్మను తన పొలంలో కాలువ వదలమని అందుకు కావలసిన డబ్బు ఇస్తానన్నాడు. అందుకు ఆమె నిరాకరించింది. కొండడుతాలూకాఫీసుకు పోయి రెవెన్యూ ఇన్స్పెక్టర్‌తో తనకు కాలువ ఇప్పించమని లంచం క్రింద కొంత డబ్బుముట్టజెప్పినా ఫలితం లేక పోయింది. కలెక్టరు వచ్చి కొండడితో ఆమెనే అడుక్కోమన్నాడు. వరి మళ్ళుకోసి కుప్పలేశారు. మహాలక్ష్మమ్మ తన కుప్పలో మాలకొండడు కొంత వరి కర్రలు దొంగలించాడని దొంగతనం మోపింది. అందుకు ఊరి పెద్దలు తప్పు క్రింద బర్రెను లక్ష్మమ్మకు ఇప్పించారు. ఆ రాత్రే లక్ష్మమ్మ పొలంలో కొండడి వరి కుప్పను తన మనుషులచే అంటించింది. తెల్లవారి కొండడు వరి కుప్ప దగ్గరికి వెళ్ళేలోగా వరి కుప్ప కాలి పోయింది.

అన్ని కులాల మాదిరిగానే హరిజనులలోనూ కులాలు ఉన్నాయి. అంతమాత్రన హరిజనులు నీచులని, తమ చెంతకు చేరరానివారని, వారి ఆస్తి కాజేయడానికి ప్రయత్నించడం సభ్య సమాజానికి తలవంపులు. అన్ని అవయవాలు సక్రమంగా పనిచేసినప్పుడే మానవుని ఆరోగ్యం సంపూర్ణంగా వుంటుంది. అన్ని కులాల వారు సమృద్ధిగా వున్నప్పుడే సంపూర్ణ మానవ జీవన వికాసానికి దోహదం చేకూరుతుంది. అది తెలియని లక్ష్మమ్మలాంటివాళ్ళు తమకు కావలసినన్ని వనరులు ఒకగూడినా కూలీ చేసుకొని తక్కువ ఆస్తితో కాలం గడిపే హరిజనుల ఆస్తి కాజేయడం వారి మూర్ఖతకు అత్యాశకు తార్కాణం. ఒక వ్యక్తికి సాయం చేయకున్నా పరవాలేదు కాని హాని చేయడానికి ప్రయత్నించకూడదు. అది మానవ క్షీణ దశకు తార్కాణం. లక్ష్మమ్మ కొండడికి చేసిన అన్యాయానికి అతడు ప్రతిఘటించలేకపోయాడు. సవర్ణులు చేసే అన్యాయాలను హరిజనులను ఎదిరించమని రచయిత ఈ కథద్వారా తెలియచేశాడు.

**3.2.1.9. పోలయ్య**:- ఒక హరిజనుడిపై అగ్రవర్ణాల వారు దాడి చేయబోతే తాను క్రైస్తవుడినని అబద్ధమాడి ప్రమాదాన్ని తప్పించుకొన్న హరిజనుడి కథ. రచయిత కరుణ కుమార. విఠలాపుర అగ్రహారంలో బ్రాహ్మణ కుటుంబాల కుల పెద్ద వేంకటశాస్త్రి అతను హరిజనులు హిందువులు కాదని సిద్ధాంతాన్ని లేవదీశాడు. దాని కోసం దేశాటనం చేశాడు. తన మనవని బారసాల కోసం గంగాజలంతో పుంజూరు రైల్వేస్టేషన్‌లో దిగాడు. తెల్లవారేలోగా శాస్త్రి ఊరుచేరదలచి అక్కడున్న బండివాడైన పోలయ్యను బలవంతం చేసి బండి కట్టించుకొని ఊరి ముఖం పట్టాడు. దారిలో వస్తూ మాటలు సందర్భంలో పోలయ్య ఆ ఊరి చెంచునాయుడు ఆ దారిలో మోటారు బండ్లు వేసి తనలాంటి బీదవారి కడుపులు కొట్టాడని చెప్పాడు. తాను హరిజనుడన్న విషయాన్ని శాస్త్రికి తెలియజేశాడు. తన మిత్రుడైన చెంచునాయుడును దూషించడం, తాను హరిజనుడు కావడం శాస్త్రికి తీవ్ర కోపాన్ని తెప్పించింది. అప్పటి నుండి తానూ తన వస్తువులను పోలయ్యకు తగలకుండా దూరంగా వుంచుకోవడానికి ప్రయత్నించాడు. ఇల్లుచేరిన వెంటనే తన కొడుకుతో చెంచునాయుడును పిలిపించి తనను వీడు దూషించాడని చెప్పాడు. తన కులాన్ని చెప్పకుండా బండి కట్టాడని తాను మైలపడ్డాడని '' ఛండాలుణ్ణి తాకితే బ్రాహ్మడు ఒళ్ళు తెగ్గాల్చుకొంటేగాని ఆ పాపం పద్నాలుగు జన్మలదాకాపో''[19] దన్నాడు. ఆ ప్రాయశ్చిత్తం వాడికే జరగాలన్నాడు. తనకు ఎలాగూ చావుతప్పదని గ్రహించిన పోలయ్య తాను క్రైస్తవుణ్ణి అని అబద్ధం చెప్పాడు. దాంతో శాస్త్రి నాయుడులు ప్రస్తుతం క్రైస్తవులే రాజ్యాన్ని పాలిస్తున్నారని, వారికి తెలిస్తే తమకు మరణ శిక్ష తప్పదని వాడికి బండి బాడుగ ఇచ్చి పంపించారు.

'' అయిన వాడికి ఆకుల్లోనూ, కానివాడికి కంచాల్లోనూ పెట్టే కొందరి హిందువుల మత సంస్కారానికి ఈ కథానిక మణిదర్పణం'' ఆనాడు హరిజనుల జీవితానికి సామాజిక భద్రతలేదు.

భారతదేశాన్ని తెల్లవాళ్ళు పాలిస్తున్న కాలంలో హరిజనులు తమ జీవితాల్ని చక్కదిద్దుకోవడం కోసం తమ హక్కులను పొందటం కోసం క్రైస్తవులయ్యారు. క్రైస్తవులు కాని హరిజనులు కొన్ని సార్లు సవర్ణుల ఆగ్రహానికి గురై క్రైస్తవులని చెప్పి శిక్షను తప్పించుకోగలిగారు. అలాంటి పరిస్థితుల్లో చిత్రించిన కథ పోలయ్య. సంఘసంస్కర్తలు అస్పృశ్యతా నివారణోద్యమం మొదలుపెడితే శాస్త్రిలాంటివాళ్ళు దానికి ఆదిలోనే గండికొట్టడానికి ప్రయత్నించారు. హరిజనులు చేసే చిన్న తప్పిదాలకు సహితం కఠిన శిక్షలు వేసే శాస్త్రి లాంటివారు క్రైస్తవులంటే వారిపై గౌరవం వున్నా లేకున్నా వదలిపెట్టారు. క్రైస్తవులే ఆనాడు పాలకులు కాబట్టి సవర్ణుల ఆత్మవంచనకు ఇది నిదర్శనం.

**3.2.1.10. ధర్మతల్లి**:- చావు బ్రతుకుల్లో వున్న ఒక మాలకుటుంబాన్ని ఆదుకొన బ్రాహ్మణ వితంతువు కథ. రచయిత చుండూరు రమాదేవి. ఆ ఇంటిలో తండ్రి అన్న చెల్లెలు కాపురం చేస్తున్నారు. అన్న కష్టించి పని చేసి సంసారాన్ని పోషించేవాడు. తండ్రి చనిపోయాడు. ఆవూళ్ళో కలరా వచ్చింది. గ్రామ ప్రజలు జాతర్లు చేస్తున్నారు. కాని కలరా తగ్గుముఖం పట్టలేదు. అన్నకు తమ ఇంటివంతుగా కలరా సోకింది. అన్న రోగంతో పడిపోవడం వల్ల ఆ కుటుంబానికి తిండి కరువయ్యింది. చెల్లెలు అన్నకు మందు కోసం పూజారి పాపయ్యవద్దకు వెళ్ళితే అతను పదిరూపాయిలు ఇస్తేగాని మందివ్వనన్నాడు. దారిలో ఆమెకు ఒక బ్రాహ్మణ వితంతువు ఎదురుపడి '' ఛీ మాలా ముండా, ఎదురొచ్చావు మైల పడ్డాను''21 అని తెస్తున్న నీటిని పారబోసింది. దేవుని దయవల్ల అన్నకు కలరా తగ్గ ముఖం పట్టింది. అన్నం లేక అన్నాచెల్లెలు నీరసించిపోయారు. చెల్లెలు అన్నం లేక ఊళ్ళో స్పృహతప్పిపడిపోయింది. ఆమెకు మెలకువ వచ్చేసరికి ఒక బ్రాహ్మణ వితంతువు అన్నరసం పోస్తున్నది. ఆమె కుల భేదాలు మనుషులు తెచ్చిపెట్టుకున్నవేనని, కొంత అన్నం పెట్టి వారి కుటుంబానికి కొన్ని రోజులకు సరిపడు బియ్యం ఇచ్చి పంపింది.

నాడు సమాజంలో హరిజనులంటే ఏహ్యాభావం వున్న బ్రాహ్మణులేగాక అందుకు విరుద్ధంగా కొందరు మానవతావాదులు కూడా సంస్కరణ దృక్పథంతో ఆదుకోవడం గమనార్హం. నాడు హరిజనులు బ్రాహ్మణ వీధిలో తిరిగేవారు కాదు. ఒకవేళ అంత అవసరం వస్తే బ్రాహ్మణులు ఆ వీధిలో సంచరించని సమయంలో వెళ్ళేవారు. చావు బ్రతుకుల్లో వున్న అన్నకు మందు కోసం చెల్లెలు వెళ్ళితే ఆమెకు మందు దొరక లేదు సరికదా పరాభవం ఎదురైంది. ఒక హరిజనుడుగా కాక, తోడి మానవుడిగా వాని ప్రాణంపై దయ చూపించలేకపోయారు. అలాంటిది అదే బ్రాహ్మణ వితంతువు వారి కుటుంబాన్ని దగ్గరకు తీసి , వారి ఆకలి తీర్చింది. కులం సాయం చేయవద్దని చెప్పలేదనే నీతిని ప్రబోధించింది.

**3.2.1.11. ధన్యజీవులు** :- హరిజనులు అంటరాని వారు కాదని సనాతనులను ఎదిరించిన అభ్యుదయవాది శంకరం కథ. రచయిత్రి అయ్యపెళ్ళి రామలక్ష్మి .శంకరం వేంకటశాస్త్రి కొడుకు, బి.ఏ పూర్తిచేసాడు. ఉద్యోగం కోసం ఎదురుచూడక తాతల నాటి వైద్యవృత్తిని చేస్తున్నాడు. ఒక రోజు మాల వెంకడు శంకరం వద్దకు వచ్చి తన భార్య అనారోగ్యంతో బాధపడుతున్నదని మందు అడిగాడు. వెంకడు శంకరం పొలాన్ని సాగు చేస్తున్నాడు. శంకరం ఏకంగా మాలపల్లెకు పోయి వెంకటి భార్యకు మందు ఇచ్చాడు. ఈ విషయం వూరంతా ప్రాకింది. వేంకట శాస్త్రి శంకరంతో మాలపల్లెకు పోయి నా పరువు తీశావన్నాడు. శంకరం మాలలు అంటరాని వాళ్లని ఏ శాస్త్రంలో వుందని, అరుంధతి, వాల్మీకులు హరిజనులు కారా అని తండ్రిని ఎదిరించాడు. శంకరం ఇల్లువదలి మాల పేటలోచేరాడు. వారికి చదువు నేర్పించడం మొదలుపెట్టాడు. అతని భార్య సరళ పరిశుభ్రత, శిశుపోషణను మాలపేట స్త్రీలకు తెలియజేస్తుంది. ఒకనాడు జబ్బుతో పడివున్న వేంకట శాస్త్రి శంకరాన్ని పిలిపించి నీవే గెలిచావని, హరిజనులు అస్పృశ్యులు కారని, వారికి సేవ చేయమని ప్రాణం వదిలాడు. శంకరం తండ్రి నుండి వచ్చిన డబ్బుతో హరిజన సంఘం

స్థాపించి ఖద్దరు తయారు చేయడం మొదలు పెట్టించాడు. వారు చుట్టు ప్రక్కల గ్రామాలకు ఆదర్శప్రాయులయ్యారు.

శంకరం సంస్కరణ భావాలు కలవాడు. తండ్రి అభిప్రాయాలకు విరుద్ధమయినవాడు. చీకటిలో బ్రతుకుతున్న హరిజనులకు వెలుగులు ప్రసాదించాడు. అందుకు తన భార్య సరళ సహకారాన్ని అందించింది. హరిజనులు అస్పృశ్యులు కారని, వారు మానవులే మన సోదరులేనని చాటిచెప్పాడు. వారు కష్టపడి చెమటోడ్చి పండించు ధాన్యం తినవచ్చు. కాని వారిని తాకరాదు. ఈ అస్పృశ్యతను ఏకౌటిల్యం నేర్పింది? ఏ శాస్త్రం వివరించింది ? సంఘంలో కొందరు అగ్రభాగాన కూర్చొని అధికారంచలాయించడానికే వీటిని ప్రాధమిక సూత్రాలుగా పాటించారు. ఆ సూత్రాల్లోనే హరిజనులు పడి బయటకు రాలేక పోతున్నారు.

**3.2.1.12. పులిగుండు** :- సవర్ణులు చేసే దురాగతాలకు హరిజనులు ఎలా బలవుతున్నారో తెలియజేసే కథ. రచయిత పులికంటి కృష్ణారెడ్డి. ఆ గ్రామ భూస్వామి కృష్ణమనాయుడు అతని భార్య నిర్మలమ్మ. ఆ ఊరిలో కృష్ణమనాయుడి మాట వేదవాక్కు. అతని పాలేరు బాలిగాడు. ఆ ఊళ్ళోనే రావుడు అనే హరిజన యువకుడు వుండేవాడు. తొమ్మిదవ తరగతి చదువుకుంటున్నాడు. పాటలు పాడుతూ గ్రామప్రజలు ఇంత అన్నం పెట్టితే తిని బ్రతుకుతున్నాడు. వాడిపై నాయుడి భార్య నిర్మలమ్మ మోజుపడింది. వాడిప్రాణానికి తన ప్రాణం ఇస్తానని చెప్పింది. ఈ విషయం తెలిసిన నాయుడు బాలిగాడి కళ్ళముందే రావుడిని చంపేశాడు. నాయుడి వ్యతిరేక వర్గం వాళ్ళు బాలిగాడిని రావుడి కేసుపై కోర్టులో సాక్ష్యం చెప్పమన్నారు. కృష్ణమనాయుడు బాలిగాడి ఇంటిని కాల్చి బెదిరించి, హరిజనులందరినీ తమ బాకీ అకస్మాత్తుగా తీర్చమన్నాడు. ఈ బాధలు భరించలేక, నాయుడు ఇస్తానన్న ఎకరాపొలంపై ఆశతో బాలిగాడు కోర్టులో అబద్ధం సాక్ష్యం చెప్పాడు. నాయుడుకు శిక్ష తప్పింది. బాలిగాడు నాయుడును పొలం అడిగితే '' తక్కువ జాతినా కొడకా, ఎకరా పొలం కావాల్నా ! ఎవడమ్మ మొగుడు సొత్తురా ? యిల్లు కావాల్నా ? అవును పాపం కావద్దా మరి ''22 అన్నాడు. బాలిగాడు తనకు రావుడికి జరిగిన అన్యాయాన్ని ఎవరూ ఎక్కలేని పెద్ద గుండును (పులిగుండు) ఎక్కి ప్రజలందరి ముందే చెప్పి నాయుడు చేతిలోనే హత్యకు గురయ్యాడు.

హరిజనులు వారి బ్రతుకులు వారు సాగిస్తూ ఇతరుల జోలికి వెళ్ళకపోయినా సవర్ణులే వారిని అవసర కార్యకలాపాల్లోకి ఈడ్చి వారిని దోషిగా చేసి అంతం చేసి చేతులు దులుపుకోవడం సనాతనం నుండి వస్తున్న సంప్రదాయం. హరిజనుడు చేయని నేరానికి శిక్ష అనుభవించడం రివాజు. కథలో రావుడు, బాలిగాడు అదే విధమైన సమస్యకు బలి అయ్యారు. బాలిగాడు నాయుడి పాలేరు అవ్వటం వల్ల అతను చెప్పిన పనులు చేయాల్సి వచ్చింది. ఒక హరిజనుని ఎదుట మరొక హరిజనుడిని సవర్ణుడు హత్య చేస్తుంటే దానిని హరిజనుడు అన్యాయం అని చెప్పలేకపోయాడు. కారణం అతని జీవితం నాయుడి సొత్తు కాబట్టి. ఈ కథ ద్వారా రచయిత హరిజనులను ఆ విధంగా బలికా వద్దని సలహా ఇచ్చాడు.

**3.2.1.13. అప్పావు పిళ్ళ ఆత్మ ఘోష**:- అస్పృశ్యత కారణంగా అగ్రవర్ణాల ఇంట్లోకి వెళ్లని ఒక హరిజన విద్యార్థి కథ. రచయిత పులికంటి కృష్ణారెడ్డి. అప్పావు పిళ్ళ టీచరు. అతనిది పెద్ద సంసారం. ఆరోజు నూతన సంవత్సరం, తన ఇంట్లో వున్న సందడిని చూసి అతను నూతన సంవత్సరం అనుకున్నాడు. ఆ సంబరాలను చూసి తెల్లవాడు ఎంత పునాది వేశాడురా అనుకున్నాడు. స్కూల్ పిల్లలు ఒక్కొక్కరే ఇంటికి వచ్చి అప్పావుపిళ్ళకు శుభాకాంక్షలు తెలియజేస్తూ, పండో, ఫలమో ఇస్తున్నారు. వెంకటయ్య అనే హరిజన విద్యార్థి టీచర్‌కు శుభాకాంక్షలు తెలియజేయడానికి వచ్చాడు. వాడిని చూసిన అప్పావు పిళ్ల తన వద్దనున్న విద్యార్థులను విడిచి వాని వద్దకు వెళ్లాలను కొన్నాడు. లేదా వాడినే తన ఇంట్లోకి రప్పించాలనుకుంటాడు. కాని సవర్ణుల భయానికి భయపడి. ఆ పని చేయలేకపోయాడు. విద్యార్థులంతా వెళ్లిన తర్వాత వెంకటయ్య

దగ్గరకు అప్పావు పిళ్ల వెళ్ళాడు. వాడిచేత శుభాకాంక్షలు చెప్పించుకొన్నాడు. రోజులు మారాయి. అప్పావు పిళ్ళ చనిపోయాడు. రాజకీయ నాయకులు అస్పృశ్యత సమానత్వం గురించి మాట్లాడుతున్నారు. కాని ఇప్పటికి ఊరి ముందర టీ కొట్టులో హరిజనుల కోసం గుంజకు ఒక గ్లాసును వ్రేలాడదీశారు. దానితోనే వారు నీళ్ళు త్రాగాలి.

గ్రామాల్లో హరిజనులకు బడి, గుడి నిషిద్ధం. హోటల్లో అయితే యజమానుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి వుంటుంది. పాలేర్లు అగ్రవర్ణాల పశువుల కొఠానికే పరిమితం. వారు శ్రమటోడ్చి సవర్ణుల పొలాల్లో పనిచేస్తారు. కాని సవర్ణుల ఇంట్లో కి మాత్రం ప్రవేశముండదు. వారికి అన్నం కూడా పశువుల కొట్టంలో పెడుతూ పశువులతో సమానంగాచూస్తున్నారు. సమాజం పిల్లలకు చిన్నతనం లోనే మతాల గూర్చి, కులాల గూర్చి వల్లవేస్తుంది. ఆధోరణికే గురయ్యాడు. వెంకటప్ప కులం తక్కువ కారణంగా తోడి విద్యార్థులతో సమానంగా ఉండలేకపోయాడు. అప్పావుపిళ్ల సంస్కరణ భావాలు కలవాడయినా సమాజానికి భయపడి వెంకటప్పను దూరంగా వుంచడానికే ప్రయత్నించాడు. ఈ అసమానత పురోగతికి అడ్డంకి. దీనిని రూపుమాపిన నాడే సమాజం అభివృద్ధిపథంవైపు పయనించగలదు.

**3.2.1.14. కోటిగాడు స్వతంత్రుడు :-** హరిజనులను అడ్డుపెట్టుకొని అగ్రవర్ణాల వారు ఎలా లాభపడుతారో తెలియజేసే కథ. రచయిత పులికంటి కృష్ణారెడ్డి. ఆ గ్రామంలో కోటిగాడు కట్టెలు కొట్టి తల్లిని పోషించేవాడు. ఇద్దరు అగ్రవర్ణాల వాళ్ళు పోట్లాడు కొని ఒకరిపై నొకరు జైలుపాలు చేసుకోవడానికి కోటిగాని సాక్ష్యాన్ని అర్థించారు. వాళ్ల భరించలేక కోటిగాడు పట్టణంచేరాడు పట్టణంలో ఎన్నో చోట్ల పనిచేసి అక్కడ వారు చేస్తున్న అన్యాయాలను చూసి సహించలేక ఎదురుతిరిగి పని పోగొట్టుకున్నాడు. చివరకు బాడుగ రిక్షా తీసుకొని రిక్షా త్రొక్కడం ప్రారంభించాడు. స్వాతంత్ర్యదినోత్సవం సందర్భంగా రిక్షా కార్మికులకు రిక్షాకొనడానికి ప్రభుత్వం ఐదు వందలరూపాయల ఆర్థిక సహాయాన్ని అందించింది. కోటిగాడు స్వతంగా రిక్షా కొనవచ్చని తపన పడ్డాడు. ఈలోగా పెంటయ్య వచ్చి, తనే కోటిగాడికి డబ్బు ఇప్పించానని రెండు వందల రూపాయలు తనకు ఇవ్వమని గోలపెట్టాడు. ''ఒరే కోటిగా నీకు అప్పు పుట్టించడానికి రిక్షా అడ్డు పెట్టుకోవాల్సిచ్చింది. నా లాంటోళ్ళు బతకడానికి నీలాంటోళ్ల అవసరం వొచ్చింది. అంతేరా ! అంతే రొండొందలిట్లా పారేసి మిగతా మూడొందలు పట్టుకెళ్ళి గుడ్డా గుసురు కొనుకో''23 అన్నాడు. కోటిగాని కొత్తరిక్షా ఆశలు అడుగంటిపోయాయి. వాడు బాధతో వున్న డబ్బు తీసుకొని బ్రాందీషాపు కెళ్లాడు. ఇష్టమొచ్చినంత త్రాగి బ్రాందీ సీసా తీసుకొని గాంధీ విగ్రహం వద్దకు పోయి విగ్రహాన్ని బ్రాందీ త్రాగమంటూ బాధపడ్డాడు.

గ్రామాల్లో అగ్రవర్ణాల వారు సంపద కోసం వర్గాలుగా విడిపోవడం పరిపాటి. వారు తమ లబ్ధికోసం కోటిగాడులాంటివారిని బలిగా తీసుకోవడం సహజం. వారి బారి నుండి తప్పించు కొన్న కోటిగాడికి పట్టణంలో కూడా ఎదురీత ఈదాల్సి వచ్చింది. అక్కడ సవర్ణులు మోసం చేసే ధోరణి వేరు. అదే దలారీ వ్యాపారం. ప్రభుత్వం హరిజనులను అభ్యుదయ పథంవైపు నడిపించాలని వారు అన్నింటా అభివృద్ధిచెందాలని సహాయం చేస్తే దానిని సవర్ణులే హరిజనులకు ఆశ చూపించి వచ్చిన డబ్బును దోచుకొని వారినే మానసిక క్షోభకు గురి చేయడం కన్పిస్తుంది. ఇదే స్థితిలో హరిజనులు దురలవాట్లకు వెళ్ళే ప్రమాదం కూడా వుంటుంది. చెడు అలవాటుఅంటే ఏమిటో తెలియని కోటిగాడు, పెంటయ్య తీసుకొన్న డబ్బువల్ల ఆశలు నెరవేరక, తమ బ్రతుకు మారక, మారేదారి తెలియక, జీవితాంతం కష్టం తప్పదని తెలిసిన కోటిగాడు నిరాశతో క్షణసుఖం కోసం ఉన్న డబ్బును బ్రాందీకి తగలేశాడు. ఆ పథకాలు మనిషికి ఆశలు రేకెత్తించాయి గాని అవసరాలు తీరలేదు. రచయిత ఈ కథ ద్వారా అలాంటి దళారీల చేతిలో హరిజనులు బలి కావద్దని సలహాఇచ్చాడు.

**3.2.1.15. ముత్తడు గొప్పోడు :-** సవర్ణులు హరిజనుల రిజర్వేషన్‌లు ఎలా వాడుకుంటారో తెలియజేసే కథ. దీని రచయిత పులికంటి కృష్ణారెడ్డి. పర్దేసి రెడ్డి ఆ గ్రామ భూస్వామి. అతని కొడుకు గాంధీ రెడ్డి కొద్దిగా చదువు కొన్నాడు. వారి పాలేరు ముత్తడు. ముత్తడు చిన్నతనంలోనే తల్లిదండ్రులను పోగొటుకొని రెడ్డి ఇంట్లో పాలేరుగా వుంటూ పెళ్లి కూడా చేసుకోకుండా కాలం గడుపుతున్నాడు. పర్దేసిరెడ్డి చాలా తెలివైన వాడు. రాజకీయ చతురుడు. హరిజనుల యేడల సానుభూతి పరుడుగా నటించి వాడలో కొన్ని అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టాడు. ఒక రోజు మంత్రిని పిలిపించి సభ ఏర్పాటు చేసి మంత్రి సమక్షంలో పర్దేసిరెడ్డి ''ముత్తడు పుట్టి బుద్దెరిగిన నాటి నుండి ప్రతి సెమట బొట్టూ మా ఇంటికి దత్తం చేస్తున్నాడు. నా పెద్ద కొడుకు గాంధీ రెడ్డిని ముత్తడికి దత్తత''24 చేస్తున్నానన్నాడు. ముత్తడు ఆ మాటలతో పొంగిపోయి తనకు ప్రభుత్వం ఇచ్చిన ఐదెకరాల బంజరు భూమిని గాంధీ రెడ్డి పేర వ్రాయించాడు. గాంధీ రెడ్డి ఢిల్లీ వెళ్ళి రిజర్వేషన్ తో కలెక్టర్ ఉద్యోగం సంపాదించాడు. గ్రామంలో ముత్తడి హోదా పెరిగింది. కలెక్టర్‌గా ఊరికి వచ్చిన గాంధీ రెడ్డిని ముత్తడు మనసారా కౌగలించుకోవాలను కొని ఆ పని చేశాడు. అది గమనించిన పర్దేసి రెడ్డి ఉగ్రుడై మాదిగవాడు తన కొడుకును ముట్టుకోవడమా అని కొట్టాడు. ఆ అవమానాన్ని భరించలేక ముత్తడు బావిలో పడి చనిపోయాడు. మూడు రోజుల తర్వాత పర్దేసి రెడ్డి ముత్తడి సంస్మరణ సభపెట్టి సంతాపాన్ని వ్యక్తం చేశాడు. గ్రామంలోని హరిజనులంతా రెడ్డి చెప్పిన మాటలు విని బాధపడుతున్నారే తప్ప ముత్తడు ఎందుకు చనిపోయాడని ఆలోచించలేదు.

హరిజనులు అభివృద్ధి చెందడం కోసం సమానత్వం పొందడం కోసం ప్రభుత్వం రిజర్వేషన్ విధానాన్ని ప్రవేశపెట్టింది. ఆ అవకాశాన్ని అగ్రవర్ణాల వారు ఉపయోగించడం కోసం ప్రయత్నించారు. కథలో పర్దేసిరెడ్డి హరిజనులు చేత మంచివాడుగా ముద్ర పడ్డాడు. పైకి సంస్కరణ భావాలు కలవాడుగా కనిపించి, లోన నిండుస్వార్థపూరితుడిగా తయారయ్యాడు. రోజులుగా తమ కుటుంబానికి ముత్తడు చేస్తున్న సేవలను కూడా గుర్తించక వాడి మరణానికి.కారకుడయ్యాడు. మాయ మాటలతో ముత్తడి భూమిని కాజేశాడు. పర్దేసిరెడ్డి మంచివాడని గ్రుడ్డిగా నమ్మిన హరిజనులు ముత్తడు చనిపోవడానికి గల కారణాలను తెలుసుకోవడానికి ప్రయత్నించలేదు. ముత్తడివల్లే తమ కుటుంబం లాభపడిందన్న కృతజ్ఞత పర్దేసి రెడ్డికి లేకపోయింది.

**3.2.1.16. నువ్వుకాదూ :-** హరిజనులు గోమాంసం తినడం వల్లే సవర్ణులు వాళ్లను అంటరానివారుగా చూస్తున్నారనడానికి ఈ కథ నిదర్శనం. రచయిత అందే నారాయణ స్వామి. రామస్వామి ఎడ్లబండితో సరుకులు తోలి వచ్చిన డబ్బుతో సంసారాన్ని సాగిస్తున్నాడు. వచ్చిన డబ్బంతా సంసారానికే అయిపోవడం వల్ల ఎద్దులకు కావలసినంత గడ్డిని అందివ్వలేకపోయాడు. ఆ ఎద్దులు అధిక కష్టం వల్ల తినడానికి తిండిలేక బండి ఈడ్చడానికి శక్తి లేకపోయాయి. ఒక రోజు రామస్వామి తన ఎద్దులలో ఒకదానిని బరువు లాగలేదని సంతలో అమ్మేశాడు. అతను ఆ రాత్రి సంతలోనే వుండి తెల్లవారి ఊరి ముఖం పట్టాడు. దారిలో హరిజనులు గత రోజుకొన్న రామ స్వామి ఎద్దును కోస్తున్నారు. వారు దారిన పోతున్న రామస్వామిని ఎద్దు మాంసం కావాలా అని అడిగారు. రామస్వామి వారి వద్దకెళ్లి తన ఎద్దును చూసి జాలిపడి ''ఛీ గాడిదా! దాని ప్రాణం నిలువుగా తీశావా ? దాన్ని చంపేందుకు నీకు చేతులెట్లా వచ్చినయ్‌రా ! వెధవా ఇంత దుర్మార్గులు కనుకనే అంటడానికి ముట్టడానికి పనికిరాకుండా పోయా''25 రన్నాడు.

హిందువులు ఎద్దులను గోవులను గౌరవంగా చూస్తూ, దేవతలుగా తలచి పూజిస్తారు. అలాంటి వాటిని తోడి హిందువులైన హరిజనులు భక్షిస్తారు. అందువల్ల అస్పృశ్యులయ్యారని ఈ కథ తెలియజేస్తుంది. కాని ఇది అవాస్తవం అని చెప్పవచ్చు. అలాగైతే హిందువులు కూడా కొన్నిసార్లు గోమాంసం తిన్నారు.

''గోమాంసాన్ని భక్షిస్తారని హిందువులు చేసే ఆక్షేపణలోని బలాన్ని అస్పృశ్యులు గుర్తించారు. అయితే హరిజనులు ఆ అలవాటును మానివేయకుండా చనిపోయిన గోమాంసాన్ని తినవచ్చుననే ఒక సమర్థనను ప్రచారంలోకి తెచ్చారు. ఆవు కళేబరాన్ని గాలికి విడిచి పెట్టేకంటే భక్షించడం వల్ల గోవుపట్ల ఎక్కువ గౌరవాన్ని చూపినట్లు అవుతుంది''26 అని అంబేద్కర్ సమర్థనా సారాంశం.

**3.2.1.17. అగ్నిగుండం** : హరిజను లంతా రాడికల్స్ అని, వారిని హింసించే పోలీసు వ్యవస్థను గురించి తెలియజేసే కథ. రచయిత కాలువ మల్లయ్య. అంజయ్య బాగమ్మ భార్యా భర్తలు. అంజయ్య వృత్తి డప్పు వాయించడం. గ్రామంలో అన్ని శుభాశుభ కార్యాలకు డప్పువాయిస్తాడు. అంజయ్య జీవితంలొ అగ్రవర్ణాల చేత ఎన్నో అవమానాలకు గురయ్యాడు. దొంగతనాలు మోపబడిజైలుపాలయ్యాడు అన్ని కష్టాల్లో నూతన కొడుకును చదివిస్తున్నాడు. తనకు జరిగిన అవమానాలు తన కొడుక్కు జరగకూడదని తలచాడు. అదే స్థితిలో తెలంగాణాలో రాడికల్స్ ప్రభావం ఎక్కువగా వుండేది. హరిజనులను రాడికల్స్‌ని పోలీసులు హింసించేవారు. విశ్వవిద్యాలయాల్లో రాడికల్స్ ప్రభావం విద్యార్థులో ఎక్కువగా వుండేది. అంజయ్య కొడుకు యం.ఏ . చదువుతున్నాడు. తన కొడుకు ఇంటికి వచ్చినప్పుడుల్లా బాగా చదువుకోమని పోట్లాటలకు వెళ్లవద్దని చెప్పేవాడు. తన కొడుకు మంచి ఉద్యోగస్థుడు కావాలని ఆశించేవాడు. ఒక రోజు పోలీసులు హాస్పటల్‌లో పడి అంజయ్య కొడుకును తీసుకెళ్లారు. తనకు రాడికల్స్‌తో సంబంధం లేదని చెప్పినా వినలేదు. రెండు రోజుల తర్వాత పోలీసులు అంజయ్య కొడుకును వదిలి పెట్టినా మరి కొన్ని రోజుల్లో అతనికి ఒక హత్యతో సంబంధముందని అరెస్టు చేశారు. అంజయ్య ఇంటిపై పోలీసులు దాడిచేసి ''నీ మాదిగ మన్నె పోల్లకు ఆల్లతోనే సంబంధ వుంటుంది. లేదంటే ఎవ్వల్నవుమ్మ తా(రా? హత్య సేసినోల్లండ్ల నీ కొడుకున్నడు''27 అని కొట్టారు . అంతే అప్పటి నుండి అంజయ్య కొడుకు వున్నాడో లేదో అంజయ్యకు తెలియదు.

హరిజనులు విద్యావంతులు కావడం వల్ల తరాలుగా తమ జాతిపై సవర్ణులు చేస్తున్న దురాగతాలను సహించకలేక అన్యాయాల్ని ప్రతిఘటించడం మొదలు పెట్టారు. ధీనితో సవర్ణులు హరిజనులపై సరికొత్త అవతారాన్ని చూపించారు. అధికార ం ధనబలం వున్న సవర్ణులు ప్రభుత్వ సహాయంతో వీరిని అణచడానికి ప్రయత్నించారు. రాడికల్స్‌గా పేరుమోపి, ఎదురుకాల్పుల పేరుతో హతం చేశారు. దీనితో తమ బ్రతులకు రక్షణ లేదనుకొన్న హరిజనులకొందరు రాడికల్స్‌లో చేరితే మరి కొందరు సవర్ణులపై ఎదురు తిరగలేక వుండిపోయారు. కథలో అంజయ్య కొడుకు బుద్ధిగా చదువుకొని మంచి ఉద్యోగం సంపాదించాలని తపన పడ్డాడు. ఆ తపనలోనే హతం అయ్యాడు. అంజయ్య ఆశ నిరాశగానే మారిపోయింది. సరికదా, తన కొడుకు చేతికందకుండా పోయాడు.

'కాపోడా, కూలోడా ' అనే కథలో హరిజనులు, అగ్రవర్ణాలవాళ్ల పొలాల్లోనూ వరి కల్లాల్లోనూ స్నేహంగా వుంటారని పీర్ల పండగలో హరిజనులు తప్పెట వాయిస్తుంటే సవర్ణులు తప్పెటకనుగుణంగా అడుగులు వేస్తారని వారిద్దరి సంబంధం విడదీయరాని దని రచయిత వివరించాడు. అలాగే బడితెగాడు కథలో తన కుటుంబం సర్వనాశనమైన మాల యువకుడు ఒక కొండ మీద నివాసం ఏర్పరచుకొని చునట్టు ప్రక్కల గ్రామాల భూస్వాములపై దాడిచేసి వారి ధనమును బీదలకు పంచేవాడని, ఇలా కొన్ని రోజులు జరిగాక అప్పటి నిజాం పోలీసులు ఆ మాల యువకుడిని చంపారని తెలియజేస్తుంది.

కాపోడా, కోలోడా ! కథలో ఊరి హరిజనులు, సవర్ణులు స్నేహంగా వుండటంవల్ల గ్రామ శ్రేయస్సు కు ఉపయోగపడుతుందని తెలియజేస్తే. బడితేగాడె కథలో హరిజనుడు చైతన్య వంతుడైతే సవర్ణులు వాడిన హత మార్చుడానికి కూడా వెనుకాడరన్న విషయాన్ని ఉద్బోదిస్తుంది.

**3.2.1.18. ఆచూకి** :- ఒక యువతిని ప్రేమించి ప్రేమ విఫలమయిన హరిజన యువకుడు రాడికల్స్‌లో చేరిన విధమును తెలియజేసే కథ. రచయిత గోపి లసుమయ్య, లసుము భార్య భర్తలు. వారి కూతురు కొమురు. ఆమె బూడిద లింగమును ప్రేమించింది. ఇద్దరూ పెళ్లి చేసుకోవాలనుకొన్నారు. కొమురు పెళ్ళి గాకనే గర్భవతి అయ్యింది. ఈ విషయం తెలిసిన లసుము తన కూతురుకు న్యాయం చేయమని హరిజన వాడలో పంచాయతీ పెట్టించింది. అగ్రవర్ణాలవారు కూడా పంచాయతీకి వచ్చారు. బూడిద లింగయ్యను పెళ్లి చేసుకోమన్నారు. అందుకు లింగయ్య తండ్రి మారయ్య నిరాకరించాడు. తప్పుక్రింద మూడువేల రూపాయలు దండగ చెల్లిస్తానన్నాడు. మారయ్యకుతన కొడుకు కట్నం తెస్తాడని ఆ డబ్బుతో వాడలో పెంకుల కొట్టం వేయవచ్చని కల కన్నాడు. పంచాయతీలో లింగయ్య ధైర్యంగా కొమురును పెళ్లాడుతానని అనలేదు. పంచాయతీ తీర్పు చాలించి పెద్దలందరూ వెళ్లి పోయారు. కాని లింగయ్య అక్కడే కూర్చొని పొద్దుకుంకినతర్వాత కొమురు ఇంటికెళ్లి ఆమెను తమతో రమ్మన్నాడు. అందుకు లసుము నిరాకరించింది. లింగయ్య విరక్తితో రాడికల్స్‌లో చేరిపోయాడు.

మారుతున్న సామాజిక పరిస్థితుల కనుగుణంగా జీవన విధానాన్ని సమాజం మార్చుకొనక తప్పదు. లేకపోతే అనర్థాలు రావడానికి దోహదం చేస్తుంది. కథలో లింగయ్య కొమురును ప్రేమించి పెళ్లి చేసుకోడానికి పెద్దలు అడ్డుపడ్డారు. వివాహం చేసుకొని నూరేళ్ళు జీవించవల్సిన ఆ యువతీయువకులు పెద్దలు స్వారంలో బలై చెట్టుకొకరు గుట్టకొకరయ్యారు. పెద్దల మూర్ఖత్వం వల్ల వారి జీవితాలు తీరం చేరని పడవల్లా అయ్యాయి. మారుతున్న సామాజిక వ్యవస్థ కనుగుణంగా వివాహ వ్యవస్థ వుండాలని రచయిత అభిప్రాయపడ్డాడు. పిల్లలమనస్తత్వం తెలుసుకోకుండా వారి పట్ల మూర్ఖంగా ప్రవర్తిస్తే ఏంజరుగుతుందో రచయిత తెలియజేశాడు. అంతేగాక ఒక నిస్సహాయుడు కష్టాల్లో వున్నప్పుడే ఆలోచించి చైతన్యవంతుడు కాగలడనే విషయాన్ని సూచిస్తుంది.

**3.2.2. మతాంతర జీవితం** :- హరిజనులు సవర్ణులచేత హీనంగా చూడబడుతూ ఊరికి దూరంగా వెలివేయడం వల్ల చైతన్యవంతులైన కొందరు హరిజనులు సమానత్వం సాధించడం కోసం మతాంతరం వెళ్లడానికి సుములైరి. అదే స్థితిలో ఆంగ్లేయులచే ఈ దేశంలో క్రైస్తవ మతం ప్రచారం చేయబడుతుండేది. హరిజనులు క్రైస్తవ మతాన్ని పుచ్చుకొని విద్య నభ్యసించి ఉద్యోగాలు సంపాదించారు. హిందూ మతం ఇవ్వలేని స్వేచ్ఛను హరిజనులు క్రైస్తవ మతంలో పొందగలిగారు. అక్కడ వారి జీవితాలు కొంతవరకూ మెరుగయ్యాయని చెప్పవచ్చు. హరిజనుల మతాంతర జీవితాన్ని కథానికా సాహిత్యం ద్వారా పరిశీలిద్దాం.

**3.2.2.1. సంసార సంగం** :- కులం కట్టుబాట్లకు జడిసి పెళ్ళికోసం మతం మార్చుకున్న యువతీయువకుల వివాహగాథ. దీని రచయిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి. నరసింహులు కొడుకు కాటన్న. వీరి కులం మాదిగ. మాలగంగన్నకు ఒక కూతురు ఉండేది. ఆమె పేరు సోమాలు. సోమాలు కాటన్నలు ప్రేమించుకొన్నారు. ఇద్దరూ పెళ్లి చేసుకోవాలనుకొన్నారు. కాని వారికి కులం అడ్డువచ్చింది. కుల పెద్దలు తనకు కొడుకు సోమాలుతో పెళ్లి చేస్తే కులం నుండి బహిష్కరిస్తామని నరసింహులును హెచ్చరించారు. కులం కూడు పెట్టడదని కులానికి దూరమవుదామని, ఇద్దరినీ విడదీయడం పాపమని నరసింహులుతో భార్య పోలమ్మ చెప్పింది. నరసింహులు పోలమ్మలు, దేవ సహాయం ద్వారా క్రైస్తవ మతాన్ని స్వీకరించారు. మతాంతరులను చేసి కాటన్నకీ సోమాలు కూ పెళ్ళి జరిపించారు.

హరిజనుల్లో కులపరంగా అభిప్రాయ బేధాలుండుట వాస్తవం ఒకరి కులం మరో కులంతో కలవడానికి ప్రయత్నించదు. హరిజనులు క్రైస్తవంలో చేరడానికి ఇది కూడా ఒక విషయం కావచ్చు. కుల అనుమతించని కట్టుబాట్లు హిందూ సంఘంలో వుండటం చేత స్వేచ్ఛను కోరిన కొందరు క్రైస్తవ మతాన్ని

స్వీకరించారు. హిందూ సంఘం కట్టుబాట్లు సడలించకపోతే హిందువులు వారి అవసరాల కోసం అన్యమత స్వీకారం చేస్తారని రచయిత ఈ కథలో హెచ్చరించాడు.

**3.2.2.1. కులాంతర జీవితం** :- హిందూ మతం భిన్న కులాల ప్రదర్శన శాల. భారతదేశం లౌకికరాజ్యం అగుటచే ఈ దేశంలో ఏ కులస్తుడైనా ఏ మతస్థుడైనా స్వేచ్ఛగా జీవనాన్ని కొనసాగించవచ్చు. తనకు ఇష్టమొచ్చిన కులంలో వివాహమాడవచ్చు. ఇక హరిజనుల విషయానికి కొస్తే పై మాటలన్నీ వారికి నిషిద్ధం. వారు స్వేచ్ఛగా ఏ సవర్ణుని ఇంటి ముందు తిరగడానికి వీలుండదు. ఏ గుడిలోకి వెళ్లడానికి గాని ఏ సవర్ణ స్త్రీ ని కన్నెత్తి గానీ చూడరాదు. ఈ స్థితిని సంస్కరణ భావాలు గల రచయితలు సహించ లేకపోయారు. హరిజనుల కులాంతర జీవితాన్ని గూర్చి రచనలు చేయడం మొదలు పెట్టారు. సవర్ణులలో అభ్యుదయ భావాలుగల కొందరు హరిజన స్త్రీలను వివాహమాడారు. వారి జీవితాలను కథానికా సాహిత్యం ద్వారా చర్చిద్దాం.

**3.2.2.1.1. సబ్బు** :- ఒక సవర్ణ యువకుడు హరిజన యువతిని వివాహమాడ డానికి ప్రయత్నిస్తే అందులకు నిరాకరించిన యువతి కథ. రచయిత పులికంటి కృష్ణారెడ్డి. ఆ గ్రామ ప్రెసిడెంటు పెద్దిరెడ్డి కొడుకు రమణ, వేసవి సెలవుల్లో కాలం గడపడానికి ఆ గ్రామానికి వచ్చాడు. ఒక రోజు గ్రామంలోని ఊరబావి వద్దకు వెళ్లి. నగ్నంగా స్నానం చేస్తున్న ఒక హరిజన యువతిని చూశాడు. ఆమె పేరు వరాలు. రాముడి కూతురు. వరాలు అందాన్ని చూసి ఆమెపై మోజు పడ్డాడు రమణ. ఆ గ్రామంలో హరిజనులు సవర్ణులు ఒక బావి నీళ్ళే వాడుతారు. ప్రతి రోజూ రమణ ఆ బావి దగ్గరకు వచ్చేవాడు. నీటిలో గంటలు తరబడి స్నానం చేసేవాడు. వరాలు కూడా అక్కడే బట్టలు ఉతికేది. వరాలు కూడా రమణపై మోజుపడింది. రమణ స్నానం చేసేటప్పుడు కాలువ గుండా వచ్చే సబ్బు సురుగను వరాలు క్రింద భాగాన వుండి తన కాళ్ళకు రుద్దుకునేది. ఒకరోజు ఊరు, వాడ యువకులు కబాడీ ఆడి స్నానం చేయడానికి బావి దగ్గరకు వచ్చారు. ఊరి యువకులు కాలువపైభాగంలో స్నానం చేస్తే వాడ యువకులు కాలువ క్రిందిభాగంలో చేశారు. రమణ సబ్బును సవర్ణులు ఉపయోగించుకొన్నారు. కాలువగుండా వచ్చే నురగను క్రింద బాగాన హరిజన యువకులు రుద్దుకోవడం వరాలు సహించలేకపోయింది. యువకులు స్నానం చేసి వెళ్ళిపోయారు రమణ వరాలు వద్దకు వెళ్ళి ''వరాలూ నిన్ను నేను పెళ్ళాడుతాను ''అన్నాడు. అందుకు వరాలు హరిజనులను హీనంగా చూసే మనస్తత్వం పోయినప్పుడే అది సాధ్యమవుతుందని వెళ్ళిపోయింది.

స్త్రీ పురుషుని జీవితంలో ప్రవేశించి ఎన్ని అద్భుతాలు సృష్టిస్తుందో పురుష జీవితానికి ఎంతటి ప్రేరక శక్తి కాగలదో నిరూపిస్తుంది. సాటి మనుషులను ఆలోచింపజేస్తుంది. సంస్కరణోన్ముఖులను చేస్తుంది. మొదట్లో రమణను అభిమానించిన వరాలు. చివరికి అతణ్ణి అసహించుకొంది. రమణకు అనుకూల పరిసరాల్లోనేగాక పతికూల వాతావరణంలో కూడా ప్రేరణ కలిగించింది. అందుకోసం తన శరీరాన్ని కార్యసాధనంగా వాడుకొంది. ఈ కథ ద్వారా రచయిత అగ్రవర్ణాల యువకులు చెప్పే కల్లిబొల్లి మాటలకు హరిజన యువతులు బలికావద్దని హెచ్చరించాడు.

**3.2.2. ఇరుకు** :- ఒక సవర్ణుడు హరిజన స్త్రీని వెళ్లి చేసుకోవడానికి ప్రయత్నిస్తే హరిజనులే ఆ ప్రయత్నానికి గండికొట్టిన స్థితిని తెలియ జేసే కథ. రచయిత చిలుకూరి దేసపుత్ర. సుబ్బులు హరిజన స్త్రీ ఆమెను రామ చంద్రుడనే సవర్ణుడు ప్రేమించాడు. ఆమెను వివాహం చేసుకోవడానికి కులం అడ్డువచ్చినా వెనుకాడలేదు. ఈ విషయం తెలుసుకొన్న సుబ్బులు మామ నరసింహులు వాడలో పంచాయితీ పెట్టించి సుబ్బును తన కొడుకుతో వివాహం చేయించడానికి అంగీకరింపజేశాడు. సుబ్బులుకు, నరసింహులు కొడుక్కూ వివాహమైంది. ఈ దెబ్బతో భగ్నప్రేమికుడైన రామచంద్రుడు ఆర్నెళ్ళు కోలుకోలేకపోయాడు. సుబ్బులుకు ఒక కొడుకుపుట్టగానే భర్త చనిపోయాడు. అప్పటినుండి ఆమె తన కొడుకును ప్రాణంగా చూసుకొనేది.

ఈ మధ్య ఆపిల్లవాడికి జ్వరం వచ్చిన సరైన వైద్యంకోసం చివరిస్థితిలో ఆసుపత్రికి తీసుకెళ్లింది. ఆసుపత్రిలో పిల్లవాడు చనిపోయాడు. సుబ్బులు తన కొడుకు చనిపోయాడని ఆసుపత్రిలో ఏడిస్తే డాక్టర్లు తిడుతారని. బస్సులో ఏడిస్తే శవాన్ని తీసుకరావడానికి డ్రైవరు నిరాకరిస్తాడని, ఊరు చేరిన తర్వాత ఏడ్వటం ప్రారంభించింది.

భిన్నకులాల స్త్రీ, పురుషుల సంబంధాల్లో కొన్ని సంఘటనలు తప్పనిసరి. అందులో వారు బలైపోవడమేనా? మూర్ఖంగా నోరు నొక్కుకొని అనుభవించటమేనా? అన్న సందేహాన్ని ఈ కథ వెలుబుచ్చుతుంది. కథలో పాత్రలు అలాంటి వాతావరణానికే గురి అయ్యాయి. రామచంద్రుని ప్రేమించిన సుబ్బులు కులపెద్దలు పంచాయతిలో చేసిన తీర్మానాన్ని వ్యతిరేకించలేకపోయింది. తత్ఫలితంగా చిన్నతనంలోనే విధవరాలయ్యింది. తన కొడుకునైనా కళ్లారా చూసుకుంటూ జీవిద్దామనుకుంటే సరైనవైద్యంలేక వాడుకూడా వెళ్లిపోయాడు. ఈ స్థితి సుబ్బులును ఎంత మానసిక క్షోభకు గురిచేసిందో రచయిత తెలియజేశాడు.

**3.2.2.1.3. వెలి** :- కులాంతర వివాహం చేసుకొని కులాల సమానత్వం కోసం పాటుపడిన భార్యభర్తల కథ. రచయిత చిత్తూర్తి కోటేశ్వరరావు. సత్యం హరిజనుడు. క్రైస్తవ మత ఆర్థిక సహాయంతో చదివి ఉపాధ్యాయ వృత్తిని చేపట్టాడు. అతని కూతురు శ్యామల. సత్యం హరిజనుడుగా పుట్టి జీవితంలో ఎన్నో అవమానాలు భరించినా, తన కూతురుకు కులపు అసమానతలు తెలియకుండా పెంచాడు. హరిజనులను తన ఇంటికి రానిచ్చేవాడుకాదు. ఆ ఊరిలోనే క్షత్రియ వితంతువైన సుభద్రమ్మ తన కొడుకుతో కలసి కాపురం చేస్తుండేది. కొడుకు రామరాజు ఎప్పుడూ జులాయిగా తిరిగే వాడు. సుభద్రమ్మ సత్యం ఇంట్లో పనిమనిషిగా వుండేది. ఒకరోజు పేకాటనుండి యింటికి వచ్చిన రామరాజు తన తల్లి సత్యం ఇంటి నుండి తెచ్చిన అన్నం అంటరానిదని తినక ఆమె ఇచ్చిన డబ్బును తీసుకొని వెళ్ళిపోయాడు. పేకాట ఆడుతుండగా శ్యామల అటుగా సైకిలుమీద వెళ్ళింది. తోటి పేకాట గాళ్ళు ''ఓరి ఇదంట్రా సత్యం మాష్టారి కూతురు. దీనికి ఒళ్లు బలిసిందిరా. పదిమందిలో చిన్నపెద్దలేకుండా సైకిలెక్కి తిరగడమా ! కూడు దొరికితే కులం మరచిపోతారు'' అంటూ ఎగతాళి చేశారు. ఆ మాటలను రామరాజు ఖండిస్తే వాళ్ళు కొట్టి పంపుతారు. ఇంటికి వచ్చిన రామరాజు తన మామ తన భూమిని కాజేశాడని తెలిసి అతనిని హత్య చేయడానికి ప్రయత్నించాడు. శ్యామల అతనిని వారించి పెళ్ళి చేసుకొంది. కూతురుపై దిగులుతో సత్యం చనిపోయాడు. వారికి ఒక కూతురు జన్మించింది. పేరు శారద. పాప పుట్టినప్పటి నుండి వారిద్దరి బంధువులు వారింటికి రావడం మానేశారు. కూతురు పెళ్లి విషయంలో వారిద్దరి కులాల వారు ఆమె ను పెళ్లి చేసుకోవడానికి నిరాకరిస్తారు. అప్పటినుండి రామరాజు, శ్యామల, శారదలు సమాజ సమానత్వంకోసం ప్రయత్నించారు.

హరిజనులు తమ జీవితాన్ని సుగమం చేసుకొనే ప్రయత్నంలో ఎన్నో అవాంతరాలను ఎదుర్కోవలసి వచ్చింది. వారు ఏ కులంలో ప్రవేశించినా అక్కడకూడా హరిజనులుగానే చూడబడ్డారు. కథలో జరిగిన విషయం అదే. సత్యం శ్యామలకు సవర్ణులతో పెళ్ళి చేయగలిగాడే కాని ఆమె సుఖాన్నిగూర్చి ఆలోచించలేదు. ఆమెను మానసిక క్షోభకు గురి చేశాడు. రామరాజు ముందు ధైర్యంగా శ్యామలను పెళ్లిచేసుకొన్నాడేకాని భవిష్యత్తు గూర్చి ఆలోచించ లేకపోయాడు. జీవితాంతం పరాభవాలను చవి చూచిన రామరాజు, శ్యామల లు సమాజ అభ్యుదయం కోసం పోరు మొదలుపెట్టారు. కులాంత వివాహం చేసుకొన్నా జీవితంలో ఎన్నో ఇబ్బందులను అధికమించి ముందుకెళ్లాలని ఈ కథా దృక్పథం.

**3.2.3 . మనస్తత్వ జీవితం** :- అస్పృశ్యతకు జాతిపరమైన కారణాలులేకున్నా బ్రాహ్మణులు ఆచారాల పేరుతో హరిజనులను దూరంగా వుంచడం వల్ల వారికి బానిస బ్రతుకులు తప్పనిసరి అయినవి. హరిజనులు విద్యావంతులైనా ఆత్మ న్యూనతా భావంతో హరిజనులమని చెప్పుకోలేకపోతున్నారు. అంతేగాక కొంతమంది

పేర్లు మార్చుకొని నాగరికమైన పేర్లను పెట్టుకొని వుండటం పరిపాటి. వారు అలా కావడానికి కారణం ఈ సమాజం. అలాంటి అసమానతను వీడమని రచయితలు తమ కథానికల ద్వారా సమాజానికి సలహా ఇచ్చారు.

**3.2.3.1. తల్లి వంట్లే** :- ఉద్యోగస్థుడైన హరిజనుడు తన కులాన్ని దాచుకోవడానికి ప్రయత్నించే పద్ధతిని తెలిపే కథ. రచయిత బండి నారాయణ స్వామి. కథకుడిది ఉపాధ్యాయ వృత్తి. ఒక గ్రామానికి కొత్తగా బదలీ అయ్యాడు. అక్కడ గుడి, బడి ఒక్కటే ఆ బడికి వచ్చే హరిజన పిల్లలు బయటే కూర్చుంటారు. అది చూసిన ఉపాధ్యాయుడు హరిజన పాప అంజినమ్మను బడిలోకి రమ్మన్నాడు. ఆ పాప గుడిలోకి రాకూడదు సార్' అంది. ఈలోగా సవర్ణ పిల్లలు. 'మాదిగోళ్ళు గుడిలోనికి రారు సార్' అన్నారు. కథకుడు అంజినమ్మను బడిలోనికి తీసుకొచ్చి కూర్చోబెట్టాడు. పిల్లలందరూ ''మాదిగోళ్ల పాపనిముట్టుకున్నాడు రోయ్ ఈ పొద్దు సాయంత్రం అయ్యవారికి తేలో, పామో కుడుతుంది'' అంటూ నవ్వారు.

సమాజంలో హరిజనుల స్థితి ఎలా వుందనడానికి ఈ కథ తార్కాణం అభం శుభం తెలియని పసితనంలోనే పిల్లలకు కులాల గూర్చి తెలిశాయి. సమాజం హరిజన పిల్లలను తాము అంటరానివారమని, అంటుకు, ముట్టుకు దూరంగా వుండాలనే ఆలోచనను కలుగజేసింది. సవర్ణులు తమ పిల్లలకు ఆ పసితనంలోనే కులాల అంతరాలనుగూర్చి తెలియజేయడం హిందూజాతికి మాయనిమచ్చ. తరాలుగా సంప్రదాయాలతో పెరిగిన పెద్దలు పిల్లల్లోనైనా అలాంటి అంతరాలు రాకుండా అందరిని ఒకటిగా వుంచడానికి ప్రయత్నించాలి. అప్పుడే సమాజం అభ్యుదయం వైపు పయనిస్తుంది.

ఉపాధ్యాయునికి శ్రీనివాసులు పరిచయమయ్యాడు. అతను హరిజనుడు. బాంకులో ఉద్యోగి. కథకుడిని కులంపట్ల అభ్యంతరం లేకపోతేనే తన రూంలో వుండమన్నాడు. రూంలో ఇద్దరు కావడం వల్ల పనిపిల్ల డబ్బు పెంచితేనే పనికి వస్తానంది. ఆమెకు డబ్బు ఇవ్వడానికి కథకుడు నిరాకరించినా శ్రీనివాసులు ''మనిమనుషులు మీలాంటివారికైతే కుదురుతారు కానీ మాబోటి వాళ్ళకు కుదరరండి'' అన్నాడు. పనిపిల్ల అడిగినంత డబ్బు ఇవ్వడానికి శ్రీనివాసులు అంగీకరించాడు. అతని స్నేహితులు గురుమూర్తి, ఖాదర్ భాషా, కేవలం డబ్బు కోసమే శ్రీనివాసులుకు మిత్రులయ్యారు. శ్రీనివాసులు కూడా వారడిగినట్లు డబ్బు ఖర్చు చేస్తాడు. శ్రీనివాసులు అప్పుడప్పుడు తన కులం పేరు చెప్పుకోక వ్యక్తిత్వాన్ని పెంచుకోవడం కోసం గొప్పలు చెప్పేవాడు. తమ బంధువులు మద్రాసు, బొంబాయిలలో వున్నారనేవాడు. ఒకసారి కథకునితో శ్రీనివాసులు అమ్మాయి పేరు చెప్పకుండా రెడ్ల అమ్మాయిని ప్రేమించానని కాని తన కులం కారణంగా ఆమె పెళ్ళి చేసుకోలేదని చెప్పాడు. మరోసారి కథకుడు శ్రీనివాసులు పెళ్లి చూపుల కోసం వెళ్లితే వారి ఇంటిని చూసే ఆ ఇల్లు బాగాలేదని ఆ ఇంట్లోని పిల్లను పెళ్లాడనన్నాడు ''చూసి ఇలాంటి ఇరుకు ఇంట్లో చేసుకొంటానా? ఛ.ఛ మన ప్రిస్టేజి ఏం కావాలి?'' అన్నాడు. ఒకసారి గురుమూర్తి, ఖాదర్ భాషా శ్రీనివాసులు ఏర్పాటు చేసిన విందులో తమ వంశాల గొప్పలు చెబుతుంటే శ్రీనివాసులు తన వంశాన్ని గూర్చి ఏమి చెప్పాలో తెలియక ఊరకున్నాడు.

సమాజంలో కొందరు స్వభావరీత్యా ప్రతిది అవమానంగానే భావిస్తుంటారు. అలాంటివారు సమాజంలో సర్దుకుపోలేక సతమత మవుతుంటారు. ఈ సమస్యల వల్ల మనిషిలో ఆత్మన్యూన్యతాభావం ఎర్పడుతుంది. అదే కోవకు చెందినవాడు శ్రీనివాసులు. అతను విద్యావంతుడై ఉన్నత ఉద్యోగి అయి కూడా తక్కువ కులం వాడిని అనే ఆలోచనతో మానసిక క్షోభకు గురయ్యాడు. తమ కులాన్ని దాచుకోవడం కోసం అనేక ప్రయత్నాలు చేశాడు. అతని ప్రవర్తనలో భయం వుంది. పిరికితనం వుంది. బానిసమనస్తత్వం వుంది. ఇవన్నీ అతని వెంటాడటం వల్ల ఆ స్థితికి దిగజారాడు. దీనికి కారణం సమాజం. సమాజమే అతని ఆత్మనూన్యతాభావానికి కారణం.

కథకుడు ఒకరోజు శ్రీనివాసులు తండ్రి మాటల్లో తన కొడుకు తనకు అన్నం పెట్టకపోయినా నాడు బాగుండాల అన్న మాటలు స్ఫురించాయి. కథకుడిని శ్రీనివాసులు తండ్రి తన స్థితిలో తాను గౌరవించాడు. ''మాదిగోళ్లు అనే మాటకు ఏమైనా బూతు అర్థం ఉందా? '' అని కథకుడిని అడిగాడు. అంతేగాక ''మమ్మల్ని హరిజనులని ఎందుకంటారు బాయెల్లు, బలిజోల్లు అన్నట్లు మమ్మల్ని మా కులం పేరుతో మాదిగోళ్లు అని పిలవకుండా'' అన్నాడు. శ్రీనివాసులు తండ్రి కథకుడికి తిరుగు ప్రయాణంలో బండి కట్టి సహకరించాడు. అప్పుడు కథకుడు అనుకున్నాడు ''శ్రీనివాసులు బతుకు వేళ్లు అతడు పుట్టి పెరిగిన భాషలోనూ, మనుష్యుల్లోనూ, మట్టిలోనూ లేవు. మరొక కొత్త వాతావరణంతో ఉన్నాయి. తల్లి మట్టిలోనికే సరిగ్గా పాతుకోని వేళ్లు ఇతర వాతావరణంలో పాతకుంటాయా? ''

శ్రీనివాసులు తండ్రి మనస్తత్వానికి విరుద్ధం శ్రీనివాసులు చెప్పకోలేని తను కులం గొప్పతనాన్ని తండ్రి చెప్పాడు మానవులు జీవితంలో అభివృద్ధికి పయనించడానికి ఒక పునాది అవసరం. ఆ పునాది లేకుండా మేడలు కట్టడం అసాధ్యం. ఇలాంటిది శ్రీనివాసులు మనస్తత్వం శ్రీనివాసులుకు తాను గొప్ప చెప్పుకోవడం ఒక వేళ మంచిది కావచ్చేమో కాని తన కులాన్ని గూర్చితక్కువగా చేసిమాట్లాడటం తప్పు ఒక సామాన్య హరిజనుడు తన ఉనికిని కాపాడుకోవడం కోసం తన కులాన్ని చెప్పకపోవడంలో అర్థముంది కాని విద్యావంతుడు, ఉద్యోగి , ఆర్థికంగా అభివృద్ధి చెందినవాడు అలా చెప్పడం గౌరవప్రదం కాదు.

**3.2.3.2. బంది** :- హరిజనులుకూడా సవర్ణులతో సమానం అని నిరూపించే కథ. రచయిత బి.యస్. రాములు. కథకుడు ఎమ్మెస్సీ బి.ఇడి. ఒక గ్రామంలో ఉపాధ్యాయుడుగా జీవితాన్ని ప్రారంభించాడు. తాను హరిజనుడు కావడం వల్ల ఆ గ్రామంలో అతనికి అద్దె ఇల్లు కరువయింది. ఆ గ్రామస్థులు కథకుడికి హరిజనవాడలో అద్దె ఇల్లును చూసుకోమని సలహా ఇచ్చారు. అదే స్థితిలో ఆ గ్రామ రెడ్డి యువతి ఆ బడిలో టీచర్‌గా పనిచేసేది, కథకుడిని ప్రేమించింది. ఆమె కూడా అతని కులం కారణంగా తన ఇంటిని అద్దెకు ఇవ్వడానికి సాహసించలేదు. కథకుడికి ఆ గ్రామంలో ఉద్యోగం చేయడం ఇష్టం లేక ప్రక్క గ్రామానికి బదిలీ చేయించుకొన్నాడు. అప్పుడప్పుడు రేణుకను చూడడానికి ఆ గ్రామం వచ్చేవాడు. రేణుకను మనస్పూర్తిగా ప్రేమించాడు. కథకుడు ఆర్డీవో అయ్యాడు. రేణుక కుటుంబం సంతసించింది. రేణుక తల్లిదండ్రులు కథకుడితో తమ కూతురిని తీసుకెళ్ళి వివాహమాడమన్నారు. కాని అతను సాంప్రదాయ పద్ధతిలో వారి ఇంట్లోనే వివాహం జరగాలని పట్టుపట్టాడు. అందుకు రేణుక తల్లిదండ్రులు నిరాకరిస్తే తన కులానికి చెందిన 'మల్లిక' ను వివాహం చేసుకొన్నాడు. కాని రేణుకతో సంబంధాలు తెంచుకోలేదు. మల్లిక రేణుక స్థితిని తెలుసుకొని ఆమెను రెండవ పెళ్లి చేసుకొమని తన భర్తకు సలహా ఇచ్చింది. ఈలోగా రేణుకను గూర్చి సమాజం చెడ్డగా అనుకోవడం వల్ల ఆమె తండ్రి ఆత్మహత్య చేసుకొన్నాడు కాని ఇప్పటికీ వారి ప్రేమ సంబంధాలు తెగిపోలేదు.

కథలో కథకుడికి వ్యక్తిత్వం వుంది. తన వ్యక్తిత్వాన్ని కాపాడుకోవడంకోసం తన ప్రేమను త్యాగం చేశాడు. గ్రామంలో తనకు అద్దెకు ఇల్లు ఇవ్వని సవర్ణుల పిల్లలకు విద్యను బోధించడానికి నిరాకరించాడు. ఒకప్పుడు కథకుడికి అద్దె ఇల్లు ఇవ్వడానికి భంగపడ్డ రేణుక కుటుంబం అతను ఉన్నత అధికారి అయితే స్వార్థంతో తమ కూతురునే అతనికి భార్యగా చేయడానికి ప్రయత్నించింది. మానవుడు స్వార్థం కోసం కాలానుగుణంగా ఎలా మారిపోతాడో తెలియజేస్తుందీ కథ. రచయిత ఈ కథద్వారా విద్య, ఉద్యోగం, ధనం పుష్కలంగా వున్న హరిజనుడు సవర్ణులతో సమానంగా చూడబడుతాడని వివరించాడు.

**3.2.4. విద్యా జీవితం** :- హరిజనులు తరాలుగా విద్యకు దూరంగా ఉంచబడ్డారు. ఆంగ్లేయులు భారతదేశంలో అడుగుపెట్టడం క్రైస్తవమతాన్ని ప్రచారం చేయడం వల్ల హరిజనులను క్రైస్తవులుగా

పిలుచుకోవడం వల్ల వారికి విద్య సాధ్యమయింది. అంతకుమునుపు హరిజనులు తాము పాలేరు పనికి మాత్రమే అర్హులమని, తమ బ్రతుకులు బానిసలుగానే వుండాలని అనుకొనేవారు. హరిజనులు విద్యావంతులు కావడానికి గాంధీ, అంబేద్కర్‌లు కొంత కృషిచేశారు. హరిజన విద్యను కథానికా సాహిత్యంద్వారా పరిశీలిద్దాం.

**3.2.4.1. పాకీది** : హరిజన విద్యార్థి చదువుకోవాలని ప్రయత్నిస్తే సవర్ణులు అడ్డుకొనే ప్రయత్నాన్ని చిత్రించే కథ. రచయిత అనిశెట్టి సుబ్బారావు. నాగు, కోటి ఇద్దరూ ఒక తరగతి. నాగు ధనవంతుని కొడుకు, కోటి పాకిపని చేసే మాచికొడుకు నాగు కోటితో వుండటం నాగు తండ్రి భాస్కరావ్‌కు ఇష్టముండదు. మాచి తన కొడుకును బాగా చదివించి ప్రయోజకున్ని చేయాలని వుంటుంది. కోటి చదువుకోవడం అతని చిన్నాన్నకు ఇష్టముండదు. కోటిని పనిలోకి వెళ్లమనేవాడు. భాస్కరరావ్ నాగూతో ఒకసారి వెధవ పిల్లలందరితో స్నేహం చేస్తున్నావంట. '' కోటితో మాట్లాడినావంటే వొళ్లొలిచేస్తా''36 నంటూ హెచ్చరించాడు. ఆ రోజునుండి నాగు, కోటి కలవలేదు. కోటి చిన్నాన్నవాడి పలకా, పుస్తకాలు తీసుకొని పాకీ డబ్బాలో విసిరి '' వెధవ, చేజారిపోయ్యాయ్ నీకు చదువెందుకు''37 అంటూ అరిచాడు. వట్టి చేతులతో కోటి బడికి వెళుతుంటే ఒకడు వాడికి పాకీడబ్బా అందివ్వబోయాడు. మరుసటి రోజు పంతులు కోటిని బడికి రానివ్వలేదు. ''వెళ్ళు....నాగూతో మాట్లాడావో వొళ్ళుచీలుస్తా... భాస్కరావ్ వూరుకోరు. నిన్నేరా అబ్బాయి పో''38 అన్నాడు. కోటి బాధతో బడినుండి తిరిగివచ్చాడు. మాంచి పంతులు దగ్గరకు వెళ్ళి తన కొడిక్కి చదువు చెప్పమని బ్రతిమాలింది. పంతులు భాస్కరావ్‌ను అడగమంటాడు. ''పొరపాటున ఆయన వద్దకు వెళ్ళావో బ్రతికి ఇంటికి పోలేవు''అంటాడు. విధిలేక మాచి అప్పటి నుండి తన కొడుకును పాకీ పనికి వెళ్లమని నచ్చచెప్పింది.

నాడు హరిజనులకు చదువుకోవాలన్నా పరిస్థితులు అనుకూలించేవి కావు. ఆ వర్గం వాళ్లే అందుకు అడ్డుపడడానికి సవర్ణులు అవకాశం కల్పించేవారు. అందువల్ల హరిజనుల ప్రయత్నాలకు ఆదిలోనే గండి పడేది. కోటి చదువుకోవాలని తాపత్రయ పడితే, తన పినతండ్రి అవరోధం కలిగించాడు. కోటి నాగూతో స్నేహంగా వుంటే తన కొడుకు ఒక అస్పృశ్యునితో స్నేహంగా వున్నాడనే దురాలోచనతో వాడిని తన కొడుకును దూరంగా వుంచడానికి ప్రయత్నించాడు. కోటి అస్పృశ్యుడవటం వల్ల విద్యను కూడా తాకరానివాడయ్యాడు సవర్ణుడైన భాస్కరరావ్‌కు భయపడి తన చదువును స్వస్తి చెప్పవలసివచ్చింది. దీనివల్ల చదువుకొని విద్యావంతుడు కావాలన్న కోటి కలలు చదివించి మంచి ప్రయోజకుడిని చేయాలన్న మాచి కల కలలుగానే మిగిలిపోయాయి. హరిజనుడు అభివృద్ధి చెందడానికి ప్రయత్నిస్తే సవర్ణులు వారిని అణగద్రొక్కడం సనాతన సంప్రదాయం అయింది.

అలాగే బమిడి జగదీశ్వర రావు రాసిన 'జలగ' కథలో తొమ్మిదవ తరగతి చదువుతున్న హరిజన విద్యార్థి సూరి. విద్యావంతులవుతున్న యువతరంలో పెంపొందుతున్న ఆత్మ విశ్వాసాన్ని శ్రమ జీవన సంస్కృతిని అగ్రవర్ణాలకూ హరిజనులకూ మధ్య సంబంధాలలో వస్తున్న మార్పులని చిత్రించడం సమస్యాత్మకమైన ఇతివృత్తాలను స్వీకరించడం కన్పిస్తుంది.

**2.2.4.2. లేత మొలకలు** :- చదువు పేరుతో హరిజన పిల్లలను మోసగించిన విషయాన్ని చిత్రీకరించిన కథ. రచయిత అరిగే రామారావు. కొండడు సీతాలుకొడుకు. ఒకరోజు సీతాలు ఇంటికి పట్నంనుండి వాళ్ల బంధువు నరసిహ్మ వచ్చాడు. కొండడిని చూసి సంతోషించి వాడిని పట్నం తీసుకెళ్లి బాగా చదివిస్తానని సీతాలుతో చెప్పాడు. సంతసించిన ఆమె తన కొడుకును నరసిహ్మచేత చదువుకోసం విజయవాడకు పంపింది. కొండడిని తీసుకెళ్లిన నరసిహ్మ డబ్బు కోసం వీడిని మస్తాన్‌కు అప్పగించాడు. మస్తాన్ వీడిని హైదారాబాద్ కు తీసుకెళ్లి ఒక ఇంట్లో పనిమనిషిగా వుంచాడు. చదువు కోవాలని ఆశతో పట్నం వచ్చిన నిరాశ ఎదురైంది.

సంఘంలో అమాయకులైన హరిజనులను చదువు పేరుతో చేసే మోసం కన్పిస్తుంది. కొండడు చదువుపై అభిమానంతో కన్న తల్లిదండ్రులను వదలి నమ్మినవాడి వెంటపోతే తోడి హరిజనుడే కొండడని మోసం చేసివాడి ఆశను నిరాశ చేశాడు.

**3.2.5. స్త్రీ జీవితం :-** సవర్ణులు హరిజనుల రక్తమాంసాలను పీల్చి పిప్పి చేసి వాళ్ళను తమ కాలిక్రింద చెప్పుల్లాగా చేసుకొన్నప్పటికీ తృప్తిపడక వారి స్త్రీల మాన ప్రాణాలను కూడా హరిస్తుంటారు. ఇది అన్యాయం, అక్రమం, అమానుషం అని తెలిసి కూడా హరిజనులు అగ్రవర్ణాలను ఎదిరించలేక శారీరకంగా మానసికంగా బాధపడ్డారు. సవర్ణులకు నిమ్నకులస్థులుగా చూడబడే హరిజనులకు కూడా మానప్రాణాలా? అనే చిన్నచూపు వుండటం. తమ భర్తల యెదుటే వారిని అనుభవిస్తుంటే రక్షించేవారు లేక నిరాశ్రయులయ్యారు. బలిపశువులయ్యారు. కథానికా సాహిత్యం ద్వారా వీరి జీవితాలను గమనించటం ప్రస్తుత కర్తవ్యం.

**3.2.5.1. పశువుల కొఠం :-** ఒక హరిజన యువతి తన వద్దకు రాలేదని తాను వలచిన ప్రియుని దూరం చేసిన సవర్ణుని కథ. రచయిత కరుణ కుమార. పెంచెలి మాలవెంకటి గాడి కూతురు. రోజు పట్టణంలోని పోలీసు సూపరెంటెండెంట్ గుర్రానికి గడ్డి తీసుక వెళుతుంది. ఆ గుర్రానికి పని మనిషిగా వున్న సుబ్బడిని పెంచెలి ప్రేమించింది. ఇద్దరూ పెళ్లి చేసుకోవాలనుకొన్నారు. ఆ ఊళ్లోనే రాయుడు భూస్వామి. చాలా కాలంగా పెంచెలిని అనుభవించడానికి ప్రయత్నిస్తున్నాడు. ఒక రోజు సాయంత్రం పెంచెలిని తన వద్దకు తీసుకరమ్మన్నాడు. సుబ్బడు పెంచెలితో ''రాయుడు మోజుపడి కులమయినా పాటించకుండా అడుగుతుంటే ఎన్నాళ్లని ఇట్లా ఎగర్తించి పోగలవే? పిచ్చి పిచ్చి చేష్టాలు చేయవోకనే తీసుకపోతారా'' అన్నాడు. పెంచెలి ఇక అక్కడుంటే పరాభవం కాకతప్పదని తెలుసుకొని అతి కష్టం మీద వారి బారినుండి తప్పించుకోగలిగింది. రాయుడు పంతం మాత్రం ఇంకా ఎక్కువయింది. పెంచెలి ఆ రాత్రి త్వరలోనే సుబ్బడిని పెళ్ళాడి ఊరువిడిచి వెళ్లి పోవాలనుకొంది రుబ్బడి విషయం తెలిసిన సుబ్బడు రాయుడితో పెంచెలి రుబ్బడి వ్యవహారాన్ని తెలియజేశాడు. రోశిగాడికి పెంచెలి మేనకోడలని వాడిని పెళ్లి చేసుకోనందుకు వాడు బాధ పడుతున్నాడని చెప్పాడు. రాయుడు పెంచెలిపై అబద్ధాలు చెప్పి వాటిని రుబ్బడికి తెలియజేయుమన్నాడు. సుబ్బడి ద్వారా అబద్ధాలు బలమైన దెబ్బలు కొట్టాడు. పెంచెలి ప్రేమవిఫలమై తీవ్ర గాయాలతో మనస్సు చలించి తెలుసుకొన్న రుబ్బడు పెంచెలిని పెళ్లి చేసుకోవడానికి నిరాకరించి చివరికి రాయుడు పశువుల కొఠం వద్దే చనిపోయింది.

హరిజనుల కష్టాలు సవర్ణులకు సుఖాన్ని కల్గిస్తాయి. కష్టాల కడలిలో ఈదుతున్న హరిజనులు తమ బ్రతుకులు తాము బ్రతకడానికి ప్రయత్నిస్తే వాటిని హరింపజేసి తృప్తిపొందే సవర్ణులు కూడా వుంటారని ఈ కథ తెలియజేస్తుంది. కథలో పెంచెలి రుబ్బడిని ప్రేమించి పెళ్లి చేసుకోదలిస్తే ఆమె ఒక్కసారైనా తన వద్దకు రాలేదని ఆమె జీవితానికే బిందువు పెట్టాడు. పెంచెలి మనస్తత్వం తెలిసి కూడా సుబ్బడు ఆమెను కూతురుతో సమానంగా చూడవలసినవాడు రాయుడు పెట్టే గడ్డితిని పెంచెలిని రాయుడు దగ్గరికి తీసుకువెళ్లడానికి ప్రయత్నించడం వాడి క్షీణదశ. రచయిత ఈ కథ ద్వారా సవర్ణుల వల్ల అమాయకులైన హరిజన యువతులు ఎలా బలి అవుతున్నారో తెలియజేశాడు.

**3.2.5.2 . కీచక వధ :-** తన పాలేరు భార్యనే అనుభవించాలని ప్రయత్నించి ప్రాణాలు పోగొట్టుకొన్న సవర్ణుడి కథ. రచయిత పులికంటి కృష్ణారెడ్డి. బసివి రెడ్డి పాలేరు వెంకటరాముడు రెడ్డి పొలంలో నిద్రాహారాలు మానపని చేశాడు. ఒకరోజు రాత్రి బావి వద్ద మోటతోలుతుండగా బావిలో పడి చనిపోయాడు. బసివి రెడ్డి వెంకటరాముడి కుటుంబానికి సంతాపం తెలిపాడుకాని వారిని ఆర్థికంగా ఆదుకోలేదు. అది అన్యాయం అని ఊరి ప్రజలు అనుకోవడం విన్న బసివిరెడ్డి ఒక రోజు పంచాయతీ పెట్టించి తన కుటుంబానికి

వెంకటరావుడు చాలా సహాయం చేశాడని తనకు వేయి రూపాయిలు బాకి వున్నాడని ఇకపై వాడి భార్య ఆ బాకీని చెల్లించక తన ఇంట్లోనే పని చేసుకోవచ్చునన్నాడు. పంచాయతీ ముగిసి వెంకటరాముడి భార్య ఇంటికి వెళుతుంటే ఆమె అందాన్ని చూసి అనుభవించాలనుకొన్నాడు. దానిని ఆసరాగా తీసుకొని సిద్దులుగాడు రెడ్డిని చంపడానికి ప్రయత్నించి, రెడ్డితో వెంకటరాముడి భార్యను ఎలాగైనా మీరే ఆదుకోవాలని ఈ రాత్రికి కానమాకల బావి దగ్గర మీ ఇద్దరికి మంచం వేస్తానని చెప్పాడు. రెడ్డి అర్ధరాత్రిలో కానమాకు బావి దగ్గరకు వెళ్ళడంతో అక్కడ అడవి పందులను చంపడం కోసం పొలంలో పెట్టిన నల్లమందు ఉండగలను త్రొక్కి చనిపోయాడు. రెడ్డి చావును విన్న సిద్దులుగాడు ''ఓరే ముదనష్టపు ముండానా కొడుకుల్లారా మాసెవటతో తానవాడు తానంటా వుంటారు. ఇదంతా సొల్లని వూ ఆడపడుసులు కావాల్నా''40 అంటూ వెంకటరాముడు చచ్చిన బావిలో ఈతకొడుతున్నాడు.

సవర్ణులు అప్పుల పేరుతో హరిజనులను పాలేరు ఊబిలోనికి దింపి జీవితాంతం వారితో సేవలు చేయించుకోవడం వారి ధోరణి. అలాంటి అప్పుల ఊబిలో ఒక్కొక్కసారి రెండు, మూడుతరాలు కూడా హరిజనులు సేవ చేయాల్సిందే. ఆ స్థితిలోపాలేర్ల భార్యలపై దొరకు సగం హక్కు వుందని వారిచే సుఖాలను తీర్చుకోవడం పరిపాటి. కథలో జరిగిన విషయం ఇదే. తన జీతగాడు బావిలో పడి చస్తే బజారు పాలైన వాడి కుటుంబాన్ని ఆదుకోవలిసిన బసిరెడ్డి వారిని ఆదుకోక వాడి పెళ్లాన్ని అనుభవించాడానికి ప్రయత్నం చేయడం దుష్టబుద్ధికి కారణం. పశుత్వానికి నిదర్శం. సవర్ణుడు తన పాలేరునుండి ఏదోఒకటి ఏదో రకంగా సాధించడానికే ప్రయత్నిస్తాడు కాని వాడి కష్టాలను గూర్చి ఆలోచించడనడం ఈ కథకు తార్కాణం. ఈ ఆలోచనవల్లే రెడ్డి తన మరణాన్ని కొని తెచ్చుకొన్నాడు. కథలో పాలేరు కుటుంబాలు కూటి కోసం పడే కష్టాలను రచయిత వివరించాడు.

**3.2.5.3. ఇరుకువూను** :- దొంగతనం చేసిన హరిజనుణ్ణి విడిపించి వాడి కూతురును తన వద్దకు పంపించమని కన్నతండ్రిని అడిగిన సవర్ణుని కథ. రచయిత పులికంటి కృష్ణారెడ్డి. వెంకటయ్య సూలక్క భార్యాభర్తలు. వారికి పెళ్లీడుకొచ్చిన కూతురు వుండేది. తన కూతురు పెళ్లి చూపులకు అతిథులువస్తున్నారని తెలిసిన వెంకటయ్య వారికి ఆతిధ్యం ఇవ్వడం కోసం ఇంట్లో బియ్యం లేక, నాయుడు రెడ్డి ఇళ్లకు ధాన్యం అడుక్కోవడానికి వెళ్లాడు. చిన్నప్పుడు వెంకటయ్య వాళ్ల ఇళ్లల్లో నాయుడమ్మ, రెడ్డెమ్మ చెప్పిన పనులన్నీ చేశాడు. తత్ఫలితంగా వారు వెంకటయ్యకు అన్నం మాత్రమే పెట్టేవారు. పూర్వం తాను చేసిన పనులకు దయదలచి కొన్ని వరిగింజలు పెడుతారని వెంకటయ్య ఆశపడ్డాడు. కాని ఆ రెండిళ్ళ వెంకటయ్యకు మొండిచేయి చూపించడంతో వెంకటయ్య నిస్సహాయతతో ఇంటికి తిరిగి వచ్చాడు. అతిథుల వద్ద అవమానం పాలుకాకూడదనీ, ఎలాగైనా వారికి అన్నం పెట్టాలని దొంగతనంగా వరిగింజలను సంపాదించడానికి వెళ్లిన వెంకటయ్య నాయుడు, చిన్నపరెడ్డి పొలంలో కొన్ని గింజలుజరువుకొని గొల్లగోవిందు పొలంలొ కొన్ని జవురుకుంటుండగా గోవిందు కొడుకులు వెంకటయ్యను పట్టుకొన్నారు. దేవాలయంలో కట్టేసి రాత్రంతా కొట్టారు. తెల్లవారి చిన్నపరెడ్డి వచ్చి వెంకటయ్యను విడిపించాడు. వెంకటయ్య తన ఇంటికి వెళ్లక రెడ్డి ఇంటికి వెళ్ళి తనతప్పును క్షమించమనే ధోరణలో రెడ్డివైపు చూశాడు. రెడ్డి వెంకటప్పుయను బాధపడవద్దని చెప్పి ఇంటికెళ్లి తన కూతురును పంపమన్నాడు.

తన కూతురుకు పెళ్లి చూపులకు వస్తుంటే ఇంట్లో కనీసం తిండి గింజలు లేని వెంకటయ్య వయస్సులో సవర్ణులందరికి తమ వంతు కష్టాన్ని అందించాడు. అందుకు ప్రతిఫలంగా కడుపునింపుకోగలిగాడు కాని సంపాదించలేకపోయాడు. పెద్దవారు కూడా అని సవర్ణుల నుండి సహాయాన్ని వెంకటయ్య ఆశిస్తే. వారు సహాయం చేయలేదు సరికదా అవమానంగా మాట్లాడారు. తప్పని స్థితిలో దొంగతనం చేస్తే చిన్నపరెడ్డి

ఆ అవకాశాన్ని ఆసరాగా తీసుకొని అతనిని వంచించడానికి ప్రయత్నించాడు . కన్నబిడ్డనే తన వద్దకు పంపమని అడిగే స్థితిలో సవర్ణులు వున్నారంటే హరిజనులు ఎలాంటి స్థితిలో వున్నారనడాన్ని గుర్తించవచ్చు. కులగౌరవం కూడా రెడ్డికి లేకపోయింది. రచయిత ఈ కథ ద్వారా హరిజనులు సవర్ణులను ఏదీ అడుక్కొనే స్థితిలో వుండక స్వశక్తితో కష్టించి సంపాదించుకోమని సలహా ఇచ్చాడు.

**3.2.6. రాజకీయ జీవితం** :- తమ కష్టార్జిత పలితాలను అనుభవిస్తూ తమ జీవితావసరాలను పొందడానికి ప్రతిజాతికీ హక్కువుంది. దాని మూలానే భారతీయుల అభివృద్ధికి సంపూర్ణ అవకాశాలున్నాయి. ఏ ప్రభుత్వమైనా ప్రజల హక్కులను తృణీకరించి వాళ్ళను అణగత్రొక్కడానికి పూనుకుంటే ఆ ప్రభుత్వాన్ని మార్చడానికి అవకాశం వుంది. ఆ అవకాశం కొద్దిమంది వ్యక్తుల చేతుల్లోనే కేంద్రీకృతమయ్యింది. వారు ఇతరులను బానిసలుగా చేసుకొని లేదా వాళ్ళు ఎదురు తిరిగితే బుజ్జగించో, లేదా తమదారినుండి తప్పించో వారితోనే తమ పనులు చేయించు కొంటున్నారు. ఆ బానిసలే హరిజనులు. రాజకీయంగా అభివృద్ధి చెందలేక, చెందాలనే తపనలేక దుర్భర జీవితాన్ని సాగిస్తున్నారు. వీరి రాజకీయ జీవితాన్ని కథానికా సాహిత్యంలో పరిశీలిద్దాం.

**3.2.6.1. పావులు పాములుగా మారిన వేళ** :- హరిజనులను సవర్ణులు ఎన్నికల సమయంలో ఎలా ఉపయోగించుకుంటారో తెలియజేసే కథ. రచయిత సి. యస్. రావు. రెడ్డి పాలెం గ్రామ పంచాయతీ ప్రెసిడెంటు ఎన్నికల్లో నర్సయ్య, సూరన్న పోటీ పడుతున్నారు. ఆ గ్రామ ప్రస్తుత ప్రెసిడెంటు సూరన్న. ఎన్నికల వల్ల రెడ్డి పాలెం రెండు వర్గాలుగా చీలిపోయింది. హరిజనులు కూడా రెండు వర్గాలుగా చీలిపోయారు. ఎన్నికల ప్రచారం మొదలైంది. ఇరు వర్గాల హరిజనులు సారాయి త్రాగి ప్రచారం మెదలుపెట్టారు. సూరన్న ప్రక్క హరిజన రాజిగాడు ప్రచారం చేస్తూ రెండు వర్గాల ఘర్షణలో పడి చనిపోయాడు. రాజిగాడి శవాన్ని సూరన్న వర్గం ఉపయోగించుకొని ఊరంతా ఊరేగించింది. ఆ సానుభూతితో మరుసటి రోజు జరిగిన ఎన్నికల్లో సూరన్న పంచాయతీ ప్రెసిడెంటు అయినాడు. గ్రామంలో సూరన్న, నర్సయ్య వర్గాలు కేసులు నడుపుతున్నారు. ఈలోగా అసెంబ్లీ ఎన్నికలొచ్చాయి. ఆ నియోజక వర్గ అభ్యర్థి రెడ్డిపాలెం వచ్చి మంచి మాటలు చెప్పి సూరన్నను నర్సయ్యను ఏకంచేశాడు. ఈ విషయం తెలుసుకొన్న హరిజనులు రాజిగాడి మరణానికి కారకులెవరని అనుకొన్నారు. మాల వృద్ధులు 'పెద్దోళ్లు పెద్దోళ్లు ఎప్పుడూ ఒకటేరా. కాలికి కత్తికట్టి కోడిపుంజును కోడిపుంజు మీదికే వదిలినట్లు మనోళ్లని మనోళ్ల మీదికే వుసిగొలుపు తార్రా పెద్దోళ్లు.'' చివరికి వాళ్లే గొప్ప అంటారు. అప్పటివరకూ పావులుగా వున్న హరిజనులు, తమకు జరిగిన అన్యాయానికి పాములై బుసకొట్టడానికి ప్రయత్నించారు.

**3.2.6.2. సమిధులు** :- పై కథలాంటి ఇతివృత్తాన్ని తెలియజేసే మరో కథ. రచయిత చిలుకూరి దేవపుత్ర. ఆ గ్రామపంచాయతీ ప్రెసిడెంటు ఎన్నికలొచ్చాయి. ప్రెసిడెంటు గిరికి మల్లారెడ్డి, కేశవరెడ్డి పోటీ చేశారు. వాడలో కొల్లప్ప కొడుకు పోతప్ప. కేశవ రెడ్డికి పోతప్ప అంగరక్షకుడు. అలాంటి వాడిని మరుసటి రోజు పొలం నుండి వస్తుండగా మల్లా రెడ్డి కొడుకు తిప్పారెడ్డి హత్యచేశాడు. అప్పటినుండి కేశవరెడ్డి తిప్పారెడ్డిని ఉరి కంబం ఎక్కిస్తానని ప్రతినబూనాడు. ఈలోగా ఆ నియోజక వర్గ అభ్యర్థిగా సుబ్బరాయుడు పోటీ చేశాడు. అతను ఆ గ్రామానికి వచ్చి మాయమాటలు చెప్పి కేశవరెడ్డిని, మల్లారెడ్డిని ఏకం చేశాడు. అది తెలిసిన కొల్లప్ప కేశవరెడ్డి వద్దకు వచ్చి తన కొడుకు సంగతి అడిగాడు. కేశవ రెడ్డి ఆరోజు పోతప్పే త్రాగి తిప్పారెడ్డి పైకి వెళ్లాడని. అందువల్లనే తిప్పారెడ్డి చంపాడని, ఈ విషయాన్ని వదిలిపెడితే రెండెకరాల భూమిని ఇస్తానని ఆశ పెట్టాడు. కొల్లప్ప ''మీరు పెద్దోళ్లు ఏ విధంగానైనా మాట్లాడుతారు సామి'' అన్నాడు తనకు న్యాయంజరిగేంతవరకూ అక్కడ నుండి కదలనన్నాడు. దాంతో ఉగ్రుడైనకేశవ రెడ్డి కొల్లప్పను చంపాడు.

మరుసటి రోజు పోలీసులతో తన కొడుకు చనిపోయినప్పటి నుండి కొల్లప్పకు పిచ్చి పట్టిందని అది ముదిరి నిన్న చనిపోయాడని రిపోర్టు ఇచ్చాడు. ఆమాటే నిజం అని హరిజనులు కూడా సాక్ష్యం చెప్పారు.

హరిజనులు రాజకీయంగా తుచ్ఛ సౌఖ్యాల కోసం సవర్ణుల చేతిలో బలయ్యారు. వారి మెప్పు కోసం మంచివాళ్లు అనిపించడం కోసం ఇంకా వారికి దగ్గరవాలనే తపనతో తమకు ఒన గూడని ప్రయోజనం కోసం తపన పడ్డారు. సవర్ణులు స్వార్థపరులని అవసరాలకు ఉపయోగించుకొని అవతల పారవేస్తారని గుర్తించలేకపోయారు. సవర్ణులకు కూడా హరిజనులు చేసిన సహాయానికి కించిత్తైనా కృతజ్ఞత లేకుండా ప్రవర్తించడం, వారినే మోసపూరిత ధోరణిలో హింసించడం అవసరమైతే అంతం చేయడానికి ప్రవర్తించారు. మనసున్న మనుషులుగా కాక క్రూరులుగా మారి, కల్మస ప్రపంచాన్ని సృష్టించడం మొదలుపెట్టారు. పై రెండుకథల ద్వారా రచయితల హరిజనులు సవర్ణుల కలహాల్లో బలిపశువులు కావద్దని హెచ్చరించారు.

**3.2.6.3. పాపం కుంటేలుగాడు** :- పాఠశాలలో విద్యార్థి నాయకుడుగా హరిజనుడు పోటీ చేస్తే జరిగే పరిస్థితిని తెలియజేసేకథ. రచయిత పులికంటి కృష్ణారెడ్డి. పాఠశాలలో ఎన్నికలు జరుగుతున్నాయి. విద్యార్థినాయకుడి పదవికి రెడ్డి కొడుకు , హరిజన విద్యార్థి పోటీ పడ్డారు. ఇరువర్గాలు ప్రచార నిమిత్తం ఊళ్లో గోడలపై తమపేర్లు రాయడానికి రిజర్వుచేశారు. హరిజన విద్యార్థి రిజర్వుచేసిన గోడలను చూసిన రెడ్డి కొడుకు ''ఈ నాకొడకల కేడ చూసినా రిజర్వేషన్లు కావాలల్నే చదుకోవాలంటే రిజర్వేషన్, మళ్లీ చదువుకుంటే ఉద్యోగాల్లో రిజర్వేషన్ ప్రమోషన్లలో రిజర్వేషన్, వయస్సులో రిజర్వేషన్ కడుకు మా గోడల మింద కూడా రిజర్వేషన్ ఉండే రిజర్వేషన్లు చాలుగాని కొడుకులకు మనస్లోగన్స్ రాయంగ్రా రాయుండి''42 అన్నాడు. ఇది అన్యాయమన్నా హరిజన విద్యార్థిని రెడ్డికొడుకు కొట్టాడు దానితో హరిజనవిద్యార్థి వాడయువకుల సహాయంతో రెడ్డికొడుకు గుంపును ఆసుపత్రి పాలు చేశాడు. దీంతో రెచ్చిపోయిన రెడ్డి ఆరాత్రికి వాడ గుడిసెలకు నిప్పు పెట్టాడు.

ఒకమనిషి కొన్ని వనరులను ఉపయోగించుకొని అభివృద్ధి చెందుతుంటే సాటి మనిషి ఓర్వలేక పోవడం మానవ నైజం. అంతేగాక అవసరమైతే వాడి అభివృద్ధికి అడ్డుపడటానికి పరోక్షంగా ప్రయత్నిస్తాడు. కథలో హరిజనుల ప్రగతి కోసం ప్రభుత్వం రిజర్వేషన్ పెడితే అది సహించలేని రెడ్డి కొడుకు ఏకంగా హరిజన కులాన్నే దూషించాడు. చేసిన అన్యాయంచాలక హరిజన విద్యార్థినే కొట్టాడు. సవర్ణుల దౌర్జన్యకరమైన విషయం ఇది. హరిజనులు చైతన్యవంతులై రెడ్డికొడుకు దుడుకును ఆపడానికి ప్రయత్నించారు. హరిజనులు తలచుకుంటే ఏది ఆగదని రచయిత ఈ కథ ద్వారా నిరూపించాడు.

**3.2.6.4. గోర్లు** :- నేటి సమాజంలో హరిజన మంత్రి పరిస్థితిని తెలియజేసే కథ. రచయిత డా.బి. దామోదరరావు. నర్సింహులు బాగా చదువుకొన్నాడు. అల్లరచిల్లరగాతిరిగాడు. ఆ ప్రాంతం అసెంబ్లీ సీటు రిజర్వుడు కావడం వల్ల విధిలేక రాఘవరెడ్డి నర్సింహులును అభ్యర్థిగా పోటీ చేయించి గెలిపించాడు. మంత్రి ని చేసాడు. ఒకసారి వాళ్ల గ్రామంలో పొలం వద్ద రాఘవరెడ్డి మనుషులకు హరిజన చంద్రిగాడి మనుషులకు ఘర్షణ పడింది. కొన్నాళ్లకు హరిజన ఏనుపాదంను సవర్ణులు చంపారు. అది అన్యాయమని తమ చుట్టం, మంత్రి అయిన నర్సింహులు తమకు సహాయం చేస్తాడని యాదగిరి వెళ్లాడు. అప్పటికే తనకు జైలు శిక్ష తప్పదని తెలుసుకొన్న రాఘవరెడ్డి నర్సింహులును కలసి లాలూచిపడి ఆకేసు మాఫీచేయించుకోవడానికి ప్రయత్నాలు చేస్తున్నాడు. యాదగిరి ప్రయత్నంతో మూడవ రోజు కనిపించిన నర్సింహ యాదగిరితో గ్రామంలో రాఘవ రెడ్డి లాంటివాళ్లతో గొడవ పెట్టుకోవద్దని, ఏనుపాదం తండ్రికి వాచ్‌మన్ ఉద్యోగం ఇప్పిస్తానని. ప్రస్తుతం తాను అందరికి ప్రతినిధినని, కేవలం తమ కులానికే కాదని నచ్చచెప్పి పంపించాడు. తమకు నర్సింహులు చేసిన అన్యాయాన్ని తెలుసుకోలేని హరిజనులు రెండవసారి ఓట్లేసి గెలిపించి మంత్రిని చేశారు.

నేడు సమాజంలో ఉన్నతస్థాయిలో వున్న హరిజన మంత్రులు తమ వ్యక్తిత్వాన్ని చంపుకొని సవర్ణులకు తొత్తులుగానే పని చేస్తున్నారనడానికి ఈ కథ తార్కాణం. కథలో నర్సింహులు. ఉన్నతవిద్య చదువుకొని ఎన్నికల్లో పోటీ చేస్తే తమ కులస్థులందరూ ఓట్లు వేసి గెలిపించారు. తమ కులంవాడని, తమ కష్టాలను తీరుస్తాడని తపనపడ్డారు. అలాంటి వీరి ఆశలను నర్సింహులు వమ్ము చేశాడు. స్వార్థంతోనూ సవర్ణులపైన అభిమానంతోనూ తమ కులంవాళ్లకే ద్రోహం చేశాడు. సవర్ణులు హరిజనులపై ఘర్షణకు దిగి హరిజన ఏసుపాదంను హత్య చేసి ఒక హరిజనుడితోనే ఆ కేసును కొట్టివేయించడం హాస్యాస్పదం. ఆలోచనారహితం. ఇలాంటి వారు ఎన్ని పదవులు చేపట్టినా హరిజనబ్రతుకులు మాత్రం అలానే వుంటాయి. రచయిత ఈ కథ ద్వారా సమాజంలో ఉన్నత పదవులలో వున్న హరిజనులు తోడి హరిజనులను అభివృద్ధి పథంవైపు తీసుకురావడానికి ప్రయత్నించమని ఇంకా సవర్ణుల క్రింద బానిసల్లా వుండవద్దని సలహా ఇచ్చాడు.

**3.2.7. ఆర్థిక జీవితం** :- హరిజనుల్ని పట్టి పీడిస్తున్నది ఆర్థిక స్థితి. మానవుడు సంఘజీవి. సంఘంలో తన జీవితాన్ని సుఖంగా సాగించడానికి ప్రతి ఒక్కరూ వాళ్ల పరిధిలో ప్రయత్నిస్తుంటారు. సుఖవంతమైన జీవితం గడపడానికి ఆర్థిక వనరులు ముఖ్యం. ఈ వనరులు పరిమితం. కోరికలు అపరిమితం. సంపదను సమాజంలో వుండేవారందరూ సమానంగా పంచుకుంటే అందరూ సుఖంగా జీవించవచ్చు. అయితే వ్యవస్థలోని లోటుపాట్లకారణంగా బలహీనతలవల్ల అలా జరగలేదు. సవర్ణుల అత్యధిక వనరులను తీర్చుకోవడానికి అవసరమైన వనరులు లేక బికార్లుగా వున్నారు. మానవపురోగమనానికి ప్రధమ అంశం ఆర్థిక స్థితి. అది లేని మానవుని పురోగమనం శూన్యం. హరిజనులు నిత్యం సవర్ణులఇళ్లలో పాలేర్లుగా వుంటూ వారిని కష్టానికి తగిన ప్రతిఫలం అడిగే శక్తిలేక ఇచ్చింది పుచ్చుకొని జీవిస్తున్నారు. మరికొందరు సవర్ణులు పెట్టిన అన్నం తిని ఉచితంగా పనులు చేస్తున్నారు. అలాంటివారి ఆర్థిక జీవితాన్ని తెలుగు కథానికా సాహిత్యం ద్వారా విపులీకరిద్దాం.

**3.2.7.1. కొత్తజోడు** :- ఆర్థిక మాంధ్య కాలంలో చితికిపోయిన హరిజన రైతును పీడించిన వడ్డీ వ్యాపారి పిండు భీమయ్య కథ. రచయిత్రి చ.రా. వెంకన్నది పెద్ద కుటుంబం. బీద సంసారం. సంసారాన్ని గడపడం కోసం వెంకన్న భీమయ్య వద్ద అప్పు చేశాడు. పంటపండిన వెంటనే అప్పు తీర్చాలనుకొన్నాడు. కాని ఆ సంవత్సరం పంటలు పండలేదు. అప్పు తీర్చదలచిన వెంకన్న తన వద్దనున్న కోడెదూడను భీమయ్యకు కిచ్చి వడ్డీలేకుండా అప్పు తీర్చదలచాడు. అందుకు భీమయ్య నిరాకరించాడు. ఈలోగా వెంకన్న కోడెదూడ చనిపోయింది. భీమయ్య వెంకన్నను అప్పు తీర్చమని పలుమార్లు హెచ్చరించినా సమాధానం రాలేదు. అందుకు భీమయ్య వెంకన్న పత్రం పై దొంగచెల్లు పెట్టించి గుంటూరు కోర్టులో దావావేశాడు. వెంకన్న ఆస్తిమొత్తాన్ని కాజేయడానికి ప్రయత్నించాడు. ఆ ఊరి సవర్ణుడు. అచ్యుతరావు సహాయాన్ని అర్జించాడు. తన ఆస్తిని కాజేయడానికి భీమయ్య పన్నిన కుట్రను తెలియజేశాడు అచ్యుతరావు ఈ విషయంలో వెంకన్నకు సహాయపడ్డాడు. భీమయ్యతో పాటు అచ్యుతరావు ప్రతి సారీ గుంటూరు వరకూ (25 కి.మీ) నడిచివెళ్లేవాడు. భీమయ్య న్యాయవాది అయిన ఆచార్లతో భీమయ్య వెంకన్నపై పన్నిన కుట్ర అన్యాయం అని వాదించాడు. వెంకన్న తనకు సహాయపడుతున్న అచ్యుతరావుకు చెప్పుల జోడును కుట్టించాడు. అచ్యుతరావు చనిపోయాడు. ఇక వెంకన్న తనను ఎట్లా భీమయ్య బ్రతకనివ్వడని అచ్యువరావుకు కుట్టించిన కొత్త చెప్పులను ఆయనమీద అభిమానంతో పూజ చేసుకొవడానికి తీసుకవెళ్లాడు.

ఆర్థిక మాంద్యం కాలంలో హరిజన రైతు ఎలా చితికి పోయాడో అప్పులు వసూలు చేసుకోవడానికి వాళ్లకున్న గొడ్డు గోదాను భూమిని ఎలా లాక్కున్నారో రచయిత వివరించాడు. వడ్డీ కట్టలేక ఒకే ఒక ఆధారమైవున్న కోడెదూడను తీసుకొని పత్రం ఇమ్మంటే అందుకు అంగీకరించక కాలపరిమితి ముగియడంతో

దొంగచెల్లు రాసుకొని మాదిగ వెంకన్నను వడ్డీ వ్యాపారి భీమయ్య ఎలా పీడించాడో రచయిత తెలియ జేశాడు అట్టడుగు వర్గాల వాళ్లకు సాయం చేయబోయి మధ్యతరగతికి చెందిన అచ్యుతరావు లాంటివాళ్ల ఎలా ఇబ్బంది పడుతారో కూడా రచయిత వివరించాడు. బడుగు వర్గాల వాళ్ల తమకు చేసిన సాయం వల్ల సవర్ణుల మీద గల కృతజ్ఞతా భావాన్ని చ.రా.ఎంతో ఆర్ద్రతగా చిత్రీకరించారు.'' ఆర్థిక మాంద్యం కాలంలో సవర్ణులు అవర్ణులను ఎలా మోసపుచ్చారనడానికి ఈ కథ తార్కాణం.

**3.2.7.2. ఆర్తి** :- హరిజనుల జీవన విధానాన్ని చక్కగా చిత్రించిన కథ. రచయిత కాశీపట్నం రామారావు. కోటయ్య బంగారమ్మ కొడుకు. పట్టణంలో కలాసి పని చేస్తున్నాడు. బంగారమ్మ సంసారానికి వచ్చే ఆదాయం తక్కువ. తన ముగ్గురు కొడుకులు కోడెళ్ళపనికి వెళ్లుతారు. కోటయ్య ఆ ఊరిలోనే ఎర్రెమ్మ కూతురు సన్నెమ్మను పెళ్లాడాడు. సంక్రాంతి పండుగకు ఎర్రెమ్మ తన కూతురు పుట్టినింటికి పిలుచకు పోవడానికి వస్తే అత్త బంగారమ్మ పండగపోయిన తర్వాత తన ఇంటికి పంపుతానన్నది. ఎర్రెమ్మ మాత్రం పండగలోపే తన ఇంటికి పంపమన్నది. కారణం ఏమంటే, సంక్రాంతి పండగలోపు వరిమళ్ళ కోతలకు వచ్చాయి. సన్నెమ్మ ఎవరింట్లో ఉంటే వాళ్లకు కూలీ తెస్తుంది. ఎర్రమ్మ తన కూతురును తీసుకుపోతానంది. బాంగారమ్మ నిరాకరించింది. బలవంతాన ఎర్రమ్మ సన్నెమ్మను తన ఇంటికి తీసుకెళ్లింది. పండుగకు పట్టణం నుండి ఇంటికి వచ్చిన కోటయ్య తన భార్య ఇంట్లో లేక తల్లి అడ్డం కి వల్ల అత్తగారింటికి వెళ్ల లేక మనసు చెడి సారాయి త్రాగాడు. అది తెలిసిన ఎర్రెమ్మ కోటయ్యకు తన తల్లి చెడ్డ బుద్ధులు నేర్పుతుందని దూషించడం మొదలు పెట్టింది. ఆ మాటలు వినలేక బంగారమ్మ రెండవ కొడుకు నారాయణ ఎర్రెమ్మను కొట్టాడు..

ఎర్రమ్మది బీదసంసారం. తన కూతురు తన ఇంటికి పిలుచుకపోతే తన ఇంటికే కూలి తెస్తుందని ఆశ. ఆమె కూలి తెస్తేనే ఎర్రమ్మ సంసారం గడుస్తుంది. హరిజనులు పొయ్యి క్రిందికి పొయ్యి మీదికి కావలసి వాటిని ఏ పూట కాపూటగా వెతుక్కునే బడుగుజీవులు అయినదానికి కానిదానికి పదేపదే జరుగుతున్న పీడనను ఈకథ తెలియజేస్తుంది. పంటకోతల సమయంలో పనులు ఎక్కువగా వుంటాయి. ఆ సమయంలోనే వాళ్లకు ఆటంకాలు ఎర్పడితే సవాళ్ల అర్థిక జీవితం దుర్భరమవుతుంది. కథలో ఎర్రెమ్మ బంగారమ్మల కుటుంబాలు ఆ పరిస్థితికే గురి అయ్యాయి.

**3.2.7.3 బంగారమ్మ కమతం** :- తమ స్వార్థం కోసం పాలేర్ల జీవితాన్ని నాశనం చేసిన సవర్ణుల కథ రచయిత సి.యస్.రావు బంగారమ్మ భూస్వామి. భర్త చనిపోయాడు. భీమయ్య బంగారమ్మ పాలేరు. చిన్న తనం నుంచే బంగారమ్మ ఇంట్లో పాలికాపుగా చేరాడు. కష్టపడి పనిచేసేవాడు. దానికి తోడు వయస్సులో వున్నాడు. బంగారమ్మ భీమయ్యను తనవాడిగాచేసుకుంటే జీవితాంతం తన వద్దే పడి వుంటాడని తలచింది. బంగారమ్మ భీమయ్య పడక గదిలోకి పిలుచుకెళ్లింది అయినా భీమయ్య చెలించలేదు. భీమయ్య సీతాలుతో మాలపల్లె తన గుడిసెలో కాపుర ముంటున్నాడు. అప్పటి నుండి బంగారమ్మ భీమయ్య పై సీతాలుపై ఈర్షను పెంచుకొనసాగింది. సూటి, పోటి మాటలతో ఎప్పుడూ తిడుతుంది. తన పొలంలో ధాన్యం కూడా భీమయ్య తన ఇంటికి తీసుకుపోతున్నాడని అనుమానం మొదలైంది. సీతాలు నిండు మనిషి.అప్పటి నుండి భీమయ్య సీతాలు ఆరోగ్యాన్ని దగ్గరుండి చూసుకొనేవాడు. ఒకరోజు భీమయ్య బంగారమ్మ పొలంలోని కూరగాయలను అమ్మకరావడానికి పట్టణం వెళ్లివచ్చాడు. బంగారమ్మతో ఆరాత్రికి ఇంటికెళ్లాలని సీతాలుకు నెలలు నిండాయన్నాడు. బంగారమ్మ పశువులపాకలో బర్రె ఈనుతుందని బర్రెవద్ద రాత్రికి వుండమని చెప్పింది. భీమయ్య ఆరాత్రి పశువుల పాకలోనే పడుకొన్నాడు. రాత్రి మాలపల్లె నుండి మరియమ్మ వచ్చి సీతాలు ప్రసవిస్తావుందని తక్షణం ఆసుపత్రికి తీసుకెళ్లాలని భీమయ్య కోసం బంగారమ్మ

ఇంటి వద్దకు వచ్చింది. బంగారమ్మ భీమయ్య పట్టణం వెళ్లాడని అబద్ధం చెప్పింది. తెల్లవారి భీమయ్య ఇంటికెళ్లితే సీతాలు అప్పటికే చనిపోయింది. బంగారమ్మ తన సంసారానికి చేసిన అన్యాయానికి మరుసటి రోజు ఆమె చెరుకు తోటను సరికి వెళ్లి పోయాడు భీమయ్య.

సమాజంలో డబ్బుకు ప్రాధాన్యత వుంది. మనిషి తన మనుగడ కోసం తాను సృష్టించుకొన్న డబ్బుకే బానిసయ్యాడు. డబ్బుకొసం జరిగే నేరాలు లెక్కలేనన్ని. దారిద్ర్యం అనేది మహాపాపంగానూ, దానితో బాదపడే వాణ్ణి నిర్భాగ్యుడుగాను చెలగాటం ఆడటం. అవరసరమైతే వాడి ప్రాణాలనే దోచుకోవడం సవర్ణుల విధి. ఈ స్థితిలోనే సీతాలు బలి అయ్యింది. హరిజనుల జీవితాలను ఎలా బలి చేస్తారో వివరించి పాఠకులను హరిజనుల యెడ సానుభూతి పరులుగా చేయడానికి తపన పడ్డాడు.

**3.2.7.4 శిలువ వేసిన మనుషులు** :- తన పిల్లలకు కనీసం తిండి పెట్టేయోగ్యత కూడా లేని హరిజన స్త్రీ కథ. రచయిత కేతువిశ్వనాధ రెడ్డి. గంగి హరిజన స్త్రీ భర్త బండగలగనిలో పనిచేస్తూ బండ క్రింద పడి చనిపోయాడు. ఆమెకు ఒక కూతురు కొడుకు, కొడుకు వెంకడు కూతురు ఓబి వెంకడు తను చదువుతున్న పుస్తకాల్లో పుష్టికరమైన ఆహారం అనే పాఠాన్ని చదివి తల్లిని తనకు పుష్టికరమైన ఆహారం పెట్టమని అడిగేవాడు. గంగికి కొడుకు అడుగుతున్నది అర్థం గాక గంజిపోసి వాడికి కడుపు నింపేది. బడి శెలవు దినాల్లో వెంకడు తన స్నేహితులైన శంకర రెడ్డి కొండి శెట్టి, దావిదులతొ గోలిగుండ్లాట ఆడేవాడు. ఆటలో ఎవరు ఓడినా వెంకడే దోకుతాడు. అందుకు వారిచ్చే తిరుబండారాలు ప్రతిఫలంగా లభించేవి. ఒకసారి దావీదుతో వెంకడు పాలపొడి పెట్టమని అడిగాడు అందుకు దావీదు నిరాకరిస్తే తల్లి వద్దకు వచ్చి ''అవునే యీ సదువోద్దు రోజు పాలిషురాళ్ల రుద్దివొబికి, పాలూ, పండ్లు కొందాం'' అన్నాడు. అందుకు గంగికి తన భర్త గుర్తుకొచ్చి వాడిని బండల గనిలో పని చేయించడానికి నిరాకరించింది. వెంకడు పాలపొడి కొసం హనుమంత టీచరు కొడుకు సీతారాముడి స్నేహం చేశాడు. వాడు వెంకడికి పాలపొడి ఇచ్చాడు. ఆపాల పొడిని త్రాగిన వెంకడు ఓబి అస్వస్థతకు గురి అయ్యారు. వారిని జూచి వాపోయింది గంగి.

బడుగు వర్గాల వారు అభివృద్ధి చెందడం కోసం ప్రభుత్వం అభ్యుదయ పధకాలు చేపట్టింది. ఆ పధకాలను ప్రవేశ పెట్టే దలారీల వల్ల అవి బడుగు వర్గాల పాలిట మరణ శాసనాలుగా తయారయ్యాయి. కథలో పుష్టికరమైన ఆహారాన్ని తినాలని తపన పడ్డాడు వెంకడు. తన తల్లి తనకు ఎలా పుష్టికరమైన ఆహారం పెట్టే స్థితిలో లేదని తానే సంపాదించడానికి ప్రయత్నించాడు. పాలపొడి సాధించి దానివల్ల ఇంత కాలంగా అనారోగ్యంగా వున్నతన చెల్లి ఆరోగ్యావంతురాలవుతుందని ఆశించాడు. కానీ అది మొదటి కే ముప్పు వచ్చింది. ప్రభుత్వం హరిజనుల కోస ం ప్రవేశ పెట్టె పధకాలు వాడిలో ఆశలు రేకెత్తిస్తాయి. అవరసమైతే అంతం చేయడానికి ఉపయోగపడుతాయి తప్ప సుఖాన్ని ఇవ్వవని రచయిత అభిప్రాయం.

**3.2.7.5 మార్పు** :- హరిజనులు తమ కూలి రేట్లు పెంచమన్నందుకు సవర్ణులు చేసే నిర్వాకం కథ రచయిత కేతు విశ్వనాధ రెడ్డి. హరిజనులు కష్టించిపని చేసేవారు. వారికి వచ్చే కూలితప్ప పండించుకొనే భూములుండవు. ఆ ఊరిలో హరిజనులు, కూలీ రేట్లను పెంచాలని సమ్మె చేశారు. మునుపు రోజుకు కూలీ రూపాయి ఇచ్చేవారు. హరిజనులు సమ్మె చేసినందుకు అగ్రవర్ణాలు ఆగ్రహించి '' సారాయి త్రాగేనా కొడుకులకు ఎంతేచ్చినా ఒకటే ఏమన్నా మిగిలించుకొని చస్తారా''45. అని హరిజనవాడకు నిప్పుపెట్టారు. ఈ విషయం కథకుడు తన మిత్రుడైన జయచంద్రతో అన్నాడు. జయచంద్ర కథ కునితో హరిజనులకు అన్నం పెడుతారు గదా ఇక వాళ్లకు ఇచ్చే కూలిసాలదా అన్నాడు కథకుడు మాది గోళ్లకి పెట్టే భోజనం ఇంటి అల్లుళ్లకు పెట్టినట్లు పెట్టరండి''46 అన్నాడు. వారిద్దరూ ఆ విషయంపైనే మాట్లాడుతుండగా ఆ ఊరి హరిజనులు తమకు న్యాయం జరగాలని మౌన ప్రదర్శన చేస్తూ రోడ్డుపైన పోతున్నారు.

కూలీలు, యజమానుల పరస్పర సహకారంతోనే ఉత్పత్తి జరుగుతుంది. ఉత్పత్తికి పెట్టుబడి ఎంత అవసరమో శ్రమ కూడా అంతే అవసరం. వ్యవస్థలో వుండే లోపం వల్ల సవర్ణులు హరిజనుల కనీస అవసరాలను తీర్చక వారి శ్రమనంతా దోచుకుంటున్నారు. తమ కోర్కెల సాధన కోసం కూలీలు ప్రయత్నిస్తే ఆప్రయత్నాలను వమ్ము చేయడానికి సవర్ణులు ప్రయత్నించారు. తమకు జరిగిన అన్యాయం సవర్ణులకు ఎగతాళిగా కన్పించింది. హరిజనుల శ్రమకు తగిన ఫలితాన్ని ఇవ్వడం లేదని రచయిత ఈ కథ ద్వారా వివరించాడు.

'బడితెగాడు' కథలో ఒక హరిజన నిరాటిగాడు ఆకలికి తాళలేక, తాను నీళ్లు పెడుతున్న పంటపొలం నుండి వేరుసెనగ కాయలు తిన్నాడు. అది సాకుగా తీసుకొని దొర సంవత్సరపు జీతం ఎగగొడుతాడు. ఆ తర్వాత వంతు కూడా నీరాటి గానిగి జీతం ఇవ్వడానికి దొర నిరాకరించడంతో పంచాయితీ పెట్టిస్తాడు. ఆ పంచాయితీలో మొదటివాడే అది భరించాలనే తీర్పుతో ఆ నీరాటిగాడు తన ఆవు వగైరా అమ్మి దండగకడుతాడు. పట్వారికి లంచం పెట్టి పొరం బోకు భూమి దున్నుకొని పంట పండించిన తర్వాత దొర ఆభూమి తనదంటూ రావడంతో వాడు గొడ్డలితో తిరగబడుతాడు.

ఇది వ్యక్తి చైతన్యానికి సంబంధించినది. దొరలు చేసే అన్యాయాలను హరిజనులు ఒక పరిధి వరకూ అనుభవించి ఇక భరించలేక తమ ప్రాణాలను తెగించి ఎదురుతిరగడం ప్రారంభించారు. కథలో నిరాటిగాడు కేవలం తాను నీళ్లు కట్టే పొలంలో ఒక చెనికి చెట్టు పీకినందుకు ఒక సంవత్సరం పాటు వాడి చేత ఊడిగం చేయించుకొన్నాడు. కథలో హరిజనుల శ్రమను దొరలు ఎలా దోచుకొనే వారో రచయిత తెలియజేశాడు. జీవితాంతం వారి వద్దేపడి వుండటానికి పాలేర్ల ఆస్తిని దోచుకోవడానికి కూడా దొరలు ప్రయత్నించారు. ఈ కథలో రచయిత్రి వ్యక్తి ఏ స్థితిలో చైతన్యవంతు డవుతాడో తెలియజేశాడు.

**3.2.7.6 చీకటి నాడీ - వెలుగు నెత్తురూ :-** పాలేర్లకు సరిగా కూలి ఇవ్వక మోసం చేసిన సవర్ణుని కథ. రచయిత కేతు విశ్వనాథ రెడ్డి. రామిరెడ్డి భూస్వామి ఒక రోజు సాయంత్రం పొలంలో తన తండ్రి సమాధి వద్ద తన జీతగాడు. తలారి తిరుపతయ్య మాదిగ సుబ్బులు వుండటం చూసి తప్పు క్రింద తిరుపతయ్య సంవత్సరం పాటు డబ్బు లేకుండా జీతం చేయించుకొన్నాడు. పుల్లన్న రామిరెడ్డి పాలేరు. పుల్లన్న కొడుకు ఓబీలేసు పుల్లన్న రెడ్డి పొలంలో పనిచేస్తున్నాడే తప్ప కూలీ గురించి ఆలోచించలేదు. రెడ్డిని అడగలేదు. రెడ్డి ఇచ్చింది పుచ్చుకొన్నాడు. ఒకసారి తన కొడుక్కు కూతురుకు పెళ్లి చేయదలచి డబ్బు అవసరంతో, రామిరెడ్డిని పుల్లన్న డబ్బు అడిగాడు. రెడ్డి డబ్బు ఇవ్వడానికి అంగీకరించి కాబోయే కోడలు సుబ్బులని తెలుసుకొన్నాడు. రెడ్డి పుల్లన్నకు అన్యాయం చేస్తున్నాడని లెక్కసరిగా తేల్చిక ప్రతిసారి బాకీని పెంచుతున్నారని. బాకీ విషయం తేల్చుకొమని సుబ్బులు సలహా ఇచ్చింది. మరుసటి రోజు పుల్లన్న ఓబిలేసు రెడ్డి వద్ద కెళ్లి తమ బాకీ విషయం తేల్చమన్నారు. పుల్లన్న రెడ్డి తన డబ్బు గురించే చెబుతున్నాడని తన కష్టానికి ఫలితాన్ని లెక్క కట్టలేదన్నాడు. బాకీ సరిగా తేల్చేంత వరకూ పనిలోనికి రానని పుల్లన్న వెళ్లి పోయాడు. ఈ లోగా హరిజన స్త్రీలు '' వరి కోతలకు కూళ్లు ఏక్కిస్తే తప్ప కొడవళ్లు పట్టం'' 47 అన్నాడు. టని కంతా కారణం సుబ్బులని రెడ్డి తలచాడు. రెడ్డి సుబ్బులును తిట్టడం మొదలుపెట్టాడు. సుబ్బులు రెడ్డికి ఎదురు తిరిగింది. ఇన్నాళ్ళు తన కులానికి జరిగిన అన్యాయాన్ని ప్రజలకు తెలియజేసింది.

హరిజనులు సవర్ణులు చెప్పింది చేయడం. ఇచ్చింది పుచ్చుకోవడంలోనే కాలం గడిపారనడానికి సాక్ష్యం కథలో పుల్లన్న పాత్ర. రెడ్డి ఇంట్లో అంతకాలంగా పనిచేస్తున్న పుల్లన్న ఒక్కసారైనా తనకు రావలసిన డబ్బు గురించి ప్రశ్నించలేదు. అసలు ఆ ఆలోచనే అతనికి సుబ్బులు చెప్పనంత వరకూ రాలేదు. హరిజనులు ఎంత మూర్ఖంగా అనాలోకత్వంగా వున్నార నడానికి ఒక పుల్లన్న పాత్రచాలు. పుల్లన్న తన డబ్బు గురించి

ఆలోచన లేక పోయినా ఇంతకాలంగా పుల్లన్న చేసిన సేవలకైనా రెడ్డి తన డబ్బు తనకి ఇవ్వడానికి ప్రయత్నించ లేదు. మోసపోయేవాడు వున్నంత వరకూ మోసం చేసే వాళ్లుండటం పరిపాటి ఆధోరణికే బలియ్యాడు పుల్లన్న. కేవలం తన పోలంలో తిరుపతయ్య చేసిన తప్పుకు వాడికి ఆర్థికపరమైన శిక్షవేశాడు. ఈ విధమైన ఆర్థిక మనస్తత్వం మంచిది కాదని రచయిత సలహా.

**3.2.7.7 వల్లమ్మ ఉసురు** :- హరిజనులు సవర్ణుల యెడ అప్పుచేస్తే వుండే పరిస్థితిని తెలియజేసే కథ. రచయిత పులికంటి కృష్ణారెడ్డి, గంగులు నాయుడు వడ్డీ వ్యాపారి. పట్టణంలో షావుకారి వద్ద ఒక రూపాయి వడ్డీతో డబ్బు తెచ్చి పల్లెలో రెండు రూపాయల ప్రకారం అప్పు ఇస్తాడు. మల్లయ్య తన ఇబ్బందుల కారణంగా గంగులు నాయుడు వద్ద అప్పు చేశాడు. పంట చేతికి వస్తానే అప్పు తీర్చాలనుకొన్నాడు. కాని వచ్చిన పంట తన ఇంటి ఖర్చులకే సరిపోయింది. అప్పు కట్టలేదని గంగులు నాయుడు ''బాకీ తీర్చలేనోడు పెండ్లాన్ని పండుకోబెట్టాల'' అన్నాడు. మల్లయ్య గంగులు నాయుడు అక్కడే కొట్టాలనుకొన్నాడు. కాని తాను ఇవ్వవలసిన బాకీవల్ల వూరకుండిపోయాడు. మరుసటి రోజు మల్లయ్య ఆవూరిలోనే సవర్ణుడైన రాజన్న గంగులు నాయుడి వద్ద నున్న తన బాకీని అప్పులేకుండా తీర్చేమార్గం చేయమన్నాడు. ఆఊరిలో రాజన్న గౌరవంగల మనిషి రాజన్న మల్లయ్యను గంగులు నాయుడు కాళ్ల మీద పడమని సలహా ఇచ్చాడు. మరుసటి రోజు మల్లయ్య రాజన్న ఎదురుగా ''నాయుడు గారూ నచ్చని కడుపున పుట్టా ! నాపరిస్థితుల్నికు తెలుసు గదా అసలిచ్చేస్తా వడ్డీతో నేమి'' అన్నాడు. నాయుడు అందుకు అంగీకరించి అసలు డబ్బు తీసుకొన్నాడు. గంగులు నాయుడు, రాజన్నతో తాను ఎలా తన షావుకారి అప్పుతీర్చాలన్నాడు. అప్పుడు రాజన్న మల్లయ్య చేసిన పనే నీవు చేయమని సలహా ఇచ్చాడు. అప్పుడు గంగులు నాయుడుకు తన పరపతి అంతా గుంతలో వేసినట్లు అయ్యింది.

ఆర్థికంగా దోపిడి కొనసాగే సమాజంలో చెలరేగి సంప్రదాయం వడ్డీ వ్యాపారం. ఈవడ్డీల వల్ల ధనవంతులు ఆకాశాన్ని చేరుతుంటే బీదవారు అధఃపాతాలానికి నెట్టబడుతున్నారు. పరిస్థితులకనుగుణంగా అవసరాన్నిబట్టి అప్పుచేయక తప్పదు. బీదవాడి అవకాశాన్ని ఆసరాగా తీసుకొన్న ధనవంతులు వాడిని భవిష్యత్తులో కోలుకోకుండా చేయడం సహజం. కథలో అదే స్థితికి గురయ్యాడు మల్లయ్య. అప్పు తీర్చలేక గంగులు నాయుడితో అనరాని మాటలు అనిపించుకొని ఊరకుండిపోయారు. ఒక సవర్ణుని సహాయంవల్ల తన అప్పును తీర్చుకోగలిగాడు. రచయిత ఈకథలో హరిజనులు ఎలా అప్పుల ఊబిలో కూరుకపోవద్దని సలహా ఇచ్చాడు.

**3.2.7.8 చెప్పులుకుట్టేవాడు** :- చెప్పులు కుట్టేవాని స్థితిగతిని గురించి తెలియజేసే కథ. రచయిత గోపీచంద్. ఒక హరిజనుడు నాలుగు దారుల కూడలిలో చెప్పులు కుట్టేవాడు. ఆపనిలో అతనికి భార్య సహకరించేది. వారందరూ కష్టపడి డబ్బు సంపాదించి ఒక చెప్పుల షాపు పెట్టాలనుకొంటారు. ఈలోగా భార్య అనారోగ్యానికి గురి అవుతుంది. డాక్టరును సంప్రదిస్తే ఆమె కూడలిలో కూర్చున్నందువల్ల ముక్కుద్వారా, దూళి, దుమ్ము పోయి ఊపిరితిత్తులు చెడిపోయాయని చెప్పాడు. భార్యను బ్రతికించుకోవాలన్న తపనతో సంపాదించిన డబ్బునంతా ఖర్చుపెట్టాడు. కాని ఆమె చనిపోయింది. ఆమె స్థానంలో ప్రస్తుతం తన కూతురు చెప్పులు కుట్టడంలో తండ్రికి సహకరించేది ఒక్కొక్కసారి తండ్రికి భార్య గుర్తుకొచ్చి తన కూతురు అలా అవుతుందేమోనని భయపడేవాడు. తాను షాపు పెట్టాలనే ఆలోచనకు స్వస్తి చెప్పాడు.

వర్ణ వ్యవస్థకు ఆవల ఉంచబడి వృత్తులతో దీనాతి దీనంగా చూడబడుతున్న వారు హరిజనులు ఆచర్మకార వృత్తినే అంటిపెట్టుకొని బ్రతకడానికి ప్రయత్నిస్తే అక్కడ కూడా వారికి ఆర్థిక అవాంతరాలు

అడ్డువచ్చాయి. కథలో ఈవిధమైన ఆర్థిక అవాంతరాలను అధిగమించి ధనం సంపాదించి షాపు పెట్టాలని ప్రయత్నిస్తే ఆప్రయత్నం విఫలమయ్యింది. సరికదా ఆప్రయత్నంలో తన భార్యను కూడా పోగొట్టుకొన్నాడు. ఒక్కొక్కసారి దురదృష్టవంతులు ఎంత ప్రయత్నించినా తమ ఆశలు నేరవేరవని ఈకథలో రచయిత వివరించాడు.

**3.2.7.9 శ్రంతి** :- ఉన్నత ఉద్యోగులు కార్మికులను తమ స్వార్థం కోసం ఎలా ఉపయోగించుకోవడానికి ప్రయత్నిస్తారో తెలియజేసే కథ. రచయిత కేతువిశ్వానాథరెడ్డి. కథకుడు తన మిత్రులైన సేతుమాధవన్ దేశపాండ్యన్, అబ్దుల్లాలు ఒక సిమెంటు ఫ్యాక్టరీలో ఇంజనీర్లుగా చేరారు. అందరూ ఒకే రూంలో వుండేవారు. వీరికి చంద్రఅనే వ్యక్తి పరిచయ్యమయ్యాడు. అతను అదే ఫ్యాక్టరీలో గుమాస్తా. ఆఫ్యాక్టరీ త్రవ్వకాల్లో ఒక విగ్రహం బయటపడితే హిందూకార్మికులు ఒక దేవాలయాన్ని కట్టించారు. అందుకు ఫ్యాక్టరి యజమాన్యం సహకరించింది. ఈలోగా మిత్రులైన ఇంజనీర్ల మనఃస్పర్థలు రావడంతో వేర్వేరు గదులలో వుండటానికి వెళ్లిపోయారు. కథకుడు చంద్రల పరిచయం చాలా దగ్గరైంది. ఈలోగా ముస్లింలు, మసీదు, క్రైస్తవులు చర్చి కట్టించారు. ఒకసారి కార్మికులు తమ కూలీ రేట్లు పెంచమని సమ్మె చేశారు. సమ్మెకు చంద్రం నాయకత్వం సహించాడు. ఫ్యాక్టరి యజమాన్యం కథకుడిని పిలిపించి తన మిత్రుడైన చంద్రంను సమ్మెనుండి విరమించమని చెప్పమని లేకుంటే నీవే మీహరిజన కార్మికులనందరినీ సమ్మెనుండి విరమింపజేయమని తనకు ప్రమోషన్, ఫారిన్ ఛాన్స్ ఇప్పిస్తామన్నారు. ఆవిధంగా ఇతర ఇంజనీర్లయిన అబ్దుల్లా సేతుమాధవన్, దేశ్‌పాండ్యన్‌లతో చెప్పారు. కథకుడు తెల్లవారి ఆసమ్మెను విరమింపజేయడానికి ప్రయత్నించాడు. తెల్లవారేలోగా కార్మికులు ఫ్యాక్టరీ ముందు సమ్మె చేస్తున్నారు.

**3.2.7.10 మేకు** :- పైకథలాగే స్వార్థపరత్వంతో కూడినకథ. రచయిత పులికంటి కృష్ణారెడ్డి. మాధవనాయుడు షావుకారి. మాకడికి రెండెకరాల పొలం వుంది. ఆపొలాన్ని పంట పెట్టడానికి మాధవనాయుడు దగ్గర అప్పుచేశాడు. పంట చేతికి రాగానే అప్పు తీర్చదలచాడు. కాని మాకడి దురదృష్టం వల్ల ఒకయేడు అతివృష్టి మరోయేడు అనావృష్టి వల్ల పంట చేతికి రాలేదు. మాకడు మాధవనాయుడు బాకీ తీర్చడంలో జయరామయ్య సహాయం కోరాడు. జయరామయ్య దలారీ వ్యాపారంలో దిట్ట. ఆప్రాంతంలో అతని మాటకు తిరుగులేదు. పేదాసాదలపై అతనికి దయాదాక్షిణ్యాలుండవు. ఒకరోజు జయరామయ్య మాధవనాయుడు, ఇంటిదగ్గర కూర్చొన్నాడు. మాకడు వెళ్లితే మాధవనాయుడు వడ్డీ లేకుండా బాకి చెల్లించమని చెప్పాడు. మధ్యలో జయరామయ్య కలుగజేసుకొని మాకడితో నీవు పొలం పనులు చేయలేవని, ఎవరు ఏపనిచేస్తే ఆపనే చేయాలని తమలాంటి వాళ్లకు వ్యవసాయం చేయడం చేతకాదన్నాడు. తనపొలాన్ని మాధవనాయుడికే అమ్మమని సలహా ఇచ్చాడు. తిరుపతిలో రిక్షాత్రొక్కి బ్రతకమని మాకడికి జయరామయ్య సలహా. జయరామయ్య మాటవిన్న మాకడు తనభూమిని మాధవనాయుడుకు అమ్మి తిరుపలో రిక్షా త్రొక్కడం ప్రారంభించినాడు. పైసాకూడా సంపాదించుకోకుండా రిక్షా పంక్చర్ అయ్యింది. కాని జయరామయ్యకు మాత్రం మాధవనాయుడి ద్వారా వచ్చే కమీషన్ వచ్చింది. అప్పుడు మాకడు జయరామయ్యలాంటి మేకువల్ల తమలాంటి బ్రతుకులు ఎన్ని పంక్చర్లు అయ్యాయని గుర్తించాడు.

పైకథలో నిస్వార్థంగా కష్టపడే శ్రామికులు తమ కష్టానికి తగిన ఫలితం కోసం సమ్మెచేస్తే మరో కథలో అప్పు పేరుతో మోసపోయిన హరిజనులు కన్పిస్తారు. శ్రామికులు తన హక్కులను సాధించుకోవడానికి ప్రయత్నించి విద్యావంతులైన తోట హరిజనులే వారి సమ్మెను విరమించడానికి చేయప్రయత్నం కన్పిస్తుంది. చదువుకున్నవాడి ఆలోచనలో స్వార్థం కనిపిస్తుందనే విషయాన్ని తెలియజేస్తుంది. మరోకథ మేకులో దలారీల చేతుల్లో మోసపోయే హరిజనులు కనపడుతారు. దళారీలకు ఎదుటివాడిపై అభిమానం

ఆప్యాయతలుండవని ఎక్కువభాగం ఎదుటివాడిని మోసం చేయడానికే ప్రయత్నిస్తారనే విషయం స్పష్టమవుతుంది.

**3.2.7.11 పొద్దు కుంకింది** :- ఎక్కువ సంతానాన్ని కని తిండిలేక ఇబ్బందులు పడ్డ హరిజన కుటుంబం కథ. రచయిత పులికంటి కృష్ణారెడ్డి. మూకడిది పెద్ద సంసారం. భార్య మంగి నారికి ఎనిమిది మంది పిల్లలు. మూకడు ప్రతి దినం కూలికి వెళ్లితే మంగికట్టెలు అమ్మి సంసారాన్ని సాగించేవారు. ఒకసారి మూకడికి మంగికి జ్వరం వచ్చింది. మూడు రోజుల నుండి పిల్లలకు అన్నంలేదు. మూకడు ఇద్దరి కొడుకులను కొట్టుతూ ఈడ్చుకొని ''సాకలేన్నా కొడుకులికి సంతెందుకురా''50 అంటూ వీరారెడ్డి వచ్చాడు. మూకడితో వీరారెడ్డి ఇంకొకసారి తనపొలంలో ఆపిల్లలు కనపడితే లేరని హెచ్చరించి వెళ్లిపోయాడు. మూకడితో ఆఇద్దరు పిల్లలు ఆకలికి తాళలేక రెండు చెట్లు తీసుకున్నామన్నారు. మూకడు వీరారెడ్డి పొలంలో విత్తనాలు వేశాడు. నీళ్లు కట్టాడు, మందు వేశాడు. అలాంటిది అదే పొలంలో తన కొడుకులు రెండు చెనికి చెట్లు తీసుకుంటే వీరారెడ్డి ఆవేశం హద్దులుదాటింది.

పంటపొలాల్లో పాలేరు నిరంతరం వెట్టిచేసినా ఫలితం దక్కేది యజమానికే కడుపునింపే గంజి కూడ్ల పనివున్నంత వరకే పనిచేయించుకొనే సమయంలో భూమిని సొంతమనుకొమ్మంటూ ముద్దుచేసే పెత్తందార్లు పని ముగియగానే ముద్దవిదల్చరని అర్థమవుతుంది. హరిజనులు అనారోగ్యంతో మంచమెక్కితే జీవనాధారం నిరాధారమవుతుందన్న విషయం ఈకథ ద్వారా గోచరమవుతుంది. తాను కష్టించి పని చేసిన పొలంలోనే తన కొడుకులు రెండు చెట్లు తీసుకుంటే రెడ్డి తన దర్బారు చెలాయించాడు. మూకడు పిల్లల విషయంలో కూడా పొరపాటు పడ్డాడు. అధిక సంతానం వల్ల భవిష్యత్తులో అనేక ఇబ్బందులు ఎదుర్కొంటానన్న ఆలోచనలేకుండా సంతానాన్నిగన్నాడు. అధిక సంతానం వల్ల. కూడా సంసారం ఇబ్బందుల్లోపడే అవకాశం వుందని రచయిత హెచ్చరించాడు.

ఆలోచనలేకుండా సంతానాన్ని గన్నాడు. అధిక సంతానంవల్ల కూడా సంసారం ఇబ్బందుల్లో పడే అవకాశం వుందని రచయిత హెచ్చరించాడు.

**3.2.8 హరిజనులు సంఘదృష్టి** : - కొందరు సనాతనవాదులు స్వార్థపరులైన పండితులు తమ ఇష్టం వచ్చినట్లు వేదాలకు వ్యాఖ్యానాలు సృష్టించి వర్ణ వ్యవస్థను పటిష్టం చేసి సాంఘీకమైన కట్టుబాట్ల వల్ల వర్ణవ్యవస్థ నుండి వెలివేయ బడ్డవారే నేడు సంఘానికి దూరంగా ఉంచబడి సాంఘీక హింసకు దోపిడీలకు గురి అవుతున్నారు.

**3.2.8.1 హరిజన కలహాలు** - సంఘంలో సవర్ణులైన భూస్వాములు, ధనవంతులు, ఎవరు ఏమైన పట్టించుకోరు వారి కుటుంబం వృద్ధిలోకి వస్తేచాలు అనుకుంటారు. తమబలం, బంధుత్వం చల్లగుంటేచాలు. ఏకులం ఎటుపోయిన ఏమీ ఆలోచించరు, ఆలోచించకపోయిన పరవాలేదు, కాని తమ స్వార్థం కోసం ఎదుటివ్యక్తిని హింసించకపోతే చాలుకాని అలాగుండదు. తమచే పీడించబడిన అణిచివేయబడిన బాధితులు ఎదురు తిరిగినప్పుడు తమస్థానాన్ని నిలబెట్టుకోడానికి సవర్ణులు ఎన్నో కుట్రలు కుతంత్రాలు ఎత్తుగడలు పన్ని తమ ప్రత్యర్థులను. నాశనం చేయడానికి ప్రయత్నిస్తారు. కులం పేరుతో, మతం పేరుతో, వర్గం పేరుతో పెత్తందారులు తమకు గిట్టని వారిని వేరుచేసి వాళ్ళలో వాళ్లకు కలతలు రేపి ప్రత్యర్థుల ఐక్యాన్ని దెబ్బతీసి పబ్బంగడుపుకుంటారు. ఇలాంటి వాళ్ల మోసాలను బయటపెట్టి సామాన్య ప్రజానికానికి ముఖ్యంగా హరిజనులకు న్యాయం జరగాలని గట్టి తలంపుతో హరిజనులను చైతన్యం వైపు నడిపించాలన్న సంకల్పంతో రచయితలు కథానికలు రాశారు. వాటిని పరిశీలించటం గమనార్హం.

**3.2.8.11 డిరోడ్** :- హరిజనులు అందరు కలసి కట్టుగా వుండటం సహించని సవర్ణులు వారి మధ్య స్పర్థలను పెట్టటాన్ని చిత్రించే కథ. రచయిత కేశవరెడ్డి. కథలో మనకెక్కడ హరిజనులు ప్రత్యక్షంగా పోట్లాడుకోవడం కన్పించదు. హరిజనులంతా కలసి మాలపల్లెకు, అగ్రహారానికి మధ్యలో రోడ్డువేయాలని నిర్ణయించుకొంటారు. ఈ విషయం సవర్ణులు వినేసరికి వారికి తలకొట్టేసినట్లు అయింది. హరిజనుల్లో వచ్చిన ఐక్యసంఘటనకు మునసబు హడలిపోయి అవకాశం కోసం ఎదురుచూసి చివరకు తమ పొలంలో వున్న హరిజనులతో తనమెడలోని బంగారు గొలుసు పోయిందని దానిని వాళ్ళే కాజేశారని, అందరూ కాణిపాకం దేవాలయంలో ప్రమాణం చేయాలని చెబుతాడు. మునసబు మాట హరిజనులంతా వింటారు. కాని సుబ్బరాయుడు మాత్రం పెడచెవిని పెట్టడం వల్ల హరిజనుల్లో ముఠాలేర్పడుతాయి. పెత్తదారులకు లొంగిపోని సుబ్బరాయుడు ఒంటరి వాడవు కాదు. హరిజనుల క్షేమంకోసం సుబ్బరాయుడు తలపెట్టిన రోడ్డుపని ఆగిపోయింది.

భూస్వామ్య కబంధ హస్తాలనుంచి విముక్తి కలగనంతవరకూ హరిజనులకు స్వతంత్ర ఆలోచనా శక్తి రాదు. అంతేగాక కట్టుబానిసలను చేయకపోతే హరిజనులు ఎంతో అభ్యుదయాన్ని సాధించేవాళ్ళు అప్పుయిచ్చి వడ్డీక్రింద పాలెర్లుగా వుంచుకొని బానిసత్వాన్ని సృష్టించింది. ధనికవర్గమే సుబ్బరాయుడు తండ్రిచేసిన వృత్తి ఇలాంటిదే. తన తండ్రి తర్వాత తనకు బానిసత్వం తప్పదని గ్రహించిన సుబ్బరాయుడు ఊళ్లో నుండి దొంగగా పారిపోయి సైన్యంలో చేరుతాడు. అంతకు ముందు మనసుతో సుబ్బరాయుడు తన తండ్రి చేసిన అప్పు తీరుస్తానంటే ''నోర్మూయ్ మల ముండాకొడకా మాలబుద్దులు పోనిచ్చావుకావు అప్పుయిచ్చి పుచ్చుకోడానికి నేనేం వడ్డీవ్యాపారిననుకున్నావా''52 అంటాడు. వాళ్ళ ఒప్పందం ప్రకారం అప్పుయిచ్చింది పాలేరుగా పడివుండేందుకేనటా. తరతరాలుగా వస్తున్న బానిస సంకెళ్ళను త్రెంచుకొన్నాడు సుబ్బారాయుడు. ఐదేళ్లతరువాత మునసబుకు వడ్డీతో సహా తిరిగి ఇచ్చాడు. సుబ్బారాయుడు మునసబు బాకీ తీర్చడంలో తరాలుగా వస్తున్న ధనిక వర్గం కోటలు బీటలు వారాయి. ఒక భూస్వామి వద్ద అప్పుపడ్డ పాలేరు అప్పు చెల్లకట్టడం బానిస చరిత్రలో అదే మొదటిసారి. ఆయనలో చైతన్యం రాగానే తరాలనుంచి వస్తున్న ఆచారాన్ని తలక్రిందులు చేశాడు. సుబ్బారాయుడు మునసబుకు ఎదురుతిరగాడనే నేపంతో రోడ్డువేయడానికి నిరాకరించాడు. దీనికి కారణం వారికి వేసిన బానిస సంకెళ్ళే. తీసుకొన్న సొమ్ము చెల్లించటం అనే ధర్మం నిర్వర్తించిన వ్యక్తిని శత్రువుగా చూసిన భూస్వామిని నమ్ముకొంటున్న హరిజనులు తమఅవసరమైన రోడ్డు నిర్మించుకోకుండా చెడిపోవటం కథలో కథానాంగం.

హరిజనులు అస్పృశ్యత సమస్యను దూరం చేసుకోనంతకాలం వాళ్ళకు బనిస బ్రతుకు తప్పదు. హరిజనులు అగ్రవర్ణాల మీద ఆధారపడి జీవించాలి వారి బయభక్తులు తమ ఒంటినిండా నింపుకొంటారు. యజమానులు విదిలించే మెతుకులు గతుకుతారు. తమ రక్తాన్ని తడిపి వ్యవసాయ ఉత్పత్తులను పెంచితే అవిఎక్కడో నిలవబడ్డాయి. హరిజనులకు ఆకలిని సృష్టిస్తాయి. ఆ ఆకలిని ఛేధించగలిగితే సమాజంలో అస్పృశ్యత వుండదు. తక్కువ జాతి తనమే శ్రమను దోచుకొనేందుకు అవకాశాన్నిచ్చింది. అది పోతే శ్రమదోపిడికి తెరపడుతుంది. ధనిక వర్గం హరిజనులు అజ్ఞానాన్ని ఆసరాగా తీసుకొని వంచించాలని చూసింది. వారి ఐకమత్యాన్ని చూసి ఈర్ష్యపడి అనైక్యతను సృష్టించి సంఘటితం కాకుండా చూసింది. పొట్టకూటి కోసం తాపత్రయపడే జాతి ప్రతిఘటన శక్తినే కోల్పోయింది. వారంతా ఏకమై సమైక్యంగా ప్రతిఘటించిన నాడే చైతన్యవంతులుకాగలరు.

**3.2.8.1.2 కొమ్మలు** - హరిజనులు, అరుంధతియులు ఏకమైతే వారిని విడదీయటానికి సవర్ణులు చేసే ప్రయత్నాన్ని చిత్రించిన కథ. రచయిత పులికంటి కృష్ణారెడ్డి. ఆ ఊరిలో గంగమ్మ జాతర జరుగుతున్నది.

హరిజనులు, అరుంధతీయులు కలిసి జాతర జరుపుకొంటున్నారు. అంతకుముందు ఎవరికి వారు వేర్వేరుగా జాత జరుపుకొనేవారు. ఆ ఊరిలో కొండారెడ్డి జిత్తుల మారినక్క అక్కడ అతని మాటకు అడ్డువుండదు. గంగమ్మ విగ్రహం రాత్రి ఊరంతా మెరువణి చేస్తున్నారు. హరిజనులు, అరుంధతీయులు కలిసి తప్పెట్లు, కొమ్ములు వాయిస్తున్నారు. మధ్యలో కొండారెడ్డి వెళ్లి ఇరువర్గాల మధ్య చిచ్చుపెట్టాడు. దాంతో ఆగ్రహించిన హరిజనులు, అరుంధతీయులు రెండు వర్గాలుగా చీలిపోయారు. తెల్లవారి దున్నపోతులను బలి ఇస్తున్నారు. హరిజనులు దున్నపోతును తెచ్చి బలికంబానికి కట్టివేస్తే అరుంధతీయులు నరకాలి. నరికిన తర్వాత దున్నపోతు కాలుకోసి, దున్నపోతు నోట్లో పెట్టాలి. అలా చేయడంలో హరిజనులు ఆలస్యం చేశారు. అరుంధతీయులు తామే గెలిచామని కుంబం కూడు తమకే ముందుపెట్టాలని పోట్లాటకు తలపడ్డారు. పోట్లాటలో గాయపడ్డ వారిని ఇరువర్గాలు తమ వాడలకు తీసుకెళ్లారు. కొండారెడ్డి మాత్రం నవ్వుతూ ''ఈ నాయళ్ల సరిగ్గా మాపనులకు రారు దానికి తోడు ఎక్కువ కూలి ఇమ్మంటారు. రెండు రూపాయల కిలో బియ్యంతో మరి రెచ్చిపోయారు'' అంటున్నాడు.

సంఘం మాల, మాదిగలను కలిపి హరిజనులుగా ముద్రవేసింది. సమాజం ఈరెండు తెగలను అంటరాని వారుగానే చూస్తుంది. ఈ రెండుకులాల వాళ్ల సవర్ణుల ఆధిపత్యానికి సాంఘీక నియమాలకు తలొగ్గి జీవిస్తున్న వాళ్లే కాని మాల మాదిగల్లో ఎవరు ఎక్కువ అనే సమస్య ఎదురైనప్పుడు మేమే గొప్ప అని మాటలు చెప్పుకొంటారు హెచ్చుతగ్గుల విషయంలో ఎవరికి వారు వేరవుతారు కాని ఏకంకారు. ఈ బలహీనతను ఆయుధంగా తీసుకొని సవర్ణులు తమ అవసరాలను తీర్చుకుంటారు. కథలో కొండారెడ్డి తమ స్వార్థం కోసం సమైక్యంగా వున్న హరిజనులను వేరు చేయడానికి ప్రయత్నించాడు. అందుకు జాతరను అడ్డంగా పెట్టుకొన్నాడు. హరిజనులు కూడా ఆలోచనారహితంగా ప్రవర్తించి వారి జీవితాలను వారే వెనక్కి నెట్టుకోవడానికి ప్రయత్నించారు. ఇందులో ప్రాధాన్యం రెడ్డిదిగా బలిపశువులుగా మాలమాదిగలు చిత్రితమయ్యారు.

**3.2.9 జీవనవ్యథ** - నాగరికత శరవేగంతో మారుతుంది మనుషులు వేషభాషలు మారుతున్నాయి. కట్టుబాట్లు మారుతున్నాయి. ఆచార సాంప్రదాయాలు మారుతున్నాయి. కాని హరిజన వ్యవస్థకు సంబంధించినంతవరకూ కాలచక్రం ఆగిపోయింది. తామూ మనుషులమేనని తమ శరీరంలో చీము, రక్తం వున్నాయని వీరు మరచిపోతున్నారు. మరచిపోయినంత కాలం అగ్రజాతుల వారికి బానిసలయిపోతున్నారు. పురుగులు దుర్గంధంలోనే మహదానందను అనుభవించినట్లు వీరు బానిసత్వంలోనే సంతృప్తిని అనుభవిస్తున్నారు. ఈ దాస్య శృంఖలాలను తెంచుకోవడానికి వీరు ప్రయత్నించడంలేదు. ధనం, బలం, కలిగిన వారు తమను ఎన్ని అమానుషకృత్యాలకు గురి చేసినా తమను ఆయుధాలుగా వాడుకొని ఎన్ని అకార్యాలు చేయించినా అదేమని అడగలేని జడత్వం వారిది జీవన వ్యధను చిత్రించిన కథానికలను పరిశీలిద్దాం.

**3.2.9.1 బిళ్లమంత్రాడు** - రామిరెడ్డి కామంతో కళ్లు గప్పి తన పాలేరు భార్యను బలాత్కరించడానికి ప్రయత్నిస్తే కన్నతల్లే వాడిని జైలుపాలు చేసిన కథ. రచయిత కరుణకుమార. సుబ్బులు హరిజనుడు, లక్ష్మమ్మ పాలేరు. లక్ష్మమ్మ కొడుకు రామిరెడ్డికి ఏమాత్రం పనితగలకుండా సుబ్బులే కష్టపడేవాడు. లక్ష్మమ్మ కూడా సుబ్బులును ఎంతో అభిమానంగా చూసుకొనేది. కమ్మవారి పాలెంలో సుబ్బులు తన మామ కూతురు రమణిని పెళ్లి చేసుకొంటాడు. అప్పుడు రామిరెడ్డి తన భూమి వ్యవహారం కోర్టు కేసులు చూస్తూ కమ్మవారి పాలెంలోనే వుంటాడు. సుబ్బులు మామ తన ఆస్తి రెండెకరాలను పండించుకొని తన సంసారాన్ని అక్కడే కొనసాగించమని సలహా ఇస్తాడు. కాని సుబ్బులు లక్ష్మమ్మ మీద వున్న అభిమానంతో మామ సలహాను నిరాకరించాడు. లక్ష్మమ్మ సుబ్బులు సంసారం కోసం తన తోటలో గుడిసె వేయించింది. వారి

సంసారం గడవటానికి కావలసిన సామాగ్రినిచ్చింది. ఈలోగా కమ్మవారిపాలెం నుండి వచ్చిన రామిరెడ్డి రమణిని కామిస్తాడు. ఒకనాటి రాత్రి ఆమెను బలాత్కరించబోయాడు. అప్పుడు రమణి రామిరెడ్డి బారినుండి రక్షించుకొని, ఈ విషయం రమణి తన భర్తతో చెప్పింది. సుబ్బులు తన సంసారాన్ని కమ్మవారిపాలేనికి తీసుకెళ్ళడానికి ప్రయత్నించాడు. దీనితో ఉగ్రుడైన రామిరెడ్డి బిళ్లల మొలత్రాడును సుబ్బులు దొంగిలించాడని కేసుపెట్టాడు. స్టేషన్‌లో రామిరెడ్డి పోలీసులతో జతకూడి సుబ్బులు ఆస్తినంతా తనపేర రాయించుకోవాలని ప్రయత్నిస్తాడు. చివరకు ఈగొడవ కోర్టులో విచారణకు వస్తుంది. లక్ష్మమ్మ కోర్టులో సుబ్బులు బిళ్లల మొలత్రాడు దొంగలించలేదని తాను నీటిలో మునిగిపోతున్నప్పుడు కాపాడినందుకు కానుకగా ఇచ్చానని చెప్పి రామిరెడ్డిని జైలుపాలు చేయించి ఆమెకూడా సుబ్బులు ఇంట్లో వుండటానికి వెళ్ళుతుంది.

కథలో హరిజనుని పాలేర్ల భార్యలపై యజమానులు ప్రవర్తించే తీరు కన్పిస్తుంది. అంతేగాక యజమానుల భార్యలు పాలేర్లపై చూపించే దయ విశదమవుతుంది. లక్ష్మమ్మ సుబ్బులు మీద అంత ప్రేమ చూపించి ఎక్కువగా పనులు చేయించుకోవడానికి ప్రయత్నించారుతప్ప వర్గదృష్ట్యా చూస్తే సుబ్బులు పట్ల లక్ష్మమ్మ అంతదయ చూపకపోవడానికి వీలులేకపోవచ్చు. ఎందుకంటే ఆమె సుబ్బులును రామిరెడ్డితో సమానంగా చూడలేదు. చదువు చెప్పించలేదు. కేవలం పెళ్లి అయిన తర్వాత తన పొలంలో కొట్టం వేయించింది కాని స్వతహాగా పెళ్లి చేయలేదు. ఆస్తి వారసత్వం అసలే ఇవ్వలేదు ఈకథలో రచయిత లక్ష్మమ్మ పాత్ర కొంత ఉదారంగా చిత్రించడానికి తపనపడ్డాడు. ఇందులో లక్ష్మమ్మ పాత్రకు ప్రాధాన్యం ఉంది. సుబ్బులు పాత్ర ఉత్తమమే కాని నిమిత్తమాత్రంగా ఉంది.

భూస్వామ్య వ్యవస్థలో శ్రామికులపట్ల రైతు భార్యలు ప్రదర్శించే ప్రేమకు ఈకథానిక నిదర్శనం. అతి ఆదర్శవంతంగా రచయిత లక్ష్మమ్మ పాత్రను చిత్రించాడు. పీడితులు గెలిచేటట్లు చూపించాలనే తాపత్రయంచేత ఇలా చిత్రించాడు.

**3.2.9.2 హరిజనసమస్య** - హరిజనులకు జరుగుతున్న అవమానాలు భరించలేక వారు సవర్ణులను ప్రతిఘటించే కథ. రచయిత చలం ఆఊరికి ఒక యోగివచ్చాడు. కొన్నాళ్లు మౌనంగా గడిపాడు. ఒకరోజు హరిజనుడు అనారోగ్యంతో వున్న తన కొడుకును యోగివద్దకు తీసుకొచ్చాడు. యోగి ''బతికిస్తే ఆకుర్రాణ్ణి నాకు యిచ్చేస్తారా'' అన్నాడు. అందుకు హరిజనుడు అంగీకరించాడు. ఆపిల్లవాడు బ్రతికాడు, వాడి పేరు వీరన్న యోగి అప్పటినుంచి ఆఊరి హరిజనవాడ చేరారు. కాలేజిలో చదువుకుంటున్న ఆఊరి విద్యార్థులంతా ఆయనతో వాదించేవారు. కులం గూర్చి మతం గూర్చి దేవుని గూర్చి యోగి సమాధానాలు వీరన్నను సమాధానపరచేవి కాదు. అతనికి పూర్వంనుండి తమ జాతులను అణగత్రొక్కడానికి బ్రాహ్మణులు బోధించిన విషయం కన్పించింది. వీరన్న ''హరిజనులు విప్లవం చేసి మీస్త్రీలకు హరిజనబిడ్డల్ని కనా''54 లనేవాడు. ఆపని తలపెట్టాడు కూడా. దసరారోజు ఊరి మగవాళ్లంతా పొలానికి వెళ్లారు. హరిజనులు ఊరి స్త్రీలపై పడ్డారు. ఆవార్త తెలిసిన యోగి అక్కడికి వచ్చాడు. కథకునికి వీరన్నకు మధ్య వచ్చిన యోగి దెబ్బతగిలి ప్రాణం విడిచాడు. అక్కడితో పోట్లాట ఆగింది. కొందరు జైలుకెళ్లారు. ఆఊరంతా ఐక్యంగా యోగి సమాధికట్టించి ప్రతి సంవత్సరం ఉత్సవాలు జరుపుతున్నారు.

యోగి ముఖ్యం కాని హరిజనులు కారు. హరిజనులు అగ్రకులాల వాళ్ల స్త్రీలను దౌర్జన్యంగా కోరుకోరు. కోరుకొని మూకుమ్మడిగా దొమ్ముగా శృంగార కార్యం చేయబోరు అతిసహజమైన రీతిలో చలం ఈకథవ్రాశాడు.

''సమాజంలోని దుర్లక్షణాలను మార్చుకోవడానికి హింసాపూరిత చర్యలు కార్యకారికాదు. హింసవల్ల కలిగేది ప్రతి హింస మాత్రమే హరిజనులు తాము అల్పులమని నీచులముకాదని ఆత్మ సంస్కారంతో

ప్రవర్తించడమే మార్గం. కాని ఈఉపదేశాలు వారిని తృప్తిపరచలేవు వారికి తక్షణ కార్యక్రమం ఉండాలి. తర్క చమత్కారంతో చేసే బోధలు అవమానాన్ని గూడ కల్గించి దౌర్జన్యానికి మాత్రమే దారితీస్తాయి''55

''హరిజన సమస్య మరొక గడ్డు సమస్య శాంతివచనాలు సమన్వయాలు అగ్రకులాలకు ఆనందమిస్తాయి. ఇదొక పక్షం అవమాననూ ఉద్రేకమూ మరొక పక్షం పరిష్కారం కళ్లముందు స్పష్టంగా లేకపోతే ఉద్రేక పడేవాళ్లు వాళ్లకు తోచిన మార్గం వాళ్లు తీసుకొనే ప్రమాదం వుందని రచయిత హెచ్చరిక ధ్వనిస్తుంది''56.

హరిజనసమస్య వర్ణద్వేషంతో కాక సమత్వం, స్నేహం, సమానం, వీటితో పరిష్కరించుకొమ్మనే బోధలోనూ, గాంధీ స్ఫురిస్తాడు. గాంధీ పద్ధతిపై చలం నమ్మకం కూడా కన్పిస్తుంది అంటాడు డా. నావిలాల సుబ్బారావు.

''ఈకథలో చలం దళితుల మీద విషం వెళ్లగక్కాడు. పుచ్చిపోయిన అగ్గిపుల్లలమీద గజ్జిపట్టిన కుక్క పిల్లమీద జాలిని కురిపించిన చలం అంతకన్నా హీనంగా, నీచంగా చూడబడుతున్న దళితుల్ని అపహాస్యం చేశాడు. కారంచేడు, చుండూరు ఘటనలకు ముందే అగ్రవర్ణాల మీదికి దళితుల్ని రెచ్చగొట్టేందుకు చేసిన నీచాతి నీచమైన సాంస్కృతిక దమనకాండ హరిజన సమస్య అనే కథ అంటాడు ఖాదర్‌మొహిద్దీన్ అంతేగాక చలందృష్టిలో దళితుడంటే ఒక మూర్తీభవించిన ద్వేషం చలం ద్వేషంలేని వాళ్ల పక్షం ద్వేషం ఎవరికి వుంటుంది. పీడించే వాడికి వుంటుందా. పీడనకు గురిఅయ్యే వాడికుంటుందా, పీడనకు గురిఅయ్యే వాడికి పీడించే వాడిమీద ద్వేషం వుండటం న్యాయం మాత్రం కాదు. అలావుండాలి కూడా చలం ద్వేషంలేని వాళ్ల వైపు చలం అగ్రవర్ణాపక్షపాతి. పీడితుడు రెచ్చగొడితే తప్ప పీడకునిలో ద్వేషం తలెత్తదని చెబుతున్నాడు. చలం పీడితుడు పీడించేవాణ్ణి రెచ్చగొట్టడమంటే పీడితుడు కుక్కకన్నా పందికన్నా హీనంగాగాక మనిషిగా బతకాలనుకోవడమే మనిషిగా తలెత్తుకు బతికేందుకు తమకున్న హక్కుల్ని వినియోగించుకోవాలని ప్రయత్నించడమే చలం పచ్చి దళిత వ్యతిరేకి అగ్రవర్ణాల తరుపున అబద్దాల్ని ప్రచారం చేసిన అచ్చతెలుగు గోబెల్స్'' అంటాడు ఖాదర్‌మొహిద్దీన్.

ఈయన వాదనల మీద ఆంధ్రజ్యోతి వారపత్రికల్లో పాఠకులు అనేకమంది పత్రికాముఖంగా తమ అభిప్రాయాలు వెల్లడించారు.

''చలం అనగానే స్త్రీలూ, పువ్వులూ, పక్షులూ, చిరునవ్వుల వెన్నెలా నిద్రించే స్వప్నాలు, వసంతం ముఖ్యంగా ఎంకి గుర్తుకురావాలి ఖాదర్‌కు మాత్రం కులం గుర్తు వచ్చిందంటే ఏదో పెర్వర్షన్ వున్నట్టేలెక్క''.58 అంటారు శివలెంకరాజేశ్వరీదేవి.

అలాగే ''చలాన్ని దళిత కోణం నుంచి పరిశీలించడానికి ఖాదర్ చేసిన ప్రయత్నాన్ని హర్షించాల్సిందే అయితే చలంలోని పరిమితుల్ని సర్వస్వం చేసి అంచనావేయడానికి చేసి ప్రయత్నాన్ని అనుసరించిన పద్ధతిని తిరస్కరించాల్సి వుంటుంది''59 అని అంటారు కాంతి. ఈయన చలం సరైన పరిజ్ఞానం ప్రదర్శించాడని అంగీకరించాడు.

జాగ్రత్తగా అలోచిస్తే ఖాదర్‌మొహిద్దీన తర్కం నిజమనిపిస్తుంది. చలం హరిజన సమస్య అనేకతను 1946 ప్రాంతంలో రచించాడు. అంటే అప్పుడు భారతదేశం ఇంకా పరాయిపాలనలోనే వుంది. దేశంలో ఎక్కువగా గ్రామాలు జమీందార్ల చేతిల్లోనూ, పెత్తందార్ల చేతిల్లోనూ వుండేవి. అప్పుడు ఎక్కువభాగం సవర్ణులకు కూడా స్వేచ్ఛ స్వాతంత్రాలు లేవు. ఎందుకంటే భారతదేశాన్ని పాశ్చాత్తులు పాలిస్తున్నారు కాబట్టి. అలాంటి స్థితిలో హరిజనులు పాలేర్లు బానిసలుగా వుండటం తప్ప అన్యం తెలియదు. ముఖ్యంగా రచయిత తాను చేసే రచనపై సమకాలీన సమాజ ప్రభావం వుంటుంది. కాని చలం రాసిన హరిజన

సమస్యపై నాటి ప్రభావం ఏమాత్రం లేదు. ఒకవేళ చలం ఆవిషయాన్ని ఊహించి రాసి ఉండవచ్చు. కాని పరిణామ దృక్పథమేలేని వారిలో అంత తొందరగా అభ్యుదయాన్ని కాంక్షించడం దురాశ అవుతుంది.

**3.2.9.3 అంటరాని పొలం** - సవర్ణుడు తన పొలం వద్దనున్న హరిజనుని పొలాన్ని కాజేయడానికి చేసే ప్రయత్నాలు తెలియజేసే కథ. రచయిత ముద్దుకృష్ణ అంజనేయులు భూస్వామి తన పొలం ప్రక్కనే పిచ్చయ్య రెండెకరాల పొలం వుంది. అది అతని ముత్తాతల నాటి ఆస్తి. ఆంజనేయులు తనపొలం ప్రక్కన పిచ్చయ్య పొలం వున్నందుకు సహించలేక అతనితో పొలం కొనడానికి ప్రయత్నించాడు. అందులకు పిచ్చయ్య నిరాకరించాడు. అయినా ఆంజనేయులు పిచ్చయ్యను ఏమీ అనక అతని పొలం పనులకూ బాంకులో తనఖాలిప్పించేందుకు సహాయపడేవాడు. దానిని ఆసరాగా తీసుకొని అంజనేయులు పిచ్చయ్యతో వేలిముద్రలు వేయించుకొని పొలాన్ని కాజేశాడు. అంజనేయులు చేసిన మోసానికి పిచ్చయ్య కోర్టులో దావావేశాడు. లాయర్ సత్యమూర్తి సహాయంతో అంజనేయులు రాయించుకొన్న దస్తావేజుల్లో అవకతవకలవల్ల పిచ్చయ్య తన ఆస్తిని తిరిగిరాబట్టుకోగలిగాడు.

ఇది హరిజన జీవితం ప్రముఖంగా ప్రదర్శించిన కథ. బ్రాహ్మణత్వం ఆ పొందించిన సూత్రాల వల్ల హరిజనులు తరాలుగా నిరక్ష్య రాశ్యులుగానే మిగిలారు. జీవితంలో ఎన్నో సమస్యలకు గురయ్యారు. వున్న ఆస్తులను పోగొట్టుకొని పాలేర్లుగా చర్మకారులుగా, పాకీవాళ్లుగా, దొంగలుగా, బిక్షగాళ్లుగా జీవితాన్ని ప్రారంభించారు. కథలో పిచ్చయ్య నిరక్షరాస్యత వల్ల తన ఆస్తిని పోగొట్టుకొనే స్థితికి చేరాడు. తన పొలం వద్ద అంటరాని వాడి పొలం వుండటాన్ని ఆంజనేయులు సహించలేక పోయాడు. దానిని కాజేయాలన్న తపనతో పిచ్చయ్య సహాయకారిగా నటించాడు. ఈ కథ ద్వారా రచయిత ప్రతి ఒక్కరికి విద్య అవసరం అని లేదంటే తెలిసిన వాడి చేతిలో తెలియనివాడు బలికావల్సిందేనని హెచ్చరించాడు.

**3.2.9.4 ఉస్తి** :- హరిజన స్త్రీలు ఆహారాన్ని సంపాదించడంలో పడే కష్టాలను తెలియజేసే కథ. రచయిత కవి కొండల వెంకటరావు. మాలపల్లెలో ఒక హరిజన స్త్రీ. ప్రతిరోజు కొండకెళ్లి ఉస్తికాయలు తీసుక వచ్చి వ్యాపారం చేసేది. ఒకసారి వర్షం రావడం వల్ల మూడు రోజుల పాటు ఉస్తి కాయలకు వెళ్లలేక పోయింది. ఇబ్బందులకు గురిఅయి కొన్ని కాయలను తెంచుకుంది. ఈలోగా వానరావడం మొదలు పెట్టింది. ఉస్తి చెట్టు కంటకాలతో కూడినది కావటం వల్ల హరిజన స్త్రీ శరీరం అనేక గాయాలకు గురైంది. ఈలోగా ఒకడు. వెళ్లి ముళ్ల పొదల్లో వున్న ఆమెను రక్షించడానికి ప్రయత్నిస్తే అప్పుడామె ''నాయనా నన్ను లాగి పాలేసినా గాని పొదను లాగి పారవేయకు''60 అన్నది తన ప్రాణానికి హాని వుండదని తనే తనను కాపాడుకో గలనని అతనితో చెప్పింది. తనకు సహాయం చేయవచ్చిన అతనిని పొగిడింది.

హరిజన స్త్రీ పట్టెడు మెతుకుల కోసం అనేక చిక్కుల్లో పడి ఉస్తి కాయలు కోసి తెస్తే వాటిని ఆమె పరిస్థితిని చూసి సవర్ణులు కొనడానికి ప్రయత్నించారు. ఆ కాయలు కోసే ప్రయత్నంలో ఆమె శరీర మంతా రక్తమయమయింది. అయినా ముసలిది చలించలేదు. ఆకలితో అలమటించేకన్నా కష్టపడి తిండి సంపాదించడం గొప్ప అని తెలిపే కథ.

**3.2.9.5 పండగ పూట పరవాణ్ణం**- హరిజనులు తమ జీవితంలో ఏఒక్కసారైనా సుఖంగా వుండటానికి ప్రయత్నిస్తే పడేకష్టాలను చిత్రించే కథ. రచయిత పులికంటి కృష్ణారెడ్డి లచ్చుంగాడు లచ్చిమి భార్యా భర్తలు వాడలోనే కాపురముంటున్నారు. లచ్చుం గాడు రెడ్డి పాలేరు ప్రతిదినమూ పేటకు పోయి రెడ్డికి సారాయి తెచ్చి ఇచ్చేవాడు. దాంట్లో మిగిలిన కమిషన్‌తో భార్యకు పూలు తెచ్చేవాడు. రెడ్డి రెడ్డెమ్మ సారాయి త్రాగేది చూసి తనూ ఒకనాడైనా అలాసారాయి త్రాగాలను కొన్నాడు. ఇంట్లో భార్యను కష్టపెట్టి ఒప్పించాడు. ఈలోగా ఉగాది పండుగ రావడంతో సారాయి ఎక్కువ అవసరమై వాడంతా దొంగసారాయి చేయడం మొదలు

పెట్టారు. అది తెలిసి పోలీసులు వాడపై బడి సారా కుండలను నాశనం చేశారు. లచ్చిమి తన ఇంట్లో వున్న సారా ఊటను రక్షించదలచి పోలీసుల చేతిలో బలి అయ్యింది.

హరిజనులకు కష్టపడటం తప్ప సుఖం తెలియదు. కష్టం జాతి వారిక్చిన కానుక. వారు కూడా సుఖపడటానికి ఆలోచించరు. 'దేవుడు ఇలా రాశాడు'అని కర్మ సిద్ధాంతంతో ముడిపెట్టుకొని బ్రతకడం అలవాటు. ఎప్పుడైనా ఒకరోజు సుఖంగా వుండాలని ప్రయత్నిస్తే ఆ ప్రయత్నం సఫలం కాదు సరికదా, అనర్థం జరగక పోతేసరి. కథలో లచ్చం గాడు ఎప్పుడూ కష్టపడేవాడు. పోలీసులు కూడా ధనం, బలం వున్న వారి జోలికి వెళ్లరు. బీదవారు తినడానికి తిండిలేని వారి దగ్గర అధికారం చెలాయించడం పరిపాటి.

**3.2.9.6 జీవనాడులు** - హరిజనులు తమ పిల్లలకు ఘనంగా పెళ్లి చేయాలని ప్రయత్నిస్తే సవర్ణుల నుండి ఎదురైే సమస్యను చిత్రించే కథ. రచయిత శాంతి నారాయణ గంగడు వాడ పంచాయితీ బోర్డు మెంబరు. తన కూతురును పట్టణంలో ఒక గుమస్తాపని చేసే కుల్లాయప్పతో పెళ్లి సంబంధాన్ని ఖరారు చేశాడు. పెళ్లి ఘనంగా జరిపించదలచి మంగళ వాయిద్యాల కోసం మంగలి కొండడిని అడిగితే ''మాదిగోళ్ల పెండ్లికి బ్యాండు మేళం పట్టమని''61 చెప్పాడు. స్కూలు బెంచీలు తీసుకొచ్చి తన ఇంటి ముందు వేయించదలిస్తే స్కూల్ కమిటి ప్రెసిడెంటు రామన్నచౌదరి ''మాదిగోళ్ల పెళ్లిళ్లకు స్కూల్లో బెంచిలు ఇవ్వలేద''62 అన్నాడు వున్న వనరులతోనే పెళ్లిజరిగింది. వచ్చిన బంధువులంతా భోజనాలు చేసి వెళ్లిపోయారు. ఆరోజు సాయంత్రం నూతన వధూవరులు రెడ్డి ఇంటికి పోయి వారి కాళ్లకు నమస్కరించి వారిచ్చే ఇనాములు తీసుకొవాలన్నాడు. గంగడు. ఆసాంప్రదాయం పెళ్ళికొడుకు కుల్లాయప్ప కు నచ్చకపోయినా అంగీకరించాడు. పెళ్ళికూతురు తల్లి ''నడిబజారులో మనం ఊరేగింపుగా పోగూడదమ్మా'' 63 అని చెప్పింది. కాని అల్లుడు చెప్పినట్లే బజారు వెంట వెళ్లారు. బజార్లో వున్న వెంకటరెడ్డి ''యేరా గంగా యానాడు లేని మామూలు. ఈపొద్దు కొత్తగా పెడతాండావే యనాడాన్నా సూసినావేంరా మాదిగనాయళ్ళ ఈ వూర్లో బజారు గుండా వూరేగడం. మేం వూరికే వుండే కొద్ది కండ్లు నెత్తికెక్కుతుండాయిరా మీకు. సన్నజాతి సన్న రకంగానే వుండల్ల కానీ మరీ ఇంత మిడిసిపాటు పనికిరాదురా''64 అన్నాడు. ఈ విషయాన్ని సహించలేని పెళ్లికొడుకు కుల్లాయప్ప వెంకటరెడ్డిని ఎదిరించాడు. కొండా రెడ్డి ఇంటికి వెళ్ళారు. అప్పటికే తమ్ముడు వెంకటరెడ్డి చెప్పిన మాటలు విన్న కొండా రెడ్డి కోపంతో తనకు కాళ్ళు మొక్కవద్దని పాతచీర పదిరూపాయలు ఇనాము తీసుకొనివెళ్లి పోమన్నాడు. అవి తీసుకోక పెళ్లి జంట వెనక్కు తిరిగింది.

పూర్వం హరిజనులు మెడకు కుండ, ముడ్డికి చిపురు చేతిలో ముంత పట్టుకొని బజార్లో తిరిగేవారు. ప్రస్తుతం ఆసాంప్రదాయం లేదు కాని, గ్రామాల్లో సవర్ణుల ఎదుట హరిజనులు వంగి నడువాలి. వారి ఎదుట కూర్చోకూడదు. ఇది చట్టం కాదు. సాంప్రదాయం. కథలో జరిగిన స్థితి ఇదే. హరిజనులకు మంగలిలు బాండుమేలం పట్టరు. సరే సవర్ణులు పెళ్లి జంటగా స్వేచ్ఛగా బజార్లో కూడా ఊరేగించుకోడాన్ని సహించలేకపోయారు. వారి సంతోషాన్ని కాలదన్నే ధోరణిలో అవమానపరచారు. రెడ్డి మీద గౌరవంతో నూతన దంపతులు అతని ఇంటికి పోతే మర్యాద లేదు సరికదా తీవ్ర అవమానం ఎదురైంది. సమాజంలో మంచికి మానవతకు చోటులేదు. ఎదురు తిరిగేవాడే సాధించగలుగుతాడు. ఇనాం రెడ్డి ఇవ్వకపోవటం ముఖ్యంగా వుంది. కాళ్ళు మొక్కించుకోకపోవటం ప్రధానంగా వుంది. కాళ్ల మొక్కటానికి ఊరేగింపు గా పోవటం ఉంది. అందుకు దిక్కరించటం ఉంది. కానీ వాళ్లతో రెడ్డి కాళ్లకు మొక్కి ఇనాంతెచ్చుకోను అని కుల్లాయప్ప కూడా అనకపోవటం వల్ల కథ బలవంతుల పక్షంగానే జరిగినట్లు స్పష్టమవుతుంది.

**3.2.9.7** తొందరపడి ఒక కోడి ముందే కూసింది: ఆ ఊరి హరిజనులకు జరిగే అన్యాయాన్ని చిత్రించే కథ. రచయిత ఆరవేటి శ్రీనివాసులు. ఊరికి దూరంగా హరిజనవాడ. ఆ ఊరిలో భూస్వామి సుబ్బారెడ్డి.

వాడంతా అతని మాటే వినాలి. ఆవాడకు ఒకసారి రాడికల్స్ యువకులు వెళ్లి సుబ్బారెడ్డి మీశ్రమను దోచుకుంటున్నాడని తన ఆస్తిని వృద్ధి చేసుకుంటున్నాడని నూర ఎకరాలు బంజరు భూములను ఆక్రమించుకుంటున్నారని, దోపిడిదారుడని, కథలాగా చెప్పారు. ఈ కథ విన్న హరిజనులు సుబ్బారెడ్డినే తిడుతున్నారని అక్కడ నుండి ఒక్కొక్కరే జారుకొన్నారు. ఈ లోగా సుబ్బారెడ్డి మనుషులువచ్చి రాడికల్స్ యువకులైన వెంకటేశు, పెద్దిరాజు, నడిపి రాజు చిన్న రాజులను పిలుచుకెళ్లారు. తమకు దెబ్బలు తప్ప వనుకొన్నారు. సుబ్బారెడ్డి రాడికల్స్ యువకులకు ఆ రాత్రి భోజనం పెట్టి నిద్ర పోమన్నాడు. తెల్లవారి సుబ్బారెడ్డి రాత్రి నన్ను గూర్చి తిట్టిన వెంకటేశుతో ఆ తిట్లకు అర్థాలు చెప్పించుకొన్నాడు. ఆమాటలు అర్థం చేసుకొన్న సుబ్బారెడ్డి వెంకటేశుతో ''బాగా జెప్పినావు సంటోడా! అట్టియాడికి బోయినా మన వాళ్ళ గురించి యిట్లనే జెప్తాండు రాచ్చసులనా, బకాసురులని, సంపకతింటారని, కాలుకింద ఏసినలుచ్చారని జెప్పు లేకపోతే ఈనా కొడుకులు మన మాటింటారా''65 అన్నాడు. వెంకటేశుకు అర్థ నూటా పదహార్లు ఇచ్చి వారికి బండి కట్టిసాగనంపాడు.

సంఘంలో హరిజనులకు తీవ్ర అన్యాయం జరుగుతున్నదని తెలిసి రాడికల్స్ వారిని చైతన్య వంతులను చేయదలచినారు. ఊరూరు తిరిగి హరిజనులను మోసం చేస్తున్న భూసాముల దోపిడి స్థితిగతులను వివరించారు. దీని వల్ల హరిజనులు ఇంకా భయపడే స్థితిని కథ బోధిస్తుంది. కథలో వెంకటేశు సుబ్బారెడ్డిని గూర్చి హరిజనులకు క్రూరంగా చెప్పితే అందుకు సుబ్బారెడ్డి సంతసించాడు. తనంటే హరిజనుల భయపెట్టడానికి అది మంచి మార్గం అన్నాడు. హరిజనులను చైతన్య వంతులను చేయదలిస్తే అగ్రవర్ణాల గూర్చి క్రూరంగా చెప్పవద్దని సాధ్యమైనంత వరకూ హరిజనుల్లోని లోపాలనే బయటపెట్టడానికి ప్రయత్నించమని రాడికల్స్‌ను హెచ్చరించింది ఈకథ.

**3.2.9.8 ఏటిపాట** - హరిజనుడు సవర్ణ స్త్రీని తీసుకెళ్లితే వచ్చే కష్టాలను చిత్రించే కథ రచయిత గొరునాయుడు. పైడయ్య హరిజనుడు. ఊరూరు తిరిగి కథలు చెప్పి జీవనంగడిపేవాడు. ఒక ఊరిలో కథలు చెప్పుతుండగా నాయుడు వల్ల ఆదాయం రాక ఒక ఊరిలోనే స్థిరంగా వుండిపోయాడు. ఆ ఊళ్లో నాయుడు సూరమ్మపై కన్ను వేశాడు. పైడయ్యను తన ఇంట్లోనే కూలీకి వుండమన్నాడు. అందుకు పైడయ్య అంగీకరించాడు. పైడయ్య మాస్టర్ బాబు పెట్టిన సంఘంలో చేరాడు. సూరమ్మఎప్పుడైనా తాను నాయుడు కామానికి బలికాక తప్పదనుకుంది. అప్పుడప్పుడు భర్తతో పాటు నాయుడింటికి పోయి పనులు చేసేటి ఒక రోజు సంఘం వాళ్లు మీటింగు పెట్టి మరుసటి రోజు ఆ ఊరి బంజరు భూములను సాగుచేసుకోగలిగారు. విషయం తెలిసిన నాయుడు. అక్కడికి వెళ్లిపొలాన్ని సాగు చేస్తున్న పైడయ్యను చూసి కోపపడ్డాడు. ఆరాత్రికే పోలీసులొచ్చి పైడయ్యను మరి కొందరిని స్టేషన్‌కు తీసుకెళ్లారు. సంఘం ఒత్తిడి వల్ల పైడయ్య సమూహాన్ని పోలీసులు వదిలిపెట్టారు. ఆ రాత్రిలోనే పైడయ్య తన ఊరికి వస్తూండగా దారి మధ్యలో నాయుడు మనుష్యుల చే హత్యకు గురయ్యాడు.

సవర్ణులు హరిజను స్త్రీలను ఏమిచేసినా అడిగే దిక్కువుండదు. కాని అదే విషయం హరిజనులు చేస్తే వాళ్ల బ్రతకడంకష్టం. కథలో పైడయ్య స్థితి అదే. పైడయ్య మంచి పాటగాడని మనసుపడిన సూరమ్మకు చివరికి తినడానికి తిండిలేక తోటి కులం వాడైన నాయుడు ఇంట్లోని పని చేయవలసి వచ్చింది. గ్రామంతరుపున వున్న బంజరు భూమిని సంఘం వాళ్ళు సాగు చేసుకోవడానికి ప్రయత్నిస్తే సవర్ణులు వారిని సంఘ వ్యతిరేకులుగా చిత్రించారు. తన ఇంట్లో పాలేరుగా వుంటూ తనపై ఎదురు తిరిగిన పైడయ్యను నాయుడు హత మార్చాడు. కథలో రచయిత సవర్ణుల ఎదుట హరిజనులు అభివృద్ధి చెందడానికి ప్రయత్నిస్తే జరిగేవిషయాన్ని వివరించాడు. ఇది సవర్ణులు చేసే దుర్మార్గం చిత్రించబడిన కథ. అయితే హరిజనులు

భయపడకుండా సవర్ణులు ఎప్పుడు ఎలా ప్రవర్తిస్తారో గ్రహించి మసలుకోమనే హెచ్చరిక ఉంది.

**3.2.9.9 కొత్తదారి** :- న్యాయం కోసం పోరాడే హరిజనులను సవర్ణులు రాడికల్స్ గా ముద్రవేసిన కథ. రచయిత పినాకపాణి. రాములు నాగమ్మ కొడుకు అతనికి భూమిపైన దొరలపైన నమ్మకం లేదు. ఈ రెండు తమ బ్రతుకులను బాగు చేయవని ఆలోచించేవాడు. ఒకసారి హరిజన గుడిసెలు దగ్ధమవుతున్నాయి. వాటిని ఆర్పడానికి వాడలో నీళ్ళులేవు. హరిజనులు వాడ దగ్గర శివాలయ బావి నుండి నీళ్ళు తీసుకొచ్చి గుడిసెలను ఆర్పుతున్నారు. ఈ లోగా సవర్ణులు వచ్చి హరిజనులు, శివాలయ బావిలో నీళ్ళు తీసుకోవడం వల్ల బావి శివుడు మైలపడుతాయని, ఊరికి అరిష్టం జరుగుతుందని తిట్టుతూ నీరు ముట్టుకోవద్దన్నారు. దీనికి ప్రెసిడెంటు కొడుకు బాబులు రెడ్డి న్యాయకత్వం వహించాడు. హరిజనులు నీళ్ళు తీసుకెళ్లకపోతే తమ గుడిసెలు బూడిద పాలవుతాయని ప్రాధేయపడ్డారు. ఈ విషయం గ్రహించిన సవర్ణులు తమపై హరిజనుల దౌర్జన్యం చేశారని, తెల్లవారే లోగా పోలీసులను ఊరిలోకి రప్పించారు. పోలీసులు హరిజన వాడకు వచ్చి హరిజనులందరిని చిదకబాదుతూ అరెస్ట్ చేస్తున్నారు. రాములును పట్టుకోవడానికి ప్రయత్నిస్తే కొత్తదారి వెతుక్కొని రాడికల్స్‌లో చేరాడు.

నేడు తోటి వ్యక్తి అభివృద్ధి చెందడం ఎదుటి వానికి ఈర్ష్యను పురికొల్పుతుంది. అది ఈ వ్యవస్థలోపం. పైగా హరిజనులు తమ హక్కుల కోసం పోరాడటం అంటే సవర్ణుల ఉనికి దెబ్బతింటుంది. సమాజ పరిణామంలో భాగంగా హరిజనులు ఆపదలో తమ హక్కులను వినియోగించుకుంటే అగ్రవర్ణాల వారు సహించ లేక పోయారు. రాములు ఎదురు తిరిగే మనస్తత్వం వున్నవాడు కాబట్టే వాడిని తమ అడ్డును తొలగించుకోవడానికి రాడికల్స్ గా ముద్రవేశారు. హరిజనులు చైతన్యవంతులు కావడానికి ప్రయత్నిస్తే నమాజం వీరికిచ్చే కానుక ఇది.

**3.2.9.10 ముఖర ముఖం** - హరిజన ఉపాధ్యాయులను గూర్చి వివరించే కథ. రచయిత సింగమనేని నారాయణ. కథకుడి బీద కుటుంబం తండ్రి సవర్ణుల ఇళ్లల్లో జీతం చేసేవాడు. చిన్నతనంలో తమ కుటుంబం చాలా ఇబ్బందులకు గురైనా కథకుడు బాగానే చదువు కొన్నాడు. ఊరికి నాలుగు మైళ్ల దూరంలో వున్న హైస్కూల్‌నందు ఉన్నత విద్య నభ్యసించాడు. హాస్టల్ లోనే భోజనం చేస్తూ బి.ఇడి పూర్తి చేశాడు. ఉపాధ్యాయుడు గా ఉద్యోగం సంపాదించాడు. తోటి సమాజం అతనిని ''రిజర్వేషన్ కోటాలో ఉద్యోగం కొట్టేశావ్ అదృష్టం అంటే మీ ఎస్సీగాల్లదే.''66 అంటె బాదపడ్డాడు. ఉపాధ్యాయుడై వెంకటాపురం సెకండరీ గ్రేడ్ స్కూల్‌కు వెళ్లారు. వెళ్ళడంతోటి గ్రామంలో వ్యక్తితో పరిచయం చేసుకొని హోటల్‌లో కాఫీ త్రాగి తాను ఉద్యోగం చేయవలసిన పాఠశాలను చూశాడు. అక్కడ చాలా కాలంగా పాఠశాల భవనం కూలిపోవడం వల్ల దగ్గరలో నున్న ఆంజనేయ స్వామి దేవాలయంలో పాఠశాల పెట్టారు. ఆ పాఠశాలలో అది వరకే వున్న ఉపాధ్యాయుడు హరిజనుడు కావడం వల్ల దేవాలయం బయట ఎర్రటి ఎండలో నెత్తిన గడ్డ వేసుకొని పిల్లలకు చదువు చెప్పుతున్న ఉపాధ్యాయుడిని చూసిన కథకుడు తనదీ ఆదే బ్రతుకే. అనుకొని నివ్వెర పోయాడు.

హరిజన విద్యావంతులకు కూడా అడుగడుగునా అవమానాలు, సూటిపోటిగా మాటలు తప్పవనడానికి ఈ కథ తార్కాణం. కథలో కథకుడు విద్యావంతుడై ఉద్యోగం సంపాదిస్తే సమాజం రిజర్వేషన్ క్రింద వచ్చిందని, అది ఆతని కష్టానికి ఫలితం కాదని హీనంగా చూసింది. ఉద్యోగం వచ్చి పల్లెకు వెళ్ళితే అక్కడ గుడిబయట చదువు చెప్పాల్సిన స్థితి. ఈస్థితినేడు సమాజం అభివృద్ధి చెందినా అనాగరిక ఆటవిక సాంప్రదాయలతో మగ్గే సమాజంలా కన్పిస్తుంది. ఒక విద్యావంతుని కూడా కులం పేరుతో దూరంగా వుంచడం మానవ ప్రవృత్తికే మాయని మచ్చ.

**3.2.10 సంస్కరణోద్యమం** - సంస్కరణోద్యమం లో భాగంగా హరిజనుడు సవర్ణుని పంచన చేరి ఇబ్బందులకు గురికావడం చిత్రించే కథ. రచయిత కొనకళ్ళ వేంకటరత్నం. చక్రవర్తి జమీందారీ బిడ్డ. చిత్రలేఖనంలో డిట్ట. తండ్రి చనిపోవడంతో ఆస్తి అన్యాక్రాంతం అయ్యింది. భార్య ఉమాదేవి కూడా విరక్తి పొంది ఆత్మహత్య చేసుకొంది. అప్పటికి వారికి మూడు నెలల కొడుకున్నాడు. వాడి పేరు బాజి. ఆ స్థితిలో మనోవిఖలుడైన చక్రవర్తి కొడుకును అమ్మమ్మ ఊళ్ళో విడిచి ఇతర దేశాలకు వెళ్ళి పోయాడు. తిరిగి వచ్చి విశాఖపట్టణంలో కొడుకుతో సంసారం సాగిస్తున్నాడు. అప్పుడే దేశవ్యాప్తంగా హరిజనోద్ధరణ పాటించాలని నాయకులు పట్టుపట్టడంతో సవర్ణుల ప్రతిఒక్కరూ ఒక హరిజన విద్యార్థిని తమ ఇంట్లో వుంచుకొని విద్య నేర్పించాలని నిర్ణయించారు. చక్రవర్తి నాయకుని మాటలు కాదన లేక. ఇష్టం లేకున్నా గోవిందుడు అనే హరిజన విద్యార్థిని తన ఇంట్లో వుంచుకున్నాడు. అంతకు మునుపున్న పనిమనుషుల్లో ఒకరిని తీసివేశాడు. గోవిందుడు చదువుపై ఆసక్తి వున్నవాడు. వాడు చదువుతుంటే చక్రవర్తి సహించేవాడు కాదు. ఏదో పని పురమాయించేవాడు. ఎప్పుడు బాజీని ఆడించడానికే గోవిందుడికి కాలం జరిగి పోయేది. అప్పటినుండి బడిలో టీచరు, చక్రవర్తి వాడిని తరచుగా కొట్టేవారు. ఒక్కొక్కసారి ఈ రెండు బాధలు భరించలేక గోవిందుడు బడి, చక్రవర్తి ఇళ్ళు ఎగగొట్టేవాడు. బాజి, గోవిందుడు ప్రాణ స్నేహితులయ్యారు. ఒకరి నొకరు విడిచి వుండలేకపోయారు. ఇది చక్రవర్తికి రుచించలేదు. అప్పటినుండి చక్రవర్తి బాజికి దగ్గరవడానికి ప్రయత్నించాడు. గోవిందుడిని వాళ్లింటికి వెళ్లమన్నాడు. ఒకసారి గోవిందుడు దొంగగా వచ్చి బాజిని చూడటానికి ప్రయత్నిస్తే చక్రవర్తి కొట్టాడు. ఆ రాత్రిలోనే గోవిందుడు ఇంటికెళ్లుతూ దారిలో పామును చూశాడు. ఇంటికెళ్లి జ్వరంతో పడిపోయాడు. అప్పటినుండి గోవిందుడు చక్రవర్తి ఇంట్లో వుండటానికి నిరాకరించాడు.

సంఘ సంస్కరణ వాదులు సమాజాన్ని అర్థం చేసుకోకుండా వారి సిద్ధాంతాలను రుద్దడానికి ప్రయత్నిస్తే పరిస్థితి ఎలా వుంటుందో రచయిత వివరించాడు. కథలో విద్య పట్ల ఆసక్తి వున్న గోవిందుడు తన ఇంట్లో వున్నప్పుడు తిండి లేక పోయినా గొప్పసౌకర్యాలు లేకపోయినా విద్యావంతుడు కాగలిగాడు. అదే ధనవంతుడి ఇంట్లో గొప్పగా చదువుకోవాలని ఆశించిన గోవిందుడికి నిరాశ ఎదురైంది. వచ్చిన చదువుకే గండిపడింది. గోవిందుడు రెంటికి చెడ్డ రేవడిగా తయారయ్యాడు. అలాంటి సంస్కరణలు అభివృద్ధి చెందవని, మానవుని మనస్తత్వంలో మార్పు రావాలని రచయిత సలహా.

**3.2.11. మతాంతరీకరణం** - హరిజనులు తరాలుగా వస్తున్న బానిసత్వాన్ని భరించలేక తమ బ్రతుకును మార్చుకోవడంకోసం హిందూ మతం తమకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ప్రసాదించలేదని తెలిసి ఎక్కువమంది క్రైస్తవంలోకి వెళ్లారు. మానవులందరూ సమానమే, అందరూ దేవుని సంతానమే అనే నమ్మకం కలిగించింది క్రైస్తవం. బ్రిటీష్ వారు ఇండియాలో ప్రవేశించునాటికే అస్పృశ్యత వెట్టిచాకిరీ బాగా వేళ్లతున్నుకున్నాయి. అటువంటి సమయంలో వర్ణ, వర్గ భేదం లేని మతమే క్రైస్తవ మతమని దేవుని దృష్టిలో అంతా సమానమేననీ క్రైస్తవ మిషనరీలు ప్రచారం చేశారు. హరిజనులు తమ మత వ్యాప్తికైతేనేమి, పలుకుబడికైతేనేమి అనేకమందిని తమ మతంలోకి చేర్చుకోవడం వారికి మంచి ప్రోత్సాహాన్ని ఇచ్చింది. దీనివల్ల హరిజనులు క్రైస్తవమతంపై బాగా ఆకర్షితులై మతం పుచ్చుకొన్నారు. క్రైస్తవం వీరికి విద్య నేర్పటం వల్ల తాము ఇంత కాలం సవర్ణుల ఆచారాల వల్ల ఎంత మోసపోయారో తెలియజేసింది. ఉద్యోగాలిచ్చి జీవనం గడపటం నేర్పినా హరిజన క్రైస్తవులుగానే చూసింది. ఈ నేపథ్యం తెలుగు కథానికావస్తువయ్యింది. ఆ కథలను పరిశీలిద్దాం.

**3.2.11.1. వ్యత్యయం** - మతం ముసుగులో అక్రమాలను చిత్రించే కథ. దీని రచయిత వేలూరి శివరామశాస్త్రి. రాముడు కాటని కొడుకు. సోములు నరసింహులు కొడుకు. చిన్నతనం నుండి కాటడు

నరసింహుని పాలేరు . కాటడిని నరసింహులు ఆర్థికంగా ఆదుకొన్నాడు. పెళ్ళిచేసి ఇల్లు కట్టించాడు. అందుకు ప్రతిఫలంగా కాటడు, నరసింహులును రెండుసార్లు చావునుండి కాపాడాడు. కాటడు తన వద్దనున్న డబ్బును సోములు వద్ద వుంచి రామునికి కష్టాల్లో ఇవ్వమని చనిపోయాడు. తన ఆస్తిని తన తండ్రిమిత్రుడైన నరసింహులు కొడుకు కాజేయడం వల్ల తినడానికి తిండి లేని వాడయ్యాడు. ఆకలితో అలమటిస్తున్న రాముడిని క్రైస్తవ మతస్థురాలైన రెబెకా చేరదీసింది. ఇద్దరూ ప్రేమించుకొని ఫాదరీ సహాయంతో మతం పుచ్చుకొని పెళ్లి చేసుకొన్నారు. రెబెకా పంతులమ్మగా, రాముడు జకరయ్యగా మారి పంతులు ఉద్యోగాలు చేసేవారు. వారి కొచ్చిన జీతమంతా మత పుస్తకాలు కొనడానికే సరిపోయేది. జకరయ్య పొట్ట నింపుకోవడం కష్టమైందని ఫాదరీతో చెప్పితే ఫాదరీ మీ''నల్ల వారందఱు మాకు బానిసలు బానిసల మీద నుంపవలసిన దయ నాకు తెలియును. నేను చేయకలిగినంత ఉపకారం చేసితిని''67 అన్నాడు. మరుసటి రోజే జకరయ్య ఉద్యోగం ఊడిపోయింది. అప్పుడు జకరయ్య ''ఏ మతంలోనూ తప్పున్నది స్వార్థపరుడగు మానవునిలో గాక''68 ననుకొన్నాడు.

రాముడు జకరయ్య గా మారితే తమ బ్రతుకు బాగుపడుతుందని తలచాడు. ఉద్యోగం సంపాదించుకోవచ్చుననుకున్నాడు. మంచి భవిష్యత్తు వుంటుందని తలచాడు. అయితే అక్కడ రాముడి ఆశలన్నీ గగనకుసుమాలే కాగా అవమానం రెండింతలైంది. పంతుల ఉద్యోగం చేస్తున్న జకరయ్యకు శ్రమ దోపిడి కన్పించింది. అది అన్యాయం అంటే ఉద్యోగం నుండిగెంటివేయబడ్డాడు. సర్వమతాలూ సమానమేనని మతం కూడుపెట్టదని తెలుసుకొన్నాడు. మతం ముసుగులో అన్యాయాలు చేసే ఫాదరీ కన్నా తన ఆస్తిని స్వార్థంతో కాజేసిన సోములే మిన్న అనుకొన్నాడు. మానవుడిలో స్వార్థంవున్నంత వరకూ మతాలు ఏమీ చేయలేవని గుర్తించాడు.

**3.2.11.2. ఇలాంటి తవ్వాయివస్తే** - హరిజనులు తమ బ్రతుకు మార్పుకోసం మతాలను మార్చుకోవడాన్ని చిత్రించిన కథ. రచయిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి.

ఆ ఊరిలో తరాల నుండి మాదిగలకు చిన్న చెరువు. సవర్ణులకు పెద్ద చెరువు ఉండేది. ఎవరి చెరువులో వాళ్ళు నీళ్ళు తీసుకొనేవారు. మూడేళ్లకొకసారి చెరువులో నీళ్ళుతోడి సవర్ణులు చేపలు పట్టుకొన్నాక హరిజనులు దిగి చేపలు పట్టుకొనేవారు. హరిజనులు అప్పుడప్పుడే క్రైస్తవ మతాన్ని స్వీకరిస్తున్న సందర్భంలో మాదిగల చెరువులో కుష్ఠురోగి లచ్చుంగాడు పడి చనిపోయాడు. అందువల్ల మాదిగలు పెద్ద చెరువులో నీళ్ళు తీసుకోవడానికి నిశ్చయించుకొని గ్రామంలో పంచాయతీ పెట్టించారు. పంచాయతీలో సవర్ణులు కిరస్తానీవాళ్లనడిగి ఒక బావిని త్రవ్వించుకోమన్నారు. మరొకరు పెద్ద చెరువులో నీళ్లను మీకడవలలోకి పోయడానికి ఇద్దరు మనుషులను జీతం పెట్టుకోమన్నారు. అందుకు హరిజనులు నిరాకరించి నౌకరు విస్సన్న నాయకత్వాన పెద్ద చెరువులో నీళ్ళు తీసుకోవడానికి ప్రయత్నించగా సోమయాజులు తిరస్కరించాడు.

ఆ మరునాడే క్రైస్తవ పంతులు ఈ విషయాన్ని తాలూకా కాంగ్రెస్ అధ్యక్షుడికి హరిజన సేవా సంఘం అధ్యక్షుడికి రిపోర్టు చేశాడు. వారి ధోరణిలో వారు సహాయం చేస్తామని వాగ్దానాలు చేశారు. ఈలోగా విస్సన్నపంతులు వద్దకు పోయి తాను ముస్లీం మతంలో చేరుతున్నానని, అప్పుడే సవర్ణులతో సమానంగా వుండవచ్చునని చెప్పాడు. ముస్లీం మతస్థులు కూడా విస్సన్నను తమ మతంలోకి చేర్చుకోవడానికి అంగీకరించారు. విస్సన్న కరీంసాబ్ సహాయంతో ముస్లీం మతం స్వీకరించి ఇస్మాయిల్ అయ్యాడు. కరణం ఇంట్లోకి వెళ్లి సలాంచేశాడు. కరీంసాబ్ ఇకస్మాయిల్‌ను సవర్ణులతో సమానంగా చూడాలని కరణంతో చెప్పాడు. ముస్లీంలు అధికారులు కావడంవల్ల సవర్ణులు ఇష్టం లేకున్నా అంగీకరించారు. ఇస్మాయిల్, కరీం పెద్ద చెరువులో స్నానం చేశారు.

తరతరాలుగా తమ సామాన్య హక్కులు కూడా సాధించుకోలేని హరిజనులు క్రైస్తవ మతంలోకి చేరినా సాంఘికంగా వారిస్థితి మెరుగుపడలేదు. ఆ మతంలో మాదిగ క్రైస్తవులు, మాల క్రైస్తులు అని అనడం, వారిని దూరంగా వుంచడం వల్ల అందరూ సమానమే నని భావించే క్రైస్తవ మతం హరిజనులకు కలిగించలేని సాంఘీకౌన్నత్యాన్ని, మహమ్మదీయ మతం ఎలా కలిగించిందో తెలియజేసిందీ కథ. సామాజిక వాస్తవికతను చిత్రించే ఈ కథ పాఠకులలో ఆలోచన రేకెత్తించింది. చైతన్యవంతులను చేసింది. సమాజాన్ని పీడిస్తున్న ఒక వాస్తవిక సమస్యను హేతువాద దృష్టితో అనుశీలించిన జీవిత సత్యాన్ని ప్రతిభావంతంగా చిత్రించిన రచన ఇది. ఒకప్పుడు కాంగ్రెస్‌వారు హరిజన సేవాధోరణిని హిందీ, ఖద్దరు ప్రచారాలను రచయిత హేళన చేశాడు.

హరిజనులు అభివృద్ధి కోసం క్రైస్తవ మతం స్వీకరిస్తే అక్కడ వారికి ఆశలు ప్రబలాయి కాని, తీరలేదు. తీరుతాయన్న ఆశలు కూడా ఇంకిపోయాయి. కను చూపు మేరలో కూడా కనిపించలేదు. అందుకోసమే వారు ముస్లీంలయి సమానత్వం పొందారు. సవర్ణులు కూడా, ముస్లీంలు అయిన తర్వాత వారిని తమతో సమానంగా చూడగలిగారు.

**3.2.11.3. జీవనగమనం** - కులాంతర వివాహం చేసుకొన్న బ్రాహ్మణ స్త్రీ తన తల్లి తండ్రులను చూడలేక పొందిన మానసిక వ్యథ కథ. రచయిత చిత్తూరి కోటేశ్వరరావు. పెద్ద నారాయణ పాపయ్య శాస్త్రి పొలం పనులు చూస్తూ అక్కడే చిన్న గుడిసెలో వుండేవాడు. అతని కొడుకు చిన్న నారాయణ బి.ఏ పూర్తి చేశాడు. ఉన్నత విద్య చదివి కళాశాల లెక్చరర్ కావాలన్న ఆశతో వుండేవాడు. ఒకరోజు పాపయ్యశాస్త్రి తన కూతుళ్లతో సహా పొలం చూడటానికెళ్లి నారాయణను బాగా చదవమని ఉద్యోగం ఇప్పించే ప్రయత్నం చేస్తానని చెప్పాడు. మరుసటి రోజు తన ఇంటికి రమ్మన్నాడు. ఇంటి కెళ్లిన నారాయణపై అరుంధతి మోజుపడింది. వారిద్దరూ ప్రేమించుకొని పెళ్ళిచేసుకొన్నారు. కన్న తండ్రికి తలవంపులు తెచ్చినందుకు అరుంధతి ఆ గ్రామంలో ఉండక పట్టణానికి తన భర్తతో పాటు వెళుతుండగా రైల్వే స్టేషన్‌లో వీరిద్దరిని అనుమానించిన పోలీసులు స్టేషన్‌కు తీసుకెళ్లారు. అక్కడ పోలీసు అరుంధతిని మానభంగం చేయడానికి తలపెట్టగా ఇన్‌స్పెక్టర్ చంద్రం ఆమెను రక్షించి భార్య భర్తలిద్దరిని ఒక ప్రెస్‌లో కంపోజిటర్స్‌గా ఉద్యోగం ఇప్పించాడు. నారాయణ, అరుంధతి స్వశక్తితో ఒక ప్రెస్‌పెట్టి ధనవంతులయ్యారు. ఒకరోజు అరుంధతి తన తండ్రిని చూడటానికి వెళ్లితే ఆమె అక్కలు నిరాకరించారు. తండ్రి తనవలనే మానసిక వ్యధకు గురై చనిపోయాడని తెలిసి తానూ మానసికంగా కృంగి అనారోగ్యానికి గురై ఆసుపత్రి చేరింది. తన బంధువుల కోసం తపిస్తే ఎవరూరాలేదు. చివరకు పూర్వం ఇన్‌స్పెక్టర్‌చంద్రం ప్రస్తుతం అడిషినల్ యస్.పి.స్థాయిలో ఆసుపత్రికి వచ్చి, ఎవరో రాలేదని మనం వాళ్ళపై బెంగపెట్టుకోకూడదని, మన బ్రతుకులు మనం జీవించాలని అరుంధతికి ధైర్యం చెప్పాడు.

కుల సమస్య ద్వారా బాధపడుతున్న పీడిత తాడిత జనోద్ధరణకు కులాంతర వివాహాల ద్వారా పరిష్కరించడానికి చేసిన రచయిత ప్రయత్నం జీవన గమనం. ఒక బ్రాహ్మణ స్త్రీ హరిజన యువకుని ధైర్యంగా వివాహం చేసుకొని అభ్యుదయం వైపు పయనించడానికి ప్రయత్నించింది. ఆ తపనలో కన్నతండ్రి పుట్టినింటిపై నున్న మమకారం వల్ల మానసిక వ్యధకు గురైంది. తనకు దూరమైన వారికోసం తపన పడింది. ఆ తపనలో తనకు సహాయం చేసి తన జీవితాన్ని నిలబెట్టిన చంద్రం ఓదార్పు ద్వారా అరుంధతి ఆపదలో ఆదుకొన్న వారే బంధువులని తెలుసుకోగలిగింది. చేసిన తప్పుకు పశ్చాత్తాప పడకూడదని, తనమీద అభిమానం లేనివారిపై తన అభిమానం ఆప్యాయత పెంచుకోకూడదని, వాటినే మనస్సులో పెట్టుకొని జీవితాంతం మానసిన వ్యథకు గురికా కుండా సుఖంగా జీవించడం ఆరోగ్యానికి మంచిదని రచయత తెలియజేశాడు.

**3.2.11.4. విశ్వనరుడు** - మానవులందరూ ఒక్కటేనని నిరూపించిన కథ. రచయిత డా. సుగుణ రావు. బదరీనాథ్ కెనడాలో తత్త్వశాస్త్ర ప్రొఫెసర్. కొన్ని సంవత్సరాలకు తన ఊరికి తిరిగి వచ్చాడు. తన తండ్రి కాలంలో హరిజన తవిటయ్య తన అరెకరంపొలాన్ని అభివృద్ధి చేశాడు. పంట పండించాడు. ఇప్పుడు తన కాలంలో అదేపని హరిజన ఓబిలేసు చేస్తున్నాడు. రేపు ఓబిలేసుకొడుకు కూడా అదేపని చేస్తాడు. బదరీ నాథ్ ధనవంతుడు. ఎందరో పిల్ల నిస్తామన్నారు. కాని అతను వివాహం చేసుకోలేదు. సమాజంలో ఓబిలేసు కుటుంబాలు బానిసత్వం క్రిందే మగ్గుతున్నామని తెలిసి సహించలేక ఓబిలేసు కొడుకును దత్తత తీసుకొన్నాడు. ఆ అబ్బాయి పేరు గౌతం. ఉన్నతవిద్య చదివి డాక్టరయ్యాడు. ప్రక్క గ్రామం డాక్టర్ శివరామమూర్తి తన కూతురుతో గౌతంకు పెళ్లి చేస్తున్నామన్నాడు. ఆ డాక్టరు కూతురు ప్రేంకుమార్ అనే ఒక హరిజన టీచర్‌ను ప్రేమించింది. డాక్టర్ ఆ ప్రేంకుమార్‌ను అక్కడనుండి బదిలీ చేయించి కూతురును అమెరికాలో సెటిలైన డాక్టర్ కిచ్చి పెళ్లి చేశాడు. శివరామమూర్తిలాంటి వాళ్లెందరో డాక్టర్ గౌతంకు పిల్లనిస్తామన్నారు. తన కొడుక్కి పేద పూజారి బిడ్డతో వివాహం జరిపించాడు.

బదరీనాథ్ అభ్యుదయ భావాలు కలవాడు. సమాజంలో హరిజనులకు అంటగట్టిన అంటరానితనాన్ని వదిలించడానికి ప్రయత్నించాడు. దాని ఫలితమే గౌతం ఉన్నతుడయ్యాడు. తమను చూస్తేనే మైలపడుతారన్న ఆలోచన వున్న బ్రాహ్మణ కుటుంబంలో పెళ్లి చేసుకోగలిగాడు. బ్రాహ్మణ సంప్రదాయాలను కూకటి వ్రేళ్లతో సహా పెకలించడానికి ప్రయత్నించాడు. శివరామమూర్తి తన కూతురు ఒక హరిజనున్ని ప్రేమిస్తే సహించలేని వ్యక్తి ఒక అగ్రకుటుంబంలో పెరిగిన హరిజనునికి తన కూతురు నివ్వడానికి ప్రయత్నిస్తాడు. ఇది అతని కులతత్వస్వార్థము.

నేడు సమాజంలో ఈ పరిస్థితి లేదు. ఏ అగ్రవర్ణంవారు ఒక హరిజనుని దత్తత తీసుకోరు. అభ్యుదయ భావాలుగల డాక్టర్ యం. సుగుణారావు హరిజనులకు ఉన్నతస్థాయిని కల్పించాలనే తపన చేతనే ఈ కథను రచించాడని చెప్పవచ్చు.

**3.2.12. త్రాగునీటి సమస్యలు :-** మనిషి జీవించడానికి ఆహారం ఎంతఅవసరమో అంతకన్న ఎక్కువ నీరు అవసరం. ఆహారం లేకుండా కొన్నిరోజులైనా ఉండగలం కాని, నీళ్ళులేకుండా ఒక్కనిముషం బ్రతకలేం. గంగ సర్వపాపాలను హరిస్తుందంటారు. అది ఎంతవరకూ నిజమోకాని ఎదుటిమనిషి ప్రాణాలను మాత్రం కొంతమంది హరిస్తుంటారు. ఇది జాతి పరం కావచ్చు లేదా మరేకారణం అయినా కావచ్చు. జాతిపరంగా లేదా కులపరంగా ఊరిబయట నివసిస్తున్న వాళ్ళు హరిజనులు కొన్ని సాంఘికమైన కట్టుబాట్ల పేరుతో హరిజనులను తమకు దూరంగా వుంచారు. సవర్ణులు గుడి, బడి, బావి మొదలైన విషయాల్లో హరిజనులను ప్రత్యేకంగా ఏర్పరచారు. ఏపరిస్థితులైనా హరిజనులు ఈ నియమాలు అతిక్రమిస్తే శిక్షార్హులవుతారు. ఆశిక్ష ఎంత కఠినంగానైనా వుండవచ్చు తాము కష్టపడి బావులు త్రవ్వి చెరువులు కట్టితే వాటిలో నీరే త్రగడానికి నిషిద్ధం అవుతారు. ఇది సమాజం వారికిచ్చే బహుమానం.

ఒకవైపు కుల సమాజం పోవాలని, వర్గసమాజం నశించాలని ఉపన్యాసాలు, కర పత్రాలు, సంస్కర్తలు గొంతెత్తి చించుకొంటున్నారు. సమసమాజ నిర్మాణాన్ని ఆశిస్తున్నారు. కాని, ఈ మార్పు రెండు వర్గాలలోనూ రావాలి. అప్పుడే సమానత్వం రాగలదు. కాని ఈనాటికీ గ్రామాల్లో హరిజనులు పడే ఇబ్బందులు వారు ఏమీ అభివృద్ధి చెందలేదనడానికి నిదర్శనం. ముఖ్యంగా నీటిసమస్య ఈ సమస్యను. ఇతివృత్తంగా చేసుకొని అనేకమంది రచయితలు వ్రాసిన కథానికలను పరిశీలిద్దాం :

**3.2.12.1. మలుపు :-** హరిజనుల త్రాగునీటి సమస్యను చిత్రించే కథ. రచయిత అరుణతార. హరిజనులందరూ కలసి ఒక బావి తవ్వుకొన్నారు. బావినీటిలో ఫ్లోరిన్ శాతం అధికంగా వుండటం వల్ల

ప్రతిరోజూ కొందరు చనిపోతున్నారు. హరిజనులు కలరా అని తలచి జాతర పేరుతో ఇంటికొక పొట్టేలును బలి ఇస్తున్నారు. అయినా జనం చనిపోవడం ఆగలేదు. ఈలోగా ప్రభుత్వ అధికారులు, రాజకీయనాయకులు వచ్చి బావినీటిలో ఫ్లోరిన్ శాతం ఎక్కువుందని ఆ బావినీళ్ల ప్రాణహాని అని త్వరలోనే ఒకరిగ్ వేయిస్తామన్నారు. మాదిగలు తొందరగా బోరువేయమని ప్రాధేయపడితే ''తొత్తులంజాకొడుకుల్లారా బావి త్రవ్విస్తారులే దేవుడు ఎలా రాసి వుంటే అట్లా జరుగుతుంది. అమృతం త్రాగిన వారు కూడా చస్తున్నారు''70 అన్నారు. మరుసటి రోజు హరిజనులు ప్రెసిడెంటు రెడ్డయ్య పొలంలో బావిలోని నీళ్లకు వెళ్లితే నిరాకరించాడు. ఈ విషయం హరిజనులు ప్రభుత్వ అధికారులతో విన్నవించినా ప్రయోజనం లేక ఆ బావిలోనే నీళ్ళను త్రాగడానికి వెళుతుంటే మంగయ్య పిల్లనాయల్లారా చస్తారురా. ఈ బావి చెడిపోతే ఊళ్ళోబావి ఏమయ్యిందిరా అది కూడా మనమే త్రవ్వామన్నాడు. అంతే చిన్న రైతులు రైతుకూలీలు, మాలలు, మాదిగలు కలిసి ఊళ్ళో బావికి నీళ్ళ కెళ్ళారు. కరణం ప్రెసిడెంటు ఆచారాన్ని ఆ మాటలను లెక్కచేయలేదు.

ఈ కథలో రచయిత అగ్రవర్ణాల వారి ఆచారాలు, సంప్రదాయాలు ఎంత కట్టు దిట్టంగా వుంటాయో చిత్రించాడు. ప్రెసిడెంటు రెడ్డయ్య హరిజనులకు కనీసం పొలంలోని నీళ్ళను కూడా ఇవ్వడానికి నిరాకరించాడు. ఆ విషయాన్ని అధికార్లకు తెలియజేస్తే అస్పృశ్యతను రూపు మాపాలని గొంతెత్తి చించుకొనే అధికారులు కనీసం నోరైనా మెదపలేదు. సమస్యకు పరిష్కారాన్నైనా చూలేదు. ప్రభుత్వం చేయలేని పనిని ప్రజలు చేయగలిగారు. బడుగువర్గాల వారంతా ఏకమై ఎవరూ సాధించలేనిది. సవర్ణులు ఊహించలేనిదీ సాధించుకొన్నారు. సమస్యను ఐక్యంగా ఎదుర్కోవడానికి సిద్ధమయ్యారు. కథలో రచయిత బడుగు వర్గాల వారిని చైతన్యవంతులుగా చేయడానికి ప్రయత్నించాడు.

**3.2.12.2. చెంబుకొక గంగ** :- హరిజనులకు సవర్ణులు త్రాగడానికి నీళ్ల ఇవ్వకపోతే హరిజనులే సొంత బావిని త్రవ్వుకొనే స్థితిని చిత్రించిన కథ. రచయిత పులికంటి కృష్ణారెడ్డి, అంకయ్య మాజీ మిలటరీ సైనికుడు. పూర్వం ఆ గ్రామంలోనే సవర్ణుల ఇంట్లో జీతం వుండి, వారు పెట్టే కష్టాలు భరించలేక సైన్యంలో చేరాడు. అంకయ్య మాట వాడలో వేదవాక్కు. సైన్యం నుండి వచ్చిన అంకయ్యకు గ్రామం అభివృద్ధి కనిపించింది. కాని వాడ అభివృద్ధి కనిపించలేదు. హరిజనులు అంకయ్య నాయకత్వాన బంజరు భూముల్లో గుడిసెలు వేశారు. వాటిని కూలద్రోయడానికి సవర్ణులు అధికారులతో కలసి పన్నాగం పన్నారు. కాని లాభం లేకపోయింది. తహశీల్దారు ఒక బుల్‌డోజర్‌తో వచ్చి గుడిసెల ముందు వరుసగా పడుకున్న హరిజనులను నీళ్లకు రానివ్వలేదు. అందుకు హరిజనులే ఒక బావి త్రవ్వుకొన్నారు. బావిలో నీరు పుష్కలంగా వుంది. ఎండాకాలంలో ఊరి బావిలో ఎక్కడా నీళ్ళులేవు. సవర్ణులు అంకయ్య వద్దకు వచ్చి ఆబావిలో నుండి ఊళ్ళోకి పంపులు వేయించుకొంటామనే సరికి అంకయ్య నిరాకరించాడు. కలెక్టర్ వచ్చి హరిజనులను సవర్ణులకు నీళ్ళు ఇవ్వమన్నాడు. అందులకు అంకయ్య వాళ్లకు నీళ్ళు ఇవ్వడంలో తమకేమీ అభ్యంతరం లేదని కాని పంపు మాత్రం వేసుకొ కూడదని పూర్వం వాళ్ళే మాకు నీళ్ళు ఇవ్వలేదని కనీసం మా కడవల్లోకి నీళ్ళు పోయలేదన్నాడు. అలాంటిది. మేము ఇప్పుడు పంపుద్వారా అయితే తీసుకవెళ్ళనివ్వమని ఖచ్చితంగా చెప్పాడు.

గ్రామాలలో తరతరాలుగా ప్రజలపై పెత్తనాలు జరిపే నిరంకుశ పెత్తందార్ల నుండి హరిజనులు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు సాధించుకొనే యత్నమే ఈ కథ. హరిజనులకు ఏ విషయంలోనైనా సవర్ణుల సహకారం అని నిరూపించే కథ. వారికి డబ్బులేక పోయినా శక్తి వుంది. అంతేగాక వారు సమైక్యంగా వుంటే ఏదైనా సాధించగలరని తెలియజేస్తుంది. కథలో అంకయ్య సవర్ణులు నీళ్ళు ఇవ్వలేదని బాధపడలేదు. వాళ్ళు నీళ్ళు ఇవ్వకపోవడం వల్లే హరిజనులు అభ్యుదయంవైపు నడువగలగారు. చివరకు సవర్ణులనే తమవద్ద భిక్షమెత్తేలా చేసుకోగలిగారు.

మరో విషయం ఏమంటే - సమాజంలో ఏ హరిజనుడైనా సవర్ణుడు తన బావిలో నీళ్లు ఇవ్వకపోతే బాధపడడు కాని సవర్ణుడు తన బావిలో నీళ్లను తీసుకొంటానని హరిజనున్ని అడిగితే నిరాకరించడు. కథలో కొంత అవాస్తవికత వున్నా రచయిత హరిజనులను చైతన్య వంతులుగా చేయడానికి తపన పడ్డాడు.

**3.2.12.3. పాహిమాం పాహి పాహి** :- సవర్ణులు పెట్టే బాధలను భరించలేక క్రైస్తవం పుచ్చుకొన్న హరిజనుల కథ. రచయిత ఎం.సూర్య ప్రసాదరావు. చెంగయ్య హరిజనవాడ పెద్ద. గ్రామస్థులు తమకు త్రాగడానికి నీళ్ళు ఇవ్వలేదని చెంగయ్య వద్ద హరిజనులు సమావేశమై వాడ దూరంగా మంచి నీళ్లబావి త్రవ్వుకోవాలని నిశ్చయించారు. అనుకొన్నదేతడవు హరిజనులు బావి త్రవ్వడం ప్రారంభించారు. ఈలోగా గ్రామస్థులు హరిజనుల గుడిసెలను అక్కడలేకుండా చేయడంతో మంచినీళ్ళ బావి దగ్గరే గుడిసెలు వేసుకొన్నారు. పాత హరిజనవాడ పట్టణంగా మారిపోయింది. కొన్ని రోజులకు హరిజనులు కాపురముంటున్న నివాసం జాతీయ రహదారికి అడ్డంకి అని, తక్షణం ఆ ప్రాంతాన్ని ఖాళీ చేయమని అధికారులు ఆదేశించారు. హరిజనులు అధికారులకు విన్నవించుకొన్నా ప్రయోజనం లేకపోయింది. ఇక తమకు న్యాయం జరగదని తెలిసి చెంగయ్య నాయకత్వాన క్రైస్తసం స్వీకరించి, తమవాడకు 'బెత్లెహమ్ నగరం' అని పేరు పెట్టుకొన్నారు. అది చూసిన అధికారులు గుడిసెలను నేలమట్టం చేయకుండా వెళ్ళిపోయారు.

వర్ణ వ్యవస్థకు కట్టుబడి శతాబ్దాలుగా బానిస జీవితం గడుపుతున్న హరిజనులకు సంఘటిత శక్తితో పోరాటం సాగించడం ద్వారా తమ భవిష్యత్తును తీర్చి దిద్దుకో గలమన్న విశ్వాసం కలిగింది. కులం కూడు పెట్టదని తమ భవిష్యత్తు మారదని బానిస బ్రతుకు తప్ప అన్యం వుండదని తెలుసుకొన్నారు. కథలో ఈ విషయం కన్పిస్తుంది. సవర్ణులు హరిజనులకు త్రాగడానికి నీళ్లు ఇవ్వకపోతే వారిని ప్రతిఘటించే శక్తిలేక ఊరికి దూరంగా వెళ్ళిపోయారు. అయినా సవర్ణులు వీరిని పీడించే ధోరణిలో గుడిసెలను ఖాళీ చేయించారు. తప్పని పరిస్థితుల్లో హరిజనులు సవర్ణులు పెట్టే బాధలు భరించలేక క్రైస్తవులై తమ వాడను రక్షించుకొని మేము 'ఆలోచనాపరులం' అని నిరూపించుకొన్నారు. శత్రుత్వంతోనే వారిపై విజయం సాధించారనడానికి ఈ కథ తార్కాణం.

**3.2.12.4. హోమం** :- హరిజనులు తమపై ఆధిక్యతను సాధించినందుకు సవర్ణులు చేసే కక్ష్య సాధింపు చర్యలను చిత్రించిన కథ. రచయిత వి.ఆర్.రాసాని. సిన్నాయుడు ప్రెసిడెంటు ఎన్నికల్లో హరిజన వాడ మెంబరుగాగెలిచాడు. ఆ ఊరికి కొండారెడ్డి ప్రెసిడెంటు. హరిజనవార్డులో తాను నిలబెట్టిన అభ్యర్థి ఓడిపోయి సిన్నాయుడు గెలవడం వల్ల అంతవరకూ ఆధిపత్యం చెలాయిస్తున్న కొండారెడ్డికి తలకొట్టేసినట్లు అయ్యింది. హరిజనులను దెబ్బతీయదలచాడు. ఆ ఊళ్లో హరిజనులు త్రాగడానికి చెరువు నీళ్ళు వాడుతారు. కాని ఆ చెరువు కొండారెడ్డి ఆధీనంలో వుంటుంది. కొండారెడ్డి హరిజనులను ఇబ్బందిపాలు చేయడానికి చెరువువద్దకెళ్లి తాము నీళ్ళు త్రాగుతున్న చెరువులోకి దిగితే చేపలు మైలపడుతాయన్నాడు. కొండారెడ్డి హరిజనులు మీరువాడే బావులు, పొలాలు మీవయినట్లే మేము ఉపయోగించు కొనే చెరువు మాది అంటే ఇరువర్గాల మధ్య గొడవ ప్రారంభమయింది. చేసేది లేక హరిజనులు అవమానంతో ఇంటికెళ్ళారు. తమకు జరిగిన అన్యాయానికి తమ కులానికి ప్రతి నిధులైన డప్పు,కొమ్ములను, ఉంచుకోకూడదని కాల్చివేసి అప్పటినుండి ఊళ్ళో జరిగే కార్యక్రమాలకు డప్పు వాయించకూడదను కొన్నారు.

నిమ్న జాతులుగా చూస్తూ తృణీకారంతో వారిని సమాజం నుండి వెలి వేసినట్లుగా పరిగణిస్తూనే వారి శ్రమను దోచుకొనే దోపిడీ వర్గాలను ఎదిరించడానికి ప్రయత్నిస్తున్నారనడానికి ఈ కథ నిదర్శనం. అస్పృశ్యులుగా చూడబడుతున్న ఈ అసహాయక వర్గం ఒక వ్యక్తిత్వాన్ని కల్పించుకొంది. ఆలోచనా పరులైనా హరిజనులు, సవర్ణుల అన్యాయాలను ఎదిరించబోతే తమ హక్కులను కాపాడుకోవడానికి ప్రయత్నించదలిస్తే

ఎలాంటి పరాభవాలకు గురవుతారో రచయిత వివరించాడు. కేవలం హరిజన వార్డులో హరిజనుడు ఎన్నికల్లో పోటీ చేసిగెలిస్తే కొండారెడ్డి ఆ హరిజన వాడకే ఇబ్బందులు తెచ్చిపెట్టాడు. భవిష్యత్తులో సిద్రాయుడు ఎన్నికల్లో పోటీ చేయకుండా వుండేలా చూశాడు. మరో విషయం ఏమంటే - కొందరికి వారు చేసే వృత్తులను బట్టి గౌరవ హోదాలు లభిస్తే కొందరిని దిగజార్చుతాయి. సవర్ణులు చేసే శుభాశుభ కార్యాలకు డప్పు అవసరం. కాని డప్పు వాయిద్యంలో ఎంత గొప్పవాడైనా సమాజం అతన్ని హీనంగా చూడటం తప్ప గౌరవించడంలేదు. అందుకేవారు ''మనకూ ఇలువ కావాలంటే మన కూలాలకు గుర్తుగా వుండే ఈ వాద్యాలు మన కొద్దు''71 అంటారు. సమాజంలో అన్ని వృత్తులకూ గౌరవ మర్యాదలున్నాయి కాని, హరిజన వృత్తులకు మాత్రం లేవని అభిప్రాయం.

**3.2.12.5. చెలిమి** :- సవర్ణుల త్రాగు నీటి కోసం హరిజనుడు తన బొటన వ్రేలిన ఇచ్చిన కథ. రచయిత కాట్రగడ్డ దయానంద్. ఆ ఊరిలో ఎండాకాలం వస్తే బావిలో నీళ్ళు వుండవు. ఊరి ప్రజలు బావిత్రవ్వడం మొదలుపెట్టారు. బావి ఎంతలోతు త్రవ్వినా నీటి చెమ్మ కనిపించలేదు. పంతులు గంగకు నరబలి ఇస్తే బాగుంటుందన్నాడు. ఆ ఊరిలో హరిజన ఇసాకు కుటుంబం ఒక్కటే. అతనికి నలుగురు కొడుకులు. చలమయ్య నాయుడు ఇసాకుకు ఐదెకరాలు భూమి ఇస్తానని అందుకు అతని బొటన వ్రేలిని గంగకు బలి ఇవ్వమన్నాడు. ఇసాకు సవర్ణులకు ఎదురు తిరిగితే తాను జీవించలేనని తన వ్రేలిని బలి ఇవ్వడానికి అంగీకరించాడు. అంతేగాక తమ కులం వారికి సవర్ణులు వచ్చేదాక ఆగి వాళ్ళ చేదిపోస్తేనే నీళ్ళ తీసుకపోవాలని తన వ్రేలిని బలిఇస్తే హరిజనులు కూడా సవర్ణులతో పాటు తీసుకొనేలా చేయమని అడిగాడు. ''గొడ్డు చెరువులోకి దిగి నీళ్ళ తాగితే తప్పు లేనప్పుడు మాదిగోడు చెరువులోకి దిగడంలో తప్పేందని''72 అన్నాడు అందుకు సవర్ణులు నిరాకరించారు. అయినా ఇసాకు తన బొటన వ్రేలిని గంగమ్మకు బలిఇచ్చాడు. ఆ రోజే బావిలో నీళ్ళు పడ్డాయి. కాని హరిజనులకు మాత్రం సవర్ణులు ఇప్పటికీ బావివద్ద నీళ్ళ చేది పోస్తున్నారు. అది సహించలేని ఇసాకు కొడుకులు బర్రెదట్టెంను బావిలో వేశారు.

అంటరాని వాళ్ళగా గుర్తించబడిన తమకా స్థితి ఎందుకొచ్చిందని ఆలోచించక, ఆలోచించినా నోచుకోకపోవడం ఒకటైతే, తమ కష్టంతో వచ్చిన ఫలితాన్ని అనుభవించకపోవడం మరొకటి. కథలో త్రాగునీటి కోసం ఇసాకు తనవ్రేలిని బలిస్తే వాటిని సవర్ణులు అనుభవించటం ఇసాకు కష్ట ఫలితం. ఇసాకు ప్రాణాలకు ప్రతీక. ఆ నీళ్ళు అయినా తన కుటుంబ స్వేచ్ఛగా వాడుకోలేకపోయింది. ఇసాకు తన రక్తం చిందించి సవర్ణులను బ్రతికించాడు. కాని తన జాతి మాత్రం ఆ బ్రతుకులో భాగం కాలేకపోయింది. ఇది మోసం కుట్ర అనే నగ్నసత్యాన్ని తెలుసుకొన్న ఇసాకు కొడుకులు. తమకు జరుగుతున్న అన్యాయాన్ని అన్యాయంతోనే ప్రతిఘటించాలని బర్రెదట్టెంను బావిలో వేయడం కన్పిస్తుంది.

**3.2.12.6. ఊరిబాయి** :- హరిజన నీటి సమస్యను చిత్రించిన కథ. రచయిత డా. బి.దామోదర రావు. రామి మల్లన్న భార్యాభర్తలు. తిండిలేక నీళ్ళ త్రాగి కడుపు నింపుకొంటున్నారు. ఆ నీళ్ళు కూడా ఇంట్లో లేకపోయేసరికి రామి తమవాడ బావిలో నీళ్ళు లేక ఊరబావికి నీళ్ళకువెళ్ళింది. బావిలో నీళ్ళు తీసుకొంటున్న రామిని పటేలు చూశాడు. ఆగ్రహంతో నీటికుండను పగులకొట్టి ఘర్షణకు దిగారు. ఆ పోట్లాటను చూసిన రామి సవర్ణులు కూడా త్రాగకూడదని ఆ బావిలోనే పడి చనిపోయింది.

ఈ కథలో రామి త్రాగడానికి నీళ్ళు లేక ఆకలితో తాళలేక నీళ్ళు త్రాగైనా జీవిద్దామని తలచింది. సవర్ణుల బావి దగ్గరకు వెళ్లితే వాళ్ళు నిరాకరించడం కన్పిస్తుంది. గంగ సర్వపాపాలను హరిస్తుందంటారు. కాని అది ఎంత మాత్రం నిజమోకాని . సవర్ణులు మాత్రం త్రాగునీటి విషయంలో హరిజనుల హక్కులను కాలరాస్తున్నారు. అంటు పేరుతో దూరంగా వుంచుతున్నారు. రామి నీళ్ళకోసం తనవల్ల జరిగే పోట్లాట

ఆగలేదు. అందువల్ల తాము ఆ నీళ్లకు దూరంగా వున్నాము. సవర్ణులు కూడా ఆ నీటికి దూరంగా వుండాలని తలచింది. ఆ బావిలోనే పడి ఆత్మహత్య చేసుకొంది. సమస్య పరిష్కారం చావుతో ముడిపడింది. కథలో హరిజనుల హక్కులను సవర్ణులు హరిస్తే. రామిభావిలో పడి చనిపోయి. సవర్ణులకు దాహార్తిని తెచ్చిపెట్టింది. అన్యాయాన్ని అన్యాయంతోనే ప్రతిఘటించింది.

**3.2.13. ఆలయప్రవేశం :-** ''హరిజనులు పేరుకు హిందువులే అయినా హిందువుల దేవుళ్లే పూజించిన హిందూ దేవాలయంలో ప్రవేశించరాదు. ఇది నిషేధం ఈ నిషేధం అసమానత్వాన్ని ప్రతిఘటించింది. ఇది అమానుషమని గాంధీ విశ్వాసం. అంబేద్కర్ ఆరాటం . ఈ అసమానత్వాలు తొలుగించడానికి గాంధీ హరిజనుల దేవాలయ ప్రవేశం బోధించాడు. అంబేద్కర్ హరిజనుల్ని దేవాలయంలో ప్రవేశింప చేసే చర్యకు పూనుకొన్నాడు.73'' దాని కోసం అనేక చట్టాలు వెలిశాయి. కాని సంఘంలో అగ్రవర్ణాలు వాటికి అడ్డుకట్టగా నిలిచాయి. అమలు చేయవలసిన అధికారులు కూడా నిస్సహాయస్థితిలో వుంటున్నారు. సాహిత్యంలో హరిజన దేవాలయ ప్రవేశం వస్తువయ్యింది. ఈ నేపథ్యంలో తెలుగులో కథానికలు వెలుపడ్డాయి. వాటిని పరిశీలిద్దాం.

**3.2.13.1. పరివర్తన :-** హరిజనుల దేవాలయ ప్రవేశానికి సంబంధించిన కథ. రచయిత అందే నారాయణ స్వామి. సూరదాసు హరిజనుడు, వేదాంతి, సంఘ సంస్కర్త. అతను చెడును నిరోధించడానికి ప్రయత్నిస్తాడు. మాధవా చార్యులు బ్రాహ్మణుడు. వేదాంతం నేర్చినవాడు. సనాతన వాది. పూర్వాచారాలను కొనసాగించాలంటాడు. హరిజనులను హీనంగా చూశాడు. కాంగ్రెస్ వాది అయిన కృష్ణశాస్త్రి సంఘసేవ, అస్పృశ్యతా నివారణ, హరిజనోద్ధరణ లకు పాటుపడ్డాడు. ఊళ్ళో సవర్ణులకు ఏమి కష్టాలొచ్చినా వాటిని హరిజనులే ధైర్యంగా ఎదుర్కొంటారు. సూరదాసులాంటివాళ్ళు అభ్యుదయ భావాలు కలవారని హరిజనులకు దేవాలయ ప్రవేశు చేయడానికి ఎదుర్కొన్న పరిస్థితులను కథలో వివరించాడు. చివరకు మాధవా చార్యులు ఇంట్లోవారితోపాటు సూరదాసు భోజనం చేస్తాడు.

'హిందూత్వం, మానవత్వం, వాళ్ళ జన్మహక్కులు ఇతర యోగ్యతల మీద ఆధారపడవు. నీవు వాళ్ళను ఇంటికి భోజనానికి పిలవక పోవచ్చు. నీవు వియ్యమందకపోవచ్చు. కాని వీధుల్లో నడపనీయకపోవడం, సమాజిక ఆస్తులైన గుడి, బడి, బావులకు దూరంగా వుంచడం వారి హక్కులను హరింపజేసినట్లే అవుతుంది. ఈ హక్కులను నిరోధించినవాళ్ళు నేరస్థులవుతారు'. ఈ అభిప్రాయాలను రచయిత ఈ కథలో వ్యక్తం చేశాడు.

హరిజనులు దేవాలయంలో ప్రవేశిస్తే తాము వెళ్ళక కొందరు మానుకోవచ్చు. కాని తమ కోసం హరిజనులను రాకుండా చేయమని కోరడం భావ్యం కాదంటాడు రచయిత. ఈ కళంకాన్ని పోగొట్టడానికి హిందూమతాభిమానులంతా పాటుపడాలంటాడు రచయిత. హరిజనులకు దేవాలయ ప్రవేశం కల్పించడం ఈ కథ ప్రధానాంశం. అయితే బాధితులైన హరిజనులు తమ దుర్భర పరిస్థితిని అధిగమిస్తూ జరిగే అన్యాయాలను ప్రతిఘటిస్తూ సమానత్వంకోసం ప్రయత్నించడం ఈ కథానిక ముఖ్యోద్దేశం.

**3.2.13.2. నర్సన్న పాపాయి :-** హరిజన బాలుడు దేవాలయంలోకి తెలియక ప్రవేశించి సవర్ణుల చేత దెబ్బలు తినడాన్ని చిత్రించిన కథ. దీని రచయిత అడవి బాపిరాజు. నర్సన్న పాపాయి మాలకులస్థుడు. అతను చిన్నతనంలో శివరాత్రి ఉత్సవాల్లో రుద్రేశ్వరం గుడిలోకి రాబోయాడని కథకురాలి అన్న అతన్ని చావమోదాడు. చిన్న వయస్సులో అతను ఆ పని తెలియక చేశాడన్న ఆలోచనలేకుండా కొట్టాడు.

ఈ జగత్తు భగవంతుని సృష్టి అని మతం చెబుతుంది. భగవంతుని దృష్టిలో మానవులందరూ సమానమే. హెచ్చు తగ్గులన్న ప్రసక్తి వుండదు. అలాంటప్పుడు ఈ అస్పృశ్యత హరిజనులను ఎందుకు

వెంటాడు తుంది? ఎందుకు మానసికంగా బాహ్యంగా చిత్రహింసల పాలు చేస్తుంది ఇది మానవుల మధ్య ఏర్పడిన భేదాభిప్రాయం తప్ప భగవంతుడు సృష్టికాదు. హిందూమతం భిన్న కులాల ఐక్యత అయినా ఆ కులాల మధ్య సఖ్యతలేదు. హరిజనుల హిందువులే. అయినా మతం వారిని దూరంగా వుంచడానికి ప్రయత్నించింది. కథలో నర్సన్న తెలియక దేవాలయంలో ప్రవేశిస్తే సవర్ణుడు పిల్లవాడనే దయాదాక్షిణ్యాలు లేకుండా కొట్టాడు.

**3.2.13.3. దేవుడు** :- హరిజనుల దేవాలయప్రవేశంను నిరసించిన కథ. రచయిత ఎమ్.సుగుణరావు. గ్రామంలో శ్రీరాముని ఉత్సవాలు జరుగుతున్నాయి. హరిజనులైన నందయ్య,లచ్చయ్య, మరి కొందరు రాముని ఉత్సవాలను చూడటానికి వెళ్లారు. కాని వారు గుడిలోకి వెళ్లడానికి ప్రయత్నిస్తే సవర్ణులు అడ్డుకొన్నారు. నందయ్యను సవర్ణుడు కొట్టి గాయపరిచాడు. హరిజనులంతా ఆ వర్షంలోనే అవమానంతో ఎదురుతిరిగారు. దగ్గరలో నున్నరైల్వేస్టేషన్‌లో తలదాచుకొన్నారు. ఆ రోజు వచ్చిన వర్షానికి గుడి పడిపోయింది. ఉదయాన్నే హరిజనులు రైల్వే స్టేషన్ నుండి ఇంటికెళ్ళుతుండగా సవర్ణులు వచ్చి గుడి కట్టవలసిందిగా కోరితే హరిజనులు తిరస్కరించారు. పూజారి గుడి కట్టకపోతే దేవుడు కోపిస్తాడని తత్ఫలితంగా వూరికి గత్తరవస్తుందన్నాడు. అందుకు హరిజన లచ్చయ్య ''అప్పుడు గుళ్లో కొచ్చినప్పుడు ముట్టుడుంది కాని, గుడి కట్టైతెందుకు లేదా సామి ముట్టుడు''74 అన్నాడు. తమకు దేవుడు కనికరించలేదని అలాంటి దేవుడు తమకు అక్కరలేదన్నాడు.

గుళ్ళు కట్టేది హరిజనులు, గోపురాలు నిర్మించేది హరిజనులు. చివరకు సవర్ణుల చావుకు కూడా హరిజనులే. వారి పనులు చేసేంతవరకూ అక్కడ వుండవచ్చు. పూర్తి అయిన తర్వాత వారికి ప్రవేశముండదు. కథలో హరిజనులు గుడిలోకి ప్రవేశించాలని ప్రయత్నిస్తే ఆ ప్రయత్నాన్ని తిరస్కరించిన సవర్ణులు వర్షానికి గుడి కూలిపోతే వారినే గుడి కట్టమనడం హాస్యాస్పదం. కొత్త విలువలు యెదుట పాత విలువలు నిలబడలేవని మారుతున్న సమాజానికి అనుగుణంగా హరిజనులు మారవలసి వుంటుందని రచయిత హరిజనులను హెచ్చరించాడు.

**3.2.14. స్త్రీ దృష్టి** :- సవర్ణులకు హరిజన స్త్రీ ఒక ఆట బొమ్మలా అయింది. హరిజనులను తమ పాలేర్లుగా వుంచకుంటూ వారి భార్యలను ఉంపుడు గత్తెలుగా చేసుకొని అవసరమైతే వారి భర్తల ముందే వారి శీలాన్ని దోచుకోవడం లాంటి కార్యాలకు పాల్పడుతున్నారు. తత్ఫలితంగా ఎంతో మంది స్త్రీలు రక్షణ లేక బలిపశువులయ్యారు తప్ప ప్రతిఘటించలేకపోయారు. ఆత్మాభిమానాన్ని చంపుకొని జీవచ్ఛవాల్లా వుండిపోయారు. ఈ నేపథ్యం నుండి వచ్చిన కథానికా సాహిత్యాన్ని పరిశీలిద్దాం.

**3.2.14.1. మాలా మనిషి** :- ఒక హరిజన యువకుడు సవర్ణ స్త్రీని ప్రేమించి పెళ్లి చేసుకోదలిస్తే సవర్ణులు అడ్డుకొనే ప్రయత్నం చిత్రిస్తుందీ కథ. రచయిత కొలకలూరి సదానంద. మల్లిగాడు ఆదిశేషయ్య పాలేరు. ఆ ఊళ్లో సవర్ణ యువతి సీతను ప్రేమించాడు. సీత కులాల అంతరం తెలిసికూడా అతనిని ప్రేమించింది. ఇద్దరూ పెళ్లి కూడా చేసుకోవాలనుకొన్నారు. ఈ విషయం తెలిసిన సవర్ణులు సీత మల్లిగాడిని చేసుకొంటే తమ జాతికి కళంకం వస్తుందని వారిని విడదీయడానికి ప్రయత్నించారు. సీతను లొంగదీసుకోవడానికి ప్రయత్నిస్తే సఫలంకాలేదు. ఒకరోజు రాత్రి మల్లిగాడు పూలు, పండ్లు తీసుకొని సీత ఇంటికి వచ్చాడు. అప్పుడే సీత మామ వెంకటయ్య మనుషులు మల్లిగాడిని చంపడానికి ఇంటి బయట కాపు కాశారు. వారిని మల్లిగాడిని వెంకటయ్య మనుషులు తరిమి తీవ్రంగా గాయపరచారు. ఆ రాత్రే వంటరిదైన సీత తన వల్ల మల్లిగాడికి చావు తథ్యం అని తెలిసి ఇంట్లోనే ఉరిపోసుకొంది. అంతేగాక తన కులానికి కళంకం తెస్తున్నందుకు ఆది శేషయ్య మనుషులు సీతతో పాటు తన ఇంటికి నిప్పు పెట్టారు. మల్లిగాడు మాలపల్లె

నుంచి సీత కొట్టం కాలిపోతున్నదన్న విషయం గ్రహించాడు. తన శరీరం పై వున్న గాయాలను లెక్క చేయకుండా వచ్చి మంటల్లో నుండి సీత శవాన్ని వెలికి తెచ్చాడు. అప్పటి నుండి పిచ్చి వాడయ్యాడు. కొన్ని రోజులు తపస్సు చేశాడు. ఒక రోజు మాలపల్లెను ఊరును వేరు చేస్తున్న రైలు పట్టాల మీద కొచ్చి మాలలను సవర్ణులతో సమానంగా వుండమని తిడుతూ పల్లెను ఊరును వేరు చేస్తు వస్తున్న రైలును ఢీకొన్నాడు. రైలు కూడా మల్లిగాడి శవాన్ని మాలపల్లె వైపు విసిరింది.

అసమానతలు నశించాలని ప్రభుత్వం ఒకవైపు అరుస్తున్నప్పటికీ ఒక వర్గం వారు పోరాడుతున్నప్పటికీ ఫలితం దక్కకపోతున్నది. ఈ మార్పు అగ్రవర్ణాలలో కూడా రావాలి. అప్పుడే ఈ అసమానతలు తొలగిపోవడానికి ఆస్కారం కలుగుతుంది. కథలో మల్లిగాడు సీత కులాలు వేరైనా పెళ్ళి చేసుకోవడానికి ప్రయత్నానికి సవర్ణులు గండి కొట్టారు. ఆచార సాంప్రదాయాలను ప్రక్కకు నెట్టి వివాహం చేసుకొని నిండు నూరేళ్ళు జీవించాల్సిన ఆ యువతీ యువకులకు సవర్ణుల ఆగ్రహంతోటే నూరేళ్ళు నిండాయి. ఎవరికీ ఏ హానిని తలపెట్టకుండా వారి బ్రతుకులు వారు బ్రతకడానికి ప్రయత్నిస్తే సమాజం కులం అని, ఆచారం అని వారికి అపకారం తలపెట్టింది.

**3.2.14.2. అంకురార్పణ** :- హరిజనులను మోసం చేసిన సవర్ణుని కథ. రచయిత పాలెపు బుచ్చిరాజు. రాజప్ప, గంగి భార్యాభర్తలు, రాజప్ప తన పేరుతో ఆ ఊరులోనే సవర్ణుడైన రంగనాథంకు బ్యాంకులో తనఖా ఇప్పించాడు. ఒకరోజు బాంకుకు చెల్లించవలసిన అప్పులను చెల్లించాలని ఆ ఊరందరికీ తాఖీదు పంపారు. రాజప్ప రంగనాథం ప్రస్తుతం తన పేరుతో తీసుకొన్న అప్పు బాంకుకు చెల్లించమన్నాడు. అందుకు రంగనాథం ప్రస్తుతం తన వద్ద డబ్బులేదని తర్వాత రాజప్పకే ఇస్తానని ప్రస్తుతానికి రాజప్పనే ఆ అప్పు తీర్చమన్నాడు. అందుకు గంగి రంగనాథాన్ని తిట్టింది. తెల్లవారి బాంకు ఋణం చెల్లించలేదని రాజప్పను పోలీసులు తీసుకెళ్ళారు. ఒక రోజు రంగనాథం గంగిని పిలిపించి రాంకోవెలను శుభ్రపరచమన్నాడు. ఆమె దేవాలయాన్ని శుభ్రం చేస్తుండగా రంగనాథం వెళ్లి బలాత్కారింపబోయాడు. కాని గంగి రామనాథంబారినుండి తప్పించుకొంది. గంగి తన జాతి బలహీనతను గుర్తించింది. తమ జాతికూడా రంగనాథంతోపాటు అభివృద్ధి చెందాలన్న ప్రయత్నానికి అంకురార్పణ చేసింది.

సోదర మానవుల చేత అధఃపాతాళానికి తొక్కబడిన జాతులు ప్రపంచంలో చాలా వున్నాయి. అయితే సమాజంలో అత్యధికంగా అమానుషంగా దోచుకోబడుతున్నది హరిజన స్త్రీలు. తరాలుగా భూస్వాములు, పాలక వర్గాల స్వంత ప్రయోజనాల కోసం హరిజన స్త్రీలు సాంఘిక పీడనకు గురి అవుతున్నారు. కథలో దొంగసంతకం పెట్టించుకొని రాజప్ప పేరుతో అప్పు తీసుకొన్న రంగనాథం ఆ డబ్బు తిరిగి చెల్లించలేదు సరికదా అతని భార్యనే అనుభవించడానికి ప్రయత్నించాడు. తనకు చేసిన మేలుకైనా వారిపై కృతజ్ఞత చూపలేకపోయాడు. ఇది సవర్ణుల స్వార్థ ప్రయోజనాలకు మచ్చుతునక. అందుకే రంగనాథం బారి నుండి తప్పించుకున్న గంగి తన జాతిని మేలుకొల్పడానికి ప్రయత్నించింది. కాని అతనిపై ప్రతీకారం తీర్చుకోవడానికి ప్రయత్నించలేదు. రచయిత ఈ కథ ద్వారా హరిజన స్త్రీలను ఆలోచనాపరులుగా చేయడానికి ప్రయత్నించాడు.

**3.2.14.3. ఒక్క పిడికిలి చాలు** - తన పాలేరును హీనంగా చూస్తూ రోజూ తిట్టడం, కొట్టడం వల్ల తన ప్రాణాలకే ముప్పు తెచ్చుకొన్న సవర్ణుని కథ. రచయిత తుల్లి రాజగోపాల్. గురవయ్య దొర పాలేరు. చిన్నతనం నుండి దొర ఇంట్లో పాలేరుగా తన తండ్రి వారవత్వాన్ని పుచ్చుకొన్నాడు. దొర గురవయ్యను రోజూ కొట్టేవాడు. తిండి కూడా సరిగా పెట్టేవారు కాదు. పనులు మాత్రం చాలా చేయించేవాడు. చిన్నతనంలో తన తండ్రి ముందే తన తల్లిని దొర అనుభవించినందుకు తన జీవితంలో పెళ్ళి చేసుకోకూడదని, తాను ప్రేమించిన

సీతాలును పెళ్ళి చేసుకోలేదు. గురవయ్య తనతోనే పాలేరు తనం పూర్తికావాలని ఆశించాడు. దొర భార్య రాజ్యం తనకు తీరిక వేళల్లోనే గురవయ్యకు అన్నం పెట్టేది. ఒకరోజు ఆమె గురవయ్యకు అన్నం పెట్టుతుండగా దొరవచ్చి అతనికి అన్నం పెట్టవద్దని గద్దించాడు. సవర్ణుల ఆడపిల్లలు బడికి వెళ్ళుతుండగా హరిజన యువకులు చూశారని అది తగదంటే సవర్ణులపైనే ఎదురుతిరిగారని అందువల్ల ఆ ఊళ్ళో హరిజనులే వుండకుండా చేయాలని, అందువల్ల మొదట గురవయ్యను చంపడానికి దొర ప్రయత్నించాడు. ఎంతమంది హరిజన స్త్రీలను దొర మానభంగం చేశాడో తెలిసిన రాజ్యంకూడా తన భర్తముందు నోరు మెదపలేక పోయింది. దొర గురవయ్యను చంపబోయి తాను కూడా గురవయ్య చేతిలో చనిపోయాడు.

ఉన్నవాడు తన తప్పులను కప్పిపుచ్చుకోవడం లేనివాడి తప్పులను ఎత్తిచూపటం మానవ నైజం. ఎందుకంటే వున్నవాడి తప్పులను లేనివాడు ఎత్తి చూపే ధైర్యం వుండదు. కథలో విషయం ఇదే. సమాజంలో హరిజన స్త్రీలు ఎన్నో వ్యథలకు గురయ్యారు. రక్షించే దిక్కులేక ఆత్మహత్య చేసుకొన్నారు. ఆత్మవంచన చేసుకొని బ్రతికారు. కాని సవర్ణులపై ఎదురుతిరగలేకపోతారు. అలాంటి సవర్ణులు కేవలం బడికి వెళుతున్న పిల్లలను హరిజనులు చూసినందుకే ఆగ్రహించారు. వారిబ్రతుకులకే గుర్తు పెట్టారు. ఆ ప్రయత్నంలో భాగమే గురవయ్య మరణం. చేయని నేరానికి శిక్ష. తాను చస్తూ ఒక క్రూరమృగాన్ని వెంటబెట్టుకు పోవడం-తాను అనుభవించిన దుర్భర దారిద్ర్యానికి ఆ ఘనకార్యం చాలు.

**3.2.14.4. పరిధులూ ప్రమేయాలూ** :- హరిజన స్త్రీలకు కూడా ఆలోచించే మనస్తత్వం, వ్యక్తిత్వం వుంటుందని చెప్పేకథ. రచయిత దగ్గుమాటి పద్మాకర్. ఆనందరావు దళిత నాయకుడు. కళాశాల లెక్చరర్. అభ్యుదయవాది. తన కుటుంబంలో భార్య కూతురున్నారు. కూతురు చంద్రావతి. యం.ఏ చదువుతుంది. తండ్రి పద్ధతులు ఆమెలో వున్నాయి. తరచు తన కులంలోని స్త్రీ విషయాలు మొదలైనవాటిపై తన ధోరణిలో అప్పుడప్పుడు చర్చలు జరుపుతుంది. స్త్రీగా పుట్టినా తనకూ వ్యక్తిత్వం వుండాలని ఆశించేది. ఒకసారి ఒక ఉపన్యాసాని కెళ్ళిన ఆనందరావు మతాంతర వివాహాలు అవసరం అని, అప్పుడు సమాజంలో కులమతాలు నశిస్తాయని ఉపన్యాసం దంచాడు. అప్పుడు శంకరంలేచి మీ అమ్మాయి చంద్రావతిని వివాహమాడతానన్నాడు. అతను బి.సి. కులాంతర వివాహం చేసుకోవడానికి అభిప్రాయపడ్డాడు. ఆ విషయం ఆనందరావు ఇంటికొచ్చి తన కూతురు అడిగితే అది పూర్తిగా నా సమస్య అని, నా సమస్యలను పరిష్కరించుకోవడానికి నేనే ఆలోచిస్తానని నాకూ వ్యక్తిత్వం వుందని నా సమస్యలలో ఎవరూ ప్రవేశించరాదని తండ్రితో చెప్పింది. కేవలం ఈ అస్పృశ్యత పెళ్లి చేసుకొంటేనే పోదని ''అమ్మ ఇప్పుడిప్పుడు తన వంటింటి శ్రమకు జీతం కావాలంటే కుదురుతుందా? మానసికపరమైన ఘర్షణ ప్రతికులంలోనూ తప్పదు నాన్న''75 అని చెప్పింది.

సమాజంలోని ప్రతి వ్యక్తికీ వ్యక్తిత్వం అవసరం అని. ప్రతి దానికి ఇతరులపై ఆధారపడి జీవించక స్వతహాగా తమకు కావలసిన నిర్ణయాలను తీసుకొని జీవించమని ఈ కథ ఉద్బోధిస్తుంది. కథలో చంద్రావతి తనకు సంబంధించిన నిర్ణయాలను తానే తీసుకొనే స్థితిలోవుంది. తండ్రి సంస్కరణ వాది. కూతురు మేలుకోరే వ్యక్తిగా ఆమెకు ఉన్నత కుటుంబ సంబంధాన్ని తీసుకొస్తే అందుకు తృణీకరించింది. ఆ సమస్య తనదని అందులో ఎవరూ జోక్యం చేసుకోవలసిన అవసరం లేదని హెచ్చరించింది. అంతేగాక కేవలం కులాంతర వివాహాలు చేసుకొన్నంతమాత్రాన ఈ అస్పృశ్యత పోదని ఎన్నో ఏళ్లుగా అస్పృశ్యత గట్టి పునాది గానిలచింది. ఆ పునాదిని పెకలించాలంటే కేవలం ఒక్క కులాంతర వివాహాలు మాత్రమే సరిపోవని, సమాజంలో వున్న మూఢనమ్మకాలు వైదొలగి, చైతన్యవంతులు అయిననాడే అది సాధ్యమవుతుందని, ఆ కాలం ఇంకా చాలా దూరంగా వుందని అభిప్రాయపడింది.

**3.2.15. విద్యాదృష్టి** :- హరిజనులు ఎక్కువ భాగం పాలేరు తనం చేయడంలోనే మునిగిపోయారు. కాని విద్యను గురించి ఆలోచించలేదు. అంతేగాక సవర్ణులు హరిజనులు విద్యావంతులు కాకుండా అడ్డుకోవడానికి ప్రయత్నించారు. కొన్ని ప్రాంతాల్లో సవర్ణులు గ్రామంలో పాఠశాలలు పెట్టించక మరికొన్ని చోట్ల పాఠశాల వున్నా హరిజనులకు ప్రవేశం కల్పించక విద్యకు దూరంగా వుంచారు. క్రైస్తవ మిషనరీలు భారత దేశంలో ప్రవేశించడం. తమ మతాన్ని వ్యాప్తి చేయడానికి శ్రీకారం చుట్టడం హరిజనులు విద్యావంతులు కావడానికి కొంతవరకూ దోహదపడింది. అంతేగాక వారి సమస్యలను పరిష్కరించుకోవడానికి విద్య అవసరం అని, అది తరగని నిధి అని వారు తెలుసుకొన్నారు. ప్రగతిపథంవైపుపయనించడానికి ప్రయత్నించారు. ఈ విషయం తెలుగు కథా సాహిత్యానికి వస్తువయింది. ఈ వస్తువుతో కూడుకొని వచ్చిన కథానికలను పరిశీలిద్దాం.

**3.2.15.1హరిజన విద్యార్థి** :- హరిజన విద్యార్థి రిజర్వేషన్ గురించి వివరించే కథ. రచయిత చలం. నేను హరిజన విద్యార్థిని నాకొక్క సీటు ఇవ్వండి అన్నాడు ఒక ముక్కుపోగు అబ్బాయి. ఈ సందర్భంలో చలం ఆలోచనలు, హరిజనులకు ప్రత్యేక సదుపాయాలు, ప్రాధాన్య వివక్ష మొదలైన సమస్యల మీదికి వెళ్లాయి. వీటిలో సామంజస్యాన్ని విచారణ చేయటం ఇందులో ఉద్దేశ్యం.

''కులాన్నిగాక బీదరికాన్ని మాత్రమే పరిగణించాలని చాలా మంది అనుకుంటూన్నదే. అంతకన్నా ప్రత్యేకమయిన చలంగారి వాదన ఇందులో గమనార్హం. అనువంశికంగా బీదరికం అలవాటు అయినవాని కష్టంకన్నా గతంలో వైభవాన్ని ప్రస్తుతంలో బీదరికాన్ని అనుభవిస్తున్న వాని కష్టం ఎక్కువయింది. పూర్వీకుల దరిద్రం కారణంగా సీటు అడిగినా వానికన్నా నా పూర్వీకులు దేశానికి జ్ఞానాన్నిచ్చారు నాకు సీటు ఇమ్మనడం ఎక్కువ అర్హతనిస్తుంది. ఇప్పటి హరిజన ప్రేమ రాజకీయం ఇవన్నీ చర్చించిన కథ ఇది''76 అంటాడు డా. వావిలాల సుబ్బారావు.

'' హరిజనుల పట్ల కనీస సానుభూతి మానవ ధర్మం అని భావించేవారిపట్ల చలం వేళ్ళబోసుకొన్న అక్కసు ఇది. అంతేగాక హరిజనులకంటే ముందు బ్రాహ్మణులకే సహాయం చేయాలి అంటే హరిజనుడుకాదు బ్రాహ్మణులే అసలుసిసలు దళితులు, పీడితులు అని చలం ప్రతిపాదిస్తున్నాడు. దీన్నిబట్టి చలానికి బ్రాహ్మణుడంటే ప్రత్యేకత వుంది అని అర్థమవుతుంది. హరిజనుల మీద ప్రేమ లేక పోవడం కాదు ప్రత్యేక ద్వేషం వున్నట్లు అర్థమవుతుంది''77 అంటాడు ఖాదర్ మొహిద్దీన్.

ఈ కథానికలో బ్రాహ్మణులకు సహాయం చేయండి అనే ధోరణి కన్పిస్తుంది. చలాన్ని బ్రాహ్మణవాదిగా చిత్రించడానికి ఈ కథ ఆస్కారం. హరిజనులు ఈ దేశానికి ఏమీచేయలేదు. అయినా కొన్ని రకాల హక్కులను అనుభవిస్తున్నారు. బ్రాహ్మణులు అగ్రభాగాన వుండి. సమాజ స్థితిగతులు పరిశీలించి సమాజాన్ని అభ్యుదయ పథకంవైపు పయనించడానికి ప్రయత్నించారు. కాని వీరికి సమాజం ప్రత్యేక హక్కుల నేమి కల్పించలేదు. వీరికి ప్రభుత్వ సహాయం తప్పనిసరి అని రచయిత భావించాడు. బ్రాహ్మణులు సమాజాన్ని అభ్యుదయ పథం వైపు నడిపించడానికి ఎంత మాత్రం కృషి చేశారో తెలియదు. కాని సంప్రదాయాలు, ఆచారాల పేరుతో సమాజం చైతన్యవంతం కాకుండా అడ్డుకొన్నారని చెప్పవచ్చు. ఎందుకంటే సంఘంలో అగ్రభాగాన వున్న బ్రాహ్మణులు తమ స్థానాన్ని పదిలపరుచుకొవడం కోసం క్రిందితరగతి వాడిని అణగ ద్రొక్కుతూ వచ్చారు. ఎప్పుడైతే బడుగు వర్గాలు చైతన్యవంతులవుతున్నారని తెలిసి, తమ పునాదులు కూలుతున్నాయని గ్రహించి అభ్యుదయ భావాలను విధిలేక ప్రచారం చేయడానికి ప్రయత్నించారు. అదే స్థితిలో చైతన్యవంతులు కాలేని క్రింది తరగతి ప్రజలు వారిని భుజాలపై పెనవేసుకొని తిరగడం ప్రారంభించారు. ఆ విధంగా కూడా బ్రాహ్మణులు అగ్రభాగానే నిలవడానికి ప్రయత్నించారు. కాని హరిజనులు

మాత్రం నాటికీ నేటికి అధఃపాతాళంలోనే వున్నారు. ప్రభుత్వం అందించే సహాయం దళారీల చేతుల్లోనే నిలిచిపోయింది. పేరుకుమాత్రం బడుగు వర్గాలనాదుకొనేందుకు ప్రభుత్వం సంక్షేమ కార్యక్రమాలను చేపట్టిందని చెప్పుతున్నారు.

**3.2.15.2. జలగ** - తండ్రి కష్టాన్ని పంచుకొన్న కొడుకు తన తండ్రిని సవర్ణునితో సమానంగా చూడడానికి చేసే ప్రయత్నం ఈ కథ. రచయిత బమిడి జగదీశ్వర రావు. వెంకడు రిక్షాత్రొక్కి జీవించేవాడు. అతనికి ఇద్దరు పిల్లలు లచ్చిమి, సూరిగాడు ఇద్దరూ పట్టణంలో చదువుతున్నారు. ప్రతి రోజూ వారిని వెంకడు రిక్షాలో తీసుకెళ్లాడు. ఒకరోజు పట్నం నుండి వర్షంలో వస్తున్నారు. సూరిగాడు తన తండ్రిని రిక్షాలో కూర్చోమని తాను రిక్షాత్రొక్కడానికి ఉపక్రమించాడు. దారిలో రామగోపాలం అనే ఊరి పెద్ద కనిపించాడు. ఆ రిక్షా చూసి అతను రిక్షాలో కూర్చోగా వెంకడు రిక్షాదిగి నడవడం మెదలుపెట్టాడు. అందుకు సూరిగాడు తండ్రిని రిక్షాలో కూర్చోవుని గోల చేశాడు. వెంకడు రామగోపాలం ప్రక్కనే రిక్షాలో కూర్చున్నాడు. రామ గోపాలం తన మనస్సులోనే ''ఛీ...ఛీ..ఈ రోజు మైలయిపోనాను. ఇంటి కెళ్లి స్నానం సెయ్యాల...''78 అనుకొన్నాడు. కొడుకు చేసిన పనికి వెంకడు. లోలోనే తృప్తిగా నవ్వుకొన్నాడు. తెల్లవారి చెరువులో చేపలు పట్టడానికి సూరిగాడు చెరువు కెళ్లాడు. అక్కడ రామగోపాలంను జలగ కరుచుకోగా సూరిగాడు దానిని వదిలించాడు. రామగోపాలాన్ని ఒడ్డున కూర్చోబెట్టి సూరిగాడు చేపలు పట్టిచ్చాడు.

కొన్ని సార్లు మానవుని మూర్ఖత్వంలో కూడా చైతన్యం వుంటుందనడానికి ఈ కథ తార్కాణం. కథలో సూరిగాడు తనకు రామగోపాలం గొప్పతనం తెలియక తన తండ్రిని రిక్షాలో కూర్చోమని గోలచేశాడు. తన కష్టంలో తన తండ్రి సుఖపడాలని తలచాడు. వెంకడు తన ప్రక్క కూర్చున్నందుకు తన పరువు పోయినా అవసరం తప్పదని రామగోపాలం ఆత్మాభిమానాన్ని చంపుకొని అలాగే రిక్షాలో కూర్చుండిపోయాడు. మరుసటి రోజు చెరువులో చేపలు పట్టించుకొన్నాడు. అవసరం వున్నప్పుడు పంతాలు, పట్టింపులను దూరం పెట్టి కాలంతో సర్దుకపోయేగుణం ప్రతి ఒక్కరికి వుంటుందని చెప్పడానికి ఈ కథా తార్కాణం.

## 3.3 హరిజన సమస్యలు

ప్రతి మానవుడికి సమస్యలుంటాయి. ఏమీలేనివాడికి అవసరం సమస్య. అవరసం తీరిన వాడికి సౌకర్యం సమస్య. సౌకర్యాలు తీరిన వాడికి విలాసాలు సమస్య. ఇలా ప్రతివాడు సమస్యలలో సతమతమవుతుంటాడు. సమస్య మనిషిని ఆలోచింపజేస్తుంది. చైతన్యవంతుడిని చేస్తుంది. ప్రగతికి బాటవేస్తుంది. ఈ సమస్యలు కొందరికి తీరితే మరికొందరికి తీరే మార్గం తెలియదు. నేడు హరిజనులు అదే స్థితిలో వున్నారు. తమ సమస్యలు తీర్చుకోలేక, జీవితాన్ని సుఖప్రదంగా, ఫలప్రదంగా సాగించకోలేక, జీవన విధానం మార్చుకోలేక సతమతమవుతున్నారు. కథానికా సాహిత్యం ద్వారా హరిజన సమస్యలను పరిశీలించటం ప్రస్తుత కర్తవ్యం.

**3.3.1. రాజకీయ సమస్య** - అణచివేత అనేది కులవర్ణ సమాజ సహజ లక్షణం. ప్రజల్ని మరింత తీవ్రంగా అణచివేయడం ద్వారా మరిన్ని ఎక్కువ సౌఖ్యాలు అనుభవించాలని పాలక వర్గం అనుకుంటుంది. అణచివేత నుండి బయటపడాలని, అభ్యుదయ పథం వైపు పయనించాలని పాలితులు అనుకొంటారు. ఆ నేపథ్యంతో పాలితుల బలమే పెరుగుతూపోతుంది. పాలితుల బలం పెరిగేకొద్ది పాలకులు సరికొత్త అణచివేత విధానాల కోసం అన్వేషిస్తుంటారు. సాధారణంగా ఈ విధానాల రూపంలో మరింత ఎక్కువ ఉదారత్వాన్ని, సారంలో మరింత ఎక్కువ క్రూరత్వాన్ని ప్రదర్శిస్తుంటాయి. హరిజనులు రాజకీయ జీవితం అనే నేపథ్యం

నుండి వచ్చిందే హరిజనులు అభివృద్ధి చెందాలని ప్రభుత్వం అనేక చట్టాలు చేయడం. హరిజనులకు రాజకీయంగా ఉన్నత హోదా కల్పించగలిగింది. అయినా సవర్ణులు మాత్రం ఆ చట్టాలను రూపుమాపడానికి ప్రయత్నించలేదు. వాళ్ల కోసం నిర్దేశింపబడ్డ పదవుల్లో తమ పాలేర్లను తమ చెప్పు చేతల్లో వుండేవాళ్లను వుంచడానికి ప్రయత్నించింది. ఆ భాగంగా ఇది సాహిత్య వస్తువయ్యింది. ఈ వస్తువే కథానికా సాహిత్యంలో కూడా కొంత చోటు చేసుకొంది.

**3.3.1.1. అజ్ఞాతవాసం** :- తినడానికి తిండిలేని హరిజనుణ్ణి రిజర్వేషన్ పేరుతో ప్రెసిడెంటును చేసిన సవర్ణుల కథ. రచయిత మధురాంతకం రాజారాం. పరకబయలు పంచాయతీ ప్రెసిడెంటు పోలిరెడ్డి. తరాలుగా ప్రెసిడెంటు పదవిని పోలిరెడ్డి వంశమే నిర్వహిస్తుండేది. ఈసారి ప్రభుత్వం హరిజనులు రాజకీయంగా అభివృద్ధి చెందడం కోసం రిజర్వేషన్ పద్ధతిని ప్రవేశపెట్టింది. తత్ఫలితంగా పరకబయలు పంచాయతీ రిజర్వుడు అయింది. ప్రెసిడెంటు పోలిరెడ్డి. ఆ ఊరి ఆసాదు గంగడిని పిలిపించి ఈసారి గ్రామప్రెసిడెంటుగా వుండమన్నాడు. గంగడికి దిక్కుతోచలేదు. అతను ప్రతి రోజూ కూలీకి వెళ్ళితేగాని తన సంసారం గడవదు. అయితే బలవంతాన పాత ప్రెసిండెంటు పోలిరెడ్డి అతన్ని పంచాయతీ ప్రెసిడెంటుగా చేశాడు. అప్పటి నుండి గంగడినిఊరి ప్రజలు కూలీకి పిలువడం లేదు. తన కుటుంబం ఆకలితో చావవలసి వచ్చింది. ఇక ఆ ఊళ్లోనే వుంటే తనకు ఆకలి చావు తప్పదని గ్రహించిన గంగడు ప్రక్క గ్రామానికి వెళ్లదలచాడు. కాని ఊరి పెద్దలైన రామప్ప నాయుడు, కరుణం మల్లయ్య పక్కూరికి వెళితే బాగుండదని, ఆ గ్రామస్థులు పరక బయలు ప్రెసిడెంటు ఈ ఊళ్ళో కూలీపోతున్నాడను కొంటారని చిత్తూరుకు వెళ్ళితే అది పట్టణం కాబట్టి ఎవరూ గుర్తు పట్టరని ఏపనైనా చేసుకోవచ్చని చెప్పారు. ఎప్పుడైనా పంచాయతీ మీటింగ్ పెట్టినప్పుడు మాత్రం ఊరికి రమ్మన్నారు. గంగడు చిత్తూరు వెళ్ళిపోయాడు.

ప్రజల చేత ప్రజల కోసం ఎన్నుకోబడిన ప్రజా ప్రతినిధులు ఒత్తిడులకు లొంగకుండా తమ ప్రజానీకానికి సేవలు చేయాలి. ఇది అంతో ఇంతో రాజకీయ పరిజ్ఞానం వున్న వాడికి తెలుసు. హరిజనులు రాజకీయంగా చైతన్యవంతులు కావాలని ప్రభుత్వం సంకల్పిస్తే దానికి ఆదిలోనే సవర్ణులు గండికొట్టారు. కథలో తన కడుపు నింపుకోవడానికి కూడా చేతకాని, ఊరి ప్రెసిడెంటు ఊరి క్షేమంకోరడం అబద్ధం. ప్రెసిడెంటు గంగడు అలసత్వాన్ని ఆసరాగా తీసుకొన్న సవర్ణులు వానిని నామమాత్రంగా వుంచారు. తమ స్వార్థం కోసం తమ జీవితాలను సుగమం చేసుకోవడం కోసం గంగడిని బలిపశువుగా చేశారు. హరిజనుల్లో చైతన్యం రానంతవరకూ ప్రభుత్వం ఎన్ని చట్టాలు చేసినా వారిని ఎంత అభ్యుదయ పథాన నడపాలను ప్రయత్నించినా ఫలితముండదని దానికి తోడు సవర్ణులు కూడా హరిజనులతో సమానంగా మెలగగలిగినప్పుడే ఈ కార్యం సాధ్యమవుతుందని రచయిత అభిప్రాయపడ్డాడు.

**3.3.1.2. ఊడల మర్రి** :- హరిజనుల రాజకీయ అసమర్థతను చిత్రించిన కథ. రచయిత చిలుకూరి దేవపుత్ర. వీరాపురానికి సర్పంచు భీముడు. ముప్పై ఏళ్లుగా సర్పంచు గిరిని చేపట్టాడు. ఈసారి ప్రభుత్వం వీరాపురాన్ని రిజర్వుడు సీటుగా చేసింది. భీమప్ప సర్పంచుపదవికి తన జీతగాడైన ఓబులుగాడిని తన అభ్యర్థిగా నిలబెట్టాడు. అయినా ఇంకా ఓబులుగాడికి భీమప్ప పశువుల పాక బాధ్యతలు తీరలేదు. ఎన్నికలు జరిగాయి. ఓబులుగాడు ఆ ఊరి ప్రెసిడెంటుగా ఎన్నికయ్యాడు. పోలింగ్ అధికారులు ఓబులుగాడిని సర్పంచుగా ప్రమాణ స్వీకారం చేయించడానికి బడిలోకి రమ్మన్నారు. అక్కడేవున్న భీమప్పను చూసిన ఓబులుగాడు తాను హరిజనుడనని బడిలోకి రాకూడదని. తన యజమాని లోపలున్నాడని చెప్పాడు. భీముడు ''ఒరేయ్ ఓబుళుగా రావోయ్ ! నీయమ్మ లోపలికిరా''79 అన్నాడు. ఓబులుగాడు బడిలోకి రాగానే భీమప్ప కూర్చున్న కుర్చీ నుండి క్రింద కూర్చోమని ఆ స్థానంలో ఓబులుగాడిని కూర్చొబెట్టి

అధికారులు ప్రమాణ స్వీకారం చేయించారు. తన ఎదుట కుర్చీ మీద కూర్చున్నందుకు ఓబులుగాడిని భీమప్ప తన ఇష్టమొచ్చినట్లు కొట్టాడు.

చట్టం దృష్టిలో అందరూ సమానమే. మనిషి సుఖంగా బ్రతకడానికి సమాజం కొన్ని హక్కులను ప్రసాదించింది. అయితే వాటిని కొందరు సుఖంగా వినియోగించుకొంటే మరికొందరు ఎదుటి వాళ్ల హక్కులను తమ చేతుల్లో వుంచుకొని వారిని కీలుబొమ్మలుగా చేసుకొన్నారు. ఒక సవర్ణుని ఎదుట స్వేచ్ఛగా కూర్చోలేని హరిజనుడు ప్రెసిడెంటు పదవిని ఎలా చేయగలడో అర్థం చేసుకోవచ్చు. తన ఉనికిని కాపాడుకోవడంలో భీముడు కృతకృత్యుడు కాగలిగాడు. హరిజనులు రాజకీయంగా ఎంత నిస్సహాయ స్థితిలో వున్నారనడానికి ఈ కథ నిదర్శనం. అందుకే రచయిత ''ఎన్ని రిజర్వేషన్లు కల్పించినా దశదిశలా వ్యాపించిన ఈ వ్యవస్థ ఊడల మర్రి క్రింద ఏమొక్కయినా బతుకుతుందా''80 అనుకొన్నాడు.

**3.3.1.3. వ్యూహం** :- హరిజనులు తమ సమస్యల సాధన కోసం కలసికట్టుగా పనిచేయడాన్ని చిత్రించిన కథ. రచయిత శ్రీధర శ్రీరామకృష్ణ. రాముడు ఆ గ్రామ పంచాయతీ ప్రెసిడెంటు. ఆ ఊరి హరిజనవాడ యువకుడు ఆనందరావు తమ సమస్యలను రాయుడు దృష్టికి తీసుకెళ్లాడు. అయినా ఫలితంలేకపోయింది. ఈసారి పంచాయతీ ఎన్నికలు వచ్చాయి. రాయుడు పంచాయతీ ప్రెసిడెంటు పదవికి పోటీ చేశాడు. అంతవరకూ ప్రెసిడెంటుగా ఏకగ్రీవంగా ఎన్నికవుతున్న రాయుడుతో ఈసారి ఆనందరావు పోటీ చేశాడు. రాయుడు సహించలేక పోయాడు. ఆనందరావుకు తన ఓటు తప్ప హరిజనవాడలో ఒక్క ఓటుకూడా పడకూడదను కొన్నాడు. హరిజన పెద్దలను పిలిపించి శాస్త్రి ద్వారా మధ్యస్థం చేసి ఓటుకు ఐదువందల రూపాయలు చొప్పున ఇచ్చాడు. పోలింగ్ జరిగింది. ఈసారి రాయుడే ప్రెసిడెంటుగా ఎన్నికయ్యాడు. ఆనందరావు రాయుడుకు శుభాకాంక్షలు తెలియజేస్తూ తమరిచ్చిన ఓటుకు ఐదువందల రూపాయలు ప్రోగుచేసి 'బాక్‌వర్డ్ క్లాసెస్ వెల్‌ఫేర్'' సంస్థను పెట్టామని మీరిచ్చిన డబ్బు అంతా హరిజనవాడ సమస్యలకు ఖర్చు పెడతామని ఇక మీదట వాడ సమస్యలను తీర్చుకోవడం కోసం మీ వద్దకు రామని ఒక లేఖను రాసి శుభాకాంక్షలతోపాటు పంపాడు.

ఈ కథానికలో ఆనందరావు ఎన్నికల పరంగా ఓడిపోయినా నైతికంగా గెలిచాడు. తాను పన్నిన వలలో రాయుడు చిక్కుకొన్నాడు. మానసికంగా ఆనందరావును దెబ్బతీయాలన్న రాయుడి ఆలోచన జరగలేదు సరికదా, అతనే మానసిక వ్యధకు గురయ్యాడు. హరిజనులు కూడా చైతన్యవంతులయ్యారని గుర్తించగలిగాడు. ప్రెసిడెంటుగా వున్నప్పుడు మెతుకు మిగల్చని నాయుడు ఎన్నికల సమయంలో స్వార్థం కోసం డబ్బును నీళ్ళలా ఖర్చు చేశారు. డబ్బు వున్నదనే అహంతో అధికార వ్యామోహం కోసం తన ఆస్తిని నాశనం చేసుకొన్నాడు. తన జీవితాన్ని నైతికంగా పతనం చేసుకొన్నాడు. హరిజనులు చైతన్యవంతులని రాయుడు తెలుసుకొన్నాడు.

**3.3.1.4. పెద్దోళ్ళు** :- హరిజనుడు పంచాయతీ ప్రెసిడెంటు అయితే పరిస్థితి ఎలా వుంటుందో తెలియజేసే కథ. రచయిత బొడ్డు కూర్మారావు. రామరాజపురం మాజీ ప్రెసిడెంటు పెద్దనాయుడు. ఈసారి ఆ పంచాయతీ రిజర్వుడు కావడం వల్ల పెదనాయుడే తన పాలేరు లక్ష్మయ్యను ప్రెసిడెంటుగా ఏకగ్రీవంగా ఎన్నిక చేశాడు. యం.యల్.ఏ పరశురాం కూతురు ఆహ్వానాన్ని అందుకొన్న పెద్దనాయుడు తనతో లక్ష్మయ్యను కూడా తీసుకెళ్లాడు. రామరాజపురం నుంచి యం.యల్.ఏ గ్రామం అక్కయపల్లి వరకూ పెదనాయుడు ప్రెసిడెంటు లక్ష్మయ్యను బస్తా బియ్యం మోయించాడు. పెళ్లిలో కూడా తన పాలేరు లాగానే నాయుడు లక్ష్మయ్య చేత పనులు చేయించాడు. యం.యల్.ఏ పరశరాం లక్ష్మయ్యకు చూసి నవ్వాడు కాని పలకరించ లేదు. పెద నాయుడు లక్ష్మయ్యను అందరితో సమానంగా భోజనం పెట్టక ఇంటి గుమ్మాన క్రింద కూర్చోబెట్టి

అన్నం పెట్టారు. ఒకప్పుడు కులం పట్టింపులు లేవని అందరూ సమానమే నన్న పరశురాం కూడా క్రింద కూర్చోని అన్నం తింటూన్న లక్ష్మయ్యను చూసి మారుమాట్లాడకుండా వెళ్లిపోయాడు. దానితో మనసులో వ్యథచెందిన లక్ష్మయ్య ''పదవులిచ్చి పెద్దోళ్ని చేద్దామనుకున్నా పెద్దోళ్లు కాలేరు. పేదోళ్లు పేదోళ్లే అని సెప్పడానికి సేనామంది''81 వున్నారనుకొన్నాడు. ఒకచోట నియోజక వర్గంలోని పంచాయతీ ప్రెసిడెంట్లు అందరూ కూర్చోని లక్ష్మయ్యను కూడా పిలిచారు. కాని పెదనాయుడు భయం వున్నా ఇంటి వరండాలోకి వెళ్లి వారితో పాటు కుర్చీలో కూర్చున్నాడు. అది చూసిన పెదనాయుడు కోపంతో అందరిలో వున్న లక్ష్మయ్యను తిట్టలేక చూపులతోనే భయంకరంగా చూస్తున్నాడు.

కథలో లక్ష్మయ్య గ్రామ ప్రెసిడెంటు అయినా పాలేరుతనం తప్పలేదు. దళితుడు పాలితుడుగానే తప్ప పాలకత్వంవైపు కన్నెత్తి చూడటానికి కూడా అర్హత లేనివాడని బానిసగా తప్ప ప్రజాప్రతినిధిగా తన అధికారాన్ని ఉపయోగించుకోవడానికి అర్హత లేని వాడని పెద నాయుడు అనుకొన్నాడు. తన ఎదుట తన పాలేరు కుర్చీ మీద కూర్చున్నందుకు అతన్ని ఒక పంచాయతీ ప్రెసిడెంటుగా కూడా గౌరవించలేక పోయాడు. సరికదా అతని వైపు క్రూరంగా చూడటం మొదలుపెట్టాడు. రచయిత ఈ కథలో పంచాయతీ ప్రెసిడెంటుగా ఎన్నికైన లక్ష్మయ్య పెదనాయుడు ఒత్తిడికి తలవొగ్గే స్థితిని దాటిపోయాడని తెలియజేశాడు.

**3.3.1.5. వేట** :- చేయని నేరానికి శిక్ష అనుభవించిన హరిజన ప్రెసిడెంటు కథ. రచయిత కొల్లిపాక శ్రీరామ మూర్తి. భీముడు మునుపు ధర్మభూషణం పాలేరు. ప్రస్తుతం ఆ గ్రామ రిజర్వుడు ప్రెసిడెంటు. ధర్మభూషణం చేతిలో కీలుబొమ్మ. పనులన్నీ ధర్మభూషణం చేతులమీదుగానే జరుగుతాయి. ఒకసారి భీముడు హరిజనులకు త్రాగే నీళ్లు వున్న చోట ఇళ్ల పట్టాలు ఇవ్వమంటే అందుకు ధర్మభూషణం నిరాకరించి నీళ్లులేని చోట ఇప్పించాడు. నీటి వసతి వున్న ప్రాంతాన్ని తనపరం చేసుకొన్నాడు.తర్వాత హరిజనులు కొత్త ప్రాంతంలో నీటివసతి లేక తిరిగి యథా స్థానానికే వచ్చారు. ధర్మభూషణం భీముడికి మాయమాటలు జెప్పి అతని ఆస్తిని కాజేశాడు. భీముడు కూతురు సామ్రాజ్యం శీలాన్ని భూషణం బావమరిది శక్తి ప్రసాద్ దోచుకొన్నాడు. అయినా భీముడు వారిపై ఎదురుతిరగలేకపోయాడు. ఆ ఊరి పరిసరాల్లో చిరుతపులి సంచరిస్తుండటం వల్ల దానిని చంపడానికి ధర్మభూషణం వేటకు వెళ్లాడు. ఒక దుప్పిని చంపి చెట్టుక్రింద వేసి వీరిద్దరూ చెట్టు ఎక్కారు. ధర్మభూషణం ఒక తుపాకిని భీముడికిచ్చి చెట్టులో తనకన్నా పై కొమ్మలో కూర్చోమన్నాడు. చిరుతపులి దుప్పిదగ్గరకు వచ్చింది. భూషణం చిరుతను కాల్చాడు. ఆ శబ్దంతో భయపడ్డ భీముడు. తన తుపాకి ట్రిగ్గర్ నొక్కాడు. తుపాకి పేలి గుండు భూషణం భుజంలో దూరింది. మరునాడే ధర్మభూషణం భీముడు అడవిలో తనపై హత్యయత్నం చేశాడని అతనిన జైలుపాలుచేశాడు.

నేడు సంఘంలో సవర్ణులు హరిజనుల సహాయంతో తమ పనులను పూర్తి చేసుకొని లాభపడి ఆ సమస్యకే వారిని బలిచేయడం వాళ్ల వంతు అయ్యింది. కథలో భీముడిని భూషణం తన అవసరాల కోసం ప్రెసిడెంటును చేశాడు. తన ఆస్థిని కాజేశాడు. అడవిలో చిరుతను వేటాడడానికి సహాయంగా తీసుకెళ్లి, చేయని నేరానికి అతన్ని జైలుపాలు చేశాడు. భీముడు కూడా ఆలోచనలేకుండా తన సంసారం అంతా నాశనం అవుతున్నా దానికి కారణం భూషణం అని తెలుసుకోలేకపోయాడు. కథలో రచయిత హరిజనులు ఆలోచనారహితంగా సవర్ణులయెడ ప్రవర్తించి బలికావద్దని సలహా ఇచ్చాడు.

**3.3.2. ఆర్థిక సమస్య** :- మానవ ప్రగతికి ఆర్థికం అవసరం. ఆర్థికంగా అభివృద్ధి చెందినవాడు సమాజంలోని అడ్డంకులన్నింటినీ అధిగమించగలడు. అది లేనినాడు అతని ప్రగతి శూన్యం. ప్రస్తుతం హరిజనులు ఈ సమస్యతోనే కొట్టుమిట్టాడుతున్నారు. హరిజనులు నిత్యం సవర్ణుల పొలాల్లో పాలేర్లుగా పనిచేస్తూ యజమాని ఇచ్చింది పుచ్చుకొంటున్నారు తప్ప తమ కష్టానికి తగిన ఫలితం కోసం ఆశించడం

లేదు. ప్రభుత్వం వీరి కోసం అనేక అభివృద్ధి పథకాలను ప్రవేశపెడుతున్నది. ఆ సంక్షేమపథకాలను హరిజనులు వినియోగించుకోలేక, వినియోగించుకోవటం ఎలాగో తెలియక చీకటి ముసుగుల్లో మగ్గిపోతున్నారు తప్పవెలుగొందడానికి ప్రయత్నించడంలేదు. ధనమున్న చోట గౌరవం ప్రతిభ వుంటుంది. సౌజన్యం గుర్తింపు పొందుతుంది. సమర్థత అక్కరకొస్తుంది. సమస్యలన్నింటికి మూలం ధనం. అందులకే ''ధనంమూలం మిదమ్ జగత్'' అన్నారు పెద్దలు. ఈ ధనం హరిజనుల పాలిట శత్రువయింది. ఈ విషయం తెలుగు కథానిక వస్తువయింది. ఆనేపథ్యంతో వచ్చిన తెలుగుదళిత కథానికలను పరిశీలించటం అవసరం.

**3.3.2.1. మాదిగమ్మాయి** :- తినడానికి తిండి లేక మాదిగమ్మాయి అష్టకష్టాలుపడి వ్యభిచార వృత్తిని స్వీకరించే స్థితిని తెలియజేసే కథ. రచయిత చలం. కథకుడు అత్తవారింటికి వెళ్లి ఆ పల్లెటూరి అందాలన్నీ చూసి ఆశ్చర్య చకితుడయ్యాడు. ఒక రోజు తోటలో ఒక మాదిగ స్త్రీని చూశాడు. ఆమె అతని దగ్గరయ్యాక రాత్రికి బియ్యానికై తనవద్దకు వస్తానన్నది. కథకుడు బాధపడ్డాడు. డబ్బు ఇచ్చాడు కాని ఆమె పొందు ఇష్టంలేక వెళ్లి పోతానన్నాడు. ఆమె డబ్బు ఉచితంగా తీసుకోనన్నది. ఆమె నీతికి చకితుడైన కథకుడు ఆమె అవసరాన్ని గూర్చి అడిగాడు. ఆమె తన పూర్వగాథను చెప్పింది. తల్లిదండ్రులు ఆమెను అప్పు క్రింద వెంకయ్యకు అప్పగించారు. భర్త రంగూన్ వెళ్లాడు. వెంకయ్యకు ఆమె లొంగలేదు. ఫ్యాక్టరీలో కూలీకి చేరింది. అక్కడ కులం తక్కువయినా అలోచించకుండా బ్రాహ్మణుడు వెంటాడి బలాత్కరింపబోయాడు. ఆమె కత్తి పీటతో గాయపరచి అతనిబారినుండి తప్పించుకొంది. ఆమెను దొంగతనం కేసుక్రింద పోలీసులు పట్టుకొన్నారు. స్టేషన్‌లో పోలీసులు కూడా బలవంతం చేశారు. ఆమెకు గత్యంతరం లేకపోయింది. ఒప్పుకుంటే వదులుతామన్నారు. అప్పటినుండి ఆమెను వెంకయ్య వుంచుకొన్నాడు. ఈ మధ్య వెంకయ్య చనిపోయాడు. ప్రస్తుతం ఆమె బ్రతుకు వ్యభిచారంతప్ప గత్యంతరం లేదు.

''సమాజంలో ఒకస్థాయి ప్రజలకు అందం ప్రమాదకారి. శీలాన్ని పణంగా పెట్టక తప్పని పరిస్థితులు అడుగడుగునా ఎదురవుతాయి. అట్లాంటి వారిలోని అందం డబ్బుతో ముడిపడుతుంది. అది రసికులకు జుగుప్స కలిగించినా సమాజంలోని ఒక వర్గం పడుతున్న దైన్యం జాలిని కలిగిస్తుంది. ఈ కథలో వర్గ లక్షణం చక్కగా చిత్రింపబడింది. కాని చిత్రణలో వర్గపోరాటం సూచన కన్నా స్త్రీ ఆకర్షణ చిత్రణ యందే మిక్కిలి కనిపిస్తోంది. అందానికి అనుభవానికి మధ్య డబ్బు కాలుష్యాన్ని ప్రవేశపెడుతుందన్న కథకుడి ఉద్దేశం చలంగారి భావాలు ''82.

ఈ కథలో హరిజన స్త్రీలకు అందం శత్రువు అని వారు సమాజంలో సుఖంగా బ్రతుకాలన్నా సమాజం బ్రతుకనివ్వదని వారు బలికావడం తప్పదని ఈ కథ సూచిస్తుంది. మాదిగమ్మాయి ఎన్ని కష్టాలొచ్చినా శీలం పోగొట్టుకోకూడదని ప్రయత్నించింది. కాని ఫలితం లేకపోయింది.

**3.3.2.2. యజ్ఞం కథ** :- వ్యాపారం పేరుతో తమ వద్దకు చేర్చుకొని హరిజనునికి అప్పు మోపిన సవర్ణుల కథ. రచయిత కాళీపట్నం రామారావు. సుందరపాలెంలో అప్పల్రాయుడు మాలకులస్థుడు. డెబ్బై సంవత్సరాల వృద్ధుడు. రెండెకరాల పొలం వున్న పేదరైతు. అతనికి నలుగురు కొడుకులు. ఆ ఊళ్లోనే గోపన్న అనే రైతు ఒకప్పుడు బాగా బ్రతికి ప్రస్తుతం పూర్తిగా చితికిపోయి నిరుపేద స్థితిలో వున్న పాత షావుకారు. అతని కొడుకులంతా పొట్టచేత పట్టుకొని ఊరొదలి వెళ్లిపోయారు. గోపన్న ఒక విధవ కూతుర్ని ఐదుగురు మనుషుల్ని పోషిస్తూ, వుండీ లేక కాలం గడుపుతున్నాడు. అప్పల్రాయుడు గోపన్నకి కొంత అప్పుపడ్డాడు. ఆ అప్పు తీర్చడానికి అప్పల్రాయుడు మూడేళ్ల గడువు అడిగాడు. ఆ గడువు తీరిపోయి ఆ రోజు పెద్దలందరూ న్యాయమంటపంలో పంచాయితీ పెట్టారు. అప్పల్రాయుడు అప్పు క్రింద పొలం అమ్మాలని అప్పల్రాయుడు కుటుంబానికి ఐదెకరాల బంజరు భూమినిప్పిస్తామని కూలీకి, నాలికీకూడా

మున్ముందు అప్పుల్రాయుడు కుటుంబాన్నే పిలిపించి సహాయం చేస్తామని ఈ తీర్పుకు ఒప్పుకోమని పెద్దలు చెప్పారు. అప్పుల్రాయుడు తను చెప్పవలసింది చెప్పుకోన్నాడు. అసలు తన అప్పే అన్యాయమైందని అయినా తీర్చక దప్పదంటే భూమి అమ్ముకోవడం తప్ప ఇంకోవిధమైన తీర్పు చెప్పమని తనకు ఇస్తామన్న బంజరు భూమిని గోపన్నకే ఇప్పిస్తే అందులో తమ కుటుంబం వాళ్లంతా పనిచేసి అప్పు తీర్చుకుంటామన్నాడు. పంచాయతే పెద్దలు తమ తీర్పు మార్చుకోలేదు. అప్పుల్రాయుడు చివరిగా ఆ తీర్పుకే అంగీకరించి పొలం అమ్మేశాడు. అతని కొడుకుల్లో ముగ్గురు ఆ తీర్పుకే కట్టుపడ్డారు. కాని చివరి కొడుకు సీతారాముడు మాత్రం పొలం వదలడానికి ఒప్పుకోలేదు. ఒప్పుకోనని ఇదివరకే తండ్రికి చెప్పాడు. ఇప్పుడు తండ్రి పొలం వదలడానికి సీతారాముడు ఉగ్రుడై పోయాడు. పురోణి పత్రం మీద వేలుముద్ర వెయ్యడం మానేసి గిరుక్కున వెనక్కి తిరిగి మాలపేట వైపు వెళ్లి పోయాడు. ఏంజరుగుతుందోనని అందరూ సీతారాముడు వెళ్లినవైపే చూస్తున్నారు. సీతారాముడు ఒక బస్తామూట భుజానవేసుకొని అందరి మధ్య బస్తా గుమ్మరించాడు. అందులో మంచి పసిబిడ్డ మొండెం, తలం క్రిందపడ్డాయి. సీతారాముడు తండ్రితో ''నా కొడుకుమీద నాకా శెక్కువ . నా కొడుకు బానిసబతుకు బతకుడు. నా కొడుకు కంబారికాడు''83 అన్నాడు. అంతేగాక, భూమి వదలడ్డంటే విన్నావుకావు. మేమందరం ఎలా పోయినా సరే అప్పుల్రాయుడు మాత్రం ధర్మం తప్పనివాడనిపించుకోవాలనే గొప్పకోసం పొలం అమ్మేశావు. నా కొడుకు బానిసగా వుండటం కన్నా చావడమే నయమన్నాడు.

ఈ కథ సమాజంలోని అట్టడుగు జీవులను భుజం తట్టి లేపుతుంది. న్యాయన్యాయాలు వివరించడంలో సుదీర తీరాలకు తీసుకపోతుంది. దివాలాతీసిన షావుకారి వడ్డీల పై వడ్డీలు పెరిగిన బాకీని ఒక బక్క రైతు చెల్లించవలసివుంటే న్యాయం ఒక్కరైతు పక్షాన వుండాలా దివాలా తీసి ఆర్థికంగా ఇబ్బంది పడుతున్న షావుకారు పక్షాన వుండాలా అనే చిక్కు ప్రశ్నకు కథా రూపం ఇందులో కనపడుతుంది. షావుకారి దయనీయమైన స్థితిలో వున్నాడు నిజమే. అతనికి రావలసిన వడ్డీల మీద వడ్డీని సమర్థించేది మానవత్వానికి చెందిన న్యాయం కాదు. పెట్టుబడిదారి సమాజానికి చెందిన న్యాయం మాత్రమే అవుతుంది. పెట్టుబడిదారి సమాజపు పతనకారణం ఈ సమాజంలోనే వుందన్న నిజాన్ని ఈ కథ తెలియజేస్తుంది. పెట్టుబడిదారి వ్యవస్థలో పేదవాడికీ, ధనవంతుడికీ మధ్య జరిగిన ఘర్షణను ఈ కథ ఆవిష్కరిస్తుంది. కథలో భూస్వామ్య వ్యవస్థ నుండి పెట్టుబడిదారి వ్యవస్థకు మారుతున్న దశ కన్పిస్తుంది.

**3.3.2.3. మార్పుకు మార్గం** :- స్వార్థం కోసం హరిజనుల యెడ అవసరాలకు అనుగుణంగా ప్రవర్తించే సవర్ణుని కథ. రచయిత సి. యస్. రావు. సుబ్బడు ప్రెసిడెంటు పాలేరు. సుబ్బడు పుత్రమ్మ భార్యాభర్తలు. వారి కొడుకును పుత్రమ్మ చెల్లెలు బాగా చదివించి ఇంజనీరును చేసింది. తన కొడుకు ఆ ఊరు వస్తున్నట్లు సుబ్బడికి ఉత్తరం అందింది. తన కొడుక్కి యం. యల్. ఏ. చీఫ్ ఇంజనీర్‌లతో చెప్పితానే ఉద్యోగం ఇప్పించానని ప్రెసిడెంటు అన్నాడు. అంతేగాక ఇంజనీరు తన పాలేరు కొడుకైనా ఇంట్లోకి పిలుచుకెళ్లి తనతో పాటు ఫలహారం తినబెట్టాడు ఎన్నో సంవత్సరాలుగా పాలేరు తనం చేస్తూ కనీసం ఇంటి గుమ్మం కూడా తొక్కని సుబ్బడు ఆ రోజు ప్రెసిడెంటుతో పాటు ఇంట్లోకి వెళ్లాడు. ఇంజనీరు ప్రెసిడెంటుతో తాను వేయిస్తున్న రోడ్డును చూశానని, బిల్లు బుక్కుపై ఆఫీసులో సంతకం చేస్తానన్నాడు. తన తల్లిని చూడాలని మాలపల్లెకు వెళ్లాడు. తనతోపాటు ప్రెసిడెంటు కూడా వెళ్ళాడు. మాలపల్లెలో ఒక ముసలామె ప్రెసిడెంటును చూసి అప్పుడే ఎన్నికలొచ్చాయా! అన్నది. ప్రెసిడెంటు రాలేదన్నాడు. అప్పుడు ఇంజనీరు తన మనస్సులో ఈ అసమానతలు తొలగడానికి ఆర్థిక సమస్య ఒక్కటే కారణ మనుకొన్నాడు.

ధనమే సర్వ సమస్యలకూ మూలం అనే విషయాన్ని రచయిత ఈ కథలో వివరించాడు. డబ్బుకు, మనిషికీ మధ్య వున్న సంబంధాన్ని తెలియజేశాడు. జీవితాంతం పాలేరుగా చేసిన సుబ్బడు ప్రెసిడెంటు ఇంట్లోకి వెళ్ల లేదు సరికదా, కనీసం తిండి కూడా సరిగా తినలేదు. అదే ఉన్నతహోదా కలిగిన ఇంజనీరు హరిజనుడైనా ప్రెసిడెంటు సాధారణంగా తన ఇంట్లోకి ఆహ్వానించాడు. తన స్వార్థం కోసం సనాతనంగా పాటిస్తున్న సంప్రదాయాలను తెంచుకొన్నాడు. తానే సుబ్బడికొడుక్కు ఉద్యోగం ఇప్పించినట్లు అబద్ధాలాడాడు. సవర్ణులు స్వార్థం కోసం ఎంతనీచానికైనా దిగజారుతారనడానికి ఈ కథ తార్కాణం.

**3.3.2.4. వెంబ్రాళ్ళు** - సమాజంలో తనపనికి విలువలేదని బాధపడుతున్న హరిజనుని కథ. రాయలసీమలో సేద్యపుబావులే పొలాలకు శరణ్యం. ఆ ఊళ్ళో బావులే జీవనాధారం, కావటం వల్ల మోట అవసరం ఎక్కువగా వుండేది. ఆ ఊళ్ళో నే మాదిగ రాముడు భార్య లచ్చిమి వుండేవారు. రాముడు తన వృత్తి చేసేవాడు. రోజా ఊరి ప్రజలు తమ మోట (కపిల) తెగిపోయాయని చిల్లులు పడ్డాయని తమకు చెప్పులు కుట్టించమని రాముని ఇంటి చుట్టూ తెగతిరిగేవారు. రాముడు తెల్లవారి నిద్రలేచి రైతుల బావుల వద్ద కెళ్లి మోటను మరమ్మత్తు చేసి తనకు కావలసిన కూరగాయలను తీసుకొని వచ్చేవాడు. అంతేగాక పంటకాలంలో రైతులు రాముడికి ధాన్యం ఎక్కువగా పెట్టేవారు. కాలక్రమంలో విద్యుత్ మోటార్లు వచ్చాయి. మోటలను రైతులు మూలవేశారు. రాముడి సంసారం గడవటం కష్టమయింది. రోజా తన కుటుంబ సభ్యులంతా పనులకు వెళ్లవలసివచ్చింది. ఒకరోజు కథకుడు రాముడుకు ఎదురుపడ్డాడు. అప్పుడు రాముడు రోడ్డు పై పని చేస్తూ కథకుడితో 'గెంటల తరుబడి యింటి ముందర నిలబెట్ట రైతుల్ని. అవ్వి ఆ రోజులుఇప్పుడు నిమిషం నిలబడితే ఆ అయ్య కసురుకుంటాడు. ఇవి ఈ రోజులు. ఏంజేద్దాం బాబు వస్తా''84 నన్నాడు.

ఒకప్పుడు సంసారాన్ని సుఖంగా సాగించిన రాముడు ప్రస్తుతం పూట గడవటానికి ఇబ్బందిపడుతున్నాడు. కాలం మారింది. సామాజిక పరిస్థితులు మారాయి. కాని మనుషులలో మాత్రం మార్పు రాలేదు. కులం పేరుతో మనుషుల్ని వేరు చేస్తున్నారు. రాముడు కులవృత్తి వదలిపెట్టినా అతని కులం మారలేదు. హోదా మారలేదు. బ్రతుకు మారలేదు. తన మనుగడ కోసం తాను సృష్టించుకొన్న డబ్బుకే బానిసయ్యాడు. ఆ డబ్బు వల్ల హరిజనులు ఎదుర్కొంటున్న కష్టనష్టాల్ని ఆకలి కడుపుల్ని తిండి కోసం పడుతున్న పాట్లను రచయిత సానుభూతితో కథలో చిత్రించాడు. వారి సమస్యలను పరిష్కరిద్దామనే ఉద్దేశ్యం కాకపోయినా వారి స్థితిగతుల్ని సమాజానికి తెలియజేయడానికి రచయిత ప్రయత్నించాడు. ఇటువంటి స్థితిలో హరిజనుల్లో మార్పురావాలని రచయిత అభిప్రాయపడ్డాడు.

**3.3.2.3. కీచక వధ** :- తన పొలంలో పనిచేస్తూ చనిపోయిన పాలేరు కుటుంబాన్ని ఆదుకొనే రెడ్డి కథ. రచయిత పులికంటి కృష్ణారెడ్డి. వెంకటరాముడు బసివిరెడ్డి పాలేరు. అతనికి భార్య, కూతురు. వెంకటరాముడు తన శక్తిని దాచుకోకుండా రెడ్డి ఆస్తిని పెంచడానికి ప్రయత్నించాడు. ఒకరోజు రాత్రి పొలంలో మోట తోలుతుండగా, మోట బావిలో పడితే ఆ చీకటిలోనే మోట తీయడానికి బావిలోకి దూకి మోటకడ్డీలలో తల తగులుకొని చనిపోయాడు. ఊరి ప్రజలంతా వెంకటరాముడు అన్యాయమయ్యాడని తన కుటుంబం బజారున పడిందని అతని కుటుంబాన్ని ఆదుకొనేవారులేరని అనుకోవడం విన్న బసివిరెడ్డి రచ్చబండపై పంచాయతీ పెట్టించి తన కుడిభుజం లాంటి వెంకటరాముడు చనిపోయాడని వాడు తనకు వేయి రూపాయల అప్పు ఇవ్వాలని ఇక మీదట ఆ అప్పు వాడిభార్య తీర్చనవసరం లేదని, ఆమె తన ఇంట్లో పనిచేసుకోవచ్చు నన్నాడు. పంచాయతీ పెద్దలు రెడ్డి మాటను అంగీకరించారు. కాని అప్పు ఎప్పుడు తీసుకొన్నాడని అడగలేదు. వాడి భార్య కూడా నోరు మెదపకపోయింది.

హరిజనుల శ్రమ దోచుకోవడం సవర్ణుల వృత్తి. వెంకటరాముడు బ్రతికినన్నాళ్లు కష్టపడి రెడ్డికి సేవలందించాడు. రెడ్డి వాడి సేవలు అందుకొని ఆనందించాడే కాని కష్టానికి తగిన ఫలితాన్ని ఇవ్వలేదు. రెడ్డికి సేవ చేయడంలో వెంకటరాముడు ప్రాణాలను కోల్పోతే, వాడి సంసారాన్ని ఆదుకోలేదు. సరికదా, వాడికి అప్పు ఇచ్చానని అబద్ధాలాడాడు. కనీసం పంచాయతీ పెద్దలు కూడా అప్పు పత్రం చూపించమని రెడ్డిని అడుగలేదు. వెంకటరాముని భార్య ఆ మాట అడగడానికి ప్రయత్నించినా ఫలితం లేకపోయింది. సవర్ణులకు శ్రమదోచుకోవడం తప్ప శ్రమను పంచి ఇవ్వడం తెలియదు. తెలుసుకోవడానికి కూడా ప్రయత్నించరు. రచయిత ఈ కథ ద్వారా హరిజనులు అలాంటి జీవితాలకు స్వస్తిచెప్పి కష్టానికి తగిన ఫలితాన్ని సవర్ణుల నుండి పొందాలని సలహా ఇచ్చాడు.

**3.3.2.6 . పాపం కుంటేలుగాడు** :- డబ్బు పై అత్యాశతో తన కొడుకును చంపుకొన్న హరిజనుడి కథ. రచయిత పులికంటి కృష్ణారెడ్డి. కుంటేలుగాడు చెంగి భార్య భర్తలు . కుంటేలుగాడు కట్టెలు కొట్టి సంసారాన్ని సాగించేవాడు. చెంగి మగ బిడ్డను ప్రసవించి చనిపోయింది. అప్పటినుండి కుంటేలుగాడు తన కొడుకు వరదుడిని కంటికి రెప్పలా చూసుకొనేవాడు. కుంటేలుగాడు తాను కట్టెలు కొట్టినందుకు ప్రతి నెలా ఫారెస్టోళ్లకు కొంత డబ్బు ఇచ్చేవాడు. ఒక రోజు కుంటేలుగాడు అడవిలో కట్టెలు కొట్టుతున్నప్పుడు స్పెషల్ బీటోళ్ల వచ్చి కుంటేలుగాడిని చెట్టుకు కట్టి బాదారు. అప్పటినుండి కట్టెలు కొట్టడం మానేసి తనకున్న బంజరు భూమిని సాగు చేసుకోవడం మొదలుపెట్టాడు. తనవద్ద సాగు చేసుకోవడానికి డబ్బు లేక సతమతమవుతున్నాడు. ఇదే స్థితిలో బడిపిల్లల పోట్లాటలో తన కొడుకును హరిజనులు కొట్టారన్న ఆవేశంతో ప్రెసిడెంటు ఆ రాత్రి హరిజన గుడిసెలను తగులబెట్టాడు. హరిజన గుడిసెలు తూర్పు వైపంతా కాలిపోగా ప్రభుత్వ అధికారులు సంఘటనా స్థలాన్ని చూసి అన్యాయమని నష్టపరిహారం క్రింద ఇంటికి ఐదు వేల రూపాయల ప్రకారం ఇచ్చారు. అపుడు కుంటేలుగాడు ''అయ్యో! నా గుడిసె కాలిపోయ్యుంటే నాకూ ఐదువేలు వచ్చుంటే....నా బూవిలో బాయి తవ్వుకొందును. బాయికి మిషన్‌పెట్టుకొందును''85 అని బాధ పడ్డాడు. ఇక ఎలాగైనా ప్రభుత్వంచే ఐదువేల రూపాయలు సంపాదించదలచి మరుసటి రోజు తన ఇంటికి నిప్పుబెట్టి వంక చేరాడు. తన ఇళ్లు కాలిపోవడం చూసిన వరదుడు తండ్రి వద్దకు చేరుతున్నాడు. ఈలోగా గాలికి కొట్టం కప్పువచ్చి వరదుడి మీద పడి మంటల్లో కలసి పోయాడు.

ప్రేమాభిమానాలు అనేవి స్వార్థానికి ఎలాదారి తీస్తాయో రచయిత తెలియజేశాడు. పొట్టకూటికోసం కట్టెలు కొట్టి జీవిస్తున్న కుంటేలుగాడికి ఆ పని లాభదాయకంగా లేదు సరికదా ఫారెస్ట్ అధికారుల చేతిలో చిక్కి దెబ్బలకు గురయ్యాడు. తన ఆస్తిని సాగు చేసుకొని వున్న దానితో తృప్తిపడని కుంటేలుగాడు. ఆశకుపోయి ఐదువేల రూపాయలు సంపాదించడానికి తన ఇంటికి తాన నిప్పు పెట్టుకొన్నాడు. ఆ మంటల్లో తన కొడుకునే బలి చేసుకొన్నాడు. ఎవరి కోసం అయితే సంపాదించాలని తపన పడ్డాడో వాడే తన చేతికి అందకుండాపోయాడు. రచయిత ఈ కథ ద్వారా మానవుడికి అత్యాశ వుండరాదని, అది అసలుకే ముప్పని తెలియజేశాడు.

**3.3.2.7. నర్సన్న పాపాయి** :- మానవుని ఆర్థిక స్థితే అని మనుగడను తెలియజేస్తుంది అని చిత్రించే కథ. రచయిత అడవి బాపిరాజు. నర్సన్న కథకురాలి ఇంట్లో పెద్దపాలేరు, వాడలో కులపెద్ద చిన్నప్పు నర్సన్న గుడిలోకి వెళ్లాడని కథకురాలి అన్న చావమోదాడు. నర్సన్నకు ఒక భార్య కూతురు. నర్సన్నకు కథకురాలి భర్త చదువు చెప్పాడు. శాసనసభ ఎన్నికల్లో నర్సన్నను శాసనసభ అభ్యర్థిగా పోటీ చేయించాడు. ఎన్నికల్లో నర్సన్న గెలవడానికి కథకురాలి భర్త తోడ్పడ్డారు. శాసనసభ సభ్యుడైన నర్సన్న, కథకురాలి భర్త ఒకే కంచంలో భోజనం చేశాడు. వారు ఇంత స్నేహంగా వుండటం వల్ల కథకురాలి అన్న వారింటికి రావడం మానేశాడు.

నర్సన్న కూతురు భరతాంబను ఎక్కువ కాలం తన వద్దనే వుంచుకొనేది. ఆమె ఆ పాప భవిష్యత్తు గురించి ఊరికి దూరంగా వుండాలని, దేవాలయ ప్రవేశం వుండదని ఆలోచించేది. నర్సన్న కథకురాలి కుటుంబాన్ని ఆర్థికంగా ఆదుకొనేవాడు. ఈలోగా కథకురాలికి కూడా ఒక కూతురు పుట్టింది. ఆమె పేరు పూర్వ స్వరాజ్య లక్ష్మి.

మానవుడి జీవితం ఆర్థిక సంబంధాలతో ముడివడి వుంది. తన పాలేరుగా వున్న నర్సన్నకు చదువు చెప్పడం, రాజకీయ పరిజ్ఞానాన్ని బోధించడం కథకురాలి భర్త త్యాగానికి మచ్చు తునక అయితే కష్టసమయాల్లో కథకురాలి కుటుంబాన్ని నర్సన్న ఆదుకోవడం కూడా అతని గొప్పతనమే. నర్సన్న కథకురాలి పాలేరుగా తమవంతు కష్టాన్ని అందిస్తే కథకురాలి భర్త అందుకు ప్రతిఫలంగా నర్సన్న మేలుకోరి శాసనసభ్యుడిని చేశాడు. ఇందులో కులంతో సంబంధంలేని మానవ స్నేహ సంబంధాలు కన్పిస్తాయి. ఒకరికొకరు ఇచ్చి పుచ్చుకొనే ధోరణిలో సహాయ సహకారాలు అందించుకోవడం సమాజ అభ్యుదయానికి క్షేమదాయకం.

**3.3.2.8. ఉచ్చు** :- అప్పు పేరుతో హరిజనుల ఆస్తిని కాజేసిన కథ. రచయిత సింగమనేని నారాయణ. నల్లక్క నాగన్న భార్యాభర్తలు. వారి కొడుకును వెంకటరెడ్డి ఇంట్లో జీతానికి పెట్టారు. వాడికి జ్వరం వచ్చి పొలంలో పడుకుంటే వెంకటరెడ్డి చిదకబాదాడు. నాగన్న కొడుకు ఊరు వదలి పారిపోయాడు. వెంకటరెడ్డి జీతగాడు పనికిరాలేదని తాను ఇచ్చిన డబ్బుకోసం పంచాయతీ పెట్టించారు. పంచాయతీలో నల్లక్క నా కొడుకును అంతగా కొట్టినావంటే ''వోయబ్బ యీమాత్రం కొడుకింకెవుడికన్నా వుండాడా ? షన్దెయ్యకుండా చెట్టుకింద పండుకుంటే రెండేట్లు యేసిందానికి యిట్లతే వూర్లో యింక రైతులు సేద్యాలు చేసుకొన్నట్లే''86 అన్నాడు. పంచాయతీ పెద్దలు నాగన్నను వెంకటరెడ్డి ఇచ్చిన డబ్బులు తిరిగి ఇవ్వమన్నాడు. నాగన్న తనవద్ద నాలుగు నెలల వరకూ తన మూడెకరాల భూమిని వెంకటరెడ్డి తీసుకొనేటట్లు పంచాయతీ పెద్దలు తీర్మానించారు.

వ్యక్తులు సంఘ సుఖమయ జీవితానికి ఆర్థిక స్థితి అవసరం. ఆఆర్థిక స్థితిని సాధించడంలో వ్యక్తులు భిన్నమతాలు అవలంబించడం తప్పనిసరి. ఇక హరిజనులకు కులం ధనం రెండూ తక్కువే. ధనం వున్నవాడు లేనివాడి కష్టాలను తమ అవసరాలుగా చేసుకొంటాడు. ఆ ధోరణిలోనే హరిజనులు కష్టాలు అనుభవిస్తున్నారు. కథలో జీతగాడు ఎక్కడున్నాడు, ఎలా వున్నాడో, ఏమయ్యాడోని పట్టించుకోని వెంకటరెడ్డి తానిచ్చిన డబ్బును వడ్డీతో సహా ఎలా గుంజాలని ఆలోచిస్తున్నాడు. వారి శ్రమను దోచుకోవడమేకాక అప్పు పేరుతో వారికున్న ఆస్తిని కూడా కాజేశాడు. పంచాయతీ పెద్దలు కూడా అదే తీర్మానాన్ని ఆమోదించారు. 'ధనం బలం వున్నవాడి వద్ద సర్వం బానిస అన్నట్లు ఏదో తన కొడుకును జీతం పెడితే కొంత డబ్బు వస్తుందని ఆశించిన నాగన్న నల్లక్కలు ఉన్న ఆస్తిని పోగొట్టుకొన్నారు. ఈ కథలో రచయిత హరిజనులను సవర్ణులు ఎలా మోసం చేస్తున్నారో వివరించాడు.

**3.3.2.9. పురుగు** :- అప్పు పేరుతో హరిజనుల పంటధాన్యాన్ని హరింపచేయడానికి ప్రయత్నించిన కథ. రచయిత మధుచక్రవర్తి. పైడితల్లి పచ్చని తన పంట పొలాన్ని చూసి సంతోషిస్తున్నాడు. ఈ సంవత్సరం తన కష్టాలన్నీ గట్టెక్కుతాయనుకొన్నాడు. పంటకు పురుగుపట్టడంతో డబ్బుకోసం ఆ ఊరిపెద్ద నాయుడును ఆశ్రయించాడు. ఈసారి పంట చేతికిరాగానే తన అప్పు తీరుస్తానన్నాడు. తనలో ''ఛీకొట్టినా... చీదరించుకున్నా పెద్దనాయుడు బాబు నిజంగా తన పాలిట పెద్దదిక్కే''87 ననుకొన్నాడు. పంట చేతికొచ్చింది. ఒకరోజు పంటను కోయడానికి పైడితల్లివెళ్లుతుండగా పెదనాయుడునుండి కబురు వచ్చింది. నాయుడు పైడితల్లితో తన పంటధనాన్ని అంతా తన ఇంటికే తీసుకురమ్మన్నాడు. అందుకు పైడితల్లి ఈసారి కొంత అప్పు మాత్రమే తీరుస్తానంటే నాయుడు నిరాకరించాడు. నాయుడు ఇంటివద్ద పట్టెడు మెతుకుల కోసం

విశ్వాసంగా వున్న కుక్క పిల్లను నాయుడు కొడితే అతనిపై పడికరచింది. ఈదృశ్యం పైడితల్లి మదిలో తిరిగింది. అప్పటినుంచి పైడితల్లిలో జ్ఞానోదయం అయింది. పైడితల్లి నాయుడు మాటలను నిరాకరించాడు.

ఈ కథలో హరిజనులను అప్పుపేరుతో సవర్ణులు ఎలా మోసం చేస్తారో తెలియజేశాడు. పైడితల్లి పంటచేతికొస్తే తమ సమస్యలు తీరుతాయనుకొన్నాడు. కాని నాయుడు వద్దవున్న ప్రాంసరీనోటు వడ్డీకి వడ్డీని పెంచుతుందనుకోలేదు. పైడితల్లికి నాయుడు డబ్బు ఇచ్చినప్పుడల్లా మంచివాడనుకొన్నాడు. కాని ఇలామోసకారి అని తలచలేదు. మాటలురాని కుక్కకు కూడా మనిషిపై ఎదురుతిరిగే మనస్తత్వం వుంటే మనిషై పుట్టిన పైడితల్లిలో ఈ ఆలోచన లేదని తెలియజేయడానికి ఈ కథ నిదర్శనం.

**3.3.2.1. ఎలచ్చన్ అవెమ్మోరికి బలి** - స్మశానంలో శవాల మధ్య బ్రతికే కాటికాపరి ఆలోచన ఈ కథ. రచయిత గాయత్రి రాజ్. రాజయ్య సమాధుల మధ్య స్మశానంలో బ్రతికే అభాగ్యుడు. అతనికొక కల వస్తుంది. ఎన్నికల సమయంలో దొమ్మీలు, ఘర్షణ జరిగి కుప్పలు కుప్పలుగా శవాలు తన స్మశానంలోకి వచ్చినట్లు కలగంటూ వుంటే అతని భార్య నిద్రాభంగం కలిస్తుంది. ఎప్పుడు పిండా కూడు కలేకంటావని నిరసిస్తుంది.

సగటు మానవులు గీసుకొని బ్రతుకుతారు. తన స్వార్థం కోసం ఎన్నోకలలు కంటారు సమస్తం తనఒడిని చేరాలని తపనపడుతారు. అలాంటి స్థితే రాజయ్యది. తినడానికి తిండిలేక నిత్యం స్మశానంలో తిరిగే అతనికి బ్రతికిన మనుషుల కన్నా చచ్చిన శవాలే తన ఆకలిని తీరుస్తున్నాయనడానికి ఈ కథనిదర్శనం.

**3.3.2.11. కులం** - సమాజంలో రెండే కులాలున్నాయని నిరూపించే కథ. రచయిత తోలేటి జగన్నాధరావు. ఒక హరిజన ముసలివాడి కొడుకు చిన్నప్పటి నుండి కష్టపడి ఉన్నత చదువు చదివి పెద్ద ఉద్యోస్థుడయ్యాడు. డబ్బున్న వాళ్ళ జాతిలో చేరిపోయాడు. ముసలివాడు అభ్యుదయ వాది. ''సింకిపాతలవారు సీడవాళ్ళు వారు తెలివి తక్కువ వారు అంటూ మమ్ము కింద పెట్టకుండి. కించిత్తు డబ్బుంటే యింకి పోతాయండి యివన్నీ''88 అంటాడు. ఒకప్పుడు గాంధేయవాది. గాంధీ పంతులు అభ్యుదయం కోసం పరితపించేవాడు. తన ఆస్తినంతా దేశసేవకు అంకితం చేసి చనిపోయాడు. ఆ స్థితిలో ఏ సంస్థలు సాయం చేయడానికి రాకపోతే ఈ హరిజన ముసలివాడు ముందుకు వచ్చి తన డబ్బుతో దహన సంస్కారాల పూర్తి చేశాడు. గాంధీపంతులు కొడుకు కూడా తన తండ్రి చావును గురించి ఆలోచించలేదు. అతను ఆర్థిక ఇబ్బందుల్లో వున్నారు. ముసలివాడి మాటల్లో చెప్పాలంటే ''అతని కొడుకు హరిజన బ్రాహ్మణుడు గాంధీ పంతులు కొడుకు బ్రాహ్మణ హరిజనుడు. ముసలివాడి కొడుకు పెద్ద ఉద్యోగి అయి సొంతమేనల్లుణ్ణి తక్కువ తరగతివాడిగా చూస్తాడు. కాని ఏమి లేని పంతులు కొడుకు బ్రాహ్మణుడైనా హరిజనుడితో సమానంగా చూడబడుతాడు''.

''మంచి చెడ్డలు మనుజులందున ఎంచి చూడగ రెండె కులములు'' అనే గురజాడ మాట అక్షరాలా వాస్తవం. మానవ ప్రగతికి డబ్బు మూలాధారం. మరో విషయం డబ్బు లేకుంటే కాలం కూడా గడవదు. నేడు సమాజంలో డబ్బున్నవాడు సమాజం చేత గౌరవింపబడుతాడు. ఆదరింపబడుతాడు. ఉన్నతుడుగా స్వీకరింపబడుతాడు. కాని డబ్బులేనివాడు హీనంగానే చూడబడుతాడు. ఇది సమాజంలో జరిగే నిత్య సత్యం ఇది కులం కన్నా డబ్బు ఎంత విలువైంది తెలియజేసే కథ.

## 3.4 కథానికా సాహిత్య దృక్పథం

తెలుగు కథానికా సాహిత్యంలో హరిజన జీవితం. విభిన్నంగా వ్యక్తమవుతూ వుంది. రచయితలు వారి సమస్యలను అన్ని కోణాల్లోనూ చూస్తున్నారు. సనాతన ఆచారసాంప్రదాయాలను ఇతరులపై రుద్ది తమ ఉనికిని కాపాడుకోవడానికి ఉన్నత వర్గాల వాళ్ళు ప్రయత్నించారు. సమాజం అభివృద్ధి చెంది సంఘ సంస్కరణ వాదులు అట్టడుగు ప్రజల్ని వెన్నుతట్టి లేపడానికి ప్రయత్నించారు. ఈ నేపథ్యంలో బ్రాహ్మణ వాదులు బడుగు వర్గాల గురించి రచనలు చేయడం ప్రారంభించారు. వాటిని ప్రచారం చేయడంలో సవర్ణులు ముందంజవేశారు. తత్ఫలితంగా కథానికా సాహిత్యంలో హరిజన జీవితాలు పలుకోణాల్లో చిత్రించబడ్డాయి.

తెలుగు కథానికా సాహిత్యంలో మొట్టమొదటి హరిజన జీవితాన్ని చిత్రించిన కథ 'పుల్లంరాజు' రచయిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి. ఈ కథ 1925 వ సంవత్సరం జూన్ మాసంలో 'ప్రబుద్ధాంధ్ర' పత్రికలో ప్రచురితం. ఇందులో సవర్ణులకు అస్పృశ్యులుగా వున్న హరిజనులలోనే రెండు కులాల మధ్య అంతరాలున్నాయి. ఆ అంతరాలను పోగొట్టుకొని ఐక్యంగా అస్పృశ్యతను ఎదుర్కోమని రచయిత సలహా ఇచ్చాడు. 1925కు పూర్వం బడుగు వర్గాల గురించి రచనలు వచ్చాయి. కాని ప్రత్యేకంగా హరిజన కులం పేరుతొ వెలువడ్డ కథానికా సాహిత్యం గోచారం కావలసి వుంది. 1925 తర్వాతనే రచయితలు కథానికా సాహిత్యంలో హరిజన సమస్యపై దృష్టిని కేంద్రీకరించారు తెలుగు కథానికా సాహిత్య దృక్పథాన్ని రచయితలు పలుకోణాలనుండి చిత్రీక రించారు.

**3.4.1. అస్పృశ్యత** - హరిజనులను సవర్ణులు సంప్రదాయాలు, ఆచారాల పేరుతో దూరంగా వుంచడం అన్యాయమని వాటిని నిర్మూలించడానికి సంఘసంస్కర్తలు హరిజనులకు చేయి అందించి తమవంతు కృషి చేయాలని అంతేగాక హరిజనులు అస్పృశ్యత నుండి విముక్తి కావడానికి సవర్ణులతో కుటుంబ సంబంధాలు అవసరమని రచయితలు తలచారు. భక్తికి, కులమతాలు సాంప్రదాయాలు అడ్డు రావని నిత్యం నిర్మల మనస్సుతో దేవుడిని కొలిచేవాడే దేవుని సన్నిధి చేరుతాడని భావించాడు. అస్పృశ్యతను రూపు మాపడానికి ప్రతి హరిజనుడూ ఆర్థికంగా అభివృద్ధి చెందాలని అప్పుడే వారు సవర్ణులతో సమానంగా చూడబడుతారని రచయితలు వీరికి ఉద్బోధించారు. హరిజనులపై సవర్ణులు అంటరాని వారని, వారిపై జాలి, దయ చూపినంత మాత్రాన వారు అభివృద్ధిచెందరని తమతో సమానంగా చూస్తూ చైతన్యం వైపు పయనించేలా ప్రయత్నించాలన్నారు. హరిజనులు సవర్ణుల అండదండలు లేకపోతే తమ జీవితాలు గడవవన్న మూర్ఖపు ఆలోచనలు వదలి. కష్టపడితే సుఖపడుతామనే విషయాన్ని తెలుసుకొని జీవించమన్నారు రచయితలు. హరిజనులు హరిజనులుగానే బ్రతకడానికి ప్రయత్నించమని, మతం మారడం, కులం పేరు చెప్పకుండా కాలం గడపడం కులానికే మాయని మచ్చ అని చెప్పారు. నేడు సమాజంలో విద్యావంతులై ఉద్యోగాలు చేస్తున్న వారు తమ కులం పేరు చెప్పక పేరు మార్చుకొని జీవించేవాళ్లులేకపోలేదు. అలా కావడానికి సమాజపు స్థితిగతులేనని తన ఉకికిని కాపాడుకోవడం కోసం తప్పని పరిస్థితయ్యిందని వివరించారు. రచయితలు , కులమతాలన్నవి అగ్రవర్గాల్లో ఒక వర్గం తమ స్వార్థం కోసం తమ ఉనికిని కాపాడు కోవడం కోసం సృష్టించి హరిజనులను బలిపశువులను చేసిందన్నారు. ఆ యజ్ఞంలో బలిపశువులు కాక తమశక్తితో వారిని ఎదిరించి అస్పృశ్యతను నివారించుకోమని సూచన లిచ్చారు. కులం పేరుతో మనిషిని దూరంగా వుంచడం మానవత్వం కాదని అందరూ ఒక్కటేనన్న మానవత్వాన్ని ప్రతి హిందువు తెలుసుకోవాలని అన్నారు.

**3.4.2. పాలేరుతనం** - సమాజంలో ధనం వున్న వాడికి అహం, ఆవేశం, సమ పాళ్లలో వుంటాయని, ధనంలేని వాడికి ధనం వున్నవాడి క్రింద పాలేరుతనం తప్పదని, వాడి జీవితం నరక ప్రాయుమని అయితే బీదవాడు తమ ఉనికిని కాపాడుకోవడం కోసం పోరాటం తప్పనిసరి అని హరిజనులకు రచయితలు

హెచ్చరించారు. సవర్ణులు స్వార్థం కోసం చూపెట్టే ఆశకు హరిజనులు తగిన ఫలితాన్ని ఆశించమన్నారు. సవర్ణులు చేసే చెడు వ్యవహారాలలో పాలేర్లు అయిన హరిజనులు చేయరాని పనులు చేసి తమ ప్రాణాలకు ముప్పు తెచ్చుకోవద్దని పాలేరుతనంలో మగ్గిన హరిజనులు కష్టాలకు గురై చావడం కన్నా ఆ కష్టాలను ధైర్యంగా ఎదుర్కొని బతికేవాడే భవిష్యత్తులో కార్యసాధకుడు కాగలడని తమ రచనల ద్వారా తెలియజేశారు. హరిజనులు తమ హక్కులను సవర్ణులకు ధారాదత్తం చేసి పాలేరుగా గుడ్డి జీవితాన్ని కొనసాగించక ఆ హక్కులను వినియోగించు కోమన్నారు. సమాజంలో సవర్ణుల స్వార్థం కోసం తమ పాలేర్లకు ఆదర్శాలు, అభిమానంతో మోసం చేయబడుతున్నారని, జీవితంలో ముందు చూపు లేకుండా ప్రవర్తించిన బతుకులు కష్టాలు పాలవుతాయని తెలియజేశారు. డబ్బున్న వాడిలో అహం, ఆవేశం; డబ్బులేని వాడిలో కరుణ, జాలి అనేవి పుష్కలంగా వుంటాయని వివరించారు. సవర్ణులు హరిజనులను పాలేర్లుగా చేసుకొని వారి భార్యలపై అధికారం చలాయించారు. రచయితలు వారికి కూడా చురకలు వేశారు.

చేయని నేరానికి హరిజన స్త్రీల జీవితాలు రెండు చక్రాల క్రింద నలిగిపోయాయని తత్ఫలితంగా బలిపశువులయ్యారని అలా కాకుండా చేయని నేరాన్ని నిర్భయంగా అంగీకరించి జరిగిన అన్యాయాన్ని ప్రతిఘటించ మన్నారు. హరిజన స్త్రీలు ఎంత దీన స్థితిలో వున్నా ఎన్ని పరాభవాలు అనుభసించినా పడుపు వృత్తికి మార్గంగా ఎంచుకోరాదని ఆ వత్తిడులకు ఎదుర్కొని ఎదుటివాడిని ఎదిరించడానికి ప్రయత్నించ మన్నారు. సవర్ణుల సహాయం అందక ఆకలి చావులు చావ వద్దని ఇతర ప్రాంతాలకైనా వలస వెళ్ళి కష్టించి కడుపు నింపుకోమని ఉద్బోదించారు. జీవితంలో ఎప్పుడూ కష్టం చేస్తూ వుండక సంసార జీవితాన్ని గురించి కూడా ఆలోచించమని కుటుంబ సభ్యుల సమస్యలను గుర్తుంచుకోవాలని ఆ సమస్యలపై స్పందించాలని కూడా తెలియజేశారు. నిస్వార్థంతో పనిచేసే పాలేరు రెడ్డి పొలంలోనే చనిపోతే రెడ్డి వాడి కుటుంబాన్ని ఆర్థికంగా ఆదుకోవాలని గానీ, వాడి భార్యను అనుభవించడం కోసం తపన పడరాదని, ఒక హరిజనుడి నుండి ఆదాయం పొందిన సవర్ణుడు వాడి కుటుంబంపై అభిమానం చూపించాలనీ వాడిని ఇబ్బందులకు గురిచేసి వాడి భార్యను అనుభవించడానికి ప్రయత్నించకూడదన్న సామాన్య లోకజ్ఞానం సవర్ణుడికి అవసరం అన్నారు.

**3.4.3. విద్య** - విద్య అన్నది కేవలం సవర్ణుల కోసం ఉద్దేశింపబడినది మాత్రమే కాదని, హరిజనులు కూడా అర్హులని, హరిజనులు విద్యావంతులైన హరిజనులను చూసి సహించలేని సవర్ణులు వారిని దొంగలని, రాడికల్స్ అని అపనిందలతో అంతం చేయవద్దని సవర్ణులను హెచ్చరించారు. అలాంటి దుస్థితిని తెచ్చుకోవద్దని హరిజనులకు సలహా ఇచ్చారు. శక్తితో చేయలేని పనులు యుక్తితో చేయవచ్చుని, విద్య అన్నది మనిషికి యుక్తి బోధిస్తుందని ప్రతి హరిజనుడు విద్యావంతుడైతే వారిలో చైతన్యం వస్తుందని కూడా తెలియజేశారు. ఉన్నత విద్యావంతుడైన హరిజనుడు నిస్వార్థపరుడై తోటి హరిజనులనే మోసం చేయడానికి ప్రయత్నించకూడదని వారికి మంచి చేయడానికి ప్రయత్నించ మన్నారు. సమాజంలో ఉన్నత విద్యావంతుడైన హరిజనుని కూడా దూరంగా వుంచడం భావ్యం కాదన్నారు.

**3.4.4. ఆలయ ప్రవేశం** - తరాలుగా తాము ఆలయ ప్రవేశానికి అనర్హులని తమ మనస్సులలో ఆ ఆలోచన వున్నంతవరకూ అభివృద్ధి చెందలేరని వారుకూడా సవర్ణులతో సమానమని, ఆలయ ప్రవేశానికి అర్హులని రచయితలు రచనలను సృష్టించారు. దేవుని పేరుతోనో భక్తిపేరుతోనో సవర్ణులు చేసే మోసాలను హరిజనులు మూర్ఖంగా అనుభవించక వారు చేసే మోసాలను ఎండగట్టమని ఉద్బోధించారు. సవర్ణులు గుడి, గోపురాలను హరిజనులు చేత కట్టించుకొని అవసరం తీరిన తర్వాత వారినే దేవాలయ ప్రవేశానికి అనర్హులను చేయడం అన్యాయమన్నారు. గుడి, బడి ఒకచోటు వున్న ప్రాంతాల్లో హరిజన విద్యార్థులును,

ఉపాధ్యాయులను అక్కడికి వెళ్ల నీయకపోవడం హాస్యాస్పదం అని, అది జాతి ప్రగతికే లోటు అని తలచారు. గ్రామాల పాఠశాలలు సాధారణంగా దేవాలయంలో వుండటం సర్వసాధారణం. అలాంటి స్థితిలో ఒక హరిజనుడు ఉపాధ్యాయుడైతే. అతనిని గూడా బయట వుంచడం మానవత్వం కాదని అతను కూడా దేవాలయ ప్రవేశానికి అర్హుడుగానే భావించాలని అభిప్రాయపడ్డారు.

**3.4.5. మతం మార్పిడి** - మానవుల మధ్య సత్సంబంధాలు నెలకొల్పడానికి కులం అడ్డురాదని ప్రేమ ఆప్యాయతలనేవి అవసరం అని కట్టుబాట్లపేరుతో జాతి అభివృద్ధిని అణగదొక్కే నాయకులు జాతికి చేటని రచయితలు హెచ్చరించారు. అలాగే మానవులు తమ అవసరాలను తీర్చడం కోసం సానుకూలంగా వున్న ఏ మతంలోనైనా చేరమని ఉద్బోధించారు. సంఘంలో చెడుకీ, మంచికీ స్వార్థపరుడైన మానవుడే కారణమని వీటికి మతాలన్నవి కేవలం నామ మాత్రాలని మతం మానవులు సృష్టించుకొన్నదేనని కూడా రచయితలు తెలియజేశారు. హరిజనులపై సవర్ణులు చేసే దౌర్జన్యాలను భరించలేకనే తమ అభ్యున్నతి కోసమే వారు క్రైస్తవం పుచ్చుకొన్నారని, ఈ దేశంలో ఎక్కువ భాగం హరిజనులు విద్య కోసం, సంపద కోసం, అధికారం కోసమే క్రైస్తవం పుచుకొన్నారని కులాంతర, మతంతర వివాహాలు ఒక్కొక్కసారి అనేక కష్టాలను తెచ్చి పెడతాయని, ఆ కష్టాలను అధికమించినప్పుడే వారి జీవితాలకు సార్థకత చేకూరుతుందని మనిషి బ్రతకడం కోసం కాలానుగుణంగా మారక తప్పదని, ప్రయోజనం ఒనగూర్చేది ఏ మతమైనా సరే మారవచ్చునని హెచ్చరించారు.

**3.4.6. వృత్తి** - సవర్ణులు హరిజనులకు కొన్ని అనాగరికమైన వృత్తులను అంటగట్టారు. రచయితలు తమ రచనలు ద్వారా ఆ వృత్తులను వదలిపెట్టమని హెచ్చరించారు. కాలం అభివృద్ధి చెందినా ఇంకా నీచవృత్తులు చేస్తూ సమాజం చేత నీచానికి గురికావద్దని విద్యావంతులై ఇతర వృత్తులను చేపట్టమని కథానికా రచయితలు సలహా ఇచ్చారు. మానవులు స్వార్థంతో కులాల అంతరాలను సృష్టించి హరిజనులకు నీచవృత్తులను ఇచ్చారని ఆ వృత్తులను వదలి శ్రమ జీవులుగా మారమని, చెప్పులు కుట్టే వృత్తివల్ల కేవలం తినడానికి తిండే జరగదని దానిలో వచ్చే ఆదాయంపై ఎక్కువ ఆశలు పెంచుకుని జీవించడం హద్దుకు మీరిన ఆలోచనలాంటిదన్నారు. హరిజనులు చేపట్టిన వృత్తులు కేవలం సవర్ణులకు ఉపయోగకరమైనవని, తమను నీచంగా చూస్తున్న సవర్ణులకు బుద్ధి చెప్పాలంటే వీరు తమ వృత్తులను వదలి పెట్టమని సలహా ఇచ్చారు. హరిజనులు తమ వృత్తిని చేపట్టడం వలన సవర్ణులకు చులకనై వీరి భార్యలను వారు చేపట్టడం వల్ల జీవితంలో సవర్ణులు కూడా తీవ్రమైన ఇబ్బందులకు గురికాక తప్పదని తెలియజేశారు. సమాజంలో మార్పు రావడం వల్ల, వ్యక్తుల వృత్తుల్లో మార్పు రావడం వల్ల, పూర్వం చెప్పులు కుట్టే వృత్తి చేపట్టిన వాడు నేడు మరొక రకమైన వృత్తిని చేపట్టినాడని కథలు తెలుపుతున్నాయి. హరిజనులు తమ వృత్తులు వదిలి ఇతర వృత్తులను చేపట్టడానికి ప్రభుత్వం ఇచ్చే ఆర్థిక సహాయాన్ని మధ్య దళారీల చేతిలోనే కుండా వారి సహాయం వారి కందేలా తోడ్పడమన్నాడు.

**3.4.7 నీటి సమస్య** - చాలా కాలంగా హరిజనులను పట్టి పీడుస్తున్న సమస్యను నీటి సమస్య . తాము శ్రమించి త్రవ్విన బావిలోనే నీటిని త్రాగటానికి అనర్హులయ్యారు. అందువల్ల రచయితలు తమకు హక్కులు కావాలని కూర్చుంటే రావని వాటిని ఇతరులెవ్వరూ సానుభూతితో తెచ్చి పెట్టరని తమ హక్కుల కోసం తామే పోరాడి ఈ సమస్యను తీర్చుకోమన్నారు. తమను త్రాగనివ్వని నీటిని సవర్ణులు కూడా త్రాగకుండా చేయమని అప్పుడు నీళ్ళులేక తాము ఏ స్థితిలో ఇబ్బంది పడ్డామో సవర్ణులకు కూడా తెలిసి వస్తుందని సలహా ఇచ్చారు. హరిజనులు శక్తి సంపన్నులని దుష్టశక్తుల చేటురాహిత్యం వల్ల ఐక్యత కోల్పోక తమ నీటి సమస్యను పరిష్కరించుకోవడం కోసం సొంత బావిని త్రవ్వు కొని ఊరికి దూరంగావే నిర్మలంగా

బ్రతుకమన్నారు. సవర్ణులకు నీటి సమస్య ఎదురైతే వారికి సహాయపడమన్నారు. నీటి సమస్యకు చావు పరిష్కారం కాదని తమ శక్తి యుక్తులతోనే సమస్యలను పరిష్కరించుకోమని ఉద్బోధించారు.

**3.4.8. రాజకీయం** - ప్రభుత్వం సంక్షేమం కోసం రాజకీయంగా రిజర్వేషన్ పద్ధతిని ప్రవేశపెట్టింది. ఈ ప్రయోజనాన్ని సవర్ణులు ఉపయోగించుకోదలచి తమ పాలేర్లకు రాజకీయ పదవులు అంటగట్టి అధికారాన్ని చెలాయించారు. నీటిని ఆసరాగా తీసుకొని రచయితలు రచనలు చేశారు. శక్తిలేని హరిజనుడికి సామ్రాజ్య పట్టం కట్టడం వల్ల సమాజంలో వాడి పరిస్థితి దుర్భరదారిద్ర్యంగా వుంటుందని చైతన్యవంతులైన హరిజనులు అధికారం చేపట్టడం ఎంతైనా అవసరం అని భావించారు. సవర్ణులు అధికారం చలాయించినంత కాలం హరిజనుడికి ప్రభుత్వమే నిర్బంధంగా అధికారం అంటగట్టనా ప్రయోజనం వుండదని, దానిలో లాభపడేవాడు సవర్ణుడేనని ఉద్బోధించారు. హరిజనులు రాజకీయ నాయకులై సవర్ణుల చేతిల్లో కీలుబొమ్మల్లా వుండక తోడి హరిజనులకు సాయం చేయమని అన్యాయం చేసిన వారిని అవసరమైతే ప్రతిఘటించమని తోటి హరిజనులకు అన్యాయం జరుగుతూంటే చూస్తూ వుండిపోవద్దని హెచ్చరించారు.

**3.4.9. సంఘసంస్కర్తలు** - హరిజనుల ప్రగతి కోసం అనేక మంది సంఘ సంస్కర్తలు బయలుదేరారు. సంస్కరణవాదులపై సాంప్రదాయవాదులు అనేక చిక్కులు పెట్టి వారిని ఇబ్బందులపాలు చేశారని అలా జరిగినా సంస్కరణ వాదులు వాటిని ఛేదించుకొని ప్రగతి పథంవైపు పయనించాలని రచయితలు వివరించారు. మరో విషయం -ఒక మనిషి ఎదుటివారు చూపే నిరాదరణ వల్ల అవమానాల వల్ల మానసిక ఒత్తిడులకు గురై నీచస్థితికి దిగజారే ప్రమాదం వుందని జీవితంలో మానావమానాలు మనిషి అంతరకోణాన్ని పరీక్షిస్తాయి. అందువల్ల మనిషి ఎన్ని ఇబ్బందులకు గురైనా అడ్డదారులు త్రొక్కవద్దని ఎదుటి మనిషి కూడా తోటి వ్యక్తితో ఆత్మీయభావాన్ని కలిగి వుండాలని, వ్యక్తి ఆలోచనల్లో సంస్కరణ భావాలు లేనప్పుడు. ఎదుటి వ్యక్తి అతనిపై సంస్కరణ భావాలని రుద్దడానికి ప్రయత్నిస్తే ప్రయోజనం శూన్యమని అవసరమైతే అది తీవ్ర పరిణామాలకు దారితీస్తుందన్నారు. సమాజంలో నిస్వార్థ సేవాభావం వున్న వ్యక్తే సమాజం చేత గౌరవించబడుతాడని దళారి వ్యవస్థలో బ్రతికే వాళ్ళకు స్వార్థం తప్ప అభిమానం ఏ కోశాన వుండదని, అలాంటి దళారీల మాయమాటలు విని హరిజనులు మోసపోవద్దని ఈ కథలు వివరించాయి. కులం పట్టింపులు లేకుండా హరిజనుడితో లేచిపోయిన స్త్రీలు ఇబ్బందులకు గురైనా నిలబడి ధైర్యంగా ఎదిరించి అనుకున్న లక్ష్యాన్ని సాధించినప్పుడే వారి గౌరవం వుంటుందని నేడు సమాజంలో సంఘ సంస్కర్తలకు విలువ లేదని ఒక సంఘ సంస్కర్త చేయలేని మేలును ఒక అధికారి తన అధికారంతో చేయగలుగుతున్నాడని చాటి చెప్పారు.

**3.4.10. కలహాలు** - హరిజనులలో కులాలున్నాయి. వారందరూ సమానంగా సవర్ణులకు అస్పృశ్యులుగా వున్నారు. అయినా వారిలో ఎవరి కులం గొప్ప అనే విషయానికొస్తే వారిలో వారే ఘర్షణకు దిగుతారు. తమ కులాలు వేరైనా అందరూ ఏకమై అస్పృశ్యతా పీడన నుండి విముక్తి కావాలని రచయితలు తలచారు. అంతేగాక ఎవరి సహాయం లేకుండా తమ బ్రతుకులను సాగిస్తున్నా హరిజనులు అంతఃకలహాలకు గురై సవర్ణుల చేత హీనంగా చూడబడవద్దని సమస్యల సాధనలో చెడు మాటలు వినకుండా మంచిదారిలో పయనించి తమ సమస్యలను పరిష్కరించుకోమన్నారు. తెలియని ఆలోచనలతో సవర్ణులు చెప్పిన పనులన్న చేసి అంతఃఘర్షణలకు గురిగాక స్వతంత్ర ఆలోచనలతో మనుగడ సాగించమని సమస్యలను ఐక్యంగా ఎదుర్కోమని హరిజనులకు రచయితలు వివరించారు. అంతేగాక కులం పేరుతో మతం పేరుతో ఒకరినొకరు దూషించుకొంటూ పరస్పరం అంతం చేసుకోవడానికి ప్రయత్నించక ఐక్యంగా సామాజిక జీవనం గడపడానికి ప్రయత్నించమని ఇద్దరు పోట్లాడితే మూడవ వాడికి లాభం అనే విధంగా హరిజనులు పోట్లాడుకొని సవర్ణుల వద్దకు తీర్పుకోసం వెళ్లవద్దని, వెళ్లితే అవమానం ధన నష్టం తప్ప అన్యం వుండదని హెచ్చరించారు.

**3.4.11. సమానత్వం** - సవర్ణుల మదిలో అస్పృశ్యులు అనే భావన పోనంతవరకూ హరిజనులు ఆర్థికంగా అభివృద్ధి చెందనంతవరకూ సమానత్వం రాదని, రచయితలు స్పష్టం చేశారు. సమానత్వం సాధించే ధోరణిలో ఎంతటి గొప్పవాడైనా తమ ప్రాథమిక స్థాయిని, గుర్తించుకోవాలని ఇది లేనిదే అసమానత్వం నిలువదని హెచ్చరించారు. సుఖాలన్నవి కేవలం ధనవంతులకే పరిమితం కాదని వాటిని అనుభవించడానికి అట్టడుగు వర్గాల వారికి కూడా యోగ్యత వుండదని, నిత్యం కష్టపడే హరిజనులు అప్పుడప్పుడు సుఖాన్ని కూడా చవి చూడమన్నారు.

## అధస్సూచికలు

1. అయ్యో పాపం - గొట్టుముక్కుల మంగాయమ్మ భారతి 1935 పుట 15
2. అయ్యో పాపం - గొట్టుముక్కుల మంగాయమ్మ భారతి 1935 పుట 16
3. అయ్యో పాపం - గొట్టుముక్కుల మంగాయమ్మ భారతి 1935 పుట 16
4. సూర్యుడు తలెత్తాడు - కె. ఇనాక్ పుట 202
5. సూర్యుడు తలెత్తాడు - కె. ఇనాక్ పుట 138
6. ఎచ్చరిక - బోయ జంగయ్య పుట 29
7. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి చిన్న కథలు - సమగ్ర సమీక్ష - కనక ప్రవాసి పుట 209
8. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి చిన్న కథలు - సమగ్ర సమీక్ష - కనక ప్రవాసి పుట 209
9. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి చిన్న కథలు - సమగ్ర సమీక్ష - కనక ప్రవాసి పుట 210
10. నిరంజన శాస్త్రి - రాయ సంవేంకట శివుడు పుట
11. యీరమ్మ - అరవవేంకటస్వామి గృహలక్ష్మి నవంబర్ 1932 పుట
12. యీరమ్మ - అరవవేంకటస్వామి గృహలక్ష్మి నవంబర్ 1932 పుట
13. గుక్కెడు నీళ్లు - బందా కనకలింగేశ్వర రావు భారతి మే 1932 పుట
14. సంసార సాగరం - కాళూరి వేంకట రామారావు ఆంధ్రప్రదేశ్ ఉగాది సంచిక 1932 - 33 పుట
15. సంసార సాగరం - కాళూరి వేంకట రామారావు ఆంధ్రప్రదేశ్ ఉగాది సంచిక 1932 - 33 పుట
16. అంటరాని బాలిక - కనుకుర్తి రామకోటయ్య చౌదరి గృహలక్ష్మి పుట 31
17. కరుణ కుమార కథలు - కరుణ కుమార పుట 11
18. ఇరవై యారేళ్ల తెలుగు కథానిక - సామాజిక జీవితం (1910 - 35) జి. ప్రభాకర్ పుట 221
19. కరుణ కుమార కథలు - కరుణ కుమార పుట 49
20. దశాబ్ది ( 1936-45)కథానికలు - సామాజిక జీవితం - ఎస్. నారాయణ స్వామి పుట 228
21. ధర్మతల్లి - చుండూరు రమాదేవి
22. కోటిగాడు స్వతంత్రుడు - పులికంటి కృష్ణారెడ్డి పుట 17
23. కోటిగాడు స్వతంత్రుడు - పులి కంటి కృష్ణారెడ్డి పుట 99
24. ముత్తడు గొప్పోడు - పులికంటి కృష్ణారెడ్డి ఆంధ్రజ్యోతి వారపత్రిక 11-3-83పుట 51
25. కథాస్రవంతి రెండవ సంపుటం - పి.లక్ష్మీనారాయణ పుట 90
26. డా.బాబాసాహెబ్ అంబేద్కర్ రచనలు ప్రసంగాలు (7వ సంపుటం) - సి.నారాయణరెడ్డి పుట 298
27. అగ్నిగుండం - కాలువ మల్లయ్య అభ్యుదయ మార్చి ఏప్రిల్ 1991 పుట 16
28. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి చిన్న కథలు - సమగ్ర సమీక్ష - కనక ప్రవాసి పుట 95

29. గుండె చప్పుళ్లు - చిత్తూరి కోటేశ్వర రావు పుట 121
30. తల్లి మట్టి - స్వామి ఉదయం వారపత్రిక జనవరి 26, 1990 పుట 58
31. తల్లి మట్టి - స్వామి ఉదయం వారపత్రిక జనవరి 26, 1990 పుట 59
32. తల్లి మట్టి - స్వామి ఉదయం వారపత్రిక జనవరి 26, 1990 పుట 60
33. తల్లి మట్టి - స్వామి ఉదయం వారపత్రిక జనవరి 26, 1990 పుట 62
34. తల్లి మట్టి - స్వామి ఉదయం వారపత్రిక జనవరి 26, 1990 పుట 62
35. తల్లి మట్టి - స్వామి ఉదయం వారపత్రిక జనవరి 26, 1990 పుట 62
36. పాకీది - అనిశెట్టి సుబ్బారావు భారతి మే 1943 పుట.
37. పాకీది - అనిశెట్టి సుబ్బారావు భారతి మే 1943 పుట.
38. పాకీది - అనిశెట్టి సుబ్బారావు భారతి మే 1943 పుట.
39. కరుణ కుమార కథలు - కరుణ కుమార పుట 62
40. కోటిగాడు స్వతంత్రుడు - పులికంటి కృష్ణారెడ్డి పుట 138
41. ఊరుమ్మడి బ్రతుకులు - సి. యస్. రావు పుట 103
42. పాపం కుంటేలు గాడు - పులికంటి కృష్ణారెడ్డి ఆంధ్ర భూమి వారపత్రిక ఆగష్టు 4, 1983 పుట 26
43. దశాబ్ది (1936 - 45) కథానికలు - సామాజిక జీవితం - ఎస్. నారాయణ స్వామి పుట 262
44. జప్తు - కెతువిశ్వనాధ రెడ్డి పుట 104
45. కేతు విశ్వనాధ రెడ్డి కథలు - కేతు విశ్వనాధ రెడ్డి పుట 3
46. కేతు విశ్వనాధ రెడ్డి కథలు - కేతు విశ్వనాధ రెడ్డి పుట 4
47. కేతు విశ్వనాధ రెడ్డి కథలు - కేతు విశ్వనాధ రెడ్డి పుట 92
48. మల్లమ్మ ఉసురు - పులికంటి కృష్ణారెడ్డి ఆంధ్రప్రభ వారపత్రిక అక్టోబర్ 24, 1984 పుట 55
49. మల్లమ్మ ఉసురు - పులికంటి కృష్ణారెడ్డి ఆంధ్రప్రభ వారపత్రిక అక్టోబర్ 24, 1984 పుట 56
50. పొద్దు కుంకింది - పులికంటి కృష్ణారెడ్డి యువపత్రిక ... పుట 145
51. హరిజనాభ్యుదయం - తెలుగు నాటకం వి.పోతన్న పుట 177
52. డి.రోడ్- కేశవరెడ్డి భారతి ఆగస్టు 1971 పుట 43
53. కొమ్ములు - పులికంటి కృష్ణారెడ్డి ఆంధ్రప్రభ వారపత్రిక ఏప్రిల్ 1,1987 పుట18
54. ఆ రాత్రి - చలం పుట.
55. చలంగారి కథానికా సాహిత్యం అనుశీలనము - వావిలాల సుబ్బారావు పుట 590
56. చలంగారి కథానికా సాహిత్యం అనుశీలనము - వావిలాల సుబ్బారావు పుట 129
57. బ్రాహ్మణీకం నుంచి బ్రాహ్మణికంలోకి -4 ఖాదర్ మొహిద్దీన్ ఆంధ్రజ్యోతి వారపత్రిక జూలై 8, 1994 పుట 7
58. అంతా వక్రీకరించడమే - శివలెంక రాజేశ్వరీ దేవి ఆంధ్రజ్యోతి వారపత్రిక 5-8-94 పుట 14
59. సంయమనంతో చలాన్ని అంచనా వేయాలి - కాంతి ఆంధ్రజ్యోతి వారపత్రిక 12-8-94 పుట 23
60. ఉస్తి - కవికొండల వెంకటరావు భారతి జనవరి, 1971 పుట

61. జీవనాడులు - శాంతినారాయణ ఉదయం ఆదివారం ప్రత్యేకం జూన్ 2, 1991 పుట 10
62. జీవనాడులు - శాంతినారాయణ ఉదయం ఆదివారం ప్రత్యేకం జూన్ 2, 1991పుట 10
63. జీవనాడులు - శాంతినారాయణ ఉదయం ఆదివారం ప్రత్యేకం జూన్ 2, 1991పుట 10
64. జీవనాడులు - శాంతినారాయణ ఉదయం ఆదివారం ప్రత్యేకం జూన్ 2, 1991పుట 10
65. తొందరపడి ఒక కోడి ముందే కూసింది - ఆరవేటి శ్రీనివాసులు ఆంధ్రప్రభ వారపత్రిక జనవరి 17, 1990 పుట 75
66. మకరముఖం - సింగమనేని నారాయణ ఇండియాటుడే వార్షిక సాహిత్య సంచిక 1995 పుట 62
67. తొలి నాటి తెలుగు కథలు - మధురాంతకం రాజారాం పుట 44
68. తొలి నాటి తెలుగు కథలు - మధురాంతకం రాజారాం పుట 45
69. హరిజనాభ్యుదయం - తెలుగు నాటకం - వి.పోతన్న పుట 186
70. మలుపు - ఆరుణ తార ప్రజాసాహితి జూన్ 1981 పుట 20
71. ఇంకానా ఇకపై సాగదు (దళిత కథలు) - భార్గవీరావు పుట 21
72. ఇంకానా ఇకపై సాగదు (దళిత కథలు) - భార్గవీరావు పుట 104
73. హరిజనాభ్యుదయం - తెలుగు నాటకం - విపోతున్న పుట 187
74. ఇంకానా ఇకపై సాగవు (దళిత కథలు) - భార్గవీరావు పుట 63
75. పరిధులూ - ప్రమేయాలూ - దగ్గు మాట పద్మాకర్ - ఆంధ్రజ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక 1994 పుట
76. చలంగారి కథానికా సాహిత్యం - అనుశీలనం - వావిలాల సుబ్బారావు పుట 599
77. బ్రాహ్మణీకం నుంచి బ్రాహ్మణీకం లోకి - 5 - ఖదర్ మొహిద్దీన్ ఆంధ్రజ్యోతి వారపత్రిక 15-7-94 పుట 14
78. ఇంకానా ఇకపై సాగదు (దళిత కథలు)- భార్గవీరావు పుట 15
79. ఇంకానా ఇకపై సాగదు (దళిత కథలు)- భార్గవీరావు పుట 46
80. ఇంకానా ఇకపై సాగదు (దళిత కథలు)- భార్గవీరావు పుట 46
81. ఇంకానా ఇకపై సాగదు (దళిత కథలు)- భార్గవరావు పుట 132
82. చలంగారి కథానికా సాహిత్యం - అనుశీలనం - వావిలాల సుబ్బారావు పుట 511
83. యజ్ఞంతో తొమ్మిది - కాళీ పట్నం రామారావు పుట 35
84. కోటిగాడు స్వతంత్ర్యుడు - పులికంటి కృష్ణారెడ్డి పుట 76
85. పాపం కుంటేలుగాడు - పులికంటి కృష్ణారెడ్డి ఆంధ్రభూమి వారపత్రిక 4-8-83 పుట 27
86. జూదం (కథలు సంపుటి) - సింగమనేని నారాయణ పుట 38
87. ఇంకానా ఇకపై సాగదు - భార్గవీ రావు పుట 112.

# 4. తెలుగు కథానిక-హరిజన దృక్పథం

మనిషి జీవితానికి నాగరికత అవసరం. ప్రతి మనిషి తాను నివసించే పరిసరాలు చేత ప్రభావితుడవుతాడు. తనకు తెలియని అనేక విషయాలను సమాజంనుండి తెలుసుకొంటాడు. తమ జీవితాన్ని కొనసాగించడంకోసం అనేక సాంప్రదాయాలను ఆచారాలాను అడ్డంగా పెట్టుకొంటాడు. తన సంసారం సజావుగా జరుగడానికి అనేక కొత్త ప్రయోగాలను చేస్తున్నాడు. అవసరమైతే అప్పుడప్పుడు తన పద్ధతులను మార్చుకోగలుగుతున్నాడు. సమాజం పరిణామం చెందేకొద్దీమానవుని జీవన పద్ధతులు. ఆచారవ్యవహారాలు, కట్టుబాట్లు మారుతున్నాయి. చరిత్రనే తిరగరాయాలనే పరిస్థితి నేడు నెలకొనిఉంది. అయినా హిందుసమాజంలో ఒకభాగమైన హరిజనులు మాత్రం అభివృద్ధి నోచుకొనలేడు. వారి జీవితాలు మాత్రం యధాస్థితిలోనే కొనసాగుతున్నాయి. తెలుగుకథానికా సాహిత్యం ద్వారా వారి జీవితాలను పరిశీలిద్దాం

**4.1 సంప్రదాయదృక్పథం:**

కొన్నివేల సంవత్సరాలుగా ఆర్య మనుధర్మ సాంప్రదాయాలను అనుసరిస్తూ సవర్ణులనే ఆశ్రయించనకొని వారిపైనే ఆధారపడుతున్న కోట్లాదిమంది హరిజనులు అంటుదోషంపేరుతో అణగారిపోతున్నారు. కులవృత్తుల్ని గౌరవిస్తూ జంతుమాంసాన్ని భక్షిస్తూ, ఊరికి దూరంగా మురికివాడల్లో నివసిస్తున్నారు. దేశ ద్రిమ్మరులుగా తిరుగుతున్నారు. కాలం మారి వృత్తులను వదలినా వారి జీవితాలు మాత్రం మారలేదు. సాంప్రదాయిక జీవితాన్ని ప్రతిబింబించే కధానికలను పరిశీలిద్దాం.

**4.1.1. దౌష్యం :** హరిజనులమీద సవర్ణులుదౌష్ట్యం చూపబడే కథలు కొన్ని ఉన్నాయి. 'కొత్తచెప్పులు' కథలో సమాజంలో హరిజనస్త్రీలపై సవర్ణులుచేసే అఘాయిత్యాలుస్పష్టంగా కన్పిస్తాయి. చెప్పులు కుట్టితీసుకురావడంలో ఆలస్యమైనందుకు చిన్నపరెడ్డి నరిసిని చావమోదాడు. తత్ఫలితంగా నరిసికొడుకు కూతురు దిక్కులేనివాళ్ళయ్యారు. నరిసిని హత్యచేసినందుకు చిన్నపరెడ్డి మోతుబరితుం పోలీసునోళ్ళను నోట్లతో మూయించగలిగింది కాని, కొత్తచెప్పల ప్రతీకార జ్వాల ఆపలేకపోయింది. చెప్పులు తొడుక్కొన్న రెడ్డి కాలుకు పుండుపడి పెద్దదికావడం అతని అన్యాయానికి దేవుడు వేసిన శిక్ష. నరిసి కలలో కనపడి అతనిని తీవ్ర మనోవ్యాధికి గురిచేసి చంపివేస్తుంది. నరిసిహత్యకుగురైతే తోటి హరిజనులు అన్యాయమని అనలేకపోయారు. అలా అనే వ్యక్తిత్వం, వారికి లేదు వాళ్ల చేతిలో పని చిన్నపరెడ్డి ఎద్దుచనిపోతే తీసుకవెళ్ళ లేదు. ప్రతి మానవుడికి మానవత్వం అవసరం అది తోడి మనిషిని సమాజంలోమనిషిగా గుర్తించి గౌరవించడానికి ప్రయత్నిస్తుంది.

సంస్కరణం కథలో బూజుపట్టిన సమాజానికి సంస్కర్త అవసరమని అతనిచే సమాజం మార్పబడుతుందని సంఘ సంస్కర్త సమాజంకోసం ఏమి చేసినా ప్రజలు దానిని గౌరవించాలనే సూచన వుంది. ఆయన కులంతో వ్యక్తిత్వంతో సంబంధం పెట్టుకోరాదు. అది ప్రగతికి అడ్డుకట్ట కథలో ప్రభాకర్‌జీ సంఘ సంస్కర్త. అతను హరిజనుడైనందువల్ల కందుకూరి వీరేశలింగం విగ్రహానికి పూలమాల వేస్తే దానిని తిరస్కరించారు. సమాజశ్రేయస్సు కోరే మనిషిని తిరస్కరించడం ఈ కథలో కన్పిస్తుంది.

**4.1.2. సమానత్వం :** 'పుల్లంరాజు₂'అనే కథలో రచయిత హరిజనుల్లోవున్న భేదాభిప్రాయాలను వేలెత్తి చూపడం కన్పిస్తుంది. రాజు తన రాజ్యంలో వున్న అస్పృశ్యతను నివారించే ప్రయత్నంలో మొదటిదశగా రాజ్యంలో నున్న హరిజనుల్లో మాల మాదిగలను కులభేదం లేకుండా కలుసుకోమంటాడు. ఆ తర్వాతనే సవర్ణులతో సమానంగా వుండమని సలహా ఇచ్చాడు. మానవుని అంతర్గత విభేదాలే సమానత్వానికి అడ్డుగోడలుగా నిలిచాయనడం కన్పిస్తుంది. కథలో రాజు చేసిన ప్రయత్నానికి ఆదిలోనే గండిపడింది మాలలు, మాది గలను తమకన్నా తక్కువ అనే విషయాన్ని లేవనెత్తడం తత్ఫలితంగా వారిద్దరూ ఘర్షణకు దిగడం కన్పిస్తుంది .

కథలో రాజు చేసిన ప్రయత్నం బలంగా లేదు. ఏకులంలో ఘర్షణలు లేవు? ఏమతంలో పోట్లాటలు లేవు? వారు కడుదూరమై బానిసలుగా బ్రతకడానికే ఈ ప్రయత్నమని చెప్పవచ్చు. ఒకప్పుడు హరిజనులను బలంతో దూరంగా వుంచిన సవర్ణులు మరొకప్పుడు వారిని మాయమాటలతో మప్పపెట్టి దూరంగా వుంచడానికి ప్రయత్నించారు. ఆ ప్రయత్నంలో భాగమే ఈ కథ.

'అప్పావుపిళ్ళ ఆత్మఘోష' కథలో కాలంతో పాటు సామాజిక పరిస్థితులు మారినా హరిజనుల పరిస్థితి మాత్రం మారలేదని చెప్పటం గమనార్హం. హరిజనులు ఇంకా సవర్ణుల ఇళ్ళకు బడికి దూరంగానే జీవించాల్సిన స్థితి ఉంది. సాటిమనిషిగా సమాజం గుర్తించలేక పోతూఉంది. కథలో హరిజన విద్యార్థి వెంకటయ్య తన గురువుకు శుభాకాంక్షలు తెలియజేయడానికి ఇంటికెళ్ళితే అప్పటికే అక్కడున్న సవర్ణ విద్యార్థులను చూసి ధైర్యంగా గురువు ఇంట్లోకి పోలేకపోయాడు. అలాగని గురువు కూడా బయటకురాలేకపోయాడు. వారిద్దరి మనసత్వాలు చైతన్యంవైపే పయనించినా సమాజం వారికాళ్ళకు అస్పృశ్యత అనే బంధాన్నివేసింది. వాటికి వేసిన సంకెళ్ళు దాటరానివయ్యాయి. శాస్త్రీయవిజ్ఞానం అభివృద్ధి చెందినా సనాతన ఆచారాలను సమాజం ఇంకా పాటిస్తుండటంవల్ల హరిజనులకోసం టీకొట్టులో నేటికీ వ్రేలాడదీసిన గ్లాసు కన్పిస్తుంది. వారిపాలిట అస్పృశ్యత శాపంగా మారింది.

**4.1.3. అసమానతలు** : సమాజంలో అసమానతలు ఎంతకఠినంగా పాటింపబడుతున్నాయో కొన్ని కథానికల్లో ప్రస్ఫుటంగా వ్యక్తమవుతుంది. మాలా-మనిషికథలో సమాజంలో వర్ణాన్ని బట్టి వారిస్వేచ్ఛ కన్పిస్తుందని ప్రతిభ పలిస్తుందని సమాజంలో సవర్ణులు హరిజన స్త్రీలకు ఏ హానినైనా తలపెట్టవచ్చునని భావించేస్థితి ఉంది. అది వారికి చట్టం కల్పించని స్వాతంత్ర్యం. అదే సవర్ణ స్త్రీని హరిజనులు ప్రేమిస్తే ఆ ప్రేమ ప్రతిఫలించదు సరికదా, అవాంతరాలు ఎదురవుతాయి. అవసరమైతే అతనిని అంతం చేయడానికి కూడా ప్రయత్నిస్తారు. ఇది సమాజ సాంఘిక న్యాయం. కథలో సవర్ణయువతి సీతను హరిజన మల్లి గాడు ప్రేమించి పెళ్ళి చేసుకోవడానికి ప్రయత్నిస్తే సవర్ణులు అతనిని హత మార్చడానికి ప్రయత్నిండం సీత ఇంటికి ఏకంగా నిప్పుపెట్టడం కన్పిస్తుంది. వర్ణ వ్యవస్థపేరుతో రెండు నిండు ప్రాణాలను బలి చేయడం కన్పిస్తుంది. మల్లిగాడు తన జాతికి జరిగిన అన్యాయాన్ని తెలుసుకొని మాలపల్లెను, గ్రామాన్ని వేరు చేసే రైలు దారి దగ్గర కొచ్చి మాలపల్లె వైపు చూస్తు ''ఒరేయ్ మాలల్లారా అక్కడెందుకు రా పడినిద్దుర పోతారూ ఇవతలికి రండిరా వీరు మాలోళ్ళయితే మాత్రమేరా? మీరూ మనుషులేరా ---''1 అని అంటూ వచ్చేరైలు క్రిందపడి చనిపోవడం కన్పిస్తుంది. మనిషిని ఒక్కోసారి విధికూడా వంచిస్తుందని చెప్పడానికి ఈ కథ కారణం.

**4.1.4 సమైక్యనిర్మూలన** : అసమానతలలో భాగంగా మాలమాదిగలమధ్య సమైక్యభావాన్ని ప్రతిపాదించే ప్రయత్నం కన్పిస్తుంది. హరిజనులలోని రెండు వర్గాలైన మాల, మాదిగలు పరస్పరం తక్కువగా భావించుకోవడం సనాతన సంప్రదాయంగా ఉంది. అయినా వారిమధ్య చిన్న విషయాలను పరిష్కరించుకొని సమానత్వాన్ని సాధించుకోవడానికి ప్రయత్నిస్తే వారి ఐక్యాన్ని చూసిన సవర్ణులు సహించకపోవడం నేటిస్థితి. ఎదుటివాడు చైతన్యవంతుడైతే చూసి ఒర్వలేని పరిస్థితి నేటి సమాజానిది. 'కొమ్ములు' కథలో హరిజనులంతా ఏకమయినారని తెలిసిన కొండారెడ్డి తనస్వార్థంకోసం ఈర్షపడి దేవునిపేరుతో జాతర సృష్టించి వారి మధ్య స్పర్థలు పెట్టించాడు. హరిజనులో న్యాయకత్వలోపంవల్ల సవర్ణులు చెప్పినమాటలు విని వారి చేతులు మీదుగానే వారి జీవితాలను నాశనం చేసుకొన్నారు. వీరి నాశనాన్ని కొండారెడ్డి స్వార్థంగా మలచుకోగలిగాడు. ఆలోచనలేని హరిజనులు అభాసుపాలయ్యారు.

**4.1.5. ఆరోగ్యం** : హరిజనులు అనారోగ్యంతో బాధపడుతూ, బాధపెట్టబడుతూ జీవించడం కథల్లో

కన్పిస్తుంది. ఆరోగ్యమే మహాభాగ్యం అని పెద్దలన్నారు. సమాజంలో కొందరికి ఆరోగ్యం ప్రధాన మైతే, మరికొందరికి శత్రువుగా పరిణ మిస్తుందని తెలపటం ఉంది. కులం పేరుతో మనిషిని దూరంగా వుంచడం కన్పిస్తుంది. 'యీరమ్మ' కథలో హరిజన యువతి యీరమ్మ అనారోగ్యానికి గురైతే రోగాన్ని నయం చేసుకోవడానికి కులం అడ్డు వచ్చింది. తత్ఫలితంగా ఆమె, ఆమె తండ్రి వెంకడు, పూజారి గురవయ్య మందు ఇవ్వక మానసిక క్షోభను అనుభవించారే తప్ప అన్యధా ప్రవర్తించిమందును. సాధించలేకపోయారు. మందు ఇవ్వడానికి నిరాకరించిన గురవయ్య '' ఛీనీమొహంయీయాడ్ని నా మడి మంట గలిపిన మాలకుంకవి నీకు మందు, మాకు యిస్తానా? పో అవతలికి ''2 అని దూషించాడు. అస్పృశ్యులు వైద్యంకోసం ప్రయత్నించి ప్రాణాలను కోల్పోతుంటే అంటుపేరుతో వారికి వైద్యం చేయని బ్రాహ్మణులుంటారనడానికి ఈ కథ తార్కాణం. ఒకనాడు అవసరం కోసం సృష్టించిన కుల వ్యవస్థ నేడు ప్రాణాలనే బలికొంటున్నా సమాజం ఆలోచించలేదు. నాగరిక సమాజంలో ఇలాంటి అనాగరికతలు పోయిననాడే సమాజం చైతన్యవంతమవుతుంది.

**4.1.6. ధన ప్రాబల్యం :** డబ్బు లేకపోడం హరిజనుల్ని ఎంతగా బలహీన పరుస్తుందో చూపే కథను పరిశీలించాలి. 'అంటరాని బాలిక' కథలో ఎదుటి మనిషిని గౌరవించడంలోనే తన మర్యాద బయటపడుతుందని, దానికి ఆర్థికస్థితి తోడైతే మనిషిగర్వంగా తయారయ్యే ప్రమాదం కన్పిస్తుందనే హెచ్చరిక ఉంది. కథలో జ్ఞాను ఇంట్లో పనిమనిషిగా చేరిన రూప తన కులం కారణంగా వెలికి గురైంది. జీవితంలో క్షణ క్షణం అవమానంతో మానసికవ్యధతో ఆత్మాభిమానాన్ని చంపుకొని బ్రతికింది. జ్ఞాను ఇంట్లో దాసిగా పనిచేసినప్పటికీ వారి అభిమానాన్ని చూరగొనలేకపోయింది. ఒకప్పుడు రూపను కులంపేరుతో దూషించిన జ్ఞాను తల్లి అనారోగ్యానికి గురైతే రూప పూర్వస్థితిని మరచిపోయి ఆమెకు పరిచర్యలు చేసింది. ఆ ప్రయత్నంలో తన ప్రాణాలను పోగొట్టుకుంది. తాను ప్రేమించిన వాడిని పెళ్ళి చేసుకోవడంలో విఫలమయింది. డబ్బు, కులంకన్నా గుణం గొప్పదని నిరూపించింది. జ్ఞాను కుటుంబాన్ని గర్వం నుండి వెలికితీసింది.

**4.1.6.1. అవమానుషం :** హరిజనుల్ని ఆర్థిక ఇబ్బందుల్లో మనుష్యులుగా చూడకుండా బాధించడం వ్యక్తం చేసిన కథలున్నాయి. ''కొత్తజోడు'' కథలో అప్పు అప్పుడే ముప్పు అనీ వడ్డీల పేరుతో సవర్ణులు హరిజనులను మోసంచేయడం సనాతన ఆచారాలలో ఒకటనీ మనిషి తన అవసరాలను తీర్చుకోవడంకోసం ఆర్థికస్థితి అవసరమని కథ హెచ్చరిస్తుంది. తన అవసరాలకోసం వెంకన్న భీమయ్య వద్ద అప్పు చేశాడు. పరిస్థితుల ప్రభావంవల్ల సకాలంలో భీమయ్య అప్పు తీర్చలేక పోయాడు. అప్పును రాబట్టడంలో సకలవిద్యలు తెలిసిన భీమయ్య వెంకన్న అప్పును రాబట్టడంకోసం ప్రయత్నించాడు. ఆ పథకం నుండి వెంకన్న అచ్యుతరావు సహాయంతో తాత్కాలికంగా తప్పించుకోగలిగాడు. కథలో వడ్డీ వ్యాపారస్థుల స్వభావం కన్పిస్తుంది. వారికి మానవత్వం వుండదని. ఋణ గ్రస్తరక్తాన్ని జలగలాగా పీల్చడానికి ప్రయత్నిస్తారని విశదమవుతుంది.

**4.1.7. దౌర్జన్యం :** హరిజనులను అణగద్రొక్కడం కొన్ని కథల్లో కన్పిస్తుంది. వీరు దౌర్జన్యానికి గురిచేయడం ప్రతిపాదించిన కథ. 'కయ్యకాలువ' కథలో తరాలుగా బడుగు వర్గాలపై భూస్వాములు చేసిన దౌర్జన్యాలకు ప్రతీక కథ. వీరిపట్ల కేవలం భూస్వాములేగాక ఇటు ప్రభుత్వాధికారులు కూడా చిన్న చూపు చూడటం కన్పిస్తుంది. అధికార యంత్రాంగంలో వ్యాపించిన లంచగొండితనం, మితిమీరిన అవినీతి, అంతేగాకుండా, లక్ష్మమ్మలాంటి సవర్ణులు కొండడిలాంటి హరిజనులను సామాజికంగా ఎలా అణే ద్రొక్కడానికి ప్రయత్నిస్తారో రచయిత తెలియజేశాడు. భూస్వాముల మనఃస్థితిని వారు ఎదుటివాడిని పీడించే ధోరణి ఈ కథలో స్పష్టంగా కన్పిస్తుంది. అంతేగాక కొండడిలాంటి వాళ్ళు ఎన్ని కష్టాలెదురైనా ఎన్ని అవమానాలు వచ్చినా ఎలా భరించగలిగి తమ బ్రతుకును ఎలా నెట్టుకోగలుగుతారో కూడా ఈ కథలో విశదమవుతుంది.

**4.1.7.1. అసహాయం :** హరిజనులకు సహాయం చేయక సహకారం అందివ్వక బాధించే స్వభావం తెలిపే కథ. ''చెప్పులు కుట్టేవాడు'' కథలో చెప్పులు కుట్టేవాళ్ళు తినడానికి తిండికోసం కుటుంబ సభ్యులందరూ కష్టపడినా వారి ఆకలితీరదు. వారి జీవితాలు దుర్భరంగా ఉంటాయి. దానికి తోడు వారు సమాజం చేత చిన్నచూపుకు గురవ్వడం కన్పిస్తుంది. కష్టపడి ఒక చెప్పుల షాపు పెట్టుకోవాలనే అతని ఆలోచన తీరలేదు సరికదా, తనకుటుంబమే కష్టాలపాలయ్యింది.

''ముప్పై రూపాయల పెట్టుబడితో చెప్పులకొట్టుపెట్టుకోవాలనే జీవితాశయం తీరని బ్రతుకు వాళ్లది. తల్లి తర్వాత కూతురు ఆపిదప మరొకరు దుమ్ములో కలసి పోవలసిన జీవితాలు వారివి. ఈ దైన్య జీవితాల హృదయ ఘోష ప్రతిఫలించడంలో గోపీచంద్ ప్రతిపాదించే మానవతావాదం స్పష్టమవుతుంది.''3

**4.1.7.2. దౌర్బల్యం :** దుర్భర జీవితం చుట్టుకొన్న హరిజనులు బలవంతులు కావాలంటే సహాయం ఉండాలని తెలిపే కథ. ''తల్లి-మట్టి'' కథలో సగటుమనుషులు గిరిగీసుకొని బ్రతుకుతారని వారికి సమాజంతో అవసరం, ఆసక్తి వుండదని, ఉన్నతవిలువలు సాధించాలనే ఆరాటాలు తప్ప ఆత్మాభిమానం వుండదని తెలిసివస్తుంది. కథలో శ్రీనివాసులు విద్యావంతుడు. ఉద్యోగి అయివుండి కూడా తన కులాన్ని గురించి చెప్పుకోవడానికి సంకోచించాడు. తన కులాన్ని దాచుకోవడం కోసం గొప్పలు చెప్పాడు. ఒకసారి కథకుడితోపాటు పెళ్ళి చూపులకెళ్లిన శ్రీనివాసులు దూరంనుంచే పెళ్ళి కూతురు ఇళ్లను చూసి ''చూసి, చూసి ఇలాంటి ఇరుకు ఇంట్లో చేసుకోమంటావా? ఛ. ఛ. మన ప్రిస్టేజి ఏంకావాలి బాస్''4 అంటాడు. అతని దృష్టిలో అమ్మాయి సుగుణాలతో అవసరంలేదు, ఆమె ఆర్థికస్థితి అవసరం. అతనితో ఎదుటివాడి కులం తమకులం కన్నా గొప్ప అనే విషయం కన్పిస్తుంది. అతని అత్మన్యూనతా భావమే అతనిని ఎదగనివ్వకుండా చేసింది. తన తండ్రికి తాను హరిజనుడని చెప్పుకొనే ధైర్యంవుంది. కాని కొడుకుది ఆస్థితికాదు. కథలో మనిషిఎంత గొప్పస్థాయిని చేరుకొన్నా తన ప్రాథమిక స్థాయిని మాత్రం గుర్తుంచుకోవాలని రచయిత ఆకాంక్ష.

**4.1.7.3. ఆశావైఫల్యం :** హరిజనులు ఆశలు సఫలం కావు సరికదా, సదావైఫల్యం చెందుతాయని తెలిపే కథలు చాలా వెలువడ్డాయి. ''పాపం కుంటేలుగాడు'' కథలో స్వార్థం అనేది ఒక స్థితిలో ప్రమాదకారి అవుతుందని అవసరమైతే సర్వస్వాన్ని నాశనం చేయడానికి ప్రయత్నిస్తుందని తెలుస్తుంది. కథలో కుంటేలుగాడికి తన కొడుకు సర్వస్వం తల్లితండ్రులు, భార్య గతించినా బాధపడలేదు. అతను తనకొడుకు వరదుడికోసం బ్రతుకుతున్నాడు. వాడిని ధనవంతుడిని చేయాలని తపనపడి డబ్బుసాధించడం కోసం అడ్డదారులు త్రొక్కాడు. తనగుడిసె మంటల పాలైతే ప్రభుత్వం డబ్బు ఇస్తుందనే దురాశతో నిప్పుపెట్టాడు. కన్నకొడుకును మంటలపాలు చేసుకొన్నాడు. 'దురాశ దుఃఖానికి చేటు' అనే చందాన ఎవరికోసమైతే సంపాదించాలని తపన పడ్డాడో వాడే ఆ తపనలో బలయ్యాడు. ఆశకు హద్దు వుండాలి. ఆహద్దుమీరితే పరిస్థితులు తారుమారవుతాయని రచయిత ఉవాచ.

**4.1.8. అమాయక ప్రేమ :** హరిజనులు అమాయకంగా ప్రేమించే గుణంకలవాళ్లని తెలిపే కథలు వెలువడ్డాయి. 'పశువుల కొటం' కథలో తనకంటె ఒక మెట్టు క్రింద నున్న వర్గాన్ని పైవాడు ఆధిపత్యతం చెలాయించడం పరిపాటి అనీ బడుగువర్గాల యువతీ యువకులు ప్రేమించుకుని పెళ్లి చేసుకోవాలని ప్రయత్నిస్తే కామాంధులైన భూస్వాములు వారి ప్రేమను భగ్నం చేస్తారని తెలుపుతుంది. రుబ్బడు, పెంచెలి ప్రేమించుకుని ఒకటి కావడానికి ప్రయత్నిస్తే తన కామదాహార్తి తీర్చలేదనే కోపంతో రాయుడు పెంచెలిపై కక్ష సాధింపుధోరణిని తలపెట్టాడు. తనజీతగాడు సుబ్బడితో, రుబ్బడికి అబద్ధాలు చెప్పమని సలహా ఇచ్చాడు. ఆ అబద్ధాలే వారిని వేరుపరచాయి. తాను ప్రేమించిన పెంచెలి మనస్తత్వం అర్థంచేసుకోలేని రుబ్బడు

చెప్పుడుమాటలు గుడ్డిగా నమ్మి ''మిండగాళ్ళని మరిగిన లంజా, నన్ను మోసంమీద పెళ్ళి చేసుకోవాలని వస్తే తలకాయ పగులకొట్టాలని, కర్రచేత పట్టి ఉంటాడు ఈ రుబ్బడు''5 అని చావమోదాడు. రాయుడు అబద్ధాలవల్ల రుబ్బడి చేత దెబ్బలు తిన్న పెంచెలి పిచ్చిదై చివరకు రాయుడు పశువుల కొట్టం వద్దే చనిపోయింది. వివాహం చేసుకొని నిండునూరేళ్ళు జీవించాల్సిన ఆ జంట రాయుడు కుట్రవల్ల ఒకరు మరణిస్తే మరొకరు తీవ్ర వ్యధకు గురిచెందారు.

**4.1.8.1. విధివంచన :** హరిజనులు సవర్ణుల చేతనే కాదు, విధి చేతిలోకూడా వంచితులవుతారని తెలిపే కథలుకొన్ని ఉన్నాయి. 'మాదిగమ్మాయి' కథలో మనిషిపై సమాజ పరిస్థితుల స్వభావం ఖచ్చితంగా పడుతుందని చెప్పడాని ఈ కథ తార్కాణం. హరిజన స్త్రీకి అందం వుంది. ఆహారం లేదు. తిండికోసం ఆమె తల్లితండ్రులు ఆమెను వేశ్యగా మార్చడానికి ప్రయత్నించడం, అమెవారి బారినుండి తప్పించుకొని బయటపడగలిగినా, సమాజంలోని దుష్టశక్తుల చేతిలోనుండి బయట పడలేకపోయింది. ఆ ఊబిలోనే కూరుకొని చివరకు వేశ్యగా మారింది. ఆకలితో వేశ్యగా మారింది. ఆకలితో కడుపులు కాల్చుకోవడంకన్నా ఇతరులను యాచించడంకన్నా వేశ్యగా మారి తన కడుపు నింపుకోవడం మంచిదని ఈ కథ తెలియజేస్తుంది.

**4.1.8.2. మానభంగం :** హరిజనులు ఎంతధర్మంగా జీవించినా జీవించనీయని సమాజ గతిని తెలియజేసేకథలు ఆవిర్భవించాయి. 'పాపానికి జీతం' కథలో సమాజంలో హరిజన స్త్రీ దుస్థితి సవర్ణులు దయాదాక్షిణ్యాలపై వుంటుందని, ఆమెను సవర్ణుడు చేరదీసినా, అభిమానించినా, ఆగ్రహించినా, ఆ ప్రయత్నానికి గురి కాకతప్పదని తెలిసివస్తుంది. కథలో ఒక హరిజనస్త్రీనే సవర్ణుడు మానభంగంచేసిన ఉదంతం కన్పిస్తుంది. యల్లమంద తయారుచేసిన చెప్పులను తనభార్య అరుంధతి దొరకు ఇవ్వడానికి వెళ్ళడం అప్పటికే ఆమెపై కన్నువేసినదొర తన పశువులపాకలో ఆమెశీలాన్ని దోచుకోవడానికి ప్రయత్నించడం. అతని బారినపడిన అరుంధతి ''సీ యదవసచ్చినోడా కొంగుపట్టుకుంటావట్రా -- నిన్నూ -- నిన్ను -- పూనేయిస్తా -- రేపీ పాటికి నీ శవంలేస్తుంది సూడు''6 అంటూ తప్పించుకోవడానికి ప్రయత్నించింది. ఆ ప్రయత్నం సఫలంకాలేక ప్రాణాలను పోగొట్టుకొంది. అంటుపేరుతో హరిజనులను దూరంగా వుంచే సవర్ణులు వారి స్త్రీలను ఎలా ముట్టుకోగలుగుతున్నారు? ఎలావారి ప్రక్కన పడుకోగలుగుతున్నారు? వారి శీలంతో చెలగాటం ఆడే సవర్ణులు చివరకు వారి ప్రాణాలను హరిస్తున్నారు. అయినా స్వేచ్ఛగా తిరగగలుగుతున్నారు. ప్రజలదృష్టిలో గౌరవంగా తమ హోదాను నిలబెట్టుకొంటున్నారు.

**4.1.8.3. ప్రాణహాని :** హరిజనుల ధనమానప్రాణాలు సవర్ణుల దయాధర్మాలపై ఆధారపడి ఉన్నాయని వివరించే కథలు వచ్చాయి. 'పులిగుండు' కథలో తనభార్యను ఉంచుకొన్నందుకు రావుడిని హత్య చేయడానికి నాయుడు బాలిగాడిని సహాయంగా వుంచుకొన్నాడు. వాడు డబ్బుకోసం కక్కుర్తిపడి నాయుడుకు బానిసయ్యాడు. అతను పన్నిన వలలో చిక్కుకొన్నాడు. కష్టాలకడలిలో మునిగిపోయాడు. ఆ కష్టాల నుండి ఏ కెరటం ఒడ్డుకు చేర్చలేకపోయింది. తనమిత్రుడైన రావుడి హత్యకు ధైర్యంగా సాక్ష్యం చెప్పలేకపోయాడు. నాయుడు ఎరగా చూపిన డబ్బు బాలిగాడికి చేరలేదు సరికదా అతనినే మరణావస్థపాలుచేసింది. తనకు ఎలా చావుతప్పదని తెల్సిసిన బాలిగాడు ఎవరూ ఎక్కలేని పులిగుండునెక్కి ''ఒరేనాయుడు ముసలిపీనుగా పెండ్లాన్నీయేలుకోలేని యదవా! ఇంకా ఎందుకురా నీకామీసం? మాటదప్పిన నువ్వేరా తక్కువజాతోడు''7 అని దూషించాడు. నాయుడు తనకు రావుడికి చేసిన అన్యాయాన్ని చెప్పగలిగి అందులోనే ప్రాణాలను పోగొట్టుకొన్నాడు.

**4.1.9. విద్యారాహిత్యం :** హరిజనులకు చదువులేదు-నాడు చెప్పరాదు అనేభావం ప్రతిబింబించే కథలు లేకపోలేదు. 'పాకీది' కథ సమాజంలో చట్టపరంగా అందరూ అన్నిహక్కులను పొందినా అవి కొంతమంది

చేతిలోనే కేంద్రీకృతమయ్యామనడానికి తార్కాణం. మాచికొడుకు కోటి చదువుకోవడం సవర్ణుడైనభాస్కర్‌రావు కొడుకు నాగుతో పరిచయంవంటి చైతన్యవంతమైన పద్ధతులను నేర్చుకొంటే సమాజం అతని అభివృద్ధిని అడ్డుకొంది. కోటి విద్యావంతుడైతే తమ పరువుపోతుందని తలచిన భాస్కర్‌రావు తనకొడుకుతోనూ, బడిపంతులుతోనూ వున్న సంబంధాన్ని త్రెంచివేశాడు. కోటి పినతండ్రి ''ఐనా వాడికి చదువెందుకే పిచ్చిముండా----''8 అని బడి మాన్పించాడు. తనకొడుకు ప్రయోజకుడవుతాడనే తల్లికలలు కలలుగానే మిగిలిపోయాయి. చదువుపై శ్రద్ధవున్న కోటి అందరి ఒత్తిడులకు తలవొగ్గి చదువుకు స్వస్తి చెప్పడం కన్పిస్తుంది.

**4.1.9.1. విద్యావైఫల్యం :** హరిజనుడు ఎంత చదువుకొన్నా, తనచదువును పూర్తిగా సద్వినియోగం చేసుకోలేనిస్థితి ఉందని తెలియజేసేకథలు చాలా ఉన్నాయి. 'మకరముఖం' కథ సవర్ణులు తోడిహరిజనుడిని నీవు హరిజనుడవు, అంటరానివాడవు, తక్కువ వాడివి అనేమాటలు చెప్పడంవల్ల అతను ఇంకా ఆత్మన్యూనతాభావానికి గురయ్యే ప్రమాదం వుందని హెచ్చరించింది. కథలో కథకుడు కష్టపడి ఉద్యోగం సంపాదిస్తే సమాజం అతనికి రిజర్వేషన్ పేరుతో ఉద్యోగం వచ్చిందని, దీనివల్ల సవర్ణులైన మెరిట్ విద్యార్థులు ఇబ్బందులకు గురవుతున్నారనే మాటలు అతనిని మానసిక క్షోభకు గురిచేశాయి. ఉద్యోగం చేయడంకోసం గ్రామానికి వెళ్లిన కథకుడు తోడి ఉపాధ్యాయుడు హరిజనుడై ఆలయప్రవేశానికి అనరు డై గుడిబయట చదువుచెప్పడం చూసి అతనికి పరిచయమైన వ్యక్తి ''అతను హరిజనుడండీ హరిజనుడు తప్పదుమరి9'' అనేమాటల్లో హరిజనులయేడ సవర్ణులకు ఎంత చులకనభావముందో తెలుస్తుంది. హరిజనుడు గుడిలోనికి వెళ్లటం తప్పా? దేవుడు మైల పడుతాడా? సాటిమనిషిని మసిబూసిమారేడుకాయ చేయడం తప్ప అన్యంకాదు. అంటు పేరుతో దూరంవుంచి వారితో నీచపనులు చేయించుకోవడానికి సవర్ణులు పన్నిన కుట్ర.

**4.1.10. ధనప్రాముఖ్యం :** ధనం ఎంత ప్రాముఖ్యం సంతరించుకొంటుందో చూడడానికి ధనహీనులైన హరిజనుల జీవితాలు చూడాలని హెచ్చరించే కథలు వెలువడ్డాయి. 'ఆర్తి' కథ బడుగువర్గాల కుటుంబానికి చెందిన ఒక అత్తాకోడళ్ళ తగువులో ఆకలి కళ్ళకు డబ్బుమాత్రమే ఎలా ముఖ్యమైందో మనకు తెలియబరుస్తాడు రచయిత. వరికోతలు కాలంలో కూలీల అవసరం వున్న సమయంలో కోడలిని తన ఇంటనే వుంచుకోవాలని అత్త, పుట్టింటికి తీసుకెళ్ళాలని తల్లి తగువు పెట్టుకొంటారు. ఇద్దరి ఆశ అమెవల్ల వచ్చే కూలీ డబ్బుకోసమే. పేదరికం మనుషుల హృదయాలమీదవేసే అవాంఛనీయమైన ముద్రను హృదయవిదారకంగా చెబుతుంది ఈ కథ. అంతేగాక కొన్నిసార్లు మనుషుల బాధలు హృదయాలను ఎలా కలచివేస్తాయో దానివల్లవారు ఎలాంటి దురలవాట్లకు లోనవుతారో కూడా ఈ కథ తెలియజేస్తుంది. కాలం మారుతున్న దశలో డబ్బుకున్న నిలువ మనుషుల మనస్తత్వాలనుబట్టి ఎలా మారుతుందో డబ్బుకూ, మనిషికీ మధ్యనున్న సంబంధాన్ని రచయిత స్పష్టంచేశాడు.

**4.1.11. కుమార్గం :** సన్మార్గంలో హరిజనులు ప్రయాణం చేయాలని సంకల్పించినా వాళ్ళను కుమార్గంలోకి నడపటం సవర్ణుల అవసరమని బోధించే కథలు పరిశీలించవచ్చు. 'ది రోడ్' కథలో గాంధీమహాత్ముడు పుట్టినరోజు సందర్భంగా ఆ గ్రామంలో సంస్కరణ భావాలుగల కొందరు పెద్దలు మాలపల్లెకు అగ్రహారానికి రోడ్డువేయాలని నిశ్చయించడం అందుకు హరిజనులు శ్రమదానం చేయడానికి అంగీకరించడం కన్పిస్తుంది. హరిజనులు ఏకమవుతున్నారనే విషయం మునసబుకు అర్థమయింది. అందుకే రోడ్డుపని ప్రారంభమయ్యేరోజునే వారిమధ్య మనస్పర్థలు సృష్టించాడు. సంఘబహిష్కృతులై అగ్రహారానికి దూరంగా మాలపల్లెలో నివసిస్తున్న హరిజనులను సవర్ణులతో కలిపే వారధి రోడ్డు నిర్మాణమేకాదు, ఏపనీ జరగదు.

సవర్ణులతో సమానంగా వుండాలనే తపన హరిజనులకు వుండివుంటే రోడ్డుపని పూర్తిఅయ్యేది. అదిలేకనే హరిజనులు మునసబు మాటను గౌరవించారు. సుబ్బరాయుడు ఒంటరివాడయ్యాడు.

సాధారణంగా హోటళ్లలో పంచముల ప్రవేశం యజమానుల అభిప్రాయాల మీదనే ఆధారపడి వుంటుంది. హరిజనులు ఫలహారాలు కాఫీకోసం వస్తే వారిని బయటే కూర్చోబెట్టి ప్రత్యేక గ్లాసులోనే ఇస్తారు. ఆ గ్లాసును సవర్ణులు తాకకుండా కొట్టంచూరులోనే వుంచుతారు. కథలో సుబ్బరాయుడు సవర్ణులతోపాటు హోటల్‌కు వెళ్ళినప్పుడు జరిగిన విషయం ఇదే. అందరూ హోటల్‌లో బెంచీలమీద కూర్చుంటే సుబ్బరాయుడు మాత్రం పైకప్పుచూరులోవున్న గ్లాసును తీసుకొని క్రిందనే కూర్చొని కాఫీత్రాగుతాడు. తర్వాత గ్లాసు శుభ్రంచేసి కొట్టంచూరులోనే పెడుతాడు. సుబ్బరాయుడు దేశాన్ని రక్షించే సైనికుడయ్యుండికూడా ఇంకా అందరితో సమానంగా వుండటానికి ప్రయత్నించకపోవడం అతనిలోఇంకా అణగారిన దాస్యత్వం వుందని చెప్పవచ్చు.

**4.1.12. జీవనాధారం :** 'ఉస్తి' కథ. మనిషికి ఆకలి అనేది వుండకపోతే సమస్యలు వుండేవికాదని, అందుకే పెద్దలు 'కోటివిద్యలు కూటికొరకే' నన్నారని సమాజంలో కొందరు ఎన్నికష్టాలు పడినా వారి ఆకలి తీరడంలేదని తెలుపుతుంది. కథలో హరిజన స్త్రీ అనేక కష్టాల కోర్చి కొండకెళ్లి ఉస్తికాయలు తెచ్చి అమ్మడానికి ప్రయత్నిస్తే, ఆ ఉస్తికాయలు ఎవరూ తీసుకోక హరిజన స్త్రీ అమ్ముతుండటం వల్ల తక్కువ రేటుకు బేరమాడటం కన్పిస్తుంది. మనుషులను బట్టికూడా వారి వస్తువులకు ధర నిర్ణయించే స్థితి సమాజంలో వుందనడానికి ఈ కథ తార్కాణం. ఆమె కుండపోత వర్షంలోనే తన ఆకలి తీర్చుకోవడం కోసం అడవికెళ్లి చిక్కుల్లో పడి, చివరికి చావు ప్రమాదం నుండి తప్పించుకొని ఆ కాయలను తీసుకొస్తే ఫలితం లేకపోయింది. ఆమె పడిన కష్టం చివరకు ఆకలినే మిగిల్చింది.

**4.1.12.1 నిరాశ:** హరిజనుల ఆశలుతీరే అవకాశం లేదని నిరాశ నిస్పృహలు వాళ్ళవంతని తెలిపే కథలు లేక పోలేదు. 'దిష్టికళ్ళు' కథ ఆశ అనేది మనిషి స్థాయిని దిగజార్చుతుందని తన పైవాడిని చేయిచాచి యాచిస్తుందని సూచిస్తుంది. కథలో రామిగాడు జీతగాడు. రెడ్డెమ్మ చేస్తున్న గారెలను చూసి తనకడుపు నిండా తినవచ్చునని తలచాడు. రెడ్డి పిల్లలు తినేగారెలను చూసి నోరుచప్పరించాడు. రెడ్డెమ్మ వాడిని చూసి అసహ్యించుకొని అక్కడనుండివాడిని తప్పించగలిగింది కాని, గారెలు మాత్రం ఇవ్వలేదు. తనసర్వస్వాన్ని వదులుకొని తన ఇంట్లోనే పాలేరుగా వుంటున్న రామిగాడి పై కొంతైనా కరుణ చూపలేకపోయింది. పనిమీద తోటకెళ్ళిన రామిగాడు, గారెలమీద ఆలోచనతో ఆశతో ఇంటికివస్తూ దారి మధ్యలో పాముకాటుకు గురై మరణించాడు. తన ఆశతీరకనే అంతమయ్యాడు. తాను ఆశించినది సాధించలేకపోయాడు.

**4.1.12.2 బీదరికం :** పేదతనం ఎంత శాపంగా ఉంటుందో తెలిపే కథలు వెలువడ్డాయి. 'శిలువవేసిన మనుషులు' కథలో హరిజనుల జీవితాలు చిల్లిపడ్డ కుండలాంటివి. ఏపూట కాపూట కూలికి వెళ్ళితేగాని తిండిదొరకదనీ తెలుపుతుంది. బండలగనిలో తనభర్త పోయినందుకు యజమానులు సానుభూతితో గంగిని చేర్చుకొన్నారు. తనకు ఆ గనిలో చావు తప్పదని తెలిసినా తన సంతాన పోషణకోసం అదితప్ప అన్యం గత్యంతరంలేక చేరింది. తల్లి పడే కష్టాలను పంచుకోవడానికి ప్రయత్నించిన వెంకడు ఆమె అభ్యంతరం వల్ల మిన్నకుండిపోయాడు. కాని తన చెల్లెలు ఆరోగ్యం కోసం పుష్టికరమైన ఆహారాన్ని సంపాదించటంలో తపనపడి వాటిని సాధించి సేవించి అనారోగ్యానికి గురయ్యాడు. ఏదైతే ఆరోగ్యాన్ని తెచ్చిపెడుతుందని ఆశించిన వెంకడు అదే తన ప్రాణానికి ప్రమాదకారి అవుతుందని తలంచలేదు. పేదలకోసం ఆదరణతో ప్రవేశపెట్టే సంక్షేమ పథకాలు పేదవాడిని క్షీణింపజేస్తాయి కాని, అతని అభివృద్ధి వైపు పయనించేలా చేయవు.

**4.1.12.3. ఊబి** : హరిజనులు నిరంతరం పెద్ద ఊబిలో చిక్కుబడి జీవిస్తున్నారని వివరించే కథలు

వచ్చాయి. 'కోటిగాడు స్వతంత్రుడు' కథ ద్వారా సవర్ణులు తమ స్వార్థం కోసం అవర్ణులను తమ పావులుగా చేసుకోవడం సనాతన సంప్రదాయమని తెలుస్తుంది. కథలోకోటిగాడు కాయకష్టం చేస్తూ తమ బ్రతుకును తాను సాగిస్తుంటే ఇద్దరు సవర్ణులు ఘర్షణ పడి అతనిని బలి చేయడానికి ప్రయత్నించారు. ఆ ప్రయత్నంనుండి తప్పించుకొని బయటపడ్డ కోటిగాడు పట్టణ జీవితం ఇంకా కల్మషమైందని తెలుసుకొన్నాడు. సమాజంలో జరుగుతున్న అన్యాయాలను చూసి సహించలేక, వాటితో రాజీపడలేకపోయాడు. బాడుగరిక్షా తోలడం అతని చివరి వంతు అయింది. ప్రభుత్వం అందించే సంక్షేమ పథకంలో ఒక భాగం ఉచిత రిక్షా తన పాలిట కల్పతరువు అనుకున్నాడు. కాని సమాజంలో వారిపైన ఆధారపడి బ్రతికే దలారి పెంటయ్యలాంటివాళ్ళు మోసం చేస్తారని తెలుసుకో లేకపోయాడు. కాలానుగుణంగా ప్రవర్తించకపోతే తమ బ్రతుకులు మారవని తెలుసుకోలేక పోయాడు. రిక్షా కోసం వచ్చిన డబ్బులో కొంత భాగం పెంటయ్యకు సమర్పించి తన ఆశ తీరక ఆలోచన చావక జీవితం మీద విరక్తితో బ్రాందీత్రాగాడు. తన వద్దనున్న డబ్బు సంతా దానికే తగుల బెట్టాడు. కొత్తరిక్షా కొనాలనే అతని ఆశ ఆశగానే మిగిలిపోయింది.

4.1.12.4 కుల వృత్తి భంగం - హరిజనుల కులవృత్తికి భంగం కలగటం సర్వసాధారణ మయినట్లు తెలుపుతున్న కథలు అనేకం వెలువడ్డాయి. 'నెంబర్రాళ్ళు' కథ ఒకప్పుడు హరిజనుల వృత్తులకు గౌరవం వుండేది. సవర్ణుల పనులన్నీ హరిజనులే చేసేవారని, తత్ఫలితంగా ఆదాయం ఎక్కువ వుండేదని, వారి సంసారాలు సజావుగా జరిగేవని, కాని నేడు పరిస్థితులు మారాయని, ప్రతిదానినీ శాస్త్రీయ దృక్పథంతో ఆలోచిస్తున్నారని అందువల్లనే హరిజనుల వృతులకు విలువ గౌరవం లేకుండా పోయారని తెలుపుతూ ఉంది. కథలో ఒకప్పుడు తన వృత్తిలోనే సుఖంగా కాలం గడిపిన రాముడి కుటుంబం నేడు తమ వృత్తి సమాజానికి నిరుపయోగమై, వృత్తిని వదలి కూలీకి వెళ్ళడం కన్పిస్తుంది.

4.1.12.5 బానిసతనం - హరిజనులలో బానిసతనం అంతరించి పోలేదని తెలిపే కథలున్నాయి. 'ఏది గమ్యం' కథ సమాజం ఆర్థిక సాంఘిక అసమానతలను సాధించడానికి ప్రభుత్వం సంక్షేమ పథకాలను ప్రవేశపెట్టినా ఆ పథకాలు ఎక్కువగా ధనవంతులకే ఉపయోగపడుతున్నాయని తెలుపుతుంది. అంతేగాక హరిజనుల్లో తరాల నుండి వున్న బానిసమనస్తత్వం ఇంకా వీడలేదనడానికి ఈ కథ నిదర్శనం. కథలో రవి ధనవంతుడు పేదవాడుగా చెలామణి అవుతూ స్కాలర్ షిప్ పొందుతున్నాడు. కాని రాము తండ్రి అటెండర్ ఉద్యోగం చేస్తున్నందున అతను స్కాలర్ షిప్‌కు అనర్హుడయ్యాడు. తనను ఆర్థికంగా ఆడుకొంటున్న రవికి తాతముత్తాతలలాగానే బానిసయ్యాడు. అతనిని రక్షించబోయి రాము ప్రాణాలను కోల్పోయాడు. అతని ఆర్థిక స్థితే అతనిని బానిసను చేసింది.

4.1.12.6. రాయితీల భంగపాటు - హరిజనుల రాయితీలు హరిజనేతరులు అనుభవించటంతో పాటు హరిజనులను ఆర్థికంగానేకాదు హార్దికంగా కూడా మోసం చేయటం తెలిపే కథలు వచ్చాయి. 'ముత్తడు గొప్పోడు' కథ స్వార్థం మనిషిని మారుస్తుందని, మమతను దూరం చేస్తుందని, అవసరమైతే ఎదుటిమనిషిని అంతం చేయడానికి కూడా సిద్ధపడుతుందని తెలుపుతుంది. కథలో పర్దేసిరెడ్డి స్వార్థంతో తన ఇంట్లోని పాలేరు ముత్తడి శ్రమను దోచుకున్నది చాలక తన కొడుకు గాంధీ రెడ్డిని దత్తత చేస్తున్నాననే పేరుతో వాడి సర్వస్వాన్ని దోచుకొన్నాడు. ఊళ్ళో సభపెట్టించి. మంత్రిని పిలిపించి ''పుట్టి బుద్దెరిగిన నాట్నుండిప్రతిచెమట బొట్టూ ఈ ఇంటికి దత్తం చేసినాడు. ఇంట్లాంటోళ్ళు యేనూటికో, కోటికో గాని ఒక్కరుండరు''10 అని అతనిని తెగపొగిడాడు. పర్దేసిరెడ్డి తెలివిగా పన్నిన వలలో ముత్తడు పడిపోయాడు. ముందు చూపు లేకుండా తన ఆస్తినంతా గాంధీ రెడ్డి పేర రాయించాడు. అమాయకత్వంలో గాంధీ రెడ్డిని తన కొడుకు లాగానే తలచాడు. ఒకసారి అతనిని కౌగిలించుకోబోయి అవమానాలపాలై చివరకు ఆత్మహత్యకు

పాల్పడ్డాడు. బంధుత్వం పేరుతో కూడా తోడి మనుషులను దోచుకోవడానికి ఈ కథ నిదర్శనం.

4.1.12.7. మోసం - హరిజనులు నిరంతరం మోసానికి గురి అవుతారని తెలిపే కథలున్నాయి. 'సమిధలు' కథ సమాజంలో సవర్ణులు తమ అవసరాలను హరిజనులతో చేయించుకొని చివరకు వారినే అన్యాయం పాలు జేసి చేతులు దులుపుకోవడం సనాతన సంప్రదాయమని తెలిపింది. ఏ కార్యమైనా ధైర్యంతో సాధించగలిగేవారు బడుగు వర్గాల వారే. అందులో వారు లాభపడరు సరికదా అందులోనే అంతమవుతుంటారు. కథలో కొల్లప్ప కొడుకు పోతప్ప పంచాయితీ ఎన్నికల్లో శంకరరెడ్డిని గెలిపించడానికి ప్రయత్నించి ప్రత్యర్థి చేతిలో ప్రాణాలను పోగొట్టుకొన్నాడు. ప్రెసిడెంటుగా గెలిచిన శంకరరెడ్డి వాడి సంసారాన్ని ఆదుకోలేదు. ప్రత్యర్థిపై కక్ష సాధింపు చర్య తీసుకోలేదు. చివరికి తన కుటుంబానికి న్యాయం చేయమని కొల్లప్ప అడిగితే అతనిని చంపి పిచ్చిపట్టి చనిపోయాడని పోలీసు రిపోర్టు ఇవ్వడం, సవర్ణుల దౌర్జన్యానికి పెత్తందారీతనానికీ మచ్చుతునక. నవనాగరిక సమాజంలో కూడా హరిజనులు ఇలాంటి దుర్భర జీవితాన్ని కొనసాగిస్తున్నారనడానికి ఈ కథ తార్కాణం.

4.1.13. సంస్కరణం - సంస్కరణ భావాలు పెంపొందాలని తెలిపే కథలున్నాయి. 'మనిషి' కథ సంఘ సంస్కరణం పేరుతో చేరదీసి, సవర్ణుల వద్దకు విద్యాభిరుచి వున్న హరిజన విద్యార్థి వారి వద్ద చేరి తన చదువును పోగొట్టుకొన్న వైనం కన్పిస్తుంది. గోవిందుడు విద్యాభిరుచికలవాడు. ధనవంతుల ఇంట్లో చేరితే ఉన్నత చదువు సాధించవచ్చని తలచాడు. చక్రవర్తి ఇంట్లోనే చేరాడు. గోవిందుడి ఆశకు చక్రవర్తి ఇంట్లో గండిపడింది. వాడు చదువుకోలేదు సరికదా, రోజూ ఇంటి పనుల్లో సతమతమయ్యాడు. చదవక, చదువురాక ఉపాధ్యాయుడితో దెబ్బలు తిన్నాడు. చదువుపట్ల ఆసక్తిని కోల్పోయాడు. చిన్నతనంలోనే చక్రవర్తి వల్ల కులాల అంతరాలను తెలుసుకోగలిగాడు. సంఘసంస్కరణల భావాలు లేని వ్యక్తి దగ్గర తోడివాడు సంస్కరింపబడడని ఈ కథ తెలియజేస్తుంది.

4.1.13.1. పరిస్థితుల ప్రాబల్యం - హరిజనులు మారుతున్న సమాజంలో ఎదుర్కొంటున్న సమస్యలను చక్కగా చిత్రించిన కథలున్నాయి. 'అజ్ఞాతవాసం' కథ ప్రభుత్వం హరిజనుల సంక్షేమం కోసం కొన్ని ప్రత్యేక వసతులను కల్పించిందని, ఆ వసతులు హరిజనులకు అందినట్లే వున్నా వాస్తవానికి వాటిని సవర్ణులే వినియోగించుకొంటున్నారని తెలిపింది. కథలో పరకబయలు గ్రామపంచాయితీ హరిజనులకు రిజర్వు చేయబడితే, అగ్రవర్ణాల వాళ్లు ఆసాదు గంగడును ప్రెసిడెంటును చేశారు. నిత్యం కూలీకి వెళ్లితేగాని పూటగడవని గంగడు ప్రెసిడెంటు అయినా తన గూడు, హోదా మారలేదు సరికదా, తన కుటుంబం పస్తులపాలయ్యింది. కూలీ కోసం ప్రక్క గ్రామం వెళ్లాల్సివచ్చింది. సవర్ణుల మాట ప్రకారం ప్రక్క గ్రామానికి వెళ్లలేక జన సమూహం వున్న పట్టణంలోకి వెళ్లడం కన్పిస్తుంది. ప్రెసిడెంటు గిరిపై కనీస అవగాహన లేని గంగడును ప్రెసిడెంటుగా చేసుకొని లాభపడ్డారు. పదవి కట్టబెట్టి ఊరు వదిలేలా చేశారు.

**4.1.13.2. హింస** - మనిషిని మనిషిగా చూడక పశువుగా భావించి హరిజనుల్ని బాధించిన జీవితం చిత్రించే కథలు వచ్చాయి. 'ఉచ్చు' కథ. భూస్వామ్య విధానంలో శ్రామికుడు కష్టపడినా ఫలితం దక్కేది మరొకరికి. వాడి కష్టానికి తగిన ఫలితం లభించదు సరికదా దెబ్బలు, ఛీవాట్లు తప్పనిసరి. కథలో వెంకటరెడ్డి జీతగాడు ఒకరోజు అనారోగ్యానికి గురైతే పని చేయలేదని రెడ్డి ఆగ్రహించి చావమోదాడు. ఊరు వదిలేలా చేశాడు. ఇది అతని కర్కశత్వానికి, పెట్టుబడిదారి విధానానికి, పెత్తందారీతనానికీ ప్రతీక. బ్రతుకు సాగించడం కోసం నాగన్న తన కొడుకును జీతం పెడితే తన జీవితం గడవలేదు సరికదా తన కొడుకే అందకుండా వెళ్లిపోయాడు. పంచాయితీ పేరుతో సవర్ణులు కలసి వెంకటరెడ్డి ఇచ్చిన జీతం తిరిగి ఇవ్వలేదని అప్పుపేరుతో నాగన్న ఆస్తిని కాజేశాడు. మానవత్వం వున్న మనిషిలాగా గాక మృగంగా వ్యవహరించాడు. నాగన్న

కుటుంబాన్ని వీధుల పాలు చేశాడు. కథలో హరిజనుల యోగక్షేమాల కన్నా సవర్ణుల పంట పొలాలే ముఖ్యమని, లేకుంటే జీవితం ముక్కలవుతుందని స్పష్టమవుతుంది.

4.1.13.3. అన్యాయ ప్రవృత్తి - హరిజనుల్ని అన్యాయంగా రెండింటికి చెడ్డ రేవళ్లుగా సమాజం మార్చే తీరు వివరించే కథలు వెలువడ్డాయి. 'మేకు' కథ మనిషి తన కష్టాలలో తోటివారి సహాయాన్ని యాచిస్తాడని, కొందరు సానుభూతితో సహకరిస్తే మరి కొందరు స్వార్థంతో సహాయపడుతారని ఎదుటి వాడి కష్టాలను తన సుఖాలుగా మార్చుకొంటారని తెలుతుంది. మాకడు తన పొలాన్ని పంట పెట్టడానికి మాధవ నాయుడు దగ్గర అప్పు చేశాడు. ఒక యేడు అతివృష్టి మరోయేడు అనావృష్టి వల్ల పంట చేతికి రాక అప్పు తీరలేదు. తనకు మేలు చేస్తాడని విశ్వసించిన మాకడు జయరామయ్యను నమ్మి మధ్యస్థం కోసం ఉంచాడు. స్వార్థంతో కళ్లు గప్పిన జయరామయ్య మాకడిని మంచి మాటలతోనే మాయ చేశాడు. తన పొలాన్ని నాయుడుకు అర్పించేలా చేశాడు. సుఖమైన బ్రతుకుకోసం జయరామయ్య చెప్పిన సలహా మాకడిని తీవ్ర నిరాశకు గురిజేసింది. మాకడు జయరామయ్య మాటలు నమ్మి వున్న పొలాన్ని పోగొట్టుకొని లేని రిక్షా ఆదాయాన్ని ఆశించి రెండింటికి చెడ్డ రేవడిగా తయారయ్యాడు. ఈ కథలో హరిజనులు దలారీ వ్యవస్థ చేతిలో పడి నలిగి పోవద్దని రచయిత సలహా.

4.1.13.4. పాలెర్ల కష్టాలు - పాలేర్లుగా జీవించే వాళ్ల కష్టానష్టాలు వివరించిన కథలున్నాయి. 'పొద్దు కుంకింది' కథ మానవ జీవితానికి భవిష్యత్తు అవగాహన అవసరం. నిత్యం తన ప్రగతికి బాట వేసుకోవడానికి ప్రయత్నించాలి, పునాదిని పటిష్టం చేసుకోవాలి, ఉన్నతిని సాధించడానికి ప్రయత్నించాలి. అప్పుడే అతనికి సమాజంలో గౌరవం, హోదా లభిస్తుంది. తన స్థాయిదిగజారితే అవమానం తప్ప అన్యం వుండదు. కథలో మాకడు ఒకప్పుడు. ఆ గ్రామ రెడ్డికి పాలేరుగా తన పొలాన్ని పెంచి పోషించాడు. అయినా తన కష్టానికి తగిన ఫలితం రెడ్డి నుంచి ఆశించలేదు. అదే మాకడు అనారోగ్యానికి గురై తన కుటుంబం ఆకలి బాధలు తాళలేక తన పిల్లలు రెడ్డి పొలంలో రెండు చెనిగి చెట్లు పీక్కుంటే రెడ్డి సహించలేక పోయాడు సరికదా, అనరాని మాటలు మాకడిని అనడం కన్పిస్తుంది. అందుకే మానవ జీవితానికి ముందుచూపు అవసరం.

4.1.13.5. నిరంతర మోసం - హరిజనులు సమాజంలో నిరంతరం మోస పోతున్నారని తెలియజేసే కథలు కన్పిస్తాయి. 'ఇది కతా' కథ. దరిద్రుడు ఎంత కష్టపడినా జీవితాలు మాత్రం సాగవని, కష్టపడే వానికే కష్టాలు వస్తుంటాయని తెలియజేయడానికి ప్రయత్నించింది. కథలో మల్లయ్య ఎంత కష్టపడినా అతనికి కడుపుకు తిండిలేదు. ప్రభుత్వం మల్లయ్య జీవనం కోసం ఒక బర్రెనిస్తే అది ఇల్లు చేరేలోగా రెండువేల రూపాయలు దగా పడ్డాడు. సహాయం పేరుతో మోసం చేసే మనుషులు వున్నారనటం ఈ కథలో కన్పిస్తుంది. ఆ గ్రామంలో తమ బ్రతుకులు బాగుపడవని, నగరం చేరిన మల్లయ్య కుటుంబం అక్కడ కూడా ఆకలినే చవి చూసింది. అతనికి ఎక్కడా కష్టానికి తగిన ఫలితం దొరకలేదు. సరికదా, వున్న ఆస్తి ఊడిపోయి బజారుపాలు కావడం కన్పిస్తుంది. అమాయకుడని, తెలిసినవాడు ఎప్పుడూ మోసం చేయడానికే ప్రయత్నిస్తాడు తప్ప కష్టాల్లో వున్న వాడిని ఆదుకోడని తెలియజేయడం ఈ కథలో కన్పిస్తుంది.

4.1.13.6. భయాందోళన - హరిజనులు నిత్యం భయాందోళన మధ్య తమ జీవితాలను కొనసాగిస్తున్నారని కొన్ని కథలు తెలియజేయడం కన్పిస్తుంది. 'తొందరపడి ఒక కోడి ముందే మూసింది' కథ సమాజంతో ఎదుటివాడు మోసగాడు, క్రూరుడు, దుర్మార్గుడు అని తెలుసుకొనేదానికన్నా వాడి మోసానికి తోటివాడు గురికాకుండా మెలకుగా వుండగలిగితే అప్పుడు చైతన్యవంతులు కావడానికి ఆస్కారం వుంటుంది. కథలో రాడికల్స్ నాయకులు గ్రామ హరిజనులకు గ్రామ పెద్ద సుబ్బారెడ్డి క్రూరుడు అని, అతనిపై ఎదురుతిరగమని

బోధించడం కన్పిస్తుంది. ఆ ప్రబోధం వల్ల హరిజనులు ఇంకా భయభ్రాంతులయ్యారు తప్ప సుబ్బారెడ్డిని ఎదిరించే మనస్తత్వాన్ని మాత్రం పొందలేకపోయారు. దీనివల్ల తాను ఆశించిన మేలు జరగదు కీడు ఎక్కువగా జరగవచ్చుని రచయిత ఆకాంక్ష.

**4.1.14. దుష్ట రాజకీయం** - రాజకీయంలోని దుష్టత్వం వివరించే కథలున్నాయి. 'ఊడలమర్రి' కథ తరాలుగా వస్తున్న పెత్తందారీ విధానానికి స్వస్తి చెప్పడానికి హరిజనులు రాజకీయంగా అభివృద్ధి చెందడానికి ప్రభుత్వం రిజర్వేషన్ విధానాన్ని అమలు చేసిందని, ఈ పథకం అమలు చేస్తే సవర్ణులు వినియోగించుకోవడం గమనార్హమని తెలిసింది. కథలో మాజీ ప్రెసిడెంటు భీమప్ప తన పాలేరు ఓబులుగాడిని పంచాయితీ ప్రెసిడెంటుగా పోటీ చేయించాడు. పోలింగ్ ఆఫీసర్లతో భీమప్ప ''ఈ గుడ్డి గవర్నమెంటు రిజర్వేషన్లు పెట్టిందే ఏంజేసేది మల్ల.... ఎవరో మాలమాదిగ నాయండ్లని ఓట్లే పిచ్చిగెలిపిస్తే కొమ్ములు మొలుసుకొచ్చి మనల్నే కుమ్ముతారని నాకు బాగా తెలుసు. అందుకే మా జీతగానితోనే నామినేషన్ వేయించాం''11 నన్నాడు. గెలిచిన ఓబులుగాడు తన పాలికాపు ముందే బడిలోనికి వెళ్లడానికి సంకోచించాడు. ఇక అతను ప్రెసిడెంటుగిరి ఎలా చెలాయించగలడో తెలుస్తుంది. అనాదిగా అధికారం చెలాయించిన భీమప్ప మనస్తత్వం నేడు కూడా కొనసాగడానికి ప్రయత్నించింది. ఆ ప్రయత్నానికి అధికారులు అడ్డుకట్టవేయదలిస్తే చేయని నేరానికి ఓబులుగాడు భీమప్ప చేత చావు దెబ్బలు తిన్నాడు. ప్రభుత్వం హరిజనుల అభ్యుదయం కోసం ఎన్ని సౌకర్యాలను ఒనగూర్చినా భీమప్పలాంటివాళ్ళు వారిని అణగద్రొక్కడానికి ప్రయత్నిస్తూనే వుంటారు.

**4.1.14.1.** రాజకీయ పరిణామం : కాలానుగుణంగా హరిజనుల్లో కూడా రాజకీయ చైతన్యం వచ్చిందని తెలిపే కథలు మనకు దర్శనమిస్తాయి. 'పెద్దోళ్లు' కథ మానవ జీవితానికి వ్యక్తిత్వం అవసరమని, అది లేనినాడు వాడి జీవితం వ్యర్థమని ప్రబోధిస్తుంది. కథలో లక్ష్మయ్య రిజర్వుడు గ్రామపంచాయితీ ప్రెసిడెంటు అయినా పెదనాయుడి పాలేరు. లక్ష్మయ్య హక్కులన్నింటినీ పెదనాయుడు చెలాయించడం పరిపాటి. యం.యల్.ఏ. కూతురు పెళ్లి ఆహ్వానాన్ని పెదనాయుడు ద్వారా అందుకొన్న లక్ష్మయ్య పెళ్లికి వెళ్లితే అక్కడ కూడా అతడు పాలేరుగానే చూడబడుతూ కనీసం తిండికూడా అందరితో సమానంగా పెట్టకపోవడం కన్పిస్తుంది. తోటి పంచాయితీ ప్రెసిడెంట్లు కూర్చునే చోట లక్ష్మయ్య కూర్చుంటే పెదనాయుడు సహించలేకపోయాడు. తన మర్యాదకు భంగం కలిగినట్లు ఆలోచించాడు. లక్ష్మయ్య మనస్సులో భయం వుంది. తనకు జరుగుతున్న అన్యాయాలపై ఆలోచన వుంది. ప్రతిఘటించే స్వభావం వుంది. కాని శక్తిలేక మిన్నకుండిపోయాడు. తన జీవితాన్ని వ్యక్తిగతంగా సాగించలేకపోయాడు. అలాగని తనకు కట్టబెట్టిన ప్రెసిడెంటు గిరిని వదులుకోలేకపోయాడు.

**4.1.14.2. మానసిక పరిణామం** - సమాజాభివృద్ధికనుగుణంగా హరిజనులు మానసికంగా చైతన్యవంతులవుతున్నారని తెలియజేసే కథలు గోచరిస్తాయి. 'చెలమ' కథ హరిజనులకు స్వశక్తి తెలియక తాము సవర్ణుల పాదాలను వదిలితే బ్రతకలేమనే ఆలోచన తమ మనస్సులో చెదిరిపోనంత వరకూ అభివృద్ధి చెందరనడానికి ఈ కథ తార్కాణం. కథలో గ్రామస్థులు బావి త్రవ్వితే నీళ్లుపడకపోతే నాయుడు ఇస్తానన్న రెండెకరాల బంజరు భూమి కోసం నాయుడు ఊరును, వదిలివెళ్లలేక ఆత్మాభిమానాన్ని చంపుకొని తన బ్రొటనవ్రేలిని బావికి బలిఇచ్చాడు ఇసాక్. అయినా అదే బావిలో నీళ్లు పడితే వాటిని తీసుకోవడానికి అనర్హుడయ్యాడు. హరిజనుల అసక్తతను ఆసరాగా తీసుకొని తమ అవసరాలు తీర్చుకొనే సవర్ణుల్లో కనీస కృతజ్ఞత లేనివారున్నారనడానికి ఈ కథ నిదర్శనం.

## 4.2 ప్రయోగ దృక్పథం

మానవ సమాజంనుండి ఉద్భవించిన కులవ్యవస్థ వారి మధ్యనే అంతరాలను సృష్టించింది. కొంతమందికి నీచవృత్తులను అంటగట్టి సాంఘిక నియమాలను సృష్టించి వారికి ఊరికి దూరంగా వుంచగలిగింది. ఆంగ్లేయులు భారతదేశంలో ప్రవేశించటంతో స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా అస్పృశ్యతా నిర్మూలనకు కృషి జరిగింది. మొదట్లో హరిజనేతర సంస్కర్తలే ఈ పోరాటాన్ని కొనసాగించి హరిజనులను చైతన్యవంతులను చేశారు. ఇన్నాళ్లుగా తాము పోగొట్టుకొన్న హక్కులను గురించి ఆలోచించేలా చేయగలిగారు. తత్ఫలితంగా తమకు జరుగుతున్న అన్యాయాలను తెలుసుకొని వాటిపై స్పందించడం మొదలుపెట్టారు.

హరిజనుల పుట్టుపూర్వోత్తరాలు, వారి స్థితికి ఆధారాలను వెలుగులోకి తీసుకరావడానికి ప్రయత్నించారు. ''దళితులే ఆర్యులని ఆది ఆంధ్రులని అన్నారు. దేవుడు, మతం, సంప్రదాయాలను ప్రశ్నించారు. సంఘంలోని వివక్షను ఖండించారు. సమాజంలోని హరిజనాభ్యుదయాత్మకమైన మార్పును హర్షించారు. ఇంకా పూర్ణత్వాన్ని సంతరించుకోవాలన్నారు. మార్క్సిజం వరకూ పయనించారు. కానీ నీళ్ల భావాలన్నీ ప్రయత్నాలే, దళితుల విముక్తి కోసం ఆరాటాలే, వీళ్ల దళితాభ్యుదయం పరిపూర్ణం కాదు. అట్లని పరిమితంగానూలేదు12'' ఈ నేపథ్యం తెలుగు కథానికా సాహిత్యంలో వస్తువయింది. ఈ వస్తువుతో కూడిన కథానికలను పరిశీలిద్దాం.

**4.2.1. మతాంతరీకరణం :-** తరాలుగా దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించిన హరిజనులు తమ జీవితాన్ని చక్కదిద్దుకోవడంకోసం తమ కులంపై అసహనంతో ఇతర మతాలపై అభిమానంతో అక్కడ తమ బ్రతుకులు రూపుదిద్దుకుంటాయని తలచి ప్రవేశించారు. ఈ దేశంలో ప్రతి ఒక్క కులంలోనికి, మతంలోనికి హరిజనులు వెళ్లారన్నది మాత్రం స్పష్టం.

**4.2.1.1. క్రైస్తవం :-** ఈ దేశంలో ఎక్కువభాగం హరిజనులు క్రైస్తవమతాన్ని పుచ్చుకొన్నారని తెలియజేసే కథలు కన్పిస్తాయి. 'సాగరసంగం' కథ, కులపెద్దలవెలి తాఖీదుతో కొడుకా! కులమా!, అనే ఆలోచనకులోనయ్యాడు కాటంరాజు తండ్రి నరసింహులు. మాదిగ పెద్దలకు కులంమీద ఉండే అభిమానం కన్నా సోమాలు మీద వ్యామోహం ఎక్కువయ్యింది. మతానికి వ్యక్తిగతమైన వ్యామోహాన్ని జతచేసి కాటంరాజు, సోమాలు ప్రేమ వ్యవహారాన్ని రచ్చకీడ్చడం తగని పని. ఈ స్థితిలోనే కాటంరాజు తల్లి ప్రోలమ్మ ఆ ఊరికే క్రైస్తవ ఫాదరీ అయిన దేవ సహాయం ద్వారా మతం పుచ్చుకొని కాటంరాజు సోమాలుకు పెళ్లి జరిపించింది. రెండు కులాల యువతీ యువకుల ఒకటి కావడం కోసం మార్గం సుగమమైంది. ''నాడు కాటంరాజు కుటుంబం క్రైస్తవమతం తీసుకోవడానికి హిందూమతంలోని దుష్టసంప్రదాయాలే కారణం. నాటి సమాజం సీమకుపోతే వెలి క్రింది కులాలతో సంబంధాలు పెట్టుకొంటే వెలి రజస్వలానంతరము పెళ్లి చేస్తే వెలి. ఈ విధంగా చీటికి మాటికి వెలివేయడం వల్ల ఒకవైపు హిందుత్వం క్షీణతకు, మరోవైపు పరమత వ్యాప్తికి కారణమైంది13''. ఈకారణంగానే చైతన్యవంతులు కావడానికి మతస్వీకరణ అవసరమైంది. కన్నకొడుకు ప్రేమకోసం కులాన్ని త్యజించిన తండ్రి ఈ కథలో కనిపిస్తాడు.

**4.2.1.2. మత సహాయం :-** నాడు సమాజంలో హరిజన క్రైస్తవులపై సవర్ణులు చేసే అఘాయిత్యాలకు అడ్డుగా నిలిచిందని తెలియజేసే కథలు కనిపిస్తాయి. 'పోలయ్య' కథ మారుతున్న పరిస్థితులకనుగుణంగా మారవలసి వుంటుందని కాని హరిజనులు మాత్రం మారలేదని తెలియజేస్తుంది. కథలో పోలయ్య బండిని వెంకటశాస్త్రి గ్రామం చేరేంతవరకూ ఉపయోగించుకొన్నాడు. పోలయ్య హరిజనుడని బండిలో తెలిసిన వెంకటశాస్త్రి అతనిని తాకకుండా బండిలో ఒక ప్రక్కకు ఒదిగి కూర్చున్నాడు కాని, బండి దిగలేదు. తన అవసరం తీరాక అతనిని అంటుపేరుతో దూరం వుంచాడు. శిక్షించడానికి ప్రయత్నించాడు. తన అవసరాలను

తీర్చుకొని తననే బలి చేయడానికి ప్రయత్నిస్తున్న శాస్త్రి దుర్బుద్ధిని అర్థం చేసుకొన్న పోలయ్య తెలివిగా తాను క్రైస్తవుడని పేరు పౌలయ్య అని చెప్పి తప్పించుకోవడం కన్పిస్తుంది. నాడు సమాజంలో క్రైస్తవులకు గౌరవం వుంది. రాజ్యపాలకులు క్రైస్తవులు కాబట్టి. అందుకే వెంకటశాస్త్రి పోలయ్య క్రైస్తవుడని విని అతనిని శిక్షించలేకపోయాడు.

**4.2.1.3. మతాంతర వివాహం** - మతాంతర వివాహాలవల్ల ఈ అసమానతలు తొలగిపోతాయనే కథలు కన్పిస్తాయి. 'ఇదేం న్యాయం' కథ సమాజపు సంప్రదాయాలు నేడు కూడా సమాజాన్ని పట్టి పీడిస్తున్నాయని అభివృద్ధికి అడ్డుతగులుతున్నాయని తెలియజేస్తుంది. కథలో రెండు భిన్న సంప్రదాయాలు పాటించే యువతీయువకులు ఒకటి కావటం కన్పిస్తుంది. ప్రభాకరశాస్త్రి బ్రాహ్మణ సంప్రదాయాలను పాటిసస్తూ సనాతన సంస్కృతికి అనుగుణంగా వస్త్రాలను ధరించడం. లత క్రైస్తవ మత భక్తి తత్పరతగలది. ఈ రెండు కుటుంబాల మధ్య స్నేహితత్వం ఉండటం వల్ల వారిద్దరి మనస్సులు కలిశాయి. సనాతన ఆచారాలను వదిలి పెట్టి ఇద్దరూ వివాహం చేసుకొని మారుతున్న సమాజానికి అనుగుణంగా వుండటానికి ప్రయత్నించారు. ఆర్థికస్థితి వీరిని ఒకటిగా చేసింది.

**4.2.1.4. మతాంతరీకరణం**:- హరిజనులు అవసరాల కోసం క్రైస్తవం పుచ్చుకొన్నారని తెలియజేసేకథలు దర్శన మిస్తాయి. ''పాహిమాం....పాహి పాహి''కథ తరాలుగా బానిసత్వాన్ని అవమానాన్ని భరించిన హరిజనులకు నవనాగరిక సమాజంలో కూడా ఇదే స్థితి తలెత్తిందని తెలియజేస్తుంది. హిందూ మతంలో తమ సమస్యలు తీరవని తలచిన హరిజనులు క్రైస్తవంలో ప్రవేశించారు. కథలో సవర్ణులు హరిజనులను తమ బావుల్లోని నీటిని తీసుకోనివ్వలేదు. అందుకే రంగయ్య ''ఏమో ఊరి బయట వున్నోళ్లం ఊరబావి కాడికి రాగూడదంట14'' అని తన వాడ వాసులతో అనడం కన్పిస్తుంది. తాము సవర్ణులు తలపెట్టిన కష్టాలను వదిలించుకోవడానికి హరిజనులు ఊరికి దూరంగా గుడిసెలు వేసుకొన్నారు. అయినా వారికి సవర్ణులు తలపెట్టిన కష్టాలు తప్పవని, గౌరవం వుండదని తెలుసుకొన్న హరిజనులు, తమ సమస్య సాధన కోసం క్రైస్తవం పుచ్చుకొన్నారు. తమ వాడను ప్రభుత్వాధికారుల బారినుండి రక్షించుకోగలిగారు. కాలం మారి గ్రామాలు నగరాలుగా మారినా హరిజనులు వారి వృత్తులు మాత్రం సమాజ హీనతకు గురవుతూనే వున్నాయని ఈ కథ ప్రబోధిస్తుంది.

**4.2.1.5. ఇస్లాం**:-హరిజనులు తమ ఉనికిని కాపాడుకోవడం కోసం ఇస్లాం మతంలోకి కూడా ప్రవేశించారని తెలియజేసే కథలు కన్పిస్తాయి. 'ఇలాంటి తవ్వాయి వస్తే' కథ మతమౌఢ్యంతో కళ్ళు మూసుకొని పోయిన అగ్రవర్ణాల వారు అంటరానితనాన్ని అడ్డుపెట్టుకొని త్రాగడానికి గుక్కెడు నీళ్ళు ఇవ్వక పోవడం క్పిస్తుంది. అగ్రవర్ణాలవాళ్ల అస్పృశ్యులను చెరువులో దిగనివ్వనందున మాలమాదిగలు ఇస్లాం పెద్దలతో కలసి ఇస్లాం మతం పుచ్చుకొని సవర్ణుల త్రాగునీటి చెరువులో దిగుతారు. వీరు మతాంతీకరణ చెందడంతో తమ హక్కులను సాధించుకోగలిగారు. వీరికి క్రైస్తవం సాధించి ఇవ్వలేని హక్కులను ముస్లిం మతం సాధించిపెట్టింది. కథలో హిందువులు తమ మతస్థులను హెచ్చు తగ్గుల కులభేదాలతో చూడకపోతే హరిజనులు ఇతరమతంలోకి వెళ్లరని, అందుకోసం హిందూమతస్థులందరూ సర్వమానవ సౌభ్రాతృత్వంను కలిగి వుండాలని రచయిత అభిప్రాయం.

**4.2.1.6. కులాంతర వివాహం** :- హరిజనులు హిందూమతంలో కూడా వివాహం చేసుకొన్నారనడానికి కొన్ని కథలు నిదర్శనం. 'వెలి' కథ జీవితంలో బంధాలను అనుబంధాలను త్రెంచుకొనిపోయినవారు ముఖ్యంగా హరిజనులతో వివాహసంబంధాలు పెట్టుకొనేవారు తాత్కాలిక ఇబ్బందులకు గురికాక తప్పదని ఆ కష్టాలను అధిగమించాలని అప్పుడే అతను అభ్యుదయ పథం చేరుకోనే అవకాశం వుందని ఈ కథలో స్పష్టమవుతుంది.

కథలో దురలవాట్లకు లోనయిన రామరాజు సత్యం మాస్టర్ కూతురు శ్యామలను పెళ్లి చేసుకోవడం జీవితంలో తీరని అవమానాలకు గురై, కులం నుండి వెలివేయబడి జీవించాడు. సత్యం మాస్టర్ కూడా తన కూతురు శ్యామలను గురించి ఆలోచించలేకపోయాడు. చివరగా రామరాజు కూతురును ఇటు హరిజనులు, అటు సవర్ణులు కూడా పెళ్లి చేసుకోవడానికి నిరాకరించారు. అప్పటికే చైతన్యవంతులై హరిజన జాతికి జరుగుతున్న అన్యాయాన్ని గుర్తించిన రామరాజు సమాజమార్పు కోసం ప్రయత్నించడం కన్పిస్తుంది. ఇదే ధోరణిలో ''ఏటిపాట'' కథ కన్పిస్తుంది. ఒకప్పుడు పదిలంగా వున్న జీవితాలు మరొకప్పుడు ఏ మలుపు తిరుగుతాయో చెప్పలేని ఊహారేఖ జీవితం. కథలో మంచి పాటగాడైన పైడయ్యపై మోజు పడి కులం పట్టింపులు లేకుండా నాయుడు కోడలు సూరమ్మ అతనితో లేచిపోయింది. కాలం మారి అతని పాటను ఎవరూ వినక, అతని జీవితం గడవటం కష్టమైతే ఆ గ్రామంలో మరో నాయుడు పంచచేరక తప్పలేదు. ఒక నాయుడింటి కోడలు తాను చేతులారా చేసుకొన్న పనికి మరో నాయుడింట్లో పనిమనిషిగా చేరవలసిన దుస్థితి తెచ్చుకొంది. పైడయ్య సంఘం చెప్పిన మాటలు విని చైతన్యవంతుడై ఆ గ్రామంలో నున్న బంజరు భూములను ఆక్రమిస్తే అది చూసి సహించలేని నాయుడు పైడయ్యను అంతం చేశాడు. సూరమ్మ ఒంటరిదైంది. ఆమె జీవితం జీవచ్ఛవం అయింది. జీవితానికి అవగాహన అవసరం. అని రచయిత అభిప్రాయం. ఎదుటివాడు చైతన్య వంతుడైతే సవర్ణులు అతనిపై చేసే అఘాయిత్యం ప్రస్ఫుటంగా కన్పిస్తుంది.

**4.2.1.7. కులాంతర సంబంధం** :- కులాల మధ్య అంతరాలు వున్నంత వరకూ కులాంతర వివాహాలు సాధ్యపడవనే విషయాన్ని బోధించే కథలు కన్పిస్తాయి. 'సబ్బు' కథ మానవుల మధ్య అంతరాలు వున్నంత వరకూ వీరి ప్రేమ ఫలించదని తెలియజేస్తుంది. కథలో వరాలును సమర్థుడైన రమణ ప్రేమించాడు. పెళ్లి చేసుకోవడానికి ప్రయత్నించాడు. తన ఎదుటే హరిజనులను తక్కువగా చూస్తున్న రమణను వరాలు సహించలేకపోయింది. అతనిని వివాహమాడడానికి తిరస్కరించింది. సమాజంలో ఏ హరిజన స్త్రీ అయినా సమర్థుడు పెళ్లి చేసుకుంటానంటే తిరస్కరించదు. కాని హరిజనుల్ని తక్కువగా చూసేవాణ్ణి వాడి ప్రేమను హరిజన స్త్రీ వరాలు అంగీకరించలేదు.

**4.2.2. ఆదరణ** - సమాజంలో హరిజనులు సవర్ణుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడే కథలుద్భవించాయి. 'గుక్కెడు నీళ్లు' కథ పరిస్థితుల ప్రభావంతో పరివర్తనం చెంది అంటరాని వాడిని కన్నకొడుకుతో సమానంగా చూసుకొన్న బ్రాహ్మణ స్త్రీ కన్పిస్తుంది. ఒకప్పుడు మడినీళ్ళు తీసుకొని వస్తున్న మహాలక్ష్మమ్మకు మాదిగ వెంకటప్ప ఎదురుపడినప్పుడు అతనిపై మండిపడింది. తన భర్తచేత చావు దెబ్బలు కొట్టించింది. అవమానాల పాలు చేసింది. అలాంటి వెంకటప్ప మహాలక్ష్మమ్మను కష్టాల్లో ఆదుకొన్నాడు. ఆ అభిమానంలోనే లక్ష్మమ్మ మరణ సమయంలో తన ఆస్తిని వెంకటప్ప పేర రాయించి తన కొడుకుగా స్వీకరించింది.

''గాంధీ స్వతాజ్యోద్యమంలో భాగంగా అస్పృశ్యతా నివారణకు కృషి చేశాడు. ప్రజల మధ్యనున్న కులమతాలను రూపుమాపి వారిని సంఘటిత పరచి పరాయి ప్రభుత్వాన్ని పారద్రోలజూచినాడు. గాంధీజీ ఉన్నత ఆశయాలతో అస్పృశ్యతను నివారింపజూచినా అది సంపూర్ణంగా సాధ్యం కాలేదు. అందుకు నిదర్శనమే కథానికలోని మహాలక్ష్మమ్మ పాత్ర లేదా నేటి సమాజంలో పాటిస్తున్న కులమతాలు15''

యంత్రంలోని భాగాలన్నీ సమష్టిగా సహాయపడినప్పుడే ఉత్పత్తి జరగగలదు. ఏ భాగమైనా స్తంభించినా ఉత్పత్తి జరగదు సరికదా యంత్రం కూడా నిరుపయోగమవుతుంది. ఒక జాతిలోని ఒక వర్గాన్ని బానిసలుగా సంకెళ్లు వేస్తే అంటరానివారని దూరంతోస్తే అది జాతికే అనర్థదాయకం. అలా కాకుండా అందరూ కలిసి సమష్టిగా సహకారంతో బ్రతకగలిగినప్పుడే జాతి పురోభివృద్ధికి అవరోధాలుండవు. 'ధర్మతల్లి' కథ ఒకనాడు స్వార్థం కోసం వెలువడిన వర్ణవ్యవస్థ మరోనాడు కులం తక్కువ కారణంగా వారి ప్రాణాలను కాపాడుకోవడానికి

నిరాకరించింది. వైద్యానికి నోచుకోక ప్రాణాలనే పోగొట్టుకునే స్థితి ఏర్పడింది. కథలో చావుబ్రతుకుల్లో నున్న తన అన్నను కాపాడుకోవడానికి ఒక చెల్లెలు ప్రయత్నిస్తే ఆ ప్రయత్నం సఫలం కాలేదు సరికదా బ్రాహ్మణ వీధిలోకి అడుగుపెట్టినందుకు ''ఛీ మాలముండా కళ్లు కనబడవా బ్రాహ్మణ వీధిలో ప్రవేశించడమే కాకుండా వెధవముండవి మణ్ణీళ్లు తెచ్చుకుంటుంటే మీదిమీది కొస్తావే! హాయాయా స్వరాజ్యం వచ్చిందని మండిపోతున్నావేం''16 అనే చీదరింపులకు గురైంది. పూజారి పాపయ్య మందు ఇవ్వలేదు. తినడానికి తిండిలేక స్పృహలో పడిపోయిన ఆమెకు ఒక బ్రాహ్మణ వితంతువు ఆహారం ఇవ్వడం కన్పిస్తుంది. సమాజంలో హరిజనులను అసహ్యించుకునే వారు గాక ఆప్యాయతను చూపే వ్యక్తులు కూడా వున్నారనడానికి ఈ కథ తార్కాణం.

'ధన్యజీవులు' కథ హరిజనులు అంటరాని వారు కాదని, వారు కూడా సమాజంలో సమానమేనని శంకరం ఈ కథలో నిరూపించాడు. సమాజాన్ని కళ్లు తెరిపించడానికి ప్రయత్నించాడు. కథలో శంకరం చావు బ్రతుకుల్లో వున్న హరిజన స్త్రీకి వైద్యం చేశాడు. తండ్రి సంప్రదాయాలకు తలవొగ్గక ఆస్తిని తండ్రిని వదిలి భార్యతో మాలపల్లెలో నివాసం ఏర్పరచాడు. హరిజనాభ్యుదయానికి పాటుపడ్డాడు. మాల మాదిగలు పండించే ధాన్యం పండ్లు తింటూ, వాళ్లను తాకకూడదనడం ఏ కౌటిల్యం నేర్పిందని తండ్రిని ప్రశ్నించాడు. తన తండ్రిని సంప్రదాయాల నుండి బహిర్గతం చేశాడు. నాడు సమాజంలో కొంతమంది సంస్కరణ భావాలు కలిగిన యువకులు అంటరానితనం నిర్మూలనకు కృషి చేశారనడం ఈ కథ ద్వారా వాస్తవం.

''నరసన్నపాపాయి'' కథ - అనురాగం ఆప్యాయతలు కులానికి అతీతంగా మానవహృదయాల్లో వుంటాయి అనే గొప్ప స్నేహితత్వాన్ని నిర్మిస్తాయని తెలియజేస్తుంది ఈ కథ. నర్సన్న పాలేరుతనం చేయడంలో కథకురాలి భర్త ఆప్యాయతను అందుకొనడం, అతని చేతనే విద్యనార్జించడం, వారి పొలం పనులు చూడడం వల్ల ఈ రెండుకుటుంబాల మధ్య సత్సంబంధాలు ఏర్పడ్డాయి. కులమతాల పట్టింపులు లేని ఆ రెండు కుటుంబాలు ఒకరి అవసరాలను మరొకరు తీర్చుకోవడం కన్పిస్తుంది. అసెంబ్లీ ఎన్నికల్లో రిజర్వు శాసనసభ సభ్యుడిగా నర్సన్న పోటీ చేయడం అందులకు కథకురాలి భర్త మనస్ఫూర్తిగా సహకరించడం కన్పిస్తుంది. కథకురాలు ఆమె భర్త హరిజనులయెడ అభ్యుదయ భావాలు గలవారు. ఒకసారి మాటల్లో ''మన నరసన్న హరిజనుడు రవణా! ఎన్ని శతాబ్దాల నుంచి వాళ్ళు అలా బాధపడుతున్నారూ! వాళ్లు మనుష్యులు కాదనామనవాళ్లు రవణా17'' అని కథకురాలి భర్త అన్నాడు. ఒకనాడు గుడిలోకి తెలియక ప్రవేశించి సవర్ణుని చేత చావు దెబ్బలు తిన్న నర్సన్న ప్రస్తుతం శాసనసభ సభ్యుడై ఒక సవర్ణ కుటుంబాన్నే ఆర్థికంగా ఆదుకునే స్థితిని సాధించాడు.

**4.2.3. నిర్దోషులు** - హరిజనులు చేయని నేరానికి శిక్ష అనుభవించినా కొన్నిసార్లు ఆ నేరం నుండి తప్పించుకోగలిగారనే కథలు కన్పిస్తాయి. 'బిళ్ళల మొలత్రాడు' కథలో హరిజనులను పాలేర్లుగా చేసుకొని వారి భార్యలపై సగం హక్కు సాధించే సవర్ణులు కన్పిస్తారు. రామిరెడ్డి పాలేరు సుబ్బులు నిస్వార్థంతో కష్టించి తన ఆస్తిని పెంచాడు. అంతటితో ఆశతీరని రామిరెడ్డి అతని భార్య శీలాన్ని హరించడం కోసం ప్రయత్నించాడు. అతనిని అడ్డు తప్పించడానికి బిళ్లల మొలత్రాడు దొంగతనం మోపాడు. అతనిని దారి తప్పిస్తే అతని భార్యతో సంబంధాన్ని పెంచుకోవచ్చుని తలచాడు. చేయని నేరాన్ని మోపజూశాడు. అతని తల్లి లక్ష్మమ్మ కేసులో అడ్డుపడి సుబ్బులును నిర్దోషిగా చేసింది.

**4.2.4.. హరిజన ప్రయత్నం** - హరిజనులు చైతన్యవంతులు కావడానికి ప్రయత్నించారని కొన్ని కథలు తెలియజేస్తాయి. 'హరిజన సమస్య' కథ హరిజనులు తమ హక్కులను సాధించుకోవడానికి పోరాటం జరిపితే తప్ప లభించవు. హక్కులను సాధించుకోవడానికి ప్రయత్నించాలి గాని తరాలుగా ఇంకా బానిసతనం

పైనే ఆధారపడటం మంచిదికాదు. కథలో వీరన్న తరాలుగా తమ జాతికి జరుగుతున్న అన్యాయాన్ని కాలరాచడానికి ప్రయత్నించాడు. హరిజనులను అగ్రవర్ణాలతో సమానంగా చూడాలని అభిప్రాయపడ్డాడు. అందుకే సవర్ణ స్త్రీల మీద తనవాడ యువకులతో పడ్డాడు. హరిజనులకు సవర్ణులకు ఘర్షణ జరిగితే మధ్యలో మోగి చనిపోవడం తత్ఫలితంగా ఆ గ్రామంలో కులమతాలు తేడా లేకుండా అందరూ సమానంగా ఉండటం కన్పిసుంది.

**4.2.4.1. హరిజన ప్రతిఘటన** - హరిజనులు తమ సమస్యల సాధనకు ఉద్యమించక తప్పలేదని తెలియజేసే కథను గురించి ఆలోచించటం గమనార్హం. 'యజ్ఞం' కథ అట్టడుగు సమాజంలోని జీవుల భుజం తట్టి చైతన్యవంతులను చేయడం ఈ కథలో కన్పిస్తుంది. ఒక దివాళాకోరు షావుకారికి వడ్డీలపై వడ్డీలు పెరిగిన బాకీ ఒక బక్క రైతు చెల్లించాల్సి వుంటే న్యాయం బక్క రైతు పక్షాన వుండాలా? దివాళా తీసి ఆర్థికంగా ఇబ్బందిపడుతున్న షావుకారి పక్షాన వుండాలా ? అనే చిక్కు ప్రశ్నకు సమాధానం ఈకథలో కన్పిస్తుంది. షావుకారి దయనీయమైన స్థితిలో వున్నాడు. నిజమే. అయితే అతడికి రావలసిన వడ్డీల మీద వడ్డీని సమర్థించేది మానవత్వానికి చెందిన న్యాయం కాదు. పెట్టుబడిదారీ సమాజానికి చెందిన న్యాయం మాత్రమే. పెట్టుబడిదారి సమాజపు పతన కారణం ఆ సమాజంలోనే వుందనే ఆలోచనను తెలియజేస్తుంది. అంతేగాక సమస్యకు పరిష్కారం చావుకాదని తమ సమస్యలను తీర్చుకోవడానికి సాధ్యమైతే ప్రతిఘటించమనే సలహా కథ.

'ఒక్క పిడికిలి చాలు' కథ సంప్రదాయాల పేరుతో హరిజనులను నీచంగా చూస్తూ వారి స్త్రీల మానప్రాణాలను హరించే సవర్ణులు వీరి స్త్రీలను హరిజనులు పెట్టుకోవడానికి అర్హులా? అనే ప్రశ్నను రేకెత్తిస్తుంది ఈ కథ. చట్టం దృష్టిలో అందరూ సమానమే. అలాంటప్పుడు వీళ్ళు ఎందుకు అర్హులు కాదు? కథలో దొరపాలేరు గురవయ్య తినినా తినకపోయినా చాకిరీ మాత్రం నిత్యం తప్పలేదు. వాడయువకులు ఊరి స్త్రీలను ఏమో అన్నారనే విషయంలో ఆగ్రహించిన దొర ''ఈనాకొడుకులింక మనూళ్ళో పేణాలతో ఉండడానికి వీళ్లేదు18'' అని మొదటిదశగా తన ఇంట్లోని పాలేరు గురవయ్యను చంపడానికి ప్రయత్నించాడు. చేయని నేరానికి నిస్సహాయుడైన గురవయ్యను చంపడంలో అతనితోటే తన ప్రాణాలను పోగొట్టుకొన్నాడు. తమకు జరిగిన అన్యాయానికి కుక్కలు, పశువులు ఎదురుతిరుగుతున్నాయి. సాటి మనిషిగా పుట్టిన హరిజనుడు ఎదురుతిరగడంలో తప్పులేదని, అది వాడి హక్కు అని ఈ కథ ప్రబోధిస్తుంది. సమాజంలో హక్కులు కొంతమందికే పరిమితమయ్యాయని వారినుండి తమ హక్కులను పొందడానికి హరిజనులు ప్రతిఘటించక తప్పదని తెలియజేస్తుంది. 'మలుపు' కథ సమైక్యంగా కలసి తమ హక్కుల కోసం పోరాడితే ఫలితం దక్కుతుంది, ఆశలు నెరవేరుతాయి. అప్పుడే ప్రగతి సాధ్యం. కథలో హరిజనులు త్రవ్వుకొన్న బావి నీళ్ళలో ఫ్లోరిన్ ఎక్కువగా వున్నందువల్ల వాటిని త్రాగి చనిపోతూ వుంటే అదిచూసైనా జాలిపడి సవర్ణులు తమ బావుల్లో నీళ్లను ఇవ్వలేదు. వీరిని సాటి మనుషులుగా గుర్తించలేకపోయారు. ఎదురు తిరిగితే తమ హక్కులను సాధించుకోగలమనే విషయం తెలుసుకొన్న హరిజనులు తోటి కూలీలు ఇతర కులాల వారి సహాయంతో తమ హక్కులను సాధించుకోగలిగారు. సవర్ణుల బావుల్లోని నీటిని తీసుకోగలిగారు. సమాజంలో ఎదుటివాడి హక్కులను హరిస్తూ వాడి స్వతంత్రతకు భంగం కలిగించేవాళ్లకు చెంపపెట్టు ఈ కథ.

**4.2.4.2. హరిజన చైతన్యం** - సమాజంలోని పరిస్థితుల కనుగుణంగా హరిజనులు మారారని తెలియజేసే కథలు పరిశీలిద్దాం. 'పశ్చాద్భూమి' కథ సమాజంలో సాటివనిషిని గుర్తించాలి. అతని సేవలకు విలువనివ్వాలి. అప్పుడే వాటికి సార్థకత చేకూరుతుందని తెలియజేస్తుంది. కల్మష సమాజాన్ని సృష్టించేవాడు ఒకరైతే దానిని పవిత్రం చేయడం మరొకని వంతు అవుతుంది. ఇది మానవ నైజం. కథలో రాం కోటి

పాకీస్థలాన్ని పవిత్రం చేస్తాడు. కాని అతను సమాజానికి దూరంగా వుంటాడు. అది సహించలేని తన ఇద్దరు కొడుకులు విద్యనార్జించి పాకీ వృత్తికి స్వస్తి చెప్పి ఉద్యోగాలు చేస్తున్నారు. తాను సమాజానికి చేస్తున్న సహాయానికైనా సమాజం అతనికి కృతజ్ఞతగా వుండాలి. అలాలేదు కాబట్టి హరిజనులు ఆ వృత్తిని బదిలి స్వతంత్రంగా బ్రతకడానికి ప్రయత్నించమని సలహా.

'మార్పు' సాటిమనిషి తనకు ఎంత అన్యాయం చేసినా నోరు మెదపక వున్నంత వరకూ సమాజానికి మంచివాడుగా కన్పిస్తాడు. అదే తనకు జరిగిన అన్యాయాన్ని ప్రతిఘటిస్తే అతను సంఘ వ్యతిరేకి అవుతాడు. కథలో హరిజనులు కూలీరేట్లు పెంచమని సమ్మె చేస్తే భూస్వాములు వారి గుడిసెలకు నిప్పుపెట్టారు. శ్రమజీవుల కష్టఫలితమే భూస్వాములు తమ ఇళ్లలో దాచుకొంటూ ఆస్తులను పెంచుకొంటూ విలాస జీవితం గడుపుతున్నారు. కేవలం కష్టానికి తగిన ఫలితాన్ని సామాన్య ప్రజలు ఆశిస్తే వారి కడుపులు కొట్టడం తరాల సవర్ణుల దౌర్జన్య దమన నీతికి నిదర్శనం. తమకు జరిగిన అన్యాయాన్ని బాధలను మౌన ప్రదర్శన ద్వారా తెలియజేస్తే వారి బాధలను ఆలోచించని సమాజం వారిని ఎగతాళి చేసింది. కథలో తమకు జరిగిన అన్యాయానికి ప్రతిఘటించే శక్తి హరిజనులకుంది. 'ఇంకానా ఇకపై సాగదు' కథ ప్రతిఘటిస్తే ప్రయత్నం ప్రతిఫలిస్తుందనే విషయాన్ని నొక్కి చెబుతుంది. సాటి మనిషిని మేల్కొల్పుతుంది. హరిజనులు రంగన్న నాయకత్వాన తమ కూలీ రేట్లు పెంచడానికి సమ్మెచేస్తే సవర్ణులు సహించకపోవడం వారి ఉద్యమాన్ని నీరుకార్చడానికి దొర ఇంట్లోని ధాన్యాన్ని హరిజనుల కిచ్చి దొంగతనం చేశారని జైలుపాలుకావడం కన్పిస్తుంది. దొరల నీడల్లో కష్టాలకోర్చి బ్రతికితేనే వారి ప్రాణానికీ జీవితానికీ రక్షణ వుంటుంది. ఆపరిధి దాటితే వారి జీవితాలు ఆగమ్యగోచరాలే. నిత్యం కష్టాల కడలే. కేవలం కష్టానికి తగిన ఫలితం అడిగినందుకే రంగన్నతో పాటు హరిజనులు జైలుపాలయ్యారు. చేయని నేరానికి శిక్ష అనుభవించారు. అందుకే హరిజన స్త్రీలు, పిల్లలు చైతన్యవంతులై దొర ఇంటిపై పడటం కన్పిస్తుంది.

**4.2.4.3. హరిజన సాధన** :- హరిజనులు తమహక్కులను సాధించాలని సూచించే కథలను పరిశీలిద్దాం. ''ఊరబావి'' కథ హరిజనులు హింసకు గురైనా సరే తమ హక్కులను తాము సాధించుకోమని ఉద్బోధిస్తుంది. బావిలో ఎద్దుదట్టెంను వ్రేలడదీశారనే నేపంతో సవర్ణులు రాముడిని, చిదంబరాన్ని చావడి స్తంభాలకు కట్టివేయడం. స్త్రీ అజ్ఞాతంగా వెళ్లి తమకు అన్యాయం చేసిన వారిపై ప్రతిఘటించి తమ హక్కులను సాధించుకోవడం కన్పిస్తుంది. ఆ ప్రయత్నంలో భాగమే ఊరబావి హరిజనుల పరం అయింది.

**4.2.4.4. హరిజన విజయం** - హరిజనులు తమ హక్కులను సాధించడంలో సఫలమయ్యారని సూచించే కథ. 'చెంబుకొక గంగ' కథ సవర్ణుల వద్ద డబ్బు వుంటే హరిజనుల వద్ద శక్తి వున్నదని నిరూపించే కథ. స్వయం కృషితో వారు దేనినైనా సాధించగలరని తెలియజేస్తుంది. కథలో సవర్ణుల చేత హీనంగా చూడబడటం ఇష్టంలేని హరిజనులు ఊరికి దూరంగా బంజరు భూములను సాధించి గుడిసెలు వేయించుకొన్నారు. దీనితో సవర్ణుల మనస్తాపానికి గురైన హరిజనులకు గ్రామంలో త్రాగునీటి సమస్య ఎదురైంది. సవర్ణుల ప్రమేయం లేకుండా వారికి కావలసిన వనరులు తమ శక్తి ద్వారానే సాధించుకునే ప్రయత్నంలో బావిని త్రవ్వుకొన్నారు. చివరకు సవర్ణులే తమను నీటికోసం యాచించే పరిస్థితిని తెచ్చుకోగలిగారు. తమకు జరిగిన అన్యాయానికి తమను దూరంగా వుంచిన ఫలితానికి సవర్ణులు శిక్ష అనుభవించేలా చేశారు. అంకడి నాయకత్వంలో హరిజనులు విజయం సాధించారు. హరిజనులకు శక్తి వుందని, ఆ శక్తిని ఉపయోగించే సమర్థత వున్న నాయకుడు అవసరం అని రచయిత కాంక్ష.

**4.2.4.5. మౌఢ్యంపై విజయం** - హరిచనులు మౌఢంగా వున్నా తమ బ్రతుకు సాగించడం నేర్చుకో గలిగారు అని తెలియజేసే కథలు కన్పిస్తాయి. 'ఎర్నీళ్ళు' కథ నిత్యం కూలీకి వెళ్లితే గాని జీవితాలు గడవని

అట్టడుగు ప్రజల జీవనస్థితి ఈ కథ. ఎదుటి మనిషి దారిద్ర్యాన్ని పట్టిపీడించేది ఆకలి. ఆ ఆకలి మనిషిని నీచస్థితికి దిగజార్చడానికైనా ప్రయత్నిస్తుంది. ఆకలి తీర్చుకొనేంత వరకు తాను ఏ పని చేస్తున్నప్పటికి అతని దృష్టిలో న్యాయమేనని తెలియపరుస్తుంది. కథలో ఆకలిగొన్న చింతడు తన ఇంట్లో తిండిలేక నాలుగుదారుల కూడలిలో తీసివుంచిన దిష్టి వస్తువులను తినడం కన్పిస్తుంది. అవి ప్రమాదకరమైనవి అయినా అతని దృష్టిలో ఆ వస్తువులే ఆకలి తీర్చాయి. కడుపు నింపుకోవడం కోసం బడుగు జీవులు పడే తపన ఈ కథలో కన్పిస్తుంది.

**4.2.4.5 హరిజన దేవాలయ ప్రవేశం (దేవుడు కథ)** - ఆచారాల పేరుతో హిందువుల్లో ఒక భాగమైన హరిజనులను ఆలయప్రవేశానికి వెళ్ళితే నిరాకారించిన సవర్ణులు అదే గుడి వర్షానికి కూలిపోతే పునర్నిమ్మాణం కోసం హరిజనులకు అప్పగించడం కన్పిస్తుంది. అందులకు హరిజనులు నిరాకరించడం స్ఫురిస్తుంది. సమాజంలో సవర్ణులు హరిజనులకు ప్రత్యేకించి దేవతలను సృష్టించి ఆ దేవుళ్ళతోనే వారి జీవితాలను ముడిపెట్టడం సమాజంలో కన్పిస్తుంది. దేవాలయాలను హరిజనులతో కట్టించి వారినే దేవాలయ ప్రవేశానికి అనర్హులుగా చేయడం, సవర్ణుల దుష్ట సాంప్రదాయాలకు నిదర్శనం. గుడి కట్టినప్పుడు మైల పడని దేవుడు గుడిలోని హరిజనులు వస్తే మైల పడటం హాస్యాస్పదం. 'దేవుడు ఒక్కడే' అని ఉద్బోదిస్తున్న సమాజంలో ఇంకా కులమతాల కొలబద్దలు వుండటం దురదృష్టకరం. అందుకే హరిజనులు చైతన్యవంతులై గుడికట్టడానికి నిరాకరించడం ఈ కథలో కన్పిస్తుంది.

**4.2.4.6. హరిజన ఆలోచన పరత్వం** - హరిజనులు కూడా ఆలోచనగలవారని తెలియజేసే కథలు దర్శనమిస్తాయి. 'వ్యూహం' కథ హరిజనులు కూడా శక్తి సంపన్నులని, ఆలోచనా పరులని తెలియజేయడానికి నిదర్శనం. మోసాన్ని మోసంతోనే జయించదలచారు. సవర్ణులు మేము కూడా ఆలోచనాపరులం అని మరోమారు హెచ్చరించడానికి ప్రయత్నించారు. కథలో పంచాయతీ ఎన్నికల్లో రాయుడుకు పోటీగా వాడ యువకుడు ఆనందరావు పోటీ చేస్తే అది సహించలేని రాయుడు వాడలోని ఓట్లను డబ్బుతో కొన్నాడు. హరిజనుల ఆలోచనలను అర్థం చేసుకోలేకపోయాడు. ఆనందరావు ఎన్నికల్లో ఓడిపోయినా వాడకు రాయుడు ఇచ్చిన డబ్బుతో సంక్షేమ కార్యక్రమాలను చేసుకొన్నారు. ఆనందరావు వేసిన ఎత్తుగడలో రాయుడు చిత్తు అయ్యాడు. కేవలం తమ పరువు దెబ్బ తింటుందనే ఆలోచనతోనే డబ్బు ఖర్చుపెట్టాడు తప్ప వారి సమస్యలు తీరక తమపై పోటీ చేస్తున్నారు అని అర్థం చేసుకోలేకపోయాడు. అనందరావు ఎన్నికల్లో ఓడిపోయినా నైతికంగా గెలిచాడు. రాయుడు కళ్ళు తెరిపించాడు.

**4.2.5. హరిజన కృషి**- హరిజనులు తమ హక్కులను సాధించుకోవాలంటే కష్టపడక తప్పదని తెలియజేసే కథలను పరిశీలిద్దాం. 'క్రొత్త దారి' కథ - తమ కష్టాల్లో ఎదుటి మనిషి సాయం కోరే సవర్ణులు హరిజనుల కష్టాల్లో పాలుపంచుకోరు సరికదా, అవసరమైనప్పుడు కూడా వారిని ఆదుకోరు. కథలో హరిజనులు తమ గుడిసెలు తగులబడుతుంటే వాడలో నీళ్ళులేక శివాలయం బావికి నీటి కోసం వస్తే బావి ముట్టు అవుతుందని సవర్ణులు సహించలేక పోయారు. బాబులు రెడ్డి నాయకత్వంలో హరిజనుల పై దాడి చేసి రాములును గాయపరిచారు. దానితో తృప్తి పడని సవర్ణులు పోలీసులకు అపద్ధాలు చెప్పి హరిజనులను జైలుపాలు చేయడానికి ప్రయత్నిస్తే రాములు వారి బారి నుండి తప్పించుకొని రాడికల్స్‌లో చేరడం కన్పిస్తుంది. కథలో సవర్ణులు మానవత్వం వున్న మనుషులుగా కాక క్రూరంగా ప్రవర్తించారు. తోడి మనిషి కష్టాల్లో ఆదుకుందామనే ఆలోచన కూడా లేనివారయ్యారు. రాములు చైతన్యవంతుడైతే అతనిని అంతం చేయడానికి ప్రయత్నించారు.

**4.2.5.1. హరిజన వ్యక్తిత్వం** -హరిజనులు కూడా వ్యక్తిత్వం గలవారని నిరూపించే కథలను పరిశీలిద్దాం. 'పరిధులూ ప్రమేయాలు' కథ - హరిజన స్త్రీలకు కూడా వ్యక్తిత్వం. ఆలోచించే మనస్తత్వం

వుందని నిరూపించే కథ. వారి సమస్యలను వారే పరిష్కరించుకోగలరు. ఎదుటి మనిషి దయాదాక్షిణ్యాలపై ఆధారపడవలసిన అవసరం వుండదు. కథలో అస్పృశ్యతను రూపుమాపడంలో భాగంగా తన కూతురుకు బి.సి. యువకుడితో పెళ్లి జరిపించడానికి తపనబడితే, నిరాకరించడం తమ సమస్యలను గురించి తానే ఆలోచించగలననే సమాధానం స్ఫూర్తిస్తుంది. సమాజంలో దళితుల కన్నా ఇంకా పీడింపబడుతున్న వారు స్త్రీలు. తమ సమస్యలనూ, హక్కులనూ తెలుసుకోలేక సతమతమవుతున్నారు. వ్యక్తిత్వంతో బ్రతుకలేకపోతున్నారు. కన్న కూతురు సమస్య పరిష్కరించడానికి సాటి తండ్రికి కూడా స్వేచ్ఛ వుండకూడదని. వారి జీవితాలను వారే సుగమ మార్గం ద్వారా సాగించగలరని ఈ కథ తెలియజేస్తుంది.

**4.2.6. వైద్యరాహిత్యం** - హరిజనులు వైద్య సదుపాయాలు లేక అనారోగ్యంతో తీవ్ర బాధలకు గురయ్యారని కొన్ని కథలు సూచిస్తాయి. 'ముత్తాయి కూతురు' కథ సవర్ణులు తమ జీవితాల కోసమే బ్రతుకుతారని అట్టడుగు జనంలా తెగింపు, పరిస్థితుల పట్ల అవగాహన, కష్టాల్లో సాహసించి కార్యం నెరవేర్చే ధైర్యంగాని, ఎదుటివాడికి సాయపడే గుణంకాని వుండదని తెలియజేస్తుంది. కథలో ఊరందరికీ పని చేసే వెట్టి కూతురుకు జ్వరం వస్తే కులం పేరుతో డాక్టర్ వైద్యం చేయకపోవడం కన్పిస్తుంది. అనారోగ్యానికి గురైన హరిజనులు కులం కారణంగా వైద్యానికి నోచుకోలేక మరణించాల్సిందేనా? గ్రామంలో అంతమందికి వైద్యం చేస్తున్న డాక్టరు కేవలం ఆ చిన్నిపాపకు వైద్యం చేయడానికే తన వద్ద మందు లేదని చెప్పడం హాస్యాస్పదం. తెలిసినవాడిని మోసపుచ్చే దైన్యస్థితి . హరిజనుల యెడ సవర్ణుల నిర్లక్ష్యవైఖరి స్పష్టమవుతుంది. చివరికి వెట్టితన భార్య మెడలోని తాళిని తీసుకెళ్లి మందులు తీసుకరావడం కన్పిస్తుంది. కథలో ఊరందరికి సేవలు చేసే వెట్టికి తన కష్టాల్లో ఎవరూ సహకరించకపోవడం స్ఫురిస్తుంది.

**4.2.6.1. ఆకలి తీరే మార్గం**- హరిజనులు కష్టించి పని చేసి కడుపునింపు కోవాలనే ఆలోచనను తెలియజేసే కథలు కన్పిస్తాయి. 'ఆకలి' కథలో ఆకలి అనేది మనిషి ఆలోచనను ఎంతగా దిగజార్చడానికి ప్రయత్నిస్తుందో తెలియజేస్తుంది. చిన్నిది బీద కుటుంబం. తండ్రి కూలి తెస్తేగాని ఆ కుటుంబానికి ఆకలి తీరదు. చిన్ని ఒకసారి తలవని తలంపుగా లారి క్రిందపడి ఆసుపత్రి చేరితే లారీ ఓనరు రకరకాల తిండి పెట్టాడు. ప్రస్తుతం ఆకలికి తాళలేని చిన్ని పూర్వం లాగే ఆశపడి లారి క్రిందపడి మరణించింది. శాశ్వతంగా తన ఆకలిని పోగొట్టుకొంది. ఇందులో హరిజనుల్లో తమ సమస్యలను సాధించుకోవాలి అనే ఆలోచన రావాలని రచయిత ఆకాంక్ష. చిన్నిలో ఆ ఆలోచన వుంది. ఆమె తన కార్యాన్ని సాధించలేక పోయినా ఆలోచన గల వ్యక్తిగా కన్పించింది.

**4.2.6.2. దుష్టకామం** - స్వార్థం కోసం సవర్ణులు హరిజనులతో సంబంధాలు పెట్టుకోవడానికి ప్రయత్నించిన కథలు కన్పిస్తాయి. 'బంగారమ్మ కమతం' కథ స్వార్థంతో ఎదుటివాడి ప్రాణాలను నిలువునా కూల్చిన సవర్ణులు ఇతివృత్తాన్ని చిత్రిస్తుంది. బంగారమ్మ పాలేరు భీమప్పను స్వార్థంతో ఆత్మవంచన చేసుకొని అనేక ఆశలు చూపించి తన ఆస్తిని పెంచుకోవడానికి ప్రయత్నించింది. అతను పెళ్ళి చేసుకొంటే భార్య సీతాలుపై ఈర్ష్యపడి ఆమె చావుకు కారణమైంది. భీమప్పలో ఆవేదనను రగిలించింది. స్వార్థం మనిషి ఆలోచనను క్షణక్షణం మారుస్తుంది. ఎదుట వేయి ప్రాణాలు నిలువునా కూలుతున్నా తన ప్రాణం ఆస్తి పోకూడదనే మనస్తత్వం బంగారమ్మది. ఎవరు ఏమైనా తమ బ్రతుకులు మాత్రం సుఖంగా వుండాలి. అవసరమైతే ఇతరుల ప్రాణాలను పణంగా పెట్టైన తమ జీవితాలను సుఖప్రదం చేసుకొంటారనడానికి ఈ కథ సాక్ష్యం.

**4.2.6.3. శవరాజకీయం** - సవర్ణులు రాజకీయ దాహంతో హరిజనుల శవాలను కూడా ఉపయోగించుకొన్నారని తెలియచేసే కథలు కన్పిస్తాయి. 'పావులు పాములుగా మారిన వేళ' కథ. హరిజనులను సవర్ణులు తమ అవసరాలకు ఉపయోగించుకొని అవతలికి పారవేయడం పరిపాటి. కథలో

సూరన్న నర్సయ్య సంచాయతీ ఎన్నికల్లో పోటీ చేస్తే హరిజన రాజిగాడు కేవలం సారాయికి కక్కుర్తిపడి సూరన్న వైపు ప్రచారం చేసి నర్సయ్య వర్గం చేతుల్లో మరణిస్తే ఆ శవాన్ని ఆసరాగా చేసుకొని జనంతో ఓట్లు గుంజి సూరన్న పదవి సాధించడం కన్పిస్తుంది. రాజిగాడు బ్రతికి సూరన్నకు ఉపయోగపడి, చనిపోయికూడా ఉపయోగపడ్డాడు. చచ్చిన శవంతో విజయాన్ని సాధించిన సూరన్న ఆ కుటుంబాన్ని ఆదుకోకపోవడం, ప్రత్యర్థితో స్నేహ సంబంధాలు చేసుకోవడం కన్పిస్తుంది. తమకు జరిగిన అన్యాయాన్ని గుర్తించిన హరిజనులు చైతన్యవంతులై సూరన్న పై తిరగబడటం కన్పిస్తుంది.

**4.2.7. ప్రతీకార దృష్టి** - తమకు జరిగిన అన్యాయానికి సవర్ణులను ప్రతిఘటించిన కథలు మనకు స్ఫూర్తినిస్తాయి. 'సూర్యుడు తలెత్తాడు' కథ తాను తక్కువ అనుకొనేవాడికి ప్రతివాడు ఉన్నతుడుగానే కన్పిస్తాడు. ఆ ప్రయత్నంలో తన ఆత్మాభిమానాన్ని చంపుకొని ప్రవర్తించటం కన్పిస్తుంది. రావుడు తిండిని, సంసారాన్ని గురించి ఆలోచించక పొలంలోనే వుండిపోవడం. తన సంసారంమంతా సవర్ణుల చేతిల్లో బలైనా పట్టించుకోకపోవడం. అగ్రవర్ణులు ఏమి చేసినా ఎదురుతిరిగి సాధించలేని నిస్సహాయత అతని శరీరంలో అణువుణువునా దాగి వుంది. చివరకి ఆ పొలం కూడా ఇతరుల పాలవ్వడం. నిస్సహాయస్థితిలో తనకు జరిగిన అన్యాయానికి చైతన్యవంతుడు కావడం కన్పిస్తుంది. రావుడిలో బానిస మనస్తత్వం అణువణువునా వున్నా ప్రతీకార దృష్టితో ఊరిని కాల్చే ఊపుతో బయలుదేరటం స్పష్టంగా ఉంది.

**4.2.7.1. ఆర్థికంగా దోపిడి** - హరిజనులను ఆర్థిక ఇబ్బందులకు గురిచేసిన సవర్ణులపై ప్రతిఘటించిన కథలు కన్పిస్తాయి. 'చీకటినాడీ - వెలుగునెత్తురూ' కథ - సవర్ణులు హరిజనులను కట్టు బానిసలుగా చేసుకొని ఆర్థికంగా వారిని దోచుకోవడం కన్పిస్తుంది. హరిజనుల అలసత్వాన్ని ఆసరాగా తీసుకొని కష్టానికి తగిన ఫలితం ఇవ్వక మోసపుచ్చడం వారు, ఎదురుతిరిగితే అణచివేయడం పరిస్థితి. కథలో పుల్లన్న రామి రెడ్డి పాలేరు. తన కష్టానికి తగిన ఫలితంగురించి ఆలోచించనంతవరకూ రామిరెడ్డికి ఊడిగం చేశాడు. తెలుసుకొన్న తర్వాత ఫలితాన్ని రెడ్డివద్ద ఆశిస్తే అతనికి అన్యాయమే ఎదురైంది. అప్పుపేరుతో ఊబిలో దించడం, సవర్ణుల ధన దాహాన్ని గుర్తించిన హరిజనులు కష్టానికి తగిన ఫలితం కోసం సమ్మె చేయడం కన్పిస్తుంది. తరాలుగా వస్తున్న భూస్వామ్య నియంతృత్వానికి తెరదించడానికి హరిజనులు ప్రయత్నించడం ఈ కథలో కన్పిస్తుంది.

**4.2.7.2. మానప్రాణ హాని**- హరిజన స్త్రీలను మోహంతో పొందిన సవర్ణులను. హరిజనులు ప్రతిఘటించిన కథలు దర్శనమిస్తాయి. 'కీచకవధ' కథ మానవజీవితానికి మానప్రాణాలు ముఖ్యం, వాటిని పోగొట్టుకున్న వాడు చరిత్రహీనుడు సాటిమనిషి కష్టాల్లో వున్నప్పుడే అతనిని అన్యాయం పాలు చేయడం సులభం. కథలో బసివి రెడ్డి పాలేరు వెంకటరాముడు అతని పొలంలోనే పనిచేస్తూ చనిపోతే. వాడి సంసారాన్ని ఆదుకోవలసిన బసివిరెడ్డి అలా చేయక వాడి భార్య శీలం కోసం తపనపడటం కన్పిస్తుంది. ఆమె బలహీనుతకు తన సుఖంగా మార్చుకోవడానికి ప్రయత్నించాడు . తనకు జరిగిన అన్యాయాన్ని ప్రతిఘటించండంకోసం బసివిరెడ్డి సుఖాన్ని ఆసరా చేసుకొని అతనిని అంతం చేయడానికి సిద్దులుగాడి సహాయం కోరింది. సిద్దులుగాడు బసివిరెడ్డితో ''దానిబుద్ధి గడ్డి తిని బూతులు కూసిందంటాయ్యా పిచ్చి ముండ నాతో సెప్పి మొత్తుకొనింది. దానిని నీవే చేయిపట్టాలని''19 మాయ మాటలు చెప్పి అర్ధరాత్రి పొలంలో వెంకటరాముడి భార్య వుంటుందని అక్కడికి పిలిపించి హత్య చేయడం కన్పిస్తుంది. మోసాన్ని మోసంతోనే ప్రతీకారం నెరవేర్చుకోవడం ఈ కథలో స్ఫురిస్తుంది.

**4.2.7.3. మోసం మీద విజయం** - సవర్ణులు చేసే మోసాన్ని హరిజనులు తెలిసికొని వారి పై ప్రతిఘటించిన కథలు మనకు దర్శనమిస్తాయి. 'అంటరాని పొలం' కథ స్వార్థంతో ఎదుటిమనిషికి సాయం

చేయబోయి ఆస్తిని కాజేసిన వ్యక్తులుంటారనడానికి నిదర్శనం. పిచ్చయ్య తరాలుగా వస్తున్న తన పొలాన్ని ఆంజినేయులు కాజేయడానికి ప్రయత్నించడం, చివరకు లాయర్ సత్యమూర్తి సహాయంతో పొలాన్ని దక్కించుకోగలగడం కన్పిస్తుంది. అనురాగం ఆప్యాయతల పేరుతో తోటి మనుషులను మోస పూరితులను చేయడానికి ప్రయత్నించే వ్యక్తులు కూడా సంఘంలో వుంటారని, వారి మోసానికి గురికావద్దని హరిజనులను రచయిత హెచ్చరించాడు.

**4.2.7.4. సమ్మెహక్కు** - కష్టానికి తగిన ఫలితం కోసం కార్మికులు ఉద్యమించారని తెలియజేసే కథలు కన్పిస్తాయి. 'శ్రుతి' కథలో పరిశ్రమలో పని చేసే కార్మికుల పరిస్థితి కన్పిస్తుంది. కార్మికులకు కష్టించి పనిచేయడం తప్ప అన్యం తెలియదు. అలాంటి వారిలో కులతత్వం మతతత్వం పోషించి వారిమధ్య అంతరాలను ఏర్పరిచింది. పరిశ్రమ నాయకత్వం దేవతల పేరుతో దేవాలయాలను ఏర్పరిచింది. కార్మికులు తమ కష్టానికి తగిన ఫలితం అశించి సమ్మె చేస్తే పరిశ్రమలోని ఉన్నత ఉద్యోగుల మధ్య అంతరాలను సృష్టించి తన వైపునున్న కార్మికులను సమ్మె నుండి విరమింపజేయడంకోసం పదవుల ఆశ చూపింది. స్వార్థం మనుషుల మధ్య ఎలాంటి అగాధాలను నిర్మిస్తుందో విద్యావంతులు కూడా స్వార్థం కోసం కార్మికుల ప్రయోజనాలను విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నిస్తారని కార్మికుల్లో కూడా వర్గ కక్షలుంటాయనడానికి ఈ కథ నిదర్శనం.

**4.2.7.5. ఆడంబరాల త్యాగం** - హరిజనులకు కూడా ఆడంబరాలు అవసరం అని తెలియజేసే కథలు మనకు స్ఫురిస్తాయి. 'పండగపూట పరవాణ్ణం' కథ - హరిజనులకు కష్టాలు నిత్యకృత్యం అని వారు అందులోనే సతమతమవడం సహజమని సుఖాన్ని, విలాసాన్ని గురించి ఆలోచించే అవసరం కాని, అవకాశం గాని, వారి కుండదని విలాసాలు అనేవి సవర్ణులకే కాదని హరిజనులు కూడా అందులో భాగస్థులని నిరూపిస్తుంది. నిత్యం కష్టపడే లచ్చుంగాడు ఒక రోజు విలాసంగా భార్య చేతుల ద్వారా సారాయి త్రాగాలని తపన పడితే సమాజం సహించలేకపోయింది. వాడి ఆశను నీరుగార్చింది. అదే సవర్ణుడైన రెడ్డి ప్రతి రోజు సారాయి త్రాగితే ఆతనికి అడ్డు చెప్పలేకపోయింది. లచ్చుంగాడు చేసిన ప్రయత్నంలో తన భార్యను పోగొట్టుకొన్నాడు. రెడ్డి ప్రతి రోజు సారాయి త్రాగితే తప్పు లేనిది లచ్చుంగాడు ఒక రోజు సారాయి త్రాగాలని తపిస్తే సమాజం వాడిని దొంగగా ముద్రవేసింది. అందుకు శిక్షగా వాడి భార్య శవాన్ని చేతికిచ్చింది. ఎప్పుడూ కోర ని తన భర్త కోరికను తీర్చాలని ప్రయత్నించిన లచ్చిమి పోలీసుల చేతిలో చావుదెబ్బలకు గురైంది.

**4.2.8. విద్యావంతుడి స్థితి** - సమాజంలో హరిజనుడు విద్యావంతుడైనప్పటికీ వాడి స్థితి మాత్రం మారలేదని తెలిపే కథలు కన్పిస్తాయి. 'జీవనాడులు' కథ సమాజం ఇంత ఆధునికతను సంతరించుకొన్నా హరిజనులు ఇంకా బలహీనంగానే చూడబడుతున్నారని తెలియజేస్తుంది. రాజకీయంగా వారికి పదవులు కట్టబెట్టినా ఫలితం మాత్రం దక్కడం లేదు. వీరు సవర్ణుల చేత అణగద్రొక్కబడుతున్నారనేది మాత్రం వాస్తవం. కథలో ఆసాదు గంగడు పంచాయితీ మెంబరు. తన యోగ్యతకు తగిన విధంగా తన కూతురుకు పెళ్లి చేయదలిస్తే అతని ప్రయత్నం ఫలించలేదు సరికదా, విద్యావంతుడై ఉద్యోగం చేస్తున్న తన అల్లుడికి కూడా పెళ్లికొడుకు అనే గౌరవంతో కూడా మర్యాద ఇవ్వలేకపోయారు సవర్ణులు, వారి ఊరేగింపును కూడా నిరాకరించారు. అవమానం వున్నచోటే ప్రతిఘటన మొదలవుతుంది. సవర్ణుల అవమానంతో ఇంతకాలం తాము పోగొట్టుకొంటున్న హక్కులను తెలుసుకోగలిగారు.

**4.2.9. హరిజన దౌర్జన్యం** - తమ హక్కులను సాధించుకోవడం కోసం హరిజనులు అప్పుడప్పుడు ప్రతిఘటించారని తెలియజేసే కథలు స్ఫురిస్తాయి. 'అగ్నిగుండం' కథ. ఒక వ్యక్తి న్యాయాన్యాయాలను విచారించడంలో కొన్నిసార్లు విఫలమయి, అనుమానంతో సంబంధంలేని వ్యక్తిని బలిపశువుగా చేస్తుంది. చేయని నేరానికి శిక్షార్హున్ని చేస్తుందని తెలియజేస్తుంది. కథలో అంజయ్య జీవితంలో పరాభవాలకు, కష్టాలకు

ఓర్చి తన కొడుకును చదివించాడు. వాడిని ఉన్నతస్థితిలో చూడాలని తపనపడ్డాడు. అతని కొడుకు విద్యావంతుడైతే సవర్ణులు సహించలేక పోయారు. హత్యకేసులో అతనిని నిందితునిగా చేశారు. నక్సలైట్ పేరుతో అతనిని హింసించారు. సమాజంలో హరిజనులు విద్యావంతులైతే సమాజం వారి యెడ సృష్టించే నిందలు వారిని మానసిక క్షోభకు గురిచేసి పోరాటంవైపు పయనింపచేస్తాయి.

**4.2.10. ప్రతీకార వాంఛ** - హరిజనులు తమకు సవర్ణుల నుండి జరిగిన అన్యాయాలకు ప్రతీకారం తీర్చుకోవాలనే ఆలోచన లేకుండా పోయిన కథలు గోచరిస్తాయి. 'బంచరాయి' కథ హరిజనులు తమ బ్రతుకులు తాము బ్రతకడానికి ప్రభుత్వ సాయం కోరి బంజరు భూములను స్వాధీనపరుచుకొంటే వాటికి అడ్డంకిగా సవర్ణులు నిలవడం కన్పిస్తుంది. సవర్ణులైన కరణం రామిరెడ్డి పూనకం పేరుతో దేవుడిని సృష్టించి ఆమె ఆగ్రహానికి బలైనారనే కర్మ సిద్ధాంతాన్ని ప్రబోధించారు. తమ మోచేతి నీళ్ల త్రాగే హరిజనుల దేవాలయభూములను ఆక్రమించుకొనే స్థితికి వచ్చినందుకు సవర్ణులు సహించలేక వారి చైతన్యాన్ని కాలరాచడానికి ప్రయత్నించారు. ఆ ప్రయత్నంలో భాగమే హరిజన గుడిసెలను తగులబెట్టడం. ఇది అన్యాయం అని చైతన్యవంతుడైన గోపాలం అరచినా ఫలితం లేకపోయింది. తాత్కాలికంగా మూర్ఖత్వంతో సవర్ణులు చేసిన అన్యాయాన్ని అందుకు ప్రతీకారం అవసరం అని వారు తలచారు.

**4.2.11. సమానత్వం** - హరిజనులు కూడా సవర్ణులతో సమానం అని ప్రబోధించే కథలు మనకు దర్శనమిస్తాయి. 'మార్పుకు మార్గం' కథ ఆర్థికస్థితి మానవ సంబంధాలను ఎలా మార్చగలుగుతుందో మనిషిని ఎంత స్వార్థానికి బలిచేస్తుందో తెలియజేస్తుంది. తన పాలేరు కొడుకు ఇంజనీరు అయితే ప్రెసిడెంటు స్వార్థం కోసం అతనిని తన ఇంట్లోకి పిలుచుకొని కులపు హెచ్చుతగ్గులు ఆలోచనలు లేవని తనతోపాటు ఫలహారం తినటం కన్పిస్తుంది. ప్రెసిడెంటు కాంట్రాక్టరు, తన అవసరాలను తీర్చవలసినవాడు ఇంజనీరు. అందుకే ప్రెసిడెంటుకు ఇష్టం లేకున్నా అతనిని గౌరవించాడు. తన అవసరాన్ని తీర్చుకోవడానికి ప్రయత్నించాడు. హరిజనుడు సమానత్వం సాధించే మార్గంలో విద్య, ఉద్యోగం, ధనం, అవసరం అని అవి సాధించిన నాడే ఈ నాగరిక సమాజంలో వారు సమానంగా వుండటానికి సాధ్యపడునని రచయిత ఆకాంక్ష. 'జలగ' కథ కొన్ని సమస్యలకు కాలమే పరిష్కార మార్గం చెబుతుందని, మనుషులను కాలానుగుణంగా పయనించేలా చేస్తుందని, అన్యాయాన్ని అంతం చేసి న్యాయాన్ని రక్షిస్తుందని తెలియజేస్తుంది. కథలో రామగోపాలం హరిజనులంటే అసహ్యించుకొనేవాడు. కాని పరిస్థితుల ప్రభావం వల్ల తన అహంను చంపుకొని వెంకడి రిక్షాలో వాడితో సమానంగా కూర్చోనక తప్పలేదు. ఈ పరిస్థితిని కల్పించినవాడు సూరిగాడు. తెలియని ఆలోచనలతో మూర్ఖత్వంతో తన తండ్రిని సవర్ణునితో సమానంగా చూడగలిగాడు. రామగోపాలం తన మనస్సులో ''మా మోచేతికింది గంజి నీళ్లు తాగేటోళ్లు మా కాళ్ల క్రింద చెప్పులా గుండాల....'' 20 అనుకొన్నా పరిస్థితుల వల్ల సర్దుకపోయాడు. సూరిగాడు మరోసారి రామగోపాలానికి సహాయపడ్డాడు. ఆ సహాయం చెరువులో చేపలు పట్టించడం. అక్కడకూడా రామగోపాలానికి అవసరాలు తప్పని సరయ్యాయి. అవకాశం వస్తే అవసరం ఎలాంటి పనినైనా చేయించగలదనే సత్యం ఇందులో స్ఫురిస్తుంది. సమాజంలో మారుతున్న పరిస్థితులకనుగుణంగా మానవ పరిధి విస్తృతి అవ్వడం అవసరాలు ఎక్కువకావడం కూడా మానవ చైతన్యానికి మూల సూత్రాలని, ఆ దశలోనే హరిజనులు అభివృద్ధి చెందటం కన్పిస్తుంది.

**4.2.12. ప్రేమ వైఫల్యం** - సమాజంలో సంప్రదాయాలు, వరకట్నం కోసం ప్రేమించుకొన్న యువతీ యువకులను ఇబ్బందులకు గురి చేసిన కథలు మనకు స్ఫురిస్తాయి. 'ఆచూకీ' కథ మానవుల మధ్య అంతరాలను సృష్టించి వేరు చేయడం ఒక ఎత్తు అయితే మూర్ఖంగా స్వార్థంకోసం ఆశపడి ఒకే కులంలోని

మనుషులను విడదీయడం ఒక ఎత్తు. హరిజన కులంలోని కులపెద్దలు పిల్లల పట్ల మూర్ఖంగా ప్రవర్తించడం వల్ల యువతీ యువకులు ఇబ్బందులపాలయ్యారు. కథలో కొమురు లింగయ్య ప్రేమించుకొని వివాహం చేసుకోదలిస్తే లింగయ్య తండ్రి మారయ్య కట్నం కోసం ఆశపడి తన కొడుకుతో పెళ్లి చేయించడానికి నిరాకరించాడు. తన కొడుకు శీలాన్ని దోచుకొన్నందుకు ''అంతలావయితే నడిమందల ఆపోల్ల మావోని పేరెత్తుకున్నది గన్క తప్పు దండగ కింద మూడువేల రూపాలు గడ్త''21 నన్నాడు. తప్పు క్రింద గాడబ్బు కట్టించడానికి ప్రయత్నించాడు. జరిగిన అన్యాయానికి లింగయ్య తన తండ్రిని వ్యతిరేకించలేక, కొమురును ధైర్యంగా వెళ్లి పెళ్లి చేసుకోలేక దిక్కుతోచని స్థితిలో రాడికల్స్‌లో చేరాడు. పెళ్లి చేసుకొని నూరేళ్ళ పాటు జీవించాల్సిన ఆ యువతీయువకుల జంట పెద్దల మూర్ఖత్వానికి బలై చెట్టుకొకరు గుట్టకొకరు అయ్యారు.

**4.2.13. సహకారం** : అవర్ణులు సవర్ణుల మధ్య సహకారం వుంటే సమస్యలు పరిష్కరింపబడుతాయని బోధించే కథలు దర్శనమిస్తాయి. 'హోమం' కథ ఒక హరిజనుడు చైతన్యవంతుడై రాజకీయంగా పదవిని సాధించడానికి ప్రయత్నిస్తే అందుకు సవర్ణులు కల్పించే కష్టాలు తెలియజేస్తుంది. తనవాడ నీటి సమస్యను తీర్చడానికి తమ వాడ తరపున పంచాయతీ మెంబరైతే తమ పునాదులు కదులుతున్నాయనే దృక్పథంతో ఆలోచించిన కొండారెడ్డి నీటి సమస్యను తీవ్రతరం చేసి హరిజనులను ఇబ్బందిపాలు చేశాడు. హరిజనుల నీటి చెరువులో చేపలు పట్టించాడు. అదేం అన్యాయం అని హరిజనులు అరిస్తే వారి నోరు మూయించాడు. హరిజనుడు తమ హక్కులను వినియోగించుకొని సాటి మానవుడుగా చలామణి అవడానికి ప్రయత్నిస్తే ఆ ప్రయత్నాన్ని సవర్ణ సమాజం హర్షించలేకపోయింది. అది భరించలేని హరిజనులు తాము సమాజం చేత హీనంగా చూడబడటానికి వారి వృత్తులే కారణమని వృత్తులను సూచించే వాయిద్యాలను మంటల పాలుచేశారు. సవర్ణుల శుభాశుభ కార్యాల్లో సహకరించకూడదని హరిజనులు నిర్ణయించుకోవడం కన్పిస్తుంది.

**4.2.14. మానవతా దృష్టి** - హరిజనులు తమ ఉనికిని నిలబెట్టుకోవడానికి మానవతా దృష్టితో ప్రవర్తించారన డానికి కొన్ని కథలు. ఉదా. :- 'రుధిర మథనం' కథ మనిషిగా సమాజంలో చెలామణి అయితే దాదాపుగా పదిమంది చేత గౌరవింపబడాలి. మానవత్వం వున్న మనిషిగా చలామణి కావాలి. సమాజం చేత నీచంగా చూడబడుతూ వెలికి గురికాకుండా తన వ్యక్తిత్వాన్ని కాపాడుకోవాలి. కథలో కామయ్య కామం బారినుంచి తప్పించుకొన్న అరుంధతి ఊరువదలి వెళ్ళిపోవడం, అడవిలో రహదారి వద్ద పొలంలో కాపురం ఉండటం, ఆ దారిలో కామయ్య కొడుకు కొండలరావు తీవ్ర ప్రమాదానికి గురైతే అతనికి తన రక్తం ఇచ్చి ప్రాణాలు పోయడం కన్పిస్తుంది. సమాజంలో చెడువున్న చోట మంచి కూడా వుంటుందని ఈ కథ చెబుతుంది. తన తండ్రి చేతిలోనే అత్యాచారానికి గురైన అరుంధతి కొండలరావును మానవత్వంతో రక్షించింది. ధనం లేకున్నా ఎదుటి మనిషికి ఆప్యాయతనిచ్చే మనిషిగా వుండగలిగింది. ధనం గొప్పకాదని మానవత్వం అవసరం అని కామయ్య తెలుసుకొని తన కాళ్లపై పడేలా చేసింది అరుంధతి.

**4.2.15. ఆర్థిక మోసం** - హరిజనులు సవర్ణులతో తీవ్ర ఆర్థిక మోసానికి గురయ్యారని కొందరు మాత్రం ఆ మోసం నుండి బయటపడ్డారని తెలియజేసే కథలు కన్పిస్తాయి. 'పురుగు' కథలో అప్పుల పేరుతో హరిజనులు ఆస్తులను కాజేయడానికి ప్రయత్నించే సవర్ణులు కన్పిస్తారు. తెలియని వాడిని దోచుకోవడం సులభం. అందులో హరిజనుడైతే ఇంకా సులభం. కథలో పైడితల్లి తన కష్టాలను తీర్చుకోవడంకోసం, పంటపెట్టడంకోసం పెద్దనాయుడు వద్ద అప్పుచేశాడు. పైడితల్లి బలహీనతను ఆసరాగా చేసుకొన్న పెద్దనాయుడు అప్పుకు వడ్డీని పెంచి పండిన పంటనంతా తన ఇంటికే తీసుకరమ్మనాడు. పైడితల్లికి నిరాశ మిగిలింది. పెద్దనాయుడు తనకు తలపెట్టిన ద్రోహాన్ని గుర్తించాడు. అన్యాయాన్ని అన్యాయంతోనే ఎదిరించదలిచి తన అప్పు తీర్చకుండా వుండిపోయాడు. అప్పులపేరుతో హరిజనులను దోచుకొనే సవర్ణుల తరతరాల స్థితి

పైడితల్లి తలక్రిందులుచేశాడు. సమాజంలో అన్నిరకాల చీడలకు మందువుంది కాని తోటి మానవుణ్ణేనిస్సహాయులను చేసి వాళ్లను నిలువునా దోచుకొనే వారి నాశనానికి మందులేదని రచయిత ఆలోచన.

**4.2.16. ఆవాసవ్యధ** - హరిజనులు తమ కులం తక్కువ అనే అభిప్రాయాన్ని సమాజం నుండి పారద్రోలడానికి ప్రయత్నించారని తెలియజేసే కథలు దర్శనమిస్తాయి. 'బందీ' కథ - మానవ మనుగడగు వ్యక్తిత్వం అవసరం. అదే అతని ఉన్నతిని తెలియజేస్తుంది. కథలో హరిజనులు సంఘంలో సవర్ణులతో సమానంగా వుండమని ప్రబోధిస్తుంది. కథకుడు విద్యావంతుడు, ఉన్నతోద్యోగి. సవర్ణస్త్రీని ప్రేమించి సాంప్రదాయక వివాహం చేస్తే ఆమెను భార్యగా స్వీకరించడానికి అంగీకరించాడు. ఒకప్పుడు తాను హరిజనుడని ఆ గ్రామంలో అద్దె ఇల్లు ఇవ్వడానికి నిరాకరించిన యువతి కుటుంబం ప్రస్తుతం అతనితో పెళ్లిచేసుకోడానికి ప్రయత్నించడం, ఆత్మాభిమానాన్ని చంపుకొని యువతి తండ్రి తన కూతురును తీసుకెళ్లి పెళ్లి చేసుకోమని సలహా ఇవ్వడం, కథకుడు అందుకు నిరాకరించడం కన్పిస్తుంది. హరిజనులను కులం పేరుతో దూరం చేయవద్దని, సంఘంలో వారికి కూడా స్థానం వుందని నొక్కి చెప్పడం రచయిత ఆకాంక్ష.

## 4.3. దృక్పథ ద్వైవిధ్య తత్వం:

తెలుగు కథానికా సాహిత్యంలో హరిజన జీవిత దృక్పథాన్ని పరిశీలిస్తే రెండు కోణాల్లో చిత్రమవుతుంది. ఒక వర్గం కర్మ సిద్ధాంతంతో ముడిపెట్టుకొని జీవితాంతం సవర్ణులను బానిసలుగా వుంచటం, మరో వర్గం తమ ఉనికిని కాపాడుకోవడం కోసం మారుతున్న సమాజానికి అనుగుణంగా మారుతూ తమ జీవితాన్ని సుఖప్రదం చేసుకోవడం కన్పిస్తుంది. ఆంగ్లేయులు భారతదేశంలో క్రైస్తవ మత ప్రచారం చేస్తున్న రోజుల్లో హరిజనులు తమ ఉనికిని మార్చుకోవడానికి ప్రయత్నించారన్నది మాత్రం స్పష్టం.

దృక్పథ ద్వైవిధ్య తత్త్వంలో సాంప్రదాయక దృక్పథం, ప్రయోగదృక్పథం కన్పిస్తాయి. సాంప్రదాయక దృక్పథంలో కష్టించే సమస్య హరిజనులపై తరాలుగా సవర్ణులు చేసే దౌష్ట్యం. అసమానత్వం, సమైక్యత నిర్మూలన, ఆరోగ్యం, ధన ప్రాబల్యం, అమానుషం, దౌర్జన్యం, అసహాయం, దౌర్బల్యం ఆశావైఫల్యం, అమాయక ప్రేమ, విధివంచిన, మానభంగం, ప్రాణహాని, విద్యారాహిత్యం, విద్యా వైఫల్యం, విద్యార్జన, మోహం, ధన ప్రాముఖ్యం, కుమార్గం, జీవనాధారం, నిరాశ, బీదరికం, ఊబి, కులవృత్తి భంగం, బానిసతనం, రాయితీల భంగపాటు, మోసం, సంస్కరణం, పరిస్థితులు ప్రాబల్యం హింస, అన్యాయ ప్రవృత్తి, పాలేర్ల కష్టాలు, నిరంతరమోసం, భయాందోళన, దుష్టరాజకీయం, రాజకీయ పరిణామం, మానసిక పరిణామం మొదలైన విషయాలు అవగతమవుతాయి.

ప్రయోగ దృక్పథంలో మతాంతరీకరణంలో వివిధ మతాల కులాలలో చేరిన తమ స్థితిని మార్చు కొన్న హరిజనులు దర్శన మిస్తారు. మతాంతరీకరణం, క్రైస్తవం మత సహాయం, ఇస్లాం, కులాంతర వివాహం, కులాంతర సంబంధం, ఆదరణ, నిర్దోషులు, హరిజన దేవాలయ ప్రవేశం, హరిజన ఆలోచనా పరత్వం, హరిజన కృషి, హరిజన వ్యక్తిత్వం, వైద్య రాహిత్యం, ఆకలి తీరే మార్గం, దుష్ట కామం, శవరాజకీయం, ప్రతీకార దృష్టి, ఆర్థికంగా దోపిడి, మాన ప్రాణహాని, మోసం మీద విజయం. సమ్మె హక్కు, ఆడంబరాల త్యాగం, విద్యావంతుడి స్థితి, హరిజన దౌర్జన్యం, ప్రతీకార వాంఛ, సమానత్వం, ప్రేమ వైఫల్యం, సహకారం, మానవతాదృష్టి, ఆర్థిక మోసం, ఆవాసవ్యథ మొదలైన విషయాలు స్పష్టమవుతాయి.

పై అంశాలను పరిశీలించినట్లేతే హరిజన కథానికా సాహిత్యం హరిజనుడిని భుజం తట్టి చైతన్యవంతుడిగా చేయడానికి ప్రయత్నించింది. ఒకప్పుడు అన్నిరకాలుగా దీన స్థితిలో వున్నవాడు నేడు సవర్ణునితో సమానంగా ఉంటున్నాడు. ఉండడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆర్థిక రాజకీయ సాంఘిక రంగాలలో

మార్పు కోసం తపన పడుతున్నాడు. ఒకనాడు సవర్ణుని కామానికి గురైన హరిజన స్త్రీ నేడు అలాంటి స్థితి వచ్చిన స్త్రీ అవసరమైతే సవర్ణుని హత్య చేయడానికి కూడా వెనుకాడటం లేదు. విద్యాపరంగా కూడా ఆమె ఉన్నతస్థాయిని అందుకొనే ప్రయత్నంలో వుంది. మొత్తం మీద హరిజనులు సాధ్యమైనంతవరకూ తమ హక్కులను కాపాడుకోవడానికి ప్రయత్నిస్తున్నారు.

## అథః సూచికలు


1. నవ్వే పెదవులు - ఏడ్చే కళ్ళు - కలవకొలను సదానంద పుట 76.
2. యీారమ్మ - అరవవేంకటస్వామి గృహలక్ష్మి నవంబర్ 1932 పుట 81.
3. గోపీచంద్ కథానికలు వ్యాసాలు - ఉమ్మెత్తుల లక్ష్మీనారాయణ పుట 125.
4. తల్లిమట్టి - స్వామి ఉదయం నవతరం వారపత్రిక 26-1-1990 పుట 60.
5. కరుణకుమార కథలు - కరుణకుమార పుట 73.
6. పాపానికి జీతం - జి. భాను నవంబర్ భారతి 1969 పుట 38.
7. కోటిగాడు స్వతంత్రుడు - పులికంటి కృష్ణారెడ్డి పుట 17.
8. పాకీది - అనిశెట్టి సుబ్బారావు భారతి జనవరి 1943 పుట 48.
9. మకరముఖం - సింగమనేని నారాయణ ఇండియా టు డే వార్షిక సంచిక 1995 పుట 64.
10. ముత్తడు గొప్పోడు - పులికంటి కృష్ణారెడ్డి ఆంధ్రజ్యోతి వార్తపత్రిక మార్చి 11, 1983 పుట 51.
11. ఊడలమర్రి - చిలుకూరి దేవపుత్ర ఆహ్వానం ఆగస్టు 1993 పుట 32.
12. హరిజనాభ్యుదయం - ఆధునికాంధ్ర కవిత్వం - కల్లూరి ఆనందరావు పుట 156.
13. ఇరవై యారేళ్ల తెలుగు కథానిక - (1910-35) సామాజిక జీవితం - జి. ప్రభాకర్ పుట 243.
14. ఇంకానా ఇకపై సాగదు (దళితకథలు) - భార్గవీ రావు పుట 2.
15. ఇరవై యారేళ్ళ తెలుగు కథానిక (1910-35) - సామాజిక జీవితం - జి. ప్రభాకర్ పుట 231.
16. ధర్మతల్లి - చుండూరి రమాదేవి, గృహలక్ష్మి, మార్చి 1938 పుట 95.
17. రాగమాలిక ( కథల సంపుటి) - అడవి బాపిరాజు, పుట 130.
18. ఇంకానా ఇకపై సాగదు (దళిత కథలు) - భార్గవీ రావు పుట 142.
19. కోటిగాడు స్వతంత్రుడు - పులికంటి కృష్ణారెడ్డి, పుట 150.
20. ఇంకానా ఇకపై సాగదు (దళిత కథలు) - భార్గవీ పుట 13.
21. ఆచూకి - గోపి అరుణతార ఫిబ్రవరి 1993 పుట 16.

## 5. తెలుగు కథానిక - హరిజన పాత్రలు

కథకు పాత్రలు జీవం. వీటికి అనుగుణంగానే కథ నడుస్తుంది. రచయిత పాత్రను వాస్తవానికి ఎంత దగ్గరగా చిత్రించగలిగితే అంత గొప్ప కథకుడవుతాడు. కథా వస్తువుకు పాత్రలకు చక్కటి సమన్వయం కుదిరితే ఉత్తమ కథానిక కాగలదు. రచయిత పాత్రలను సాధ్యమైనంత గొప్పగా చిత్రించడానికి ప్రయత్నించాలి. పాత్ర ప్రతి ఆలోచనను ప్రతి సంఘటననూ ఫలితాన్ని ప్రతిబింబించేదిగా వుండాలి. ''ఒక గొప్ప వాంఛయో, ఆశయో, ఆతిశయమో, భావమో, క్షోభయో ఇట్టి ఒక చిత్తవృత్తి ప్రకృష్టముగానున్న వ్యక్తి పాత్ర కావటానికి యోగ్యమవుతుంది.''1 రచయిత తాను జీవించే వాతావరణ పరిస్థితుల ప్రభావం తన రచనలలోని పాత్రలపై ప్రసరిస్తుంది. సమాజంలో నేడు వస్తున్న కథానికల్లో పాత్రలు వాస్తవానికి చాలా దగ్గరగా వుంటున్నాయి. తెలుగు కథానికా సాహిత్యంలోని కథల్లో హరిజన పాత్రలను పరిశీలిద్దాం.

తెలుగు కథానికల్లో మొట్టమొదట హరిజన పాత్రలను ప్రవేశపెట్టినవారు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి. ఈయన రాసిన కథ ''పుల్లంరాజు''లో పేరు ప్రాతిపదికగా పాత్రలు లేకపోయినా ఉమ్మడి పాత్రలు గా కన్పిస్తాయి. ప్రస్తుతం యధాతథ దృక్పథాన్ని వివరించిన కథానికలలోని పాత్రలను పరిశీలిద్దాం.

### 5.1. యధాతథ దృక్పథం

స్వాతంత్ర్యం పూర్వం నుండి సాంఘికంగా అధోగతిపాలై గాఢాంధకార జీవితం గడుపుతున్న హరిజనులు తీవ్రంగా ఎదుర్కొంటున్న సమస్య అస్పృశ్యత. వీరు సవర్ణుల మూఢాచారాలకు సంప్రదాయాలకు బలవుతున్నారు. నేటికీ గ్రామాల్లో వీరు నడివీధుల్లో ధైర్యంగా తిరగలేకపోతున్నారు. సొంత ఇళ్ళులేక భూస్వాముల పొలాల్లో గుడిసెలు వేసుకొని కష్టానికి తగిన ఫలం పొందలేక తమ బ్రతుకులు మార్చుకొనే స్థితి తెలియక కష్టాల ఊబిలో చిక్కుకొన్నారు. నాగరిక ప్రపంచంలో మానవుడు సమతలంనుండి ఎత్తుకు చేరుకోవడం సహజం. ఒకనాడు మానవ ప్రగతి కోసం ఏర్పడిన ఆచార సంప్రదాయాలు నేడు ఆ మానవులకే అనర్థాన్ని తెచ్చిపెడుతున్నాయి. సమస్య పరిష్కారంకాక జటిలమవుతున్నది.

**5.1.1. సవర్ణద్రోహం** : హరిజనుల మూర్ఖత్వాన్ని ఆసరాగా తీసుకొని సవర్ణులు తమ అవసరాలను తీర్చుకొన్నా ఇంకా ధనవంతులు బలవంతులై వీరిని అణగద్రొక్కారు.

**5.1.1.1. కొండడు:-** 'కయ్యి-కాలువ కథలో' కొండరు మనువు లక్ష్మమ్మ పాలేరు సవర్ణుల పంచనపడి బ్రతకడంకన్నా స్వతహాగా నీళ్ళ త్రాగి జీవించడం మేలని తలచాడు. అందుకే ప్రభుత్వం ఇచ్చిన అరెకరా భూమిని నమ్ముకొని బ్రతికే మనస్తత్వం కలవాడు. కష్టపడి పనిచేయడం తప్ప అన్యం తెలియనివాడు. తన భూమి కష్టానికి తగిన ఫలితం ఇవ్వకపోతే అమ్మజూపాడు. కాని లక్ష్మమ్మ అడుగుతున్న చిల్లరధరకు ఇవ్వలేక పౌరుషంతో పొలాన్ని సాగు చేస్తున్నాడు. ఎలాగైనా పొలం కాజేయాలన్న లక్ష్మమ్మ ఆలోచనను ఎండగట్టడానికి ప్రయత్నించాడు. కాని ''డబ్బుంటే దేవుడుకూడా దరికిరాడ''నే చందాన మహాలక్ష్మమ్మ పథకంలో పడక తప్పని సరి అయింది. లక్ష్మమ్మ దగ్గరకెళ్లి ''అమ్మా నువ్వు గొప్ప మారాజువి, నా మీద పగబట్టితే నే బ్రతకలేను... నీ కయ్యిలో నుంచి నా కయ్యిలోకి జానెడు వెడల్పు కాలవ గన కిస్తివా నీ పేర దీపంపెట్టుకుని మొక్కుకుంటా''2 న్నాడు. ఆమెచేత నిరాకరణకు గురయ్యాడు. అధికారులు తనకు మేలు చేస్తారని తన బ్రతుకును చక్కదిద్దుతారని తలచి తాలూకాఫీసుకు వెళ్లితే సహాయం జరుగకపోగా, చేతిలోవున్న డబ్బును పోగొట్టుకొన్నాడు. దొంగతనంపేరుతో వున్న బర్రెను లక్ష్మమ్మ కాజేసింది. పొలంలోవున్న వడ్లకుప్పే లక్ష్మమ్మ ద్రోహానికి తగులబడిపోయింది. ఇంతజరిగినా అతను లక్ష్మమ్మను ఎదిరించలేకపోయాడు. తనకు న్యాయం జరిగేంతవరకూ పోరాడలేకపోయాడు. అతనిలో పిరికితనం, నిస్సహాయత నిండుకొన్నాయి.

**5.1.1.2.** పెంచెలి- 'పశువుల కొఠం' కథలో పెంచెలి వెంకటిగాడి కూతురు . అందం, అమాయకత్వం ఉన్న మనిషి. గడ్డి అమ్మి తన కుటుంబానికి ఆదాయం తీసుకురావడం వృత్తి. సుబ్బడిని ప్రేమించింది. పెళ్లిచేసుకొని సుఖంగా జీవితం గడపాలని తలచింది. లేనిపోని ఆశలతో పగటి కలలు కనింది. పెళ్లిలో ఊరేగింపు గుర్రంపై జరుగుతుందని భ్రమపడింది. ఒకరోజు పట్టణం నుండి వస్తున్న పెంచెలి గాలివానలో చిక్కుకొని వానబారినుండి తప్పించుకొని రాయుడు పశువుల కొఠంలోకి వెళ్లి అతని బారిన పడింది. భయంనుండి చైతన్యం పుట్టుకొస్తుందని వాళ్ల బారినుండి తప్పించుకోగలిగింది. రాయుడు పంథానికి గురైంది. తనకులంపిల్లని ఆలోచించకుండా సుబ్బడు, రాయుడు పెట్టే ఎంగిలి కూటికోసం కక్కుర్తి పడి సుబ్బడి వద్ద పెంచెలిని గూరించి అబద్ధాలు చెప్తాడు. ఆ ఊళ్లోనే వుంటే తన బ్రతుకు బుగ్గిపాలు తప్పదని తెలుసుకొన్న పెంచెలి సుబ్బడితో పెళ్లి చేసుకొని ఊరువదలాలనే ఆలోచన సఫలంకాలేదు. చెప్పుడు మాటలు విన్న రుబ్బడు రాయుడు ఉంపుడుకత్తెని ఆమె మనస్తత్వం తెలిసికూడా రుబ్బడు చెప్పినమాటలు విని ఆమెను అన్యాయం చేశాడు. చేయని నేరానికి బలి చేశాడు. కథలో ఈ పాత్ర అన్యాయం జరిగినా ఎదిరించే శక్తిలేక మూర్ఖంగా శిక్షను అనుభవించింది. రాయుడు చేసిన ఘనకార్యాలకి రాయుడు పశువుల కొఠం ముందరే చనిపోయింది. ఈ పాత్రలో గాంధేయవాదం కన్పిస్తుంది.

**5.1.1.3. సుబ్బడు** :- పశువులకొఠంకథలో సుబ్బడు రాయుడు పాలేరు . బానిస వ్యక్తిత్వం లేనివాడు. ఆలోచన అంతకన్నా లేనివాడు. రాయుడు చెప్పినపని తలత్రిప్పకుండా చేయడం అతని రివాజు. రాయుడు పొందు హరిజన స్త్రీలకు గొప్పవరంగా భావిస్తాడు. ఒకసారి పెంచెలితో సుబ్బడు ''బాగుండక చేదా ఎందే, రాయుడు మోజుపడి కులమయినా పాటించకుండా అడుగుతుంటే ఎన్నాళ్లని ఇట్టా ఎగర్తించి పోగలవే పిచ్చిచేస్టాచేయవోక నే తీసుకపోతారా'' అంటాడు. పెంచెలి గాలి వానలో పశువులకొఠంలోకి దూరినపుడు రాయుడు వద్దకు తీసుకెళ్లడానికి శతవిధాలా ప్రయత్నించాడు. పెంచాలి తన కులపు స్త్రీ అని ఆమెను అలా చేయడంవల్ల తన జాతికే మచ్చ అని ఏనాడు ఆలోచించలేదు సరికదా ఆమె జీవితం నాశనం చేయడానికి ఆమె ప్రేమికుడైన సుబ్బడితో లేనిపోని అబద్ధాలు చెప్పి వారి ప్రేమను విడదీశాడు. తత్ఫలితంగా పెంచెలి చావుకు కారకుడయ్యాడు. కథలో సుబ్బడిపాత్ర ఆలోచనలేక తనకులంవారినే అభాసుపాలు చేయడానికి తీవ్రంగా ప్రయత్నించింది. రాయుడుచేతిలో కీలుబొమ్మగా, వుండి అతను చేసే పనులన్నింటికీ సహకరించాడు. ఈ పాత్ర ద్వారా రచయిత హరిజనులకు వ్యక్తిత్వం అవసరం అని, బానిస బ్రతుకులకు స్వస్తి చెప్పమని సలహా.

**5.1.1.4. ముత్తడు**:- 'ముత్తడు గొప్పోడు' కథలో ముత్తడు పర్దేసిరెడ్డి పాలేరు. చిన్నతనంలోనే తల్లితండ్రులు పోవడంవల్ల పర్దేశిరెడ్డి ఇళ్ల చేరాడు. ఆలోచనలేనివాడు. రెడ్డే గొప్ప అతనే అన్నీ తెలిసినవాడు అని అతని మాయమాటల వల్ల నమ్మేవాడు. సుఖానికి దూరమై నిత్యం నిస్వార్ధంతో పనిచేశాడు. రెడ్డినుండి కష్టానికి తగిన ఫలితాన్ని ఆశించలేదు. అతని ఆస్తిని పెంచాడు తప్ప అతనిని అన్యాయంపాలు చేయలేదు. రెడ్డికొడుకును తనకు దత్తతచేశాడన్న సంతోషంతో తన ఆస్థిని పిల్లవానిపేర రాయించాడు. గాంధీరెడ్డి ఇక తనకొడుకేనని మురిసిపోయాడు. రెడ్డి ఇంట్లో కష్టపడినందుకు ఫలితం దక్కిందని సంతసించాడు. తెలియని ఆలోచనలతో లేనిపోని ఆశలతో వున్న ఆస్తినంతా పోగొట్టుకోగలిగాడు. పెళ్లిపెటాకులు లేకుండా బ్రతుకుతున్న ముత్తడు గాంధీరెడ్డి రిజర్వేషన్‌తో కలెక్టరైతే గర్వించాడు.సంతోషానికి అవధులు లేకపోయినాయి. ఊళ్ళోవాళ్లు ''ముత్తన్నా ఇంకనీకేన్నా నీకొడుకు కలెక్టరు కదన్నా ఎప్పుడనా యేదన్నా నీపాటుండొస్తే అట్టా పలకరించన్నా''4 అనే తోటి హరిజనుల మాటలు విని మురిసిపోయాడు. గాంధీరెడ్డిని ఒకసారి మనసారా కౌగిలించుకొని తృప్తిపడదలచాడు. ఆ పనిచేసి పర్దేసిరెడ్డి చేత ఆగ్రహానికి గురై కాలితన్నులు తిన్నాడు. తాను రెడ్డికి చేసిన

సహాయానికి కృతజ్ఞలేదని తలచాడు. అతనికి జరిగిన అవమానం అతని ఆత్మహత్యకు దారి తీసింది. కథలో ఈ పాత్ర సవర్ణులు స్వార్థంకోసం చెప్పే మాయమాటలను నమ్మి మోసపోవద్దని చెబుతూ హరిజనులు కూడా కాలపరిస్థితుల కనుగుణంగా మారాలని పాలేరుతనాన్ని వదలి కష్టానికి తగిన ఫలితాన్ని ఆశించేధోరణి ని పెంపొందించు కోవాలని చెబుతుంది.

**5.1.2. సవర్ణుల మోసం :-** సవర్ణుల మోసానికి గురైన హరిజన పాత్రను పరిశీలిద్దాం.

**5.1.2.1. కోటి :**' పాకీది' కథలో కోటి పాకీపని చేసే మాచి కొడుకు. విద్యపై ఆసక్తి వున్నవాడు. మంచిబుద్ధి గలవాడు. ఉన్నతవిద్య చదివి ఉన్నతుడు కావాలని తపనపడ్డాడు. మంచి కోసమో మానవత్వం కోసమో గొప్పకోసమో సవర్ణుడైన నాగుతో స్నేహం చేశాడు. ఆ స్నేహమే కోటి విద్యావంతుడు అవుతున్నాడన్న ఈర్ష్యను సవర్ణులలో కలిగించింది. అతని పతనానికి దారితీసింది. నాగూ తండ్రి భాస్కరరావు ప్రోద్బలంతో నాగూ, బడిపంతులు దూరమయ్యారు. తనకు చదువు చెప్పడానికి బడిలోనికి రానించుకోవడానికి నిరాకరించాడు పంతులు. ఉన్నత విద్యావంతుడై ఉద్యోగం సాధించుకోవాలనే ఆశలు అడి ఆశలయ్యాయి. ఇది సవర్ణుల పన్నాగం. సవర్ణులు చేసే పన్నాగం వల్ల కోటిమానసికంగా కృంగిపోయాడు. విద్యపట్ల రానురాను ఆసక్తి తరిగిపోయింది. చివరకు తండ్రి స్థితికి వచ్చి పాకీపనిచేయడం మొదలుపెట్టాడు. ఈ పాత్ర నేడు సమాజంలో పిల్లలకు చిన్నతనంలోనే కులంహెచ్చుతగ్గులు నేర్పడానికి పెద్దలు ఎలా ప్రయత్నిస్తారో తెలియజేస్తుంది. సవర్ణుల అవమానానికి ఈర్ష్యకు ఇంట్లో పినతండ్రి దబాయింపుకు కోటికోరిక నీరుకారిపోయింది.

**5.1.2.2. పిచ్చయ్య :-** 'అంటరాని పొలం' కథలో పిచ్చయ్య కథానాయకుడు. తనకున్న పొలాన్ని పంటపెట్టుకొని వచ్చిన ఆదాయంతో జీవితాన్ని సాగిస్తున్నాడు. ఆలోచనలేనివాడు. సంప్రదాయవాది. తాతలనాటినుండి సంక్రమించిన ఆస్తిని ప్రాణప్రదంగా చూచుకొనే మనిషి. అందుకే సవర్ణుడైన ఆంజనేయులు తన భూమిని కొనడానికి ప్రయత్నిస్తే నిరాకరించాడు. అందరూ తనలాగే వుంటారని ఆంజనేయుల సహాయాన్ని గ్రుడ్డిగా ఆశించాడు. తాను ఆంజనేయులపై నున్న గ్రుడ్డి నమ్మకంతో అతను అడిగిన చోటంతా సంతకాలు చేశాడు. వ్యక్తిత్వం లేని మనిషిగా మూర్ఖత్వంతో తన ఆస్తిని కోల్పోయాడు. తనకు మంచి చేస్తాడనుకొన్న ఆంజనేయులు మోసం చేశాడు. ఈ కథలో హరిజనుడు నాగరికత కనుగుణంగా మారవలసివుంటుందని లేదంటే ఈ మోసపూరిత సమాజంలో వారు నిలవడం కష్టమవుతుందని హెచ్చరించాడు.

**5.1.2.3. మల్లయ్య :** 'ఇది కతా' కథలో మల్లయ్య కథానాయకుడు . చిన్నతనంనుండే తమవృత్తిని చేతపట్టుకొని సంసారం సాగిస్తున్నాడు. సమాజం అంతా తనలాగే న్యాయం తప్పని మనుషులని తలచాడు. ప్రభుత్వం హరిజనులకోసం సంక్షేమపథకాలను ప్రవేశపెట్టడంతో అవి తమ బ్రతుకును మార్చుతాయని వృత్తిని వదలి సంక్షేమపథకాల కోసం ఎగబడ్డాడు. ఒక బర్రెను సాధించాడు. ఆ బర్రెను ఆరువేలరూపాయలకు ప్రభుత్వం ఇచ్చింది. తమపాలిట ప్రభుత్వ అధికారులు, సర్పంచు దేవుళ్ళు అనుకొన్నాడు. కాని వాళ్ళు నాలుగువేలరూపాయల బర్రెను ఆరువేలకిచ్చి రెండువేల రూపాయలు తినేసి మోసంచేశారనే విషయం తెలుసుకోలేకపోయాడు సరికదా, ఆ బర్రెను కూడా బ్రతికించుకోలేకపోయాడు. ఉన్న ఆస్తిని బర్రె అప్పుకట్టడంకోసం అమ్మివేశాడు. ఇక ఆ ఊళ్ళో తమబ్రతుకుమారదని పట్టణంలో బ్రతకవచ్చని తలచాడు. పట్టణంచేరి చౌరాస్తాలో చెప్పులు కుట్టడం మొదలుపెట్టాడు. రోజూపనిచేస్తే కాని తమకుటుంబం గడువదు. గ్రామంలో కన్నా పట్టణంలో సమస్యలు అతనిచుట్టూ తిరిగాయి. అక్కడ బందురోజుల్లా అతని కుటుంబం ఆకలికి బలికాక తప్పడం లేదు. అందుకు చెప్పులు కుట్టించుకోవడానికి వచ్చిన వ్యక్తితో మల్లయ్య అన్నమాటలు

''అదేందో రానురాను బరిసెలోడుపోయి తుపాకులోడు, ఈ యిద్దరు పొంగ వద్దైన బాంబులోడు . ఎవరొచ్చిన ఆళ్లాలు బాగానే ఉంటారు. జనాన్ని సంపుతుండ్రు. ఇట్లైతే ఈ లోకం ఉంటదాసారూ'' 5 అన్నాడు. లోకం మోసపూరితమని బలంవున్నవాడిదే రాజ్యమని అలాంటివాళ్ళు తమలాంటి సన్నోళ్లనే అన్యాయం చేస్తారని తెలుసుకోగలిగాడు. సహాయం పేరుతో మోసపోయే హరిజనులకు ప్రతీక ఈ పాత్ర.

**5.1.2.4. అప్పలరాముడు** :- 'యజ్ఞం' కథలో అప్పలరాముడు కథానాయకుడు. రెండెకరాల పొలంవున్న పేదరైతు న్యాయాన్ని గట్టిగా నమ్మేవాడు. ఒకప్పుడు గోపన్నతో కలిసి వ్యాపారంచేసి బాగా సంపాదించినవాడే కాలంతో పాటు కాలగతి మారింది. పరిస్థితులు తారుమారయ్యాయి. తనకు మంచి చేస్తారనుకొన్నవాళ్ళు మోసపుచ్చారు. గోపన్న వ్యాపారంలో నష్టాన్ని చూపించాడు. తత్ఫలితంగా అప్పలరాముడు బాకీపడ్డాడు. న్యాయం తప్పని మనిషి, మాలవాడలో మాటపై నిలబడేవాడు. అందుకే ఒకసారి గోపన్నతో ''బాబయ్యా నువు జంకనక్కరనే లేదు నా బొందిల పేనం వుండగ నీ డబ్బుకి తకరారుండదు''6 అంటాడు. గోపన్న అప్పుతీర్చడంకోసం ఇతనికిచ్చిన గడువుపూర్తి అయింది. పంచాయతీ పెద్దలు అప్పుక్రింద గోపన్నకు అప్పలరాముడు భూమిచెల్ల గట్టాలని చెప్పారు. అప్పటికైనా అప్పలరాముడు ఆ అప్పు మోసం అని అనలేదు. తనకు జరిగిన అన్యాయం గురించి ఆలోచించలేదు. పంచాయతీ పెద్దలు తీర్పుమార్చుకోలేదు. తన ఆస్తిని గోపన్నకు ఇచ్చేశాడు. కథలో ధనవంతులు పేదవారికి చేసే మోసంలో ఒక పాత్ర అప్పలరాముడు.

**5.1.2.5. నాగన్న** :' ఉచ్చు' కథలో నాగన్న కథానాయకుడు. మూడెకరాల ఆస్తిపరుడు. తమ చేతుల కష్టంతో పొలాన్ని సాగుచేశాడు. భూమిమీద నమ్మకం వున్నవాడు. పంట పండితే సుఖంగా బ్రతకవచ్చునని తలచాడు. పొలంలో పంట పెట్టడంకోసం డబ్బు అవసరమై తన కొడుకును వెంకటరెడ్డి ఇంట్లో జీతంపెట్టాడు. నాగన్నకొడుకు రెండురోజులకే రెడ్డిచేత దెబ్బలు తిని వెళ్లిపోయాడు. నాగన్న తన చెట్టంత కొడుకొ తమనుండి దూరమైనాడని బాధపడ్డాడు. కాని రెడ్డిని ఎదిరించే ధైర్యం నాగన్నకు లేదు. తన కొడుకును రెడ్డి కొట్టినందుకు లోలోనే మానసికంగా వ్యధచెందాడు. తప్పు రెడ్డిని దూషించలేదు. కొడుకుపోయినప్పటినుండి నాగన్నకు రెడ్డితో తనజీతం తిరిగి ఇవ్వమని ఒకటే గోల అయింది. పంచాయతీ పెద్దలు డబ్బు కట్టమన్నారు. డబ్బులేని నాగన్న ''రెండువాన సినుకులు వడితే శినిక్కాయ యేసుకుంటాం స్వామీ పంటపండినంక అంతో ఇంతో సేతికొస్తే మీకీకుండా యాడికిపోతాము''7 అన్నాడు. అయినా ప్రయోజనం లేకపోయింది. తనకొడుకు ఏమయ్యాడో ఎటుపోయాడో అని సతమతమవుతున్న నాగన్న బాధ గురించి పంచాయతీ సభ్యులు పట్టించుకోలేదు సరిగదా, బాకీతీర్చేంతవరకూ రెడ్డి తన పొలాన్ని లాగేసుకొన్నాడు. నాగన్నకు జరిగిన అన్యాయాన్ని ఇతరులతో చెప్పుకోలేక చెప్పినా వినే దిక్కు లేక కూలబడిపోయాడు. తన భూమి పై పెట్టుకొన్న ఆశలు అడియాశలయ్యాయి. తనబ్రతుకు మొదటికే వచ్చింది. 'బ్రతుకుదామని బావిత్రవ్వితే బండపడ్డట్లు ' అనే చందాన అతని జీవితం తయారైంది.

**5.1.2.6. మాకడు** :- 'మేకు' కథలో మాకడు హరిజనరైతు. రెండెకరాల భూస్వామి. పొలాన్ని ప్రాణప్రదంగా చూసుకొనేవాడు. ఎప్పుడైనా ఆ పొలం తన కష్టాలను గట్టు ఎక్కించకపోతుందాని తలచేవాడు. మాకడు కులంతక్కువైనా గుణం గొప్పది. మాటమీద నిలబడేవారు. తన పొలాన్ని పంట పెట్టడంకోసం మాధవనాయుడు వద్ద అప్పుచేశాడు. తన పొలం పండితే మాధవనాయుడి అప్పు తీర్చాలనుకొన్నాడు. కాని అతని దురదృష్టంవల్ల కాల పరిస్థితులు మారాయి. తన పొలం ఒకసారి అతివృష్టితోనూ, మరోసారి అనావృష్టితోనూ పంటదక్కలేదు. అప్పు రెండింతలు పెరిగింది. ఇన్ని ఇబ్బందుల కారణంగా మాకడు మాధవనాయుడి బాకీని వడ్డీలేకుండా తీర్చడానికి జయరామయ్య అనే మధ్యవర్తి సహాయం కోరాడు. అతని చేతిలోనే మోసపోయాడు. ఆలోచనలేని మాకడు జయరామయ్య మాటలు నమ్మి తన ఆస్తినే

మాధవనాయుడుకు అమ్మేశాడు. లేని ఆశలతో జయరామయ్య తిరుపతిలో రిక్షా పెట్టించాడు. ఆ రిక్షావల్ల మాకడికి డబ్బు రాలేదు సరికదా రిక్షా నే పంచర్ అయింది. కష్టాల్లో వున్న మాకడు తనను ఆదుకోమని జయరామయ్యను సాయంకోరితే అతనిని నిట్టనిలువునా నడియేటిలో ముంచివేశాడు. ఇక జీవితంలో కోలుకోలేక పోయాడు మాకడు. ఈ పాత్ర అమాయకులైన హరిజనులు కష్టాల్లో సవర్ణులను సాయంకోరితే ఏమవుతుందో తెలియజేస్తుంది.

**5.1.2.7. మాకడు, మంగి** :- 'పొద్దుకుంకింది' కథలో మాకడు , మంగి ,భార్యా భర్తలు. కథలో నాయికానాయకులు. వీళ్లది పెద్ద కుటుంబం. రోజూ కూలీకివెళ్లితేగాని సంసారం గడవదు. మంగి రోజూ కట్టెలుకొట్టి తనవంతు సహాయాన్ని కుటుంబానికి అందించేది. కాల పరిస్థితులు మారి రాబడి తక్కువై ఖర్చు ఎక్కువయింది. పోషణ భారం పెరిగింది. ఏరోజైనా కూలీకి వెళ్ళనినాడు ఆ కుటుంబం ఉపవాసం చేయాల్సిందే. మాకడి కుటుంబానికి దారిద్ర్యం దాపురించింది. భార్యాభర్తలు ఇరువురూ అనారోగ్యంతో మంచం పాలయ్యారు. తత్ఫలితంగా వారి సంతానం ఆకలిపాలైంది. పిల్లలు ఆకలికి తాళలేక వీరారెడ్డి పొలంలో రెండు చెనగచెట్లు పీకితే రెడ్డి ఆ పిల్లలను చావమోదాడు. మాకడు అంతకుమునుపు అదే పొలానికి నీళ్ళు కట్టాడు. మందుకొట్టాడు, కలుపుతీశాడు. తాను చేసిన కష్టానికైనా రెండుచెట్లు తీసుకొనే హక్కు తన పిల్లలకు లేకపోయింది. ఈ పాత్ర హరిజనులకు ముందుచూపు లేకుంటే కష్టాలు తప్పవని హెచ్చరిస్తుంది.

**5.1.2.8. గంగడు** :- 'అజ్ఞాతవాసం' కథలో ఆసాదుగంగడు కథానాయకుడు. కూలీచేసి జీవితం గడుపుతున్నాడు. పట్టణం ఎరగనివాడు. రాజకీయం తెలియనివాడు. శరీరం వంచి పని చేసేవాడు. అలాంటివాడిని ఆ గ్రామ సవర్ణులు రిజర్వుడు పంచాయతీ ప్రెసిడెంటుగా చేశారు. కనీసం సంతకం కూడా చేయడంరాని గంగడు ప్రెసిడెంటు అయిన తరువాత తన బ్రతుకు మారలేదు. తన ఇళ్లు మారలేదు. సరికదా ఎవరూ కూలికి కూడా పిలవటంలేదు. భార్య తెచ్చిన కూలీతో సంసారం గడవక గంగడు ఇబ్బంది పడ్డాడు. తన ఇబ్బందులను గ్రామ పెద్దలతో ''ఏంబాగుస్వామి గ్రామంలో నన్నెవరు పనికి పిలువడంలేదు ఆడదాని రెక్కల కష్టంతో సంసారం జరగడం లేదు........ రాయవరమో రచ్చల దోడ్డో సేరిఏదో ఒక పన్జెసుకొని నాలుగురూకలు సంపాదించుకొంటాను8'' అని చెప్పాడు. గ్రామాల్లో అయితే ఈ గ్రామ పరువు పోతున్నదని దగ్గరలోనున్న తిరుపతికి సవర్ణులు వెళ్లమన్నారు. పంచాయితీ సమావేశం ఉన్నప్పుడు మాత్రం గ్రామానికి రమ్మన్నారు. ఊరువిడచిన గంగడు తిరుపతిచేరి తినడానికి తిండిలేక చేయడానికి పనిదొరకక అష్టకష్టాలపాలయ్యాడు. కష్టం చేసి సుఖంగా బ్రతికే గంగడికి చేయని నేరానికి శిక్ష అనుభవించినట్లుగా ఇబ్బందులకు గురయ్యాడు. ఈ పాత్ర రాజకీయంగా సమాజంలో పాలకవర్గాల భావజాలంలో మార్పుతెచ్చేంతవరకూ సామాజిక మార్పు సాధ్యం కాదని తెలియజేస్తుంది.

**5.1.2.9. ఓబులేసు** :- 'ఊడలమర్రి' కథలో ఓబులేసు భీమప్ప పాలేరు. భీమప్ప చెప్పిన పని చేయడం తలవంచుకొని తిరగడం అతనివంతు. భీమప్ప మాట వేదవాక్కు. అతని మాటకు అడ్డు చెప్పే ధైర్యం ఇతనికి లేదు. గ్రామ పంచాయతీ రిజర్వుడు కావడం వల్ల చాలాకాలంగా వున్న ప్రెసిడెంటు భీమప్ప ఓబులేసును పంచాయతీ ప్రెసిడెంటుగా నిలబెట్టాడు. ఓబులేసుకు ప్రెసిడెంటు పదవి అంటే ఏమో తెలియదు. తాను ఏమిచేయాలో తెలియదు. అతనికి తెలిసిందల్లా ఒక్కటే - భీముడి పశువుల పాకలో, ఎద్దులకు తిండిపెట్టడం, అసలు రేపు జరిగే ఎన్నికల్లో తాను గెలుస్తాడో, ఓడుతాడో నన్న ఆలోచనకూడా లేదు. ఎన్నికలు జరిగి ఓబులేసుగెలిచాడు. ప్రమాణస్వీకారం నిమిత్తం అధికారులు ఓబులేసును కుర్చీపై కూర్చోబెట్టారు. భీమప్ప అది సహించలేకపోయాడు. తనగౌరవం మంటకలిసిపోయిందని అతనిని చావమోదాడు. తాను ఆశించిన పదవిని అంటగట్టి చిత్రహింసల పాలుచేశాడు. భీమప్ప . కథలో ఈ పాత్ర అర్థంకాని పనులు చేయడం వల్ల కష్టాలు తప్పవని హెచ్చరిస్తుంది. అర్హతను సాధించమని మందలిస్తుంది.

**5.1.2.10. భీముడు** :- 'వేట' కథలో భీముడు ధర్మభూషణం పాలేరు. గ్రామ పంచాయతీ రిజర్వుడు ప్రెసిడెంటు. కొద్దో గొప్పో ఆస్తిపరుడు ధర్మభూషణం చేతిలో కీలుబొమ్మ. అతను చెప్పిన పనిచేయడం ఇతనివంతు . అతనిమాటమీదనే ప్రెసిడెంటు అయ్యాడు. కాని అతని స్థితి మారలేదు. సరికదా, తన ఆస్తిని పోగొట్టుకొన్నాడు. ప్రెసిడెంటుగా తనకులంవారికి ఇళ్ళపట్టాల విషయంలో సాయం చేయడానికి ప్రయత్నిస్తే అందుకు భూషణం నుండి ఎదురుదెబ్బ తగిలింది. తనకూతురు సామ్రాజ్యం శీలాన్ని భూషణం బావమరిది శక్తి ప్రసాద్ దోచుకుంటే ఇది అన్యాయమని భీముడు ప్రతిఘటించలేదు, బాధపడలేదు. ధర్మభూషణాన్ని నమ్మిన భీముడు తన సర్వస్వాన్ని ఆయనకే వదలుకోవాల్సివచ్చింది. భూషణంతోపాటు భీముడుకూడా చిరుతపులిని వేటాడడానికి వెళ్లాడు. అడవిలో భూషణం దుప్పిని కాల్చితే బాధపడ్డ భీముడిని చూసి ధర్మభూషణం ''ఇది అన్యాయం కాదు ఆటరా... ఆట.... రాజకీయం ఓ ఆట... సినిమాక్రీడం ఒకాట... గుర్రపందేలు ఓ ఆట... జూదాలన్నీ ఆటలే ఉద్యోగాలివ్వటం ఇప్పించటం ఆట... అయితే ఆటలో కొంతమంది నీలాంటోళ్లు నష్టపోతారు. చస్తేచస్తారు దానికి మనవేం చేస్తాం17'' అంటాడు. వేటలో చిరుత పులిని ధర్మభూషణం చంపినపుడు ఉలిక్కిపడిన భీముడు తమ చేతిలోనున్న తుపాకి ట్రిగ్గర్‌నొక్కాడు తత్ఫలితంగా భూషణం భుజంలో తుపాకి గుండు దూసుకెళ్లింది. మరుసటిరోజే హత్యాప్రయత్నంక్రింద భీముడు జైలుపాలయ్యాడు.

పై కథల్లోని హరిజన పాత్రలను రచయితలు తిరుగబడలేనివిగా శక్తిలేని పిరికివారుగా చిత్రించారు. అందుకే ఆ పాత్రలు తమ భవిష్యత్తుపై ఆలోచన లేకుండా జీవితంలో చైతన్యాన్ని కోరకుండా బానిస శృంఖలత్వాన్ని త్రెంచుకోకుండా సవర్ణులకు దాసులుగానే వుంటూ వారికి ఊడిగం చేయటంలోనే కాలం గడిపాయి. చేయనినేరానికి శిక్ష లనుభవించాయి.

**5.1.3. సవర్ణ సహాయం** :- అమాయకపు హరిజనులను మోసంచేసే సవర్ణులే గాక చేయి అందించి సహాయంచేసే సవర్ణులు కూడా వుంటారనే పాత్రలను పరిశీలించటం ప్రస్తుత కర్తవ్యం.

**5.1.3.1. వెంకడు** :- 'యీరమ్మ' కథలో వెంకడు హరిజనుడు. కథానాయకుడు, తన కూతురే అతని సర్వస్వం. అలాంటి కూతురు అనారోగ్యానికి గురైతే మందుకోసం పూజారి గురవయ్య వద్దకు వెళ్లాడు. తాను బ్రాహ్మణ వీధికి నిషిద్ధం అని తలచేవాడు. అయినా పరిస్థితుల ప్రభావం వల్ల వెళ్లక తప్పలేదు. గురవయ్య వద్ద వెంకడికి మందు దొరకలేదు సరికదా, ఈసడింపు లభించింది. కులంపేరుతో దూషించడం జరిగింది. అయినా వెంకడు గురవయ్యపై ఎదురుతిరగలేదు, ప్రాధేయపడ్డాడు. తనచేతిలో డబ్బులేక మందు దొరక్క కూతురు స్థితిని చూడలేక చావు బ్రతుకుల మధ్య సతమతమయ్యాడు. తనబాధను గ్రహించిన సవర్ణుడైన రామారావు సహాయం లభించింది. తనకూతురు బ్రతికించుకోగలిగాడు. కథలో ఈ పాత్ర ఇతరులపై ఆధారపడటం తప్ప కష్టపడి వాటిని సాధించడానికి ప్రయత్నించలేదు. గురవయ్య దూషిస్తే ఏడ్వడం తప్ప ఎదురించలేక పోయాడు. ఈ పాత్ర సాంప్రదాయానికి చాలా దగ్గరగా చిత్రీకరింపబడింది.

**5.1.3.1. వెంకటప్ప** : 'గుక్కెడు నీళ్ళు' కథలో వెంకటప్ప ఆ గ్రామస్థులు చెప్పినపని చేయడం పెట్టింది తినడం అతనివంతు. ఇతనికి బ్రాహ్మణ వీధి కొన్ని సమయాల్లో నిషిద్ధం. తాను అంటరానివాడని చూడరానివాడని నిత్యం భయపడటం అతని మనస్తత్వం. అందుకే మహాలక్ష్మమ్మ మడినీళ్లు తెస్తున్నప్పుడు ఎదురుపోయి ఆమె ఆగ్రహానికి గురయ్యాడు. ఆమెభర్త కరణం బ్రహ్మయ్యతోటి చెప్పుదెబ్బలు తిన్నాడు. చేయనినేరానికి శిక్షను, అవమానాన్ని భరించాడు. అతనిని అవమానించిన కరణం బ్రహ్మయ్య కలరావచ్చి చనిపోతే వెంకటప్ప ప్రాణ భీతి చెందక మహాలక్ష్మమ్మకు సహాయపడి బ్రహ్మయ్య శవానికి దహనక్రియలు చేసి అనారోగ్యాన్ని తెచ్చుకొన్నాడు. నడివీధిలో కలరాతో వెంకటప్ప పడిపోతే ఒక బ్రాహ్మణ వితంతువు ఆ దారినుండి

వస్తూ ''అయ్యో నీయమ్మ కడుపుకాల, వెధవవాళ్ళం, బ్రాహ్మణులం, మడినీళ్ళు తెస్తుంటే చెప్పనక్కరలేదురా కొంపతీసేవు''9 అంటూ మడినీళ్ళు అతనిపై చల్లింది. గ్రామస్తులందరి కష్టాల్లో పాలుపంచుకున్న వెంకటప్పకు తన కష్టాల్లో ఎవరూ ఆదుకోలేదు. ఆదుకోమని ఎవరినీ ఆశించలేదు. చివరకు మహాలక్ష్మమ్మ సాయం చేసింది. తన ఆస్తినంతా వెంకటప్ప పేర వ్రాయించి చనిపోయింది. ఒకప్పుడు తానంటే అసహ్యించుకొన్న మహాలక్ష్మమ్మ చివరికి వెంకటప్ప ఒడిలోనే ప్రాణాలను కోల్పోయింది.

**5.1.3.2. అన్నపూర్ణ భాస్కరులు:** 'అయ్యోపాపం' కథలో అన్నపూర్ణ భాస్కరులు హరిజన దంపతులు. నిత్యం కష్టించి పనిచేసే దంపతులు. కూలీకెళ్లితేగాని కడుపునిండని వాళ్ళ సంసారం ఒకనాడు తన తల్లి చావు బ్రతుకుల్లో వుందని తెలిసిన అన్నపూర్ణ భర్త భాస్కరునితో బయులుదేరింది. వేసవి కాలం అగుటచే తీవ్రదాహంవేస్తే దారిలోవున్న చలివేంద్రం దగ్గరకు వెళ్ళారు . అక్కడ వీరికి కులం పేరుతో దాహం తీరలేదు సరికదా, అక్కడనుండి గెంటివేయపడ్డాడు. గంగకు అంటు, ముట్టు లేదంటారు. అయినా బ్రాహ్మణులు అక్కడ పాటిఛారు. తమదాహంతీరని దంపతులు తీర్చుకోవడం కోసం అగ్రహారంలో ప్రయత్నిస్తే అక్కడకూడా దాహంతీరక ఊరివెలుపలివరకు నెట్టివేయబడ్డారు. అయినా బ్రాహ్మణులు తమకు అన్యాయం చేస్తున్నారని నోరు మెదపలేదు ఆ దంపతులు. కర్మ సిద్ధాంతంతో ముడిపెట్టుకొన్నారు. దాహంతో ఊరివెలుపల చెట్టుక్రింద వున్న ఆ దంపతులకు ఒక ముస్లిం దాహార్తి తీర్చాడు. చివరకు భాస్కరుడు ''మేము మాలాళ్ళం అదంతా మంచి నీళ్లయినా యివ్వని మాయ సంఘం బాబు''10. అని బ్రాహ్మణులను గురించి ముస్లింతో అన్నాడు. కథలో రెండు పాత్రలు అస్పృశ్యతవల్ల అవమానం పాలుకాబడినవే. నీళ్ల దొరక్క దాహాన్ని తీర్చుకోలేక ఇబ్బందులకు గురైనవే. ఈ పాత్రద్వారా రచయిత బ్రాహ్మణులు పెట్టే సంప్రదాయాలను పాటిస్తూ ఇంకా ఇబ్బందులకు గురికాక చైతన్యం వైపు పయనించమని సలహా.

**5.1.4. హరిజన బలి** : స్వశక్తితో బ్రతకలేని హరిజనులు సవర్ణుల స్వార్థ ప్రయోజనాలకోసం బలైనారు. అలాంటి పాత్రలను గురించి పరిశీలిద్దాం.

**5.1.4.1. రూప** :- 'అంటరాని బాలిక' కథలో రూప కథానాయిక, అందగత్తె, పాచిపనులు చేయడం ఆమెవృత్తి. అభిమానవతి. తన అందం సవర్ణులకు ఈర్ష్యను పెంచింది. సవర్ణుడైన జ్ఞాను చేత ప్రేమించబడింది. కులం తక్కువ కారణంగా ఎన్నో అవమానాలను చవిచూసింది. తనతండ్రి అనారోగ్యానికి గురైతే జ్ఞానుతప్ప సవర్ణులందరూ సహకరించడానికి నిరాకరించారు. ఇంట్లోపనిచేస్తూ వంట పాత్రలను తాకినందుకు జ్ఞాను తల్లి రూపను కొట్టింది. అదే ఆమెకు కలరావస్తే రూపదగ్గరుండి సపర్యలు చేసింది. తిండిలేక ఎన్నోరాత్రులు ఉపవాసాలు చేసింది. జ్ఞాను తల్లి ని బ్రతికించింది. జ్ఞానూను కలరానుండి బ్రతికించింది. ఆ కలరాలోనే చిక్కుకొని రూప బలైంది. కథలో ఈ పాత్ర కష్టాలన్నవి కేవలం హరిజనులకేనని నిత్యం వారి జీవితాలు కష్టాల కడలి అని నిరూపించింది.

**5.1.4.2. నరిసి** : 'కొత్తచెప్పులు' కథలో నరిసి ఆదిగాడిభార్య, భర్తపోతూ మిగిల్చిన ఉద్యోగాన్ని సాగిస్తూ సంసారాన్ని పోషిస్తోంది. గ్రామస్తులకు చెప్పులు కుట్టించి ఇవ్వడం ఆమె ఉద్యోగం. ఇచ్చింది పుచ్చుకోవడం తప్ప కష్టానికి తగిన ఫలితాన్ని గురించి ఆలోచించే శక్తిగాని ఆశించే శక్తిగాని ఆమెలో లేదు. సవర్ణులంటే ఆమెకు భయభక్తులు నరనరాల్లోనూ ప్రవహిస్తాయి. ఒకసారి గ్రామపెద్ద చిన్నపరెడ్డికి చెప్పులు తయారుచేసి ఇవ్వడంలో ఆలస్యమైనందుకు అతనిచేతిలో హత్యకు గురైంది. తోటి హరిజనులే రెడ్డి ఇచ్చేడబ్బుకోసం కక్కుర్తిపడి ఆమె శవాన్ని బావిలోవేసి ఆత్మహత్య చేసుకొన్నదని పోలీసులకు రిపోర్టు చేశారు. ఆమె చావుకు సాక్ష్యం లేకపోయింది. ఆమె పిల్లలు దిక్కులేనివారయ్యారు. రెడ్డి అహంకారానికి అన్యాయంగా బలి అయింది నరిసి.

**5.1.4.3. రామి** : 'ఊరిబాయి' కథలో రామి హరిజనస్త్రీ. కథానాయిక, కూలీకి వెళ్లితే గాని పూట గడవని సంసారం ఆమెది. కూలీకి వెళ్లనినాడు నీళ్లతోనే ఆకలిని తీర్చుకుంటుంది. వాడలో నీళ్లులేక ఆకలికి తాళలేక ప్రాణంపై తీపితో ధైర్యంచేసి సవర్ణుల బావికి వెళ్లింది. సవర్ణుల ఆగ్రహానికి ఈసడింపులకు, దెబ్బలకు గురైంది. హరిజనులు అగ్రవర్గాలమధ్య ఘర్షణకు కారణమైంది. అందులో హరిజనులకు అవమానం తప్ప అన్యం వుండదని తెలుసుకొన్న రామి ''బాయి సర్కారోళ్లు తవ్విరి పెత్తనమేమో గీళ్లదాయే బాయిలన్నీ ఎండిపోయే అందరు పంచుకొని తాగాల్నాయే ఇక ఎవల్లు తాగకుండా కావాలే గీళ్ల రోగం కుదురాలే''11 అంటూ తన కూతురుతో పాటు బావిలో పడింది. తనకు జరిగిన అన్యాయాన్ని ప్రతిఘటించే ధైర్యంలేక తమ హక్కులను సాధించుకోలేక ఎదుటివాణ్ణి కూడా ఆ హక్కులకు దూరంగా వుంచడానికి ప్రయత్నించింది. తాను అనుభవించని తన హక్కులను ఎదుటివాడు కూడా అనుభవించడానికి అనర్హుడని ఈ పాత్ర చెబుతుంది.

**5.1.4.4. ఇసాకు** : 'చెలమ' కథలో ఇసాకు కథానాయకుడు. అతను గ్రామంలో సవర్ణుల సాయంతోనే కొంతభూమిని సాధించాడు. సవర్ణుల సాయంలేకపోతే తాము బ్రతకలేమనేది అతని మనస్తత్వం. అందుకే సవరులు చెప్పినట్టు వినడం అతని అలవాటు. ఎండాకాలంలో నీటి సమస్యవల్ల ఆగ్రామస్థులు క్రొత్త బావి త్రవ్వారు. అందులో నీళ్లు పడకపోతే నాయుడు ఇసాకును తన బ్రొటనవేలిని బలి ఇవ్వమన్నాడు. అందుకు ఇసాకు నోరు మెదపకుండా అంగీకరించాడేగాని ప్రాణంమీద తీపితోనైనా అతను నిరాకరించలేకపోయాడు. ఒకవేళ నిరాకరిస్తే ఇక ఆ ఊరిలో తాము బ్రతకడం కష్టమని భయపడ్డాడు. సవర్ణులకు తమ కుటుంబం నీటికోసం పడేపాట్లను తెలిపి ''గొడ్లు చెరువులోకి దిగి నీళ్లు తాగితే తప్పులేనప్పుడు మాదిగోడు చెరువులోకి దిగడంలో తప్పేందని''12 అంటూ తమ కుటుంబానికి క్రొత్త బావిలో నీళ్లు తీసుకోవడంకోసం ప్రయత్నించాడు కాని ఫలితం లేకపోయింది. సవర్ణులకు ఎదురు తిరిగితే తమ కుటుంబం కష్టాల పాలవుతుందని తనకుటుంబంకన్నా తానే కష్టాలకు గురవడం మేలని ''నాయుడుగోరు జలపడటానికి మాదిగోడి నెత్తురు పనికొచ్చిందంటే అట్టనే నెత్తురు ఇత్తానయ్యా''13 అన్నాడు. తన బలికిబావిలో నీళ్లుపడ్డాయి. అయినా అతని కుటుంబం మాత్రం ఆ బావిని అంటకుండా దూరంగా వుండిపోవాల్సి వచ్చింది. తాను కష్టపడితే ఆ ఫలితాన్ని సవర్ణులు అనుభవించడం ఈ కథలోని పాత్రలో కన్పిస్తుంది.

**5.1.4.5. హరిజన పాత్రలు** : 'పుల్లంరాజ్యం' కథలో హరిజన పాత్రలు వ్యక్తిగతంగా కన్పించక ఉమ్మడిగా దర్శనమిస్తాయి. ఈ పాత్రలు సంప్రదాయాలను తు.చ. తప్పకుండా పాటించడానికి ప్రయత్నిస్తాయి. అసమానతలు అనేవి అవసరం అని నొక్కి చెబుతాయి. హరిజనులందరూ సమానంగా వుండాలని రాజు ప్రకటిస్తే, మాలలు అందుకు నిరాకరించడం, మాదిగలు తమ కులంతో సమానం కాదని తమ రెండు కులాలను సమానం చేసే ప్రసక్తిలేదని రాజుకు మాలలు విన్నవించడం తత్ఫలితంగా రెండు వర్గాలు ఘర్షణకు దిగడం కన్పిస్తుంది.

**5.1.5. హరిజన సహాయం** : హరిజనులు తమలోతామే సహాయపడుకోవాలని తెలియజేసే కథలను పరిశీలిద్దాం.

**5.1.5. రాంకోటి** : 'పశ్చాద్భూమి' కథలో రాంకోటి కథానాయకుడు అతనివృత్తి పాకీపని. ఊళ్ళోని పాకీదొడన్నీ శుభ్రం చేయడం అతని కర్తవ్యం. తన ఉద్యోగాన్ని గౌరవంగా చూసుకొంటాడు. కులవృత్తికి ఏవీ సాటిరావనే తలంపు వున్నవాడు. నిత్యం పెంటకుప్పల మధ్యనే అతని జీవితం. దొడ్లను శుభ్రంచేసి తెచ్చిన ఎరువును దిబ్బలుగా గట్టి అమ్ముతాడు. ఆ ఎరువును సవర్ణులు తమ పొలాలకు తీసుకెళ్లుతారు కాని, అతనికి మాత్రం దూరంగా వుంటారు. పరిసరాలన్నింటినీ శుభ్రం చేసే రాంకోటి తాను అనారోగ్యానికి గురైతే డాక్టరు ముట్టుకోడు. ఆసుపత్రి ప్రవేశం అసలు వుండదు. కాలం మారినా పరిస్థితులు మారినా

రాంకోటి మాత్రం శాశ్వతం. అతని స్థానం మాత్రం పదిలం. ఒకసారి రాంకోటి తనవృత్తిని వారసత్వంగా తన చిన్నకొడుకు రాంకోటికి ద్వారా దత్తం చేశాడు. రాంకోటి పట్టణంలో తనకొడుకు ఇంటివద్ద వాళ్ళ రెండురోజులు ఆలస్యంగా వచ్చిన పాకీమనిషిని దూషిస్తుంటే సాటిమనిషిగా బాధపడ్డాడేకాని వారిని వ్యతిరేకించలేకపోయాడు. పట్టణం నుండి వస్తున్న రాంకోటి రైళ్ళో వాంతులకు గురైతే తోడి ప్రయాణికులు సహించుకోక దారిమధ్య స్టేషన్‌లో బలవంతంగా వదిలేసి వెళ్ళిపోయారు. ఇతను సమాజానికి దూరంగా వుంటూ సమాజంని పవిత్రంగా వుంచడానికి ప్రయత్నిస్తాడు. తాను మాత్రం అపవిత్రంగానే వుంటాడు. ఒకసారి రాంకోటి ఎరువుగుంతలో పడి చావు బ్రతుకుల మధ్య ఊగిసలాడుతుంటే సవర్ణులు అతనిని చూసి జాలిచూపుతున్నారేకాని కాపాడటానికి ప్రయత్నించలేకపోయారు. తోటి పాకీమనిషి తనకొడుకు చిన్న రాంకోటి అతనిని కాపాడాడు. కాలంమారినా హరిజనులు ఇంకా కొంతమంది తమవృత్తులనే పట్టుకొని వ్రేలాడుతున్నారనడానికి ఈ పాత్ర ఉదాహరణ.

**5.1.6. హరిజన ప్రయత్నం** : హరిజనులు తమ హక్కులను సాధించుకోవడానికి ప్రయత్నించాలి అని బోధించే కథలను పరిశీలిద్దాం.

**5.1.6.1. రాముడు** : 'ఊరబావి' కథలో రాముడు చెప్పులు కుట్టే కార్మికుడు. ఊళ్ళోవాళ్ళకు చెప్పులు కుట్టించడం వాళ్ళు ఇచ్చింది పుచ్చుకోవడం అతని రివాజు. బానిసబ్రతుకు బ్రతకడానికి అలవాటుపడ్డాడు. దాస్యత్వం అతని హృదయంలో అణువణువునా దాగివుంది. కర్మసిద్ధాంతంపై ఆధారపడి బ్రతికేమనిషికథలో మనకు ఎక్కడచూసినా చెప్పులు కుట్టేపాకలోనే దర్శనమిస్తాడు. తనకోడలును ఊరబావి వద్ద సవర్ణ యువకుడు చేయిపట్టుకొన్నాడంటే హరిజనులంతా కోపోద్రిక్తులైతే మాత్రం ''వాడిపాపం వాణ్ణే గొట్టుద్ది ఐనా ఎందుకేందీ కవర్లాట నోరు మూసుకొండెసే అల్లరీ అదమాయింపులూ ఏందీగోల ఏచెర్లో కప్పలా చెర్లోనే ఇవడాలిగందా''14 అంటాడు. ఈ మాటల్లో అతని పిరికితనం స్పష్టమవుతుంది. తాను పిరికివాడై తన కొడుకును పిరికివాడుగా తయారుచేశాడు. అతనిచూపులు కూడా ఎదుటి వాడి కాళ్ళవైపే చూస్తాయి. బావిలో ఎద్దుదట్టెం వ్రేలాడదీశాడన్న నెపంతో మునసబు తండ్రి కొడుకులను చావమోది చావడిలో కట్టేస్తే ఏతప్పు చేయలేని రాముడు ఎదురు తిరగలేకపోయాడు. అర్ధరాత్రిలో రాముడికోడలు కట్లు విప్పి ఇంటికెళ్లమని హెచ్చరిస్తే మునసబు వస్తే ఏంజరుగుతుందోనని అక్కడే కట్లు కట్టుకొని కూర్చున్నాడు. కొడుకు పోవడానికి ప్రయత్నిస్తే ''ఒరే బాబు నువ్వు పిల్లోడివిరా ఈళ్లని తుస్కారించి బతకటం కట్టంరా ఆళ్లొకటెత్తే నువ్వొకటెత్తావ్...''15 అంటూ వారించాడు. కథలో ఈ పాత్ర నిత్యం అణగారినతనంతో కొట్టుమిట్టాడుతుంది. ఈ పాత్ర జీవితంలో ఇతరులను సుఖపెడుతుంది. కానీ తాను మాత్రం సుఖపడదు.

**5.1.7. హరిజన మౌఢ్యం** : హరిజనులు తమ హక్కులను సాధించుకోవటంపట్ల ప్రవర్తించిన తీరును కథానిక ద్వారా పరిశీలిద్దాం.

**5.1.7.1. రేవమ్మ** : 'మలుపు' కథలో రేవమ్మ కథానాయిక. ఆమెది బీద సంసారం. భార్యాభర్తలు కూలీ, నాలీ చేసి సంసారం సాగించేవారు. గ్రామ హరిజనవాడలోని మంచినీటి బావిలో ఫ్లోరిన్ అధికశాతం వుండటంవల్ల రేవమ్మ భర్త వాటిని త్రాగి అనారోగ్యానికి గురయ్యారు. రేవమ్మ తనభర్త బ్రతకదని బాధపడుతుందేగాని, అతని అనారోగ్యానికి కారణం ఏమిటని ఆలోచించలేదు. జాతరపేరుతో కోళ్ళు కోయడానికి ప్రయత్నించిందికాని, వైద్యంకోసం డ్యాక్టర్‌వద్దకు తీసుకెళ్ళలేదు. మానవుడు ఇంకా అనాగరిక స్థితిలోనే బ్రతుకుతున్నాడనడానికి రేవమ్మ పాత్ర సాక్ష్యం. కాలం మారినా మూఢాచారాలను పాటిస్తూ వాటిలోనే క్రుంగిపోవడానికి ప్రయత్నించింది. నాగరికమైన మనిషిగా ఆలోచించలేకపోయింది.

**5.1.7.2. కొమురు :** 'ఆచూకీ' కథలో కొమురు కథానాయిక, అమాయక యువతి, బూడిద లింగయ్యను ప్రేమించింది. ప్రేమించినవాడు పెళ్లి చేసుకొంటాడని నమ్మింది. జీవితాన్ని లింగయ్యతో సుఖంగా సాగించవచ్చని తలచింది. కాని, కాలం అడ్డం తిరిగింది. లింగయ్య మాటలు నమ్మిన కొమురు ఆర్నెల్ల గర్భవతి అయ్యింది. పంచాయతీలో తనకు న్యాయం చేయమని పెద్దలను అడగలేకపోయింది సరికదా అందరిచేత అవమానం పాలయ్యింది. ఒకప్పుడు తనతో లింగయ్య సరాసాలాడుతూ తన అందాన్ని గురించి పొగుడుతున్నప్పుడు మురిసిపోయింది. కాని తాను చేస్తున్నది తప్పని ఆలోచించలేకపోయింది. తనకు జరిగిన అన్యాయానికి పంచాయతీ పెద్దలుకూడా అడ్డుకోలేకపోయారు. తత్ఫలితంగా లింగయ్య తనభర్తకాలేదు సరికదా పరాభవాన్ని చవిచూసింది. కథలో ఈ పాత్ర అవమానాలకు ప్రతీకగా నిలిచి జరిగిన అన్యాయాన్ని ప్రతిఘటించలేకపోయింది. సాటి మనుషులు కూడా సాయం చేయలేకపోయారు.

**5.1.8. హరిజన స్వయంకృషి :** హరిజనులు స్వతంత్రంగా ఆలోచించే ధోరణి వుండాలని బోధించే కతలను పరిశీలిద్దాం. హరిజన విద్యార్థి 'వేపచెట్టు' కథలో హరిజన విద్యార్థి డాక్టర్‌కోర్సు పూర్తిచేశాడు. ఉద్యోగం కోసం వెంపర్లాట మొదలుపెట్టి వుండవచ్చు. బహుశా అతని ఆలోచనా రాహిత్యమే కావచ్చు. కథలో ఈ పాత్ర ఆలోచనలేని చదువు వ్యర్థమని స్వయం ఉపాధి పథకాలను చేపట్టి స్వతంత్రులుగా బ్రతకమని అంతేగాని, ఇతరులపై ఆధారపడి బ్రతకడం ఇంకా బానిసబ్రతుకే అవుతుందని ప్రబోధిస్తుంది.

**5.1.9. హరిజన విచ్చిత్తి :** మూర్ఖంతో తమను తామే మోసపుచ్చుకొంటున్న హరిజన జీవితాన్ని గమనిద్దాం.

**5.1.9.1. శ్రీనివాసులు :** 'తల్లిమట్టి' కథలో శ్రీనివాసులు కథానాయకుడు. బ్యాంకు ఉద్యోగి ఆత్మన్యూనతాభావం కలవాడు. అన్నింటా తన కులం తక్కువనే అభిప్రాయం గలవాడు. సమాజంలో తనకులాన్ని చెప్పుకోవడానికి వెనుకాడి తన ఉన్నతిని సాధ్యమైనంత గొప్పగా చెప్పుకోవడానికి ప్రయత్నించాడు. తన సవర్ణుల మిత్రులవద్ద తన పరువును కాపాడుకోవడం కోసం ఉన్నతిని పెంచుకోవడం కోసం అనవసరంగా ఖర్చుపెట్టడం, తమ కుటుంబాన్ని గురించి గొప్పగా చెప్పుకోవడం తన బంధువులు పెద్ద పట్టణాల్లో కాపురముంటున్నారని చెప్పటం అతని అలవాటు. తన స్థాయిని పెంచుకోనడంకోసం సంబంధంలేని గొప్ప విషయాలను సంబంధం ఉన్నట్లుగా చెప్పటం అతని రివాజు. తన వ్యకిత్వాన్ని కాపాడుకోవడంకోసం ఆత్మవంచన చేసుకొని ప్రవర్తించడం ఈ పాత్రలో స్పష్టంగా కన్పిస్తుంది. సమాజంలో తనజాతిని సవర్ణులు నీచంగా చూసే పరిస్థితిని ప్రతిబింబిస్తుంది. ఒకసారి శ్రీనివాసులు కథకుడితో రెడ్డీస్ అమ్మాయిని ప్రేమించానని కులం కారణంగా ఆమె తనను వివాహమాడటానికి నిరాకరించిందంటాడు తనకులంలోనే పెళ్లి చూపులకెళ్లి ఆమె ఇంటిని చూసి అలాంటి ఇంట్లో తాను వివాహమాడనని చెప్పటం కన్పిస్తుంది. ఇతనిలో ఆత్మగౌరవం లేదు, పిరికితనం వుంది. విద్యావంతుడైన శ్రీనివాసులు తనకులాన్ని గురించి గొప్పగా చెప్పుకోవడానికి ప్రయత్నించలేదు. తన కులం ఔన్నత్యాన్ని చాటలేకపోయాడు. తన సాంఘికస్థాయిని మరచిపోయాడు. తాను పుట్టిన వ్రేళ్లను తెంచుకొన్నాడు. అతను పుట్టి పెరిగిన వ్రేళ్లు మరోకొత్త వాతావరణంలో ఉన్నాయి. అవి అక్కడ పాతుకోవడం కష్టం.

**5.1.9.2. చింతడు :** 'ఎర్నీళ్లు' కథలో చింతడు నాలుగేళ్ల ప్రాయంవాడు. తిండీగుడ్డ లేనివాడు. ఆకలి బాగా తెలిసినవాడు. ఉదయాన్నే నిద్రలేచి నీళ్లుత్రాగి ఆకలిని తాత్కాలికంగా తీర్చుకోను వంక చేరాడు. అమ్మవస్తే కూలితెస్తే అన్నం వస్తుందని తలచాడు. ఎర్రటి ఎండలో అక్కడే వుండిపోయాడు. వాడికి ఆకలితప్ప అన్యం కన్పించలేదు. ఆకలితీరే మార్గాన్ని ఆలోచించడంలో అక్కడే దిష్టి తీసి వుంచిన వస్తువులు కన్పించాయి. వాడిప్రాణాలు లేచాయి. ఆకలితీరే మార్గం కన్పించింది. ఆ వస్తువులు వాడి పాలిట పరబ్రహ్మస్వరూపంగా కన్పించాయి తప్ప అవి తింటే ప్రాణం ఏమవుతుందోననే ఆలోచన లేకపోయింది. ఆ

వస్తువులను తీసుకొచ్చి నిమ్మరసం చేసుకొని త్రాగి నిద్రపోయాడు. ఇక వాడు ఆకలిని పోగొట్టుకొన్నాడు. అమ్మ అవసరం వుండదు. ఆకలితీర్చుకోగలిగాడు కాని ప్రాణం గురించి ఆలోచించలేకపోయాడు.

**5.1.9.3. కాటడు** : 'వ్యత్యయం' కథలో కాటడు నరసింహులు పాలేరు. నిస్వార్థంతో కష్టించి పనిచేసేవాడు. స్వామిభక్తి పరాయణుండు, ఆపదసమయాల్లో తనప్రాణాలను ఎదురొడ్డి నరసింహులను రక్షించాడు. తత్ఫలితంగా అతని అభిమానానికి పాత్రుడయ్యాడు. కాలం జరిగింది. వారి స్నేహం కాలంతోపాటు అభివృద్ధి చెందింది. చివరిసారిగా తాను సంపాదించిన డబ్బులు నరసింహులుకు ఇచ్చి కష్టసమయాలలో ఆదుకొమ్మని చెప్పాడు. వీరి స్నేహంలో నిస్వార్థం వుంది. కాటుడిలో ఆప్యాయత ఉంది.

**5.1.10. హరిజన పతనం** : తినడానికి తిండిలేక తీవ్ర ఇబ్బందులకు గురైన హరిజన కథలను పరిశీలిద్దాం.

**5.1.10.1. గంగి** : 'శిలువవేసిన మనుషులు' కథలో గంగి కథానాయకురాలు. భర్తపోతూ వారసత్వంగా ఇచ్చిన బండలగనిలో పనిచేస్తుంది. వచ్చిన డబ్బుతో తాను తినీ, తినక తన పిల్లలకు పెట్టికాలం గడుపుతోంది. తమ పిల్లలే తమ ఆస్తిగా భావించేది. తనకొడుకు చదువుచూపి ఉద్యోగం సాధిస్తాడని కలలు కన్నది. తనలాగా వాడు బండలగనిలో పనిచేయకూడదని తలచింది. తన ప్రాణాలను తన పిల్లలపైనే పెట్టుకొని జీవిస్తోంది. ఒకసారి ప్రభుత్వం ఇచ్చిన పాలపొడిని తన పిల్లలు త్రాగి అనారోగ్యానికి గురైతే నోరుబాదుకొంది. తనబాధను చెప్పుకొనే దిక్కులేక చెప్పినా వినేవాళ్ళు లేక తీవ్ర మనస్తాపానికి గురైంది.

**5.1.10.2. రాము** : 'ఏదిగమ్యం' కథలో రాము విద్యావంతుడు. ఆర్థిక ఇబ్బందులకు గురవుతున్నాడు. అయినా విద్యను కొనసాగిస్తున్నాడు. అతని కి ఆర్థికస్థితిలేని లోటు స్పష్టంగా కన్పిస్తుంది. ధనవంతుడైన రవి పనులన్నీ చేసి ప్రతిఫలం పొందుతాడు కాబట్టి ఇతనిలో దిగజారిన స్థితి కన్పిస్తుంది. ఆర్థిక స్థితికోసం ఆత్మాభిమానాన్ని చంపుకొని తనమిత్రుడుకి సేవలు చేయడం కన్పిస్తుంది. తనతండ్రి చేస్తున్న అటెండర్ ఉద్యోగం కారణంగా అతనికి స్కాలర్‌షిప్ రాదు. ఎలాగైనా విద్యనార్జించాలనే తపనలో తన తాత ముత్తాతలు పాలేరుతనం చేసిన ఇంట్లోని వ్యక్తికే బానిసగా మారాడు. ఎలాగైతేనేమి తన అవసరాలను తీర్చుకొంటున్నాడు. ఒకసారి పిల్లలకు స్కాలర్‌షిప్‌ను ప్రభుత్వం ప్రకటించకపోతే తనమిత్రుడు రవి సమ్మెలోపాల్గొనడం వల్ల సమ్మెనుండి రవిని తప్పించడంకోసం తపనపడి ఆ ప్రయత్నంలో తన ప్రాణాలను పోగొట్టుకున్నాడు. రవి చేస్తున్న సహాయానికి రాము మురిసిపోయాడే కాని కష్టానికి తగిన ఫలితం అని సరిపెట్టుకోలేకపోయాడు. మరోవిషయం - రాము విద్యావంతుడైనా నిరక్షరాస్యులైన తన తాతముత్తాతలలాగే ఇతరుల సేవలోనే అంతమయ్యాడు. హరిజనులు కాలంమారినా ఇంకా పతనావస్థలోనే వున్నారనడానికి ఈ పాత్ర నిదర్శనం.

**5.1.10.3. చెప్పులు కుట్టేవాడు** : 'చెప్పులుకుట్టేవాడు' కథలో చెప్పులు కుట్టేవాడు కథానాయకుడు. తన వృత్తిపై నమ్మకం వున్నవాడు. రహదారి కూడలిలో పాతచెప్పులు కుట్టి తన సంసారాన్ని సాగించేవాడు. అతను ఎప్పుడూ తోటి మనుషుల కాళ్లవైపు చూస్తూ వారి చెప్పులు తెగివుంటే చూసి బాధపడేవాడు. కొంతడబ్బు సంపాదించి చెప్పుల షాపు పెట్టాలని ప్రయత్నించాడు. ఒకసారి పోలీసు వచ్చి దారిలోనున్న అతనిని తొలగిపొమ్మన్నాడు. అందుకు లంచమివ్వబోతే జనం ఎదుట ఆ పని చేసినందుకు ''నాలుగు పైసలు జేరేటప్పటికి వళ్లు బలిసింది. వీడి బతుక్కి వీడు పోలీసయ్యకు లంచం యిస్తాడు''16 అనే చివాట్లకు గురయ్యాడు. స్థలం మార్చాడు. డబ్బు సంపాదించాడు. అతని ఆశ సఫలం అవుతుందని చెప్పుల షాపు పెట్టవచ్చని తపనపడ్డాడు. ఈలోగా అతని భార్య అనారోగ్యానికి గురై సంపాదించిన డబ్బుఅంతా ఆమెకు ఖర్చుపెట్టినా ఆమె చనిపోయింది. అతని ఆశ తీరలేదు సరికదా ఆ ఆలోచనే మానుకోవడం కన్పిస్తుంది. ఈ పాత్ర కష్టానికి తగిన ఫలితాన్ని సాధించలేకపోయింది. ఆశకుపోయి తన సంసారాన్ని నాశనం చేసుకొంది.

పై కథల్లోని హరిజన పాత్రలన్నీ తిరగబడలేనివిగా పిరికివారుగా బ్రతకడానికే ప్రయత్నించాయి.

భవిష్యత్తు గురించి ఆలోచన లేకుండా, నూతనత్వాన్ని ఆపాదించుకోలేక దాస్య శృంఖలాల్లోనే బ్రతకడానికి ప్రయత్నించాయి. చదువుకోసం, తిండికోసం, న్యాయంకోసం అర్రులుసాచాయి. తవస్థితిని మార్చుకోవడానికి ప్రయత్నించితే ప్రాణాలను కోల్పోవడం కష్టాలపాలవ్వడంలాంటి సమస్యలు ఎదురైనాయి గాని, వారి కనీస అవసరాలు కూడా తీరలేదు. రాజకీయంగా దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించారే తప్ప సాటిమనిషిగా వ్యక్తిత్వాన్ని నిలుపుకొని జీవించలేకపోయాయి.

## 5.2. పరిణామ దృక్పథం

పందొమ్మిదవ శతాబ్దం సంస్కరణలయుగం అని చెప్పవచ్చు. దేశవ్యాప్తంగా అనేక మంది సంఘ సంస్కర్తలు బయలుదేరారు. సమాజంలో జరుగుతున్న అన్యాయాలను ఎలుగెత్తి చాటారు. అంతవరకూ మూఢాచారాలతో మ్రగ్గుతున్న వారిని వెన్నుతట్టిలేపారు. ముఖ్యంగా పందొమ్మిదవశకం అస్పృశ్యతా నివారణకు గట్టిగ కృషి చేసింది. వారిపట్ల దయ, సానుభూతి కురిపించింది. హిందూసమాజంలో బడుగువర్గాల వారిని సంఘటితపరచి సవర్ణులకు వ్యతిరేకంగా పోరాటం సాగించింది. దేశం మొత్తంమీద అంటరానితనం నిర్మూలనకోసం అనేక సంస్థలు వెలిశాయి. అప్పటినుండి హరిజనులు విద్యావంతులై తద్వారా తమ హక్కులను సాధించుకోవటం మొదలుపెట్టారు. గాంధీజీ వీరికి హరిజనులనే నామధేయం సృష్టించి అస్పృశ్యతా నిర్మూలనకు తోడ్పడ్డాడు. ఇందుకు అంబేడ్కర్ కూడా కారణం కావచ్చు. గాంధీ ''దేశంలో నేనైనా నుండవలెను. అంటరానితనమైనా నుండవలెను గాని, ఉభయులము నుండజాలము''18 అన్నాడు. అప్పటినుండి హరిజనులు తమ పాతపద్ధతులకు, వృత్తులకు స్వస్తిచెప్పి పరిణామ దృక్పథంతో పరిణమించడం కన్పిస్తుంది. ''నాగరిక ప్రపంచంలో మానవుడు అసమానతల నుంచి సమతకు చేరుకుంటాడు. అనాగరికులు అసమానతల బురదలో దొర్లాడుతుంటారు. సాంఘిక అసమానతలకు రుజువు అస్పృశ్యత, చట్టానికి సవాల్ అస్పృశ్యత''19 ఈ అస్పృశ్యతను సమాజంనుండి తరిమివేయడానికి రచయితలు అనేకమంది పరిణామ దృక్పథంతో కథలు రచించారు. వీటిని పరిశీలించుట ప్రస్తుత కర్తవ్యం.

**5.2.1. సవర్ణుల సానుభూతి:-** సవర్ణుల స్నేహంతో తమ పనులను చేసుకొన్న హరిజన కథలను పరిశీలిద్దాం.

**5.2.1.1. విస్సన్న :-** 'ఇలాంటితవ్వాయివస్తే' కథలో విస్సన్న కథానాయకుడు. ఆ గ్రామ వెట్టి పట్టుదల గలమనిషి. తమహక్కులను సాధించుకోవడంకోసం హిందుమతంనుండి క్రైస్తవాన్ని పుచ్చుకున్నాడు. సమాజంచే హరిజన క్రైస్తవుడుగానే ముద్రవేయబడ్డాడు. క్రైస్తవం పుచ్చుకొన్న విస్సన్నకు తమ హక్కులపై ఆశలు రేకెత్తాయి కానీ, అవసరాలు తీరలేదు. గ్రామహరిజనుల నీటిసమస్య ఎదురైతే సవర్ణుల చెరువునుండి నీటిని తీసుకోవడానికి హరిజనులకు న్యాయకత్వంవహించాడు. తమసమస్యను సామరస్యంగా పరిష్కరించుకోదలిస్తే ఆ ప్రయత్నాలు ఫలించలేదు సరికదా ఘర్షణ మొదలైంది. తమ సమస్యను ప్రభుత్వానికి విన్నవించుకొన్నా ఫలితం మాత్రందక్కలేదు.తనకు క్రైస్తవం న్యాయం చేయదని తెలుసుకొన్న విస్సన్న కరీంసాబ్ సహాయంతో ముస్లీం మతం స్వీకరించాడు. విస్సన్న ఇస్మాయిల్ అయి కరణం ఇంట్లోకి సవర్ణుల చెరువులోకి వెళ్లగలిగాడు. అతనికి క్రైస్తవం సాధించలేని హక్కులను ముస్లింమతం సాధించిపెట్టింది. కథలో ఈ పాత్ర ఏ విషయాన్ని సాధించాలన్నా దానివెనుక సామాజిక శక్తి అవసరం అని తెలుపుతుంది. ఆ పాత్రకు ముస్లింల సహాయం ఉండటంవల్ల ప్రగతిని సాధించగలిగింది.

**5.2.1.2. కిరస్తానీ పంతులు :-** 'ఇలాంటితవ్వాయివస్తే' కథలో కిరస్తానీ పంతులు మునుపు మాలవెంకడు. ప్రస్తుతం క్రైస్తవమతంలో ఉద్యోగి. పట్టుదలగల మనిషి. తాను ప్రస్తుతం క్రైస్తవుడైనా సవర్ణులు అతనిని హరిజనుడుగానే చూడటం సహించలేకపోయాడు. అతను క్రైస్తవం స్వీకరించి విద్య ఉద్యోగం సాధించాడు కాని అస్పృశ్యతను మాత్రం అంతం చేసుకోలేకపోయాడు. హరిజనుల నీటి సమస్యను పరిష్కరించడానికి

సవర్ణులతో ప్రతిఘటించడం కోసం ప్రయత్నించాడు. కానీ ప్రయోజనం లేకపోయింది. ''మాదిగనయి నరకం అనుభవించాను కిరస్తానీనయ్యాక ఆశలు మాత్రం రేగాయి''20 అని అనుకొన్నాడు. సవర్ణులకు అజ్ఞానం, మూర్ఖత్వం అసూయ, ద్వేషం తప్ప అన్యం తెలియదనుకొన్నాడు. తన స్థితిని మార్చుకోవడం కోసం విస్సన్న ముస్లింమతం స్వీకరిస్తానంటే అనుమతించాడు. కథలో ఈ పాత్ర హక్కులను సాధించుకోవడం కోసం తపనపడేదిగా తన జాన్ని సంఘటితం చేసేదిగా చిత్రించబడింది.

**5.2.1.3. హరిజన పాత్రలు** : 'ఇలాంటితవ్వాయివస్తే' కథలో కొన్ని హరిజన పాత్రలు ఉమ్మడి పాత్రలుగా కన్పిస్తాయి. వీరు వీరాస్వామి,గంగులు, నరసింహులులాంటివారు.వీరిలో చైతన్యభావాలు కన్పిస్తాయి. సమస్యకు స్పందించే మనస్తత్వం వుంది. సమస్యను సవర్ణులతో దీనంగా విన్నవించుకొన్నారు. వీరి దీనత్వాన్ని సవర్ణులు అలసత్వంతో చూస్తున్నారని గమనించారు. అందుకే వీరాస్వామి ''ఒక కులపక్షంగా అడుగుతున్నాం మనం, భిక్షంగా కాదు. సమానఫాయకే యిక్కడ చెల్లుబడి''21 అంటూ సమానహక్కు కోసం గర్జించాడు.తమ జీవితాన్ని పట్టి పీడిస్తున్న నీటిసమస్యను పరిష్కరించమని సవర్ణులను కోరారు. తమ సమస్యను తీర్చరాని తెలుసుకొన్న హరిజన క్రైస్తవులు తమ సమస్యను పరిష్కరించుకోవడం కోసం విస్సన్నతోపాటు ముస్లింమతాన్ని పుచ్చుకొన్నారు. సవర్ణులతో సమానంగా ఊరిపెద్ద చెరువులో నీళ్లు తీసుకొన్నారు.

**5.2.1.4. చిదంబరం** : 'ఊరబావి' కథలో రాముడు కొడుకు చిదంబరం. కథానాయకుడు. శరీరసౌష్టవం కలవాడు. అతనిలో ప్రతిఘటించే మనస్తత్వం వుంది. కాని తండ్రిపోసే పిరికిమందు త్రాగి ధైర్యాన్ని తనలోనే దాచుకోవడానికి ప్రయత్నించాడు. సవర్ణులను ఎదిరించి ఊరిలోని వేణుగోపాలస్వామి దేవాలయంలోకి పోలీసుల సహాయంతో వెళ్లి తన మొక్కుబడిని చెల్లించాడు. తత్ఫలితంగా సవర్ణుల ఆగ్రహానికి బలయ్యాడు. మరోసారి రైల్వే స్టేషన్ వద్ద వారితో ఘర్షణపడ్డాడు. ఊరిబావిలో ఎద్దుదట్టెంను వ్రేలాడదీశాడనే నెపంతో సవర్ణులు ఇతనిని ఊరచావడిలో కట్టేసి చావమోదాడు. అంతజరిగినా తండ్రి ఆజ్ఞమేరకు నిస్సహాయుడుగా వుండగలిగాడు. కష్టపడి పనిచేసే మనిషి, నిజాన్ని నిర్భయంగా అంగీకరించే మనిషి అయినా చేయని నేరానికిబలయ్యాడు. ఆ రాత్రి చిదంబరం భార్య చావిట్లో తన భర్త, మామ ల కట్లను విప్పి వెళ్లిపోతే, వారు అక్కడనుండి కదలక మిన్నకుండిపోయారు. చిదంబరం అక్కడనుండి వెళ్లి అవసరమైతే ఘర్షణకు దిగడానికి ప్రయత్నించినా తండ్రి నిరాకరించడం కన్పిస్తుంది. అతని ధైర్యానికి ప్రతిచోట తండ్రి అడ్డుకట్ట కన్పిస్తుంది. మనిషి చైతన్యవంతుడైనా పరిస్థితులు అతనిని నిస్సహాయుడుగా మార్చివేశాయి. ఎదురుతిరిగే మనస్తత్వం అణగారిపోయింది.

**5.2.1.5. వెంకన్న** : 'కొత్తజోడు' కథలో వెంకన్న కథానాయకుడు. వారిది పెద్దకుటుంబం. కుటుంబ పోషణ బరువైంది. దానికితోడు తమపంట సరిగా చేతికిరాక ఒకపూట తినీ, తినక కాలం గడుపుతున్నాడు. అదేస్థితిలో ఆర్థిక మాంద్యం రావడంవల్ల అప్పుచేశాడు. దురదృష్టవశాత్తు రెండు సంవత్సరాలు పంట చేతికి రాలేదు. భీమయ్య అప్పుతీర్చడంలో అలస్యమైంది. అయినా తనకున్న కష్టాలను ప్రక్కబెట్టి తమ అప్పును వడ్డీలేకుండా భీమయ్యకు తీర్చడానికి ప్రయత్నించాడు. అందుకు భీమయ్య చేత నిరాకరింపబడ్డాడు. చేసేది లేక వెంకన్న భీమయ్య అప్పుగురించి అలోచించక మిన్నకుండిపోయాడు. భీమయ్య కోర్టుకెళ్లి వెంకన్న ఆస్తిని గుంజడానికే ప్రయత్నించాడు. వెంకన్న ఆ మోసానికి బలికాక తప్పని పరిస్థితి అయింది. తమ న్యాయంకోసం ఆ గ్రామ సవర్ణుడైన అచ్యుతరావు సహాయం కావలసివచ్చింది. అతనిని కోర్టుకు తీసుకెళ్లేవాడు. ఇద్దరూ తినడానికి తిండిలేక గుంటూరుకు వెళ్లడానికి చేతిలో డబ్బులేక గుంటూరు వరకూ నడిచి వెళ్లేవారు. వెంకన్న అచ్యుతరావు తనకు చేస్తున్న సహాయానికి కృతజ్ఞుడుగా చెప్పుల జతను కుట్టించాడు.

వెంకన్న కోర్టు వ్యవహారంలోనే సతమతమవుతున్నాడు తప్ప కోర్టుతీర్పు రాలేదు. తన జీవితం ఆ తీర్పుతోనే అంతమవుతుందని తలచాడు. తమ ఆకలి కడుపులు చల్లార్చుకోవడంకోసం అప్పులు చేస్తే అవి ప్రాణాంతకానికి వచ్చాయి.

**5.2.1.6. మాదిగమ్మాయి** : - 'మాదిగమ్మాయి' కథలో మాదిగమ్మాయి వేశ్య. బీదకుటుంబంలో పుట్టింది. కథానాయిక చిన్నతనంలోనే వివాహం అయింది. తమ కుటుంబ పరిస్థితుల దృష్ట్యా ఆమెను వెంకటయ్యకు ఉంపుడుకత్తెగా తల్లిదండ్రులే ఉంచారు. కాని, వారి బారినుండి తప్పించుకొని శీలవతిగానే బ్రతకాలనుకొంది. కూలీచేసి జీవించాలని తపనపడింది. కష్టానికి తగిన ఫలితం ఆశించడం ఆమె అలవాటు. కూలీకెళ్ళి మేస్త్రీ కామానికి గురై అతని నుండి తప్పించుకోగలిగింది. ధైర్యంగానే బ్రతకడానికి ప్రయత్నించింది. మరోఫ్యాక్టరీలో పనిచేస్తూ అతనినుండి తప్పించుకోవడంలో దొంగతనం మోసబడి జైలుపాలయ్యింది. స్టేషన్‌లో పోలీసులందరి కామానికి బలైంది. సమాజం తనని శీలవతిగా బ్రతకనివ్వదని తెలుసుకొంది. వేశ్యగానే జీవించడంలో తన ప్రాణానికి అభయం వుంటుందని తలచింది. వేశ్యావృత్తే తమ జీవితానికి శరణ్యమని తలచింది. వెంకటయ్యకు ఉంపుడుకత్తెగానే ఉండటానికి ప్రయత్నించింది. వెంకటయ్య చనిపోగా వేశ్యగానే వుండిపోయింది. డబ్బు ఇచ్చినవాడికల్లా కొంగుపరచింది. తనకు ఇష్టంలేక ఏమగవాడైన ఆమెపై జాలిపడి డబ్బు ఇస్తే వృథాగా డబ్బు తీసుకోనన్నది. తన జీవితాన్ని సాగించడం కోసమే ఆ వృత్తిని చేపట్టినట్లు ఈ పాత్ర చెబుతుంది.

**5.2.1.7. రాముడు** : 'నెంబర్రాళ్లు' కథలో రాముడు కథానాయకుడు. పూర్వం చెప్పులుకుట్టి సంసారం సాగించేవాడు. ఆనాడు అన్నీ మోటబావులుండటంచేత రాబడి ఎక్కువుండేది. ఆహారపదార్థాలన్నీ ఉచితంగా తెచ్చుకొనేవాడు. గ్రామంలో సవర్ణుల ఆజ్ఞమేరకు ఏ తోటలోని మోట చినిగిపోతే అక్కడికెళ్లి మోట కుట్టించేవాడు. చెప్పులు కుట్టించడంలో పిల్లలకు మాయమాటలు చెప్పి రెండు, మూడు రకాల ధాన్యాలు తెప్పించుకొనేవాడు. కాలం మారింది. నేడు కరంటుబావులు రావడంవల్ల మాదిగరాముడి బ్రతుకు చింపిన విస్తరిలా అయింది. తనను పలకరించేవాడు లేడు సరికదా, తనకి తిండిగింజలు కూడా పెట్టేవారు కరువయ్యారు. దానికితోడు కుటుంబం పెరిగింది. కాలంమారింది. పరిస్థితులతోపాటు వృత్తులు మారాయి. కాని అతనుమాత్రం మారలేదు. అందుకే రాముడు కథకుడితో ''ఏంజెయ్‌మంటారు సెప్పండి సామీ.... ఈ కరంటు రానన్నా వచ్చింది మోటకట్టే నాధుడే లాకపాయ....పొట్టకింత గంజిదొరికేది గెగనమైపోతా వుండాది''22 అని తన బాధను వెళ్లబుచ్చగలిగాడు. కథలో ఈ పాత్ర వృత్తులు మారినా మానవుడు ఏర్పరచుకొన్న కులవ్యవస్థ మారలేదని తెలియజేస్తుంది.

**5.2.1.8. కాటన్న,సోమాలు** : 'సాగరసంగం' కథలో కాటన్న మాలకులస్థుడు. కథానాయకుడు, తల్లితండ్రుల చాటున బ్రతుకుతున్నాడు. పేర్రెడ్డి ఇంట్లో పాలేరు. సోమాలు మాదిగ కులస్తురాలు, కథానాయిక. తల్లిలేక తండ్రి పెంపకంలోనే పెరిగింది. కాటన్న, సోమాలు ఇద్దరూ ప్రేమించుకున్నారు. కులంవేరైనా కష్టసుఖాల్లో ఇద్దరూ భాగస్థులయ్యారు. వీరిద్దరూ వివాహం చేసుకోదలిస్తే కులం అడు వచ్చింది. కులపెద్దలు నిరాకరించారు. అలా జరిగితే రెండు కుటుంబాలను కులం నుండి వెలివేస్తామని హెచ్చరించారు. కాని ఇద్దరి తల్లితండ్రులు కులపెద్దల మాట నిరాకరించి క్రైస్తవమతం పుచ్చుకొని ఇద్దరికీ వివాహం చేశారు. పేర్రెడ్డికి రంగాయమ్మ సహాయం లభించింది. సవర్ణుల సహాయం వుండటం వల్ల తోడి హరిజనులు నోరు మెదపలేకపోయారు. కథలో ఈ పాత్రలు ప్రేమ ఫలించాలంటే కులాలు అడ్డురావని, కేవలం జీవనాధారం కోసం కులాలు వెలిశాయని తెలియజేస్తాయి.

**5.2.2. సవర్ణుల కుట్ర** :- సవర్ణుల మోసాన్ని పసికట్టి బయటపడిన హరిజనులకథలను గమనిద్దాం.

**5.2.2.1. పోలయ్య :** - 'పోలయ్య' కథలో పోలయ్య కథానాయకుడు కొంతవరకు చదువుకొన్నాడు. కాలపరిస్థితుల కనుగుణంగా నడుచుకొనేవాడు. ఎద్దులబండి తోలి సంసారాన్ని సాగించేవాడు. చైతన్య స్వభావంగలవాడు. దేశాంతరం చేసివచ్చిన వెంకటశాస్త్రికి రాత్రిలో ఊరివరకు బండికట్టాడు. నాలుగుపైసాలు సంపాదించేస్థితిలో ఆ రాత్రి నిద్రమాని శాస్త్రికి బండికట్టాడు. దారిలో మాటల సందర్భంలో ఆ గ్రామ పెద్ద చెంచునాయుడు చేసిన అన్యాయాన్ని శాస్త్రికి చెప్పాడు. తాను హరిజనుడని మాటల్లోనే తెలియజేశాడు. ''పచ్చిగడ్డి గంపలమ్ముకొనే మాళ్ళముండల్ని కూడా ఇరికించాలా ఆ దొర? అయినా మాకులం అంటే ప్రతీవాడికీ అలుసు సామీ''23 అన్నాడు. పోలయ్య మనస్సులో అన్యాయాన్ని ఎదిరించే మనస్తత్వం వుంది కాని పరిస్థితులు కలిసిరాక అలా వుండిపోయాడు. అవకాశం వస్తే తనకు అన్యాయం చేసిన వాడిపై ప్రతీకారం తీర్చుకొంటాడు. ఇళ్ళుచేరిన శాస్త్రి హరిజనుడి బండిలో వచ్చాననీ పోలయ్యకే శిక్షవేయడానికి ప్రయత్నించారు. ఇళ్ళ చేరినగాని పోలయ్య శాస్త్రి చెంచునాయుడు స్నేహితుడని తెలుసుకోలేకపోయాడు. తనకు ఎలాగూ చావు తప్పదని తెలుసుకొన్న పోలయ్య ''నన్ను మీరీ ప్రకారం హింసిస్తున్నారు. నేను చచ్చినా బ్రతికినా ఈ విషయంపైకి పోక మానదు. మా పాదరీ.... మా ఏసుప్రభువు గమనిస్తూనేవుంటారు.''24 అని అన్నాడు. తాను క్రైస్తవుడనని, పేరు పౌలయ్య అని శిక్షనుండి తప్పించుకోగలిగాడు. తానూ అలోచనగలవాడని నిరూపించుకొన్నాడు.

**5.2.2.2. సుబ్బరాయుడు :** - 'ది రోడ్' కథలో సుబ్బరాయుడు కథానాయకుడు సైనికుడు, అభ్యుదయభావాలున్నవాడు. తన కష్టానికి తగిన ఫలితం అవసరమనేవాడు. తన వంశపారంపర్యంగా వస్తున్న పాలేరుతనానికి స్వస్తి చెప్పాడు. తన కుటుంబం తీసుకోని డబ్బును మునసబుకు వడ్డీతోసహా తిరిగి ఇచ్చాడు. తనజాతిపై సవర్ణులు చేసే ఆఘాయిత్యాలకు అతను మనస్సు కలతచెందింది. అందుకే సైన్యంనుండి వచ్చిన సుబ్బరాయుడు తమ కులంలో చైతన్యం తీసుకురావడానికి ప్రయత్నించాడు. అందుకు నిత్యం శ్రమించాడు. కాని అతనికి మునసబు పెద్ద సమస్యగా మారాడు. మాలపల్లెకు, అగ్రహారానికి రహదారి వేయాలని సుబ్బరాయుడు నిశ్చయిస్తే అందుకు హరిజనులు శ్రమదానం చేయడానికి అంగీకరిస్తారు. ఈ విషయం తెలుసుకొన్న సవర్ణులు హరిజనులు ఏకమయ్యారని గుబులు చెందారు. సుబ్బరాయుడి ప్రతిపాదన కొందరు సవర్ణులు అంగీకరించినా ఫలితం లేకపోయింది. హరిజనుల ఐక్యతను దెబ్బతీసే ప్రయత్నంలో మునసబు హరిజనులలో మనస్పర్థలు సృష్టించి వారిని దూరం చేశాడు. తత్ఫలితంగా సుబ్బరాయుడు ఒంటరివాడయ్యాడు. రోడ్డు ప్రతిపాదన ఆగిపోయింది. ఈ పాత్ర తన జాతిని సమీకృతం చేయడానికి ప్రయత్నించింది. సుఖంగా జీవించడానికి ప్రయత్నించింది. తపన పడింది, కార్యసాధనలో కూడా నెగ్గింది. సవర్ణుల ఈర్ష్యవల్ల, హరిజనుల అమాయకతవల్ల ఆ కార్యం కార్యరూపం దాల్చలేదు.

**5.2.2.3. మల్లిగాడు :** 'మాలామనిషీ' కథలో మల్లిగాడు కథానాయకుడు మునసబు ఇంటిపాలేరు. సవర్ణ స్త్రీ సీతను ప్రేమించాడు. అమెచేత ప్రేమించబడ్డాడు. పెళ్లి చేసుకోవాలనుకొన్నాడు. తత్ఫలితంగా సవర్ణుల ఆగ్రహానికి గురయ్యాడు. పట్టుదలమనిషికావడంవల్ల ఒకరాత్రి ధైర్యంగా సీత ఇంట్లోకి వెళ్లగలిగాడు. సీత సన్నిధిలో ఆనందాన్ని అనుభవించినా అమెమామ వెంకటప్ప మనుషుల చేతుల్లో చావు దెబ్బలు తిన్నాడు. తీవ్రగాయాలకు గురయ్యాడు. అయినా ఆమెను తిరస్కరించలేదు. మనస్సు మార్చుకోలేదు. సీతగుడిసె మంటల్లో తగులబడుతుంటే గాయాలతోనే ఆమెను రక్షించుకోవడానికి ప్రయత్నించాడు. కాని ఫలితం లేకపోయింది. ఆమె మంటల్లో చనిపోతే తనప్రేమ విఫలమై పిచ్చివాడయ్యాడు. తనకులం కారణంగానే సీతతో వివాహం జరుగలేదని తెలుసుకొన్నాడు. సీత చావుకు కారణం తానేనని తెలుసుకోగలిగాడు. పిచ్చివాడుగా యోగిగా మారాడు. సమానత్వం రావాలని తపనపడ్డాడు. ఒకరోజు మాలపల్లెను ఊరిని వేరుచేస్తున్న

రైలుదారివద్దకొచ్చి తనజాతిని నిద్రలేపడంకోసం ''ఒరేయ్ మాలల్లారా, అక్కడెందుకురా పడి నిద్దరపోతారూ, ఇవతలికిరండిరా... మీ ఇల్లూ వాకిలీ అంతా ఇవతలికి తెచ్చుకోండిరా, అందరూ మనుషులుగా బతుకుదామురా, రండ్రా లేచిరండిరా'' 24 అంటూ హరిజనులను ఊరివైపు రమ్మని పిలిచాడు. ఈలోగా వేగంగా వచ్చిన రైలు మల్లిగాడుని మాలపల్లెవైపు విసిరివెళ్లిపోయింది. కథలో మల్లిగాడిపాత్ర సమానత్వంతో బ్రతకమని హరిజనులకు బుద్ధి చెప్పింది.

**5.2.2.4. హరిజన పాత్రలు** :- 'కొమ్ములు' కథలో మనకు పాత్రలు మూకుమ్మడీగా దర్శమిస్తాయి. సనాతన ఆచారాలతో తమ బ్రతుకులు మార్చుకోలేక సవర్ణుల ఆధిక్యత క్రిందే తమ జీవితాలను కొనసాగిస్తుంటాయి. వారి ఆలోచనలపైనే ఆధారపడివుంటాయి. మాల, మాదిగలు హెచ్చుతగ్గుల విషయంలో ఒకరితో ఒకరు కలియరు. ఎవరికి వారు వేరుగా వుండటం కన్పిస్తుంది. ఈ అసమానతే సవర్ణుల అవసరాలను తీర్చగలిగింది. కథలో హరిజనులు తమ కులాలపరంగా గాక ఐక్యంగా వుండడానికి ప్రయత్నించారు. అదేస్థితిలో జాతర జరిగింది. జాతరలో సవర్ణుల అబద్ధాలు విని హరిజనులు కులంపేరుతో వేరయ్యారు. ఒకరిపైనొకరు పంతాన్ని పెంచుకొన్నారు. సంప్రదాయంపేరుతో కుంభంకూటికోసం ప్రాకులాడుకొన్నారు. ఘర్షణపడి తీవ్రగాయాలకు గురయ్యారు. ఎవరికివారు వేరు అని నిరూపించుకొన్నారు. సవర్ణుడైన కొండారెడ్డి పన్నిన వలలో చిక్కుకొన్నారు. సమాజాభివృద్ధితోపాటు మానవుని ఆలోచనలో మార్పురావడం సహజం. సహజంగా హరిజనులు ఆమార్పుకు లోనయి ఏకం కావడానికి ప్రయత్నిస్తే అందుకు కొండారెడ్డి అడ్డుకొన్నాడు. తెలివిగా వారిని వేరుచేశాడు.

**5.2.2.5. అంజయ్య** : 'అగ్నిగుండం' కథలో అంజయ్య కథానాయకుడు. డప్పువాయిద్యకారి. ఆ ఊళ్లో ఏ కార్యం జరిగినా అంజయ్య డప్పు ముందుంటుంది. అంజయ్య జీవితంలో ఎన్నో పరాభవాలను చవిచూశాడు. ఒక్కొక్కసారి తిండిలేకుండా కూడా జీవించాడు. గ్రామంలో సవర్ణులు ఇచ్చింది తీసుకొన్నాడు తప్ప తనకష్టానికి తగిన ఫలితాన్ని ఆశించలేదు. కాని అతని శరీరం మాత్రం సవర్ణులచేత అవమానాలకు మొద్దుబారిపోయింది. అన్ని కష్టాల్లోను తన కొడుకును ఉన్నతవిద్య చదివించగలిగాడు. తన స్థితిమాత్రం తనకొడుకుకు రాకూడదని ఉన్నత ఉద్యోగిగా చూడాలని తపనపడ్డాడు. తన కొడుకు ఇంటికి వచ్చినప్పుడు ''బుద్ధిగ సదువుకో బిడ్డ .... ఎవ్వల జోలికి పోకు, కాయకష్టం సేసి నిను సదివిత్తన్న నువ్వు సదివినంత సదివిత్తా నా -రెక్కల కట్టంతోనిమవ్వయితే మంచిగ సదువుకో''25 అని బుద్ధిచెప్పేవాడు. తెలంగాణా రాడికల్స్ ప్రభావంతో ప్రజలు, విద్యార్థులు ఎక్కువమంది ఉద్యమానికి ప్రభావితులయ్యారు. తన కొడుకు రాడికల్స్ విద్యార్థి కేసులో పోలీసుల చేతిలో పట్టుపడ్డాడు. దీనితో అంజయ్య ఆశలు నిరాశలయ్యాయి. తన కొడుకు బ్రతికాడా, చచ్చాడా ? తనకళ్లముందుకొస్తే చాలని ఆలోచించాడు. తనకొడుకు చేయని నేరానికి బలయ్యాడని తెలుసుకొన్నాడు. కొడుకేగాక తండ్రికూడా పోలీసులచేత రాడికల్స్ అనే అవమానంతో చావుదెబ్బలు తిన్నారు. కథలో ఈ పాత్ర అవమానాల ప్రోగుగా అన్యాయం జరిగినా ఎదిరించలేని వ్యక్తిగా కన్పిస్తుంది.

5.2.2.6. భీముడు:- 'వేట' కథలో భీముడు ధర్మభూషణం పాలేరు. కథానాయకుడు గ్రామపంచాయతీ రిజర్వుడు ప్రెసిడెంటు, నిస్సహాయుడు, ధర్మభూషణం చేతిలో కీలుబొమ్మ. పంచాయతీ పనులన్నీ ధర్మభూషణం చేతులమీదే జరుగుతాయి. భీముడు ప్రెసిడెంటుగా తనవాడను అభివృద్ధి చేయదలచాడు. మొదటి ప్రయత్నంగా ఇళ్ల స్థలాలకోసం ప్రయత్నిస్తే ధర్మభూషణం అడ్డుపడ్డాడు. తాను హరిజనులకోసం ఏ పనిచేసినా ధర్మభూషణం అడ్డు తగలడం,, చివరికి తన ఆస్తినే మాయమాటలు చెప్పి ఆక్రమించాడు. భీముడుకి వ్యక్తిగత ఆలోచనలేదు. తాను భూషణం చేతిలో అన్యాయానికి గురౌతున్నాననే ఆలోచన రాలేదు.

తన కూతురు సామ్రాజ్యం శీలాన్ని దొరఅల్లుడు శక్తిప్రసాద్ దోచుకుంటే భీముడు ఎదిరించలేదు ధర్మ భూషణంతో పాటు వేట వెళ్లిన భీముడు తన చేయిజారి తుపాకి ట్రిగ్గర్ నొక్కితే తుపాకి ప్రేలి గుండు భూషణంభుజంలో దూరితే హత్యాయత్నం క్రింద భీముడు నేరస్థుడయ్యాడు. కథలో ఈ పాత్ర సవర్ణుడిపై గౌరవాన్ని పెంచుకోంది. అతనికి కష్టాల్లో సాయపడింది. తన ఆస్తినే పోగొట్టుకుంది. అయినా అతని చేతుల్లోనే కష్టాలకు గురైంది.

**5.2.2.7. సీతారాముడు** : 'యజ్ఞం' కథలో సీతారాముడు అప్పల్రాముడికొడుకు, చైతన్యభావాలు కలవాడు. బానిసత్వం నుండి బయటపడాలని తపనపడ్డాడు. స్వతంత్రంగా బ్రతకాలని ఆలోచించాడు. అన్యాయాన్ని ఎదిరించేవాడు. తన తండ్రి గోపన్న వద్ద చేసిన అప్పు అన్యాయమని ఆ అప్పు తీర్చడంకోసం తన తండ్రి పొలాన్ని అమ్మజూపితే అమ్మవద్దని హెచ్చరించాడు. లాభం లేకపోయింది. స్వతహాగా బ్రతకడానికి ఆస్తి లేదని, పాలేరుతనం తప్పదనితన కొడుకు తనమాదిరే బానిసబతుకు బ్రతకకూడదని తలచాడు. అందుకే వాడిని చంపేశాడు. నువు మమ్మల్ని సచ్చేందాకబానిస బతుకు బతక మన్నావ్'' 26 తన కొడుకు బానిస బ్రతుకు బ్రతక కూడదని చంపేశానని అంటాడు. బానిసత్వపు కోరలనుండి తప్పించు కోవడానికి తన వంశాన్నే బయటపడేలా చేశాడు. కథలో ఈ పాత్ర బానిసత్వపు కన్నా చావేనయమని తెలియజేస్తుంది.

**5.2.2.7. భీమయ్య** : 'బంగారమ్మ కమతం' కథలో భీమయ్య బంగారమ్మ పాలేరు. కథనాయకుడు. కష్టపడి పనిచేసేవాడు. నిస్వార్థంతో బంగారమ్మ ఆస్తిని పెంచడానికి ప్రయత్నించాడు. కాని తన గురించి ఆలోచించలేదు. ఈ ప్రయత్నంలో భాగంగా బంగారమ్మ వయస్సులో వున్న భీమయ్యకు ఆశలు రేకెత్తించింది. అయినా భీమయ్య లొంగలేదు. సీతను వివాహం చేసుకొన్నాడు. తన సంసారాన్ని మాలపల్లెలో ఉంచాడు. తత్ఫలితంగా బంగారమ్మ ఆగ్రహానికి గురయ్యాడు. సీతాలు ప్రసరించే సమయంలో భీమయ్యను ఇంటివద్దలేకుండా చేసి ఆమెమరణానికి కారణమైంది. బంగారమ్మ తత్ఫలితమే ఆగ్రహానికి గురైంది. తన పొలాన్ని భీమయ్య నాశనం చేశాడు. మార్పు కథలో హరిజన పాత్రలు సమస్య సాధనకోసం మూకుమ్మడిగా ప్రయత్నించాయి. హరిజనులు సమ్మె చేసి సవర్ణులను కూలీ రేట్లు పెంచమన్నారు. తత్ఫలితంగా గుడిసెలను మంటపాలు చేసుకొన్నారు. అన్యాయంపాలయ్యారు. న్యాయం జరగాలని ఊరేగింపు జరిపారు. కథలో ఈ పాత్రలు చైతన్యవంతంగా చిత్రీకరించబడ్డాయి.

**5.2.2.8. ఆసాదు గంగడు** : 'జీవనాడులు 'కథలో ఆసాదు గంగడు రెడ్డిపల్లి హరిజన వాడ పంచాయితీ బోర్డు మెంబర్. గౌరవంగా బ్రతకాలనుకొనేవాడు. తన కూతురు కు ఘనంగా పెళ్ళి జరిపించాలని తలచాడు. తన అల్లుడు ఉద్యోగి కావడం వల్ల అతని ప్రయత్నాలు వమ్ము అయ్యాయి. మంగళిని బాండు మేళంగు పిలవడానికి ప్రయత్నించి వారిచేత ప్రయత్నించి వారిచేత నిరాకరణ కు గురయ్యాడు. స్కూల్ బెంచీలు తీసుకోవడంలోకూడా కులపరంగా విఫలమయ్యాడు. ఉన్న వసతులతోనే పెళ్లి జరిపించాడు. సాయంత్రం ఆచారం ప్రకారం వధూవరులను రెడ్డి ఇంటికి తీసుకెళ్ళితే అవమానాలు తప్ప అన్యం లభించలేదు. ఆ దంపతులు నడివీధిలో ఊరేగింపుగా వెళ్ళి సవర్ణుల నిరాకరణకు గురయ్యారు. గంగడు తన పిల్లలకు జరిగిన అవమానానికి మానసిక వ్యధ చెందాడు. తోడి హరిజనులను మేల్కొల్పి చైతన్య వంతులను చేయడానికి ప్రయత్నించాడు.

**5.2.2.9. హరిజన పాత్రలు** : బంచరాయికథలో సమస్య సాధనకోసం హరిజన పాత్రలన్నీ మూకుమ్మడిగా కృషిచేశాయి. స్వతంత్రంగా బ్రతకాడానికి వ్యక్తిత్వంగా వుండటానికి ప్రయత్నించాయి. ఆ ప్రయత్నంలోనే ప్రభుత్వం ఆజ్ఞమేరకు బంజరుభూమిని సాగుచేసుకోవడానికి ప్రయత్నిస్తే సవర్ణులు అడ్డుతగలడం కన్పిస్తుంది. హరిజనులు దేవుడి పేరుతో, పూనకంపేరుతో మూర్ఖత్వానికి బలయ్యారు. ఆ రాత్రికి సవర్ణులే హరిజన

గుడిసెలకు నిప్పుపెట్టి దేవుడు ఆగ్రహించాడని మాయమాటలు చెప్పితే గుడ్డిగా నమ్మారు. తమను సవర్ణులు అన్యాయం చేశారని తెలుసుకోలేక పోయాయి. కథలో ఈ పాత్రలు పరిణామ దృష్టిలో ప్రయత్నించాయి.

**5.2.2.10. రామయుడు :** 'వ్యత్యయం' కథలో రాముడు కాటనికొడుకు, కథానాయకుడు, తండ్రి గతించిన తర్వాత తినడానికి తిండిలేని వాడయ్యాడు. తన ఆస్తిని తన తండ్రి మిత్రునికొడుకు సోములు కాజేశాడు. అతని కుటుంబంలోనే పాలేరుతనం చేయడానికి ఇష్టపడి యజమాని అయిన సోములు చేత నిరాకరింపబడ్డాడు. జకరయ్యగా మారి ఉద్యోగం సాధించాడు. కాని, స్థితి మాత్రం మారలేదు. ఆర్థిక ఇబ్బదులకు మాత్రం గురికాక తప్పలేదు. వచ్చిన డబ్బు మతపుస్తకాలకే సరిపోతున్నది. తినడానికి తిండిలేదన్న నేరానికి ఫాదర్ ఉద్యోగం ఊడగొట్టాడు. సమాజంలో అందరూ స్వార్థ పరులేనని ధైర్యంగా తన ఆస్థిని కాజేసిన సోములుకన్నా మతం తిండిపెట్టదని, మోసపూరితమైందని, సమాజంలో తెలివిగా బ్రతకకపోతే కష్టాలు తప్పవని తెలియజేస్తుంది.

**5.2.2.11. పైడితల్లి :** 'పురుగు' కథలో పైడితల్లి హరిజనుడు ఆస్థిపరుడు. భూమిని నమ్ముకొని బ్రతికేవాడు. ఒకసారైనా పంట పండకపోతుందా, తన కష్టాలు తీరకపోతాయా అని ఆలోచించేవాడు. తమ పొలంలో పంట పెట్టడం,కోసం పెదనాయుడు దగ్గర అప్పుజేశాడు. అవసరం వచ్చినప్పుడల్లా అప్పుతీసుకొన్నాడు. ఆ అప్పు ముసుగులో తనను పెదనాయుడు మోసంచేస్తున్నాడని గ్రహించలేక పోయాడు. తన పంట పైరు పచ్చగా వుంటే ఈయేడు తన పొలం కష్టాలను గట్టెక్కిస్తుందని తలచాడు. దానిపై ఎన్నోకలలు గన్నాడు. కాని పెదనాయుడి కళ్లపైడి తల్లి పంటపై పడినాయి. ధాన్యాన్నంతా తన ఇంటికి తెసుకురమ్మాన్నాడు. పైడితల్లికి జ్ఞానోదయం అయింది తనకు అన్యాయం చేస్తునాడని తెలుసుకొన్నాడు. అవసరమైతే పెదనాయుడిని ఎదిరించడానికి ప్రయత్నించాడు. అవసరం వచ్చి ఎదిరించాడు తనకూ వ్యకితత్వం వుందని తెలియచేశాడు.

**5.2.1.12. రాధ :** 'విలోమం' కథలో రాధ హరిజనస్త్రీ డిగ్రీ పూర్తి చేసింది. తాను కాలేజి చదువు రోజుల్లో ఒక సవర్ణుని ప్రేమించింది. అతని పేరు జీవన్. అతను అభ్యుదయవాది అని తలచింది. డిగ్రీ అయిపోగానే ఈమె రిజర్వేషన్ క్రింద ఉద్యోగాన్ని సంపాదించుకొంది. జీవన్‌ని పెళ్లి చేసుకొంది. కాలంతోబాటు జీవన్‌లో వస్తున్న మార్పుని రాధ గమనించింది. తాను మారిపోతున్నాడని తెలుసుకొంది. రాధకు ఒక కొడుకు. రాధ హరిజన కులానికి జరుగుతున్న అన్యాయాలకు చలించేది. వాళ్ళు అభ్యుదయంవైపు పయనించాలని తపనపడేది. వాళ్ళు వ్యక్తిత్వంతో బ్రతకాలని తపనపడేది. చివరిగా తననే తన భర్త మోసంచేసి కొడుకును యస్సీగా బడిలో పేరు నమోదు చేయడం తెలుసుకోగలిగింది. కాలంతోపాటు సమాజంలోని మానవుల మనస్తత్వాలు మారుతుంటాయని తనభర్తద్వారా తెలుసుకోగలిగింది.

**5.2.3. హరిజనుల విచ్చిత్తి :** హరిజనులు చైతన్యవంతులై సవర్ణులకు దూరంగా జీవించే కథానికలను గమనిద్దాం.

**5.2.3.1. రంగన్న :** 'పశ్చాద్భూమి' కథలో రంగన్న రాంకోటి పెద్దకొడుకు. తారాలుగా వస్తున్న పాకీ వృత్తికి స్వస్తిచెప్పి విద్యావంతుడై ఉద్యోగం చేస్తున్నాడు. రంగన్న నిత్యం ఏదో ఆలోచిస్తూ వుంటాడు. ఎదుటివాడు బాధపడినా సంతోషించినా అతను సహించలేడు. అతనిలో తాను హరిజనుడను, తక్కువవాడను అనే ఆలోచన వుంది. ఉద్యోగంలో వచ్చే జీతం తక్కువ. అతను వున్న అద్దె ఇళ్లవద్ద తోడి మనుషులతో తన కులాన్ని చెప్పుకోలేకపోయాడు. ఒకవేళ చెప్పితే అక్కడ తనబ్రతుకు సాగదని ఆలోచించాడు. ఒకసారి పాకీ మనిషిని తోడి మనుషులు దూషిస్తుంటే రాంకోటి ఆమెను ఆదుకోలేదని తనకొడుకును అరిస్తే అందుకు రంగన్న ''తెలిస్తే ఇంకేమయినా వుందా ? బాయిలో నీళ్లకూడా తోడికోనియ్యరు. పలకరించే దిక్కు సంగతి పక్కనబెట్టి''27 అన్నాడు. తనకులాన్ని చెప్పుకోలేని ధైర్యవంతుడు రంగన్న. అతను విద్యావంతుడైనా

అణగారిన మనస్తత్వం వుంది. అతను ఇంకా తాను అస్పృశ్యుడను అనే ఆలోచన నుండి దూరం కాలేదు.

**5.2.3.2. శ్రీనివాసులు తండ్రి :** 'తల్లిమట్టి' కథలో శ్రీనివాసులు తండ్రి కొడుకు ఆలోచనలకు విరుద్ధుడు. తమకులంపై అభిమానం వున్నవాడు. తనకులాన్ని నిస్సంకోచంగా చెప్పుకొనేవాడు. అన్ని కులాలకన్నా తనకులమే గొప్ప అనేభావం కలవాడు. తనకులం చేసిన ఘనకార్యాలు ఎవరూ చేయలేదని తలచేవాడు. తనకొడుకు అభివృద్ధి కోసం తపనపడ్డాడు. తనకొడుకు తనను పోషించకున్నా సమాజంలో ఉన్నతుడుగా ఉండాలని కోరుకొనేవాడు. ఒకసారి కథకుడితో ''మాదిగోళ్ళు అనేమాటలో ఏమైనా బూతు అర్థం వుందా?''28 అని అడిగాడు. తమ జాతిని హరిజనులు అని పిలువడంకన్నా మాదిగోళ్లు అని పిలవడంలోనే ఆనందం వుందని తలచాడు. కులంలో పుట్టాక కులంపేరు చెప్పుకోవడంలో తప్పులేదని అభిప్రాయపడ్డాడు. కథలో ఈ పాత్ర సంప్రదాయాలకు ఒదిగిఉన్నా ఆలోచనలో చైతన్య భావాలను సంతరించుకొంది.

**5.2.3.3. బూడిద లింగయ్య:** 'ఆచూకి కథ'లో బూడిద లింగయ్య కథానాయకుడు వ్యక్తిత్వం లేనివాడు. కొమురును ప్రేమించాడు. ఫలితంగా గర్భవతి అయ్యింది. పెళ్ళి చేసుకోవాలని తలచాడు. కాని తన స్థితిని తండ్రి ఎదుట చెప్పలేని అసమర్థుడు. పంచాయతీలో తనతండ్రి తప్పు క్రింద కొమురుకు మూడువేల రూపాయలు ఇస్తానంటే లింగయ్య నోరువెదపలేదు. తాను చేసిన తప్పును సరిదిద్దు కోవడానికి ప్రయత్నించలేదు. తండ్రిమాటను కాదనలేక కొమురును వదులులేక నిస్సహాయుడుగా ఉండిపోయాడు. ధైర్యంచేసి కొమురుకు లీసుక వెళ్లడానికి ప్రయత్నిస్తే ఫలితం లభించక తమ బ్రతుకు వ్యర్థం అని తలచి ఆ సమాజంలో తాను వుండటంకన్నా రాడికల్స్‌లో చేరడం మిన్న అని తలచి వెళ్లిపోయాడు. తన జీవితాన్ని తానే బుగ్గిపాలు చేసుకొన్నాడు.

**5.2.3.4. రాములు :** 'కొత్తదావారి' కథలో రాములు నాగమ్మకొడుకు. కథానాయకుడు. చైతన్యభావాలు కలవాడు. తనపై పెత్తందారితనం చెలాయించే దొరలంటే గిట్టదు. పండే పంట పైన నమ్మకం లేదు. ఈ రెండూ తమ బ్రతుకులను సుఖపెట్టనని తలచాడు. తల్లిమాటను లెక్కచేయడు. వాడగుడిసెలు కాలిపోతున్న సమయంలో మంటలను ఆర్పడానికి వాడలో నీళ్లులేక శివాలయబావికి వెళ్లి సవర్ణులకు వ్యతిరేకి అయ్యాడు. సవర్ణులు హరిజనులను అక్కడనుండి వెళ్లమని హెచ్చరించినా రాములు మాత్రం నీళ్ళు అందిస్తున్నాడు. ''ఒరేయ్ రెడ్డోడా మేం నీళ్లకొచ్చినం, నువుగమ్మునుండకుంటే నీ రక్తం నింపకపోతం. కాలిపోతున్న కొంపల్లేని మసిజేసి పారేస్తాం''29 అంటూ కోపోద్రిక్తుడయ్యాడు. సవర్ణుల దృష్టిలో నక్సలైటుగా ముద్రపడ్డాడు. వారి బారినుండి తప్పించుకో గలిగాడు. రాడికల్స్‌లోనే చేరిపోయాడు.

**5.2.3.5. చిన్ని :** 'ఆకలి' కథలో చిన్ని హరిజన పాప. కథానాయిక. ఆ పాపది బీదకుటుంబం. తినడానికి తిండిలేక ఆకలితో అలమటిస్తోంది. రోడ్డుచేరి కూలీతెచ్చే తండ్రికోసం ఎదురుచూస్తుంది. ఆకలితీర్చుకొనే మార్గాన్ని వెదకసాగింది. ఒకసారి రోడ్డుమీద ఆడుకొంటుండగా లారీ క్రిందపడి ఆసుపత్రి పాలైంది. ఆర్నెళ్ల పాటు సుఖంగా తిండి తినగలిగింది. ఆ ఆలోచనే మరొకసారి తన మనస్సులో మెదిలింది. ఇక తనకు తిండిదొరికే దారి దొరికిందని ఆకలి తీరుతుందని సంతోషించింది మరలా లారీక్రిందపడింది. తన ఆకలికి శాశ్వత పరిష్కారం దొరికింది. తన ప్రాణాలనే కోల్పోయింది. కథలో ఈ పాత్ర కొంత ఆలోచనాదృష్టికలిగివుంది. తన పొట్టకూటికోసం తన ప్రాణాలనే పోగొట్టుకుంది. తోడి మనుషులను దేహీ అని అడుక్కోవడంకన్నా చావడం మేలని తలుస్తుంది.

**5.2.4. హరిజన బలి :** హరిజనులు చైతన్యవంతులై సవర్ణుల చేతిలో బలైన కథలను పరిశీలిద్దాం.

**5.2.4.1. అరుంధతి :** 'పాపినికి జీతం' అరుంధతి యలమందభార్య. కథానాయకురాలు. భర్తకష్టాల్లో

పాలుపంచుకొనేది. చైతన్యవంతురాలు, అన్యాయాన్ని ఎదిరించే స్వభావం ఆమెలో వుంది. భర్తకు చెప్పుల తయారీలో సహకరించేది. ఒకసారి తనభర్త కుట్టిన చెప్పులను దొర భుజంగరావుకు ఇవ్వడానికి వెళ్లింది. దొర కామానికి బలైంది. దొరచూపిన ఆశలకు అరుంధతి లొంగలేదు. దొరదౌర్జన్యం చేయబోతే తప్పించుకొంది. ''సీ యదవ సచ్చినోడా కొంగు పట్టుకుంటావ(రా? నిన్నూనిన్నూ పూనేయిస్తా. రేపీపాటికి నీ శవం లేసుద్ది సూడు....యల్లమంద పెళ్లావనుకొన్నావో లేదో....''30 నీఅంతు చూస్తానని హెచ్చరించింది. దొర చెతుల్లోనే దొరికి హతమయింది. కథలో ఈ పాత్ర కేవలం సవర్ణుని కామనాహానికి బలైంది. ప్రతిఘటించే ఆలోచనవున్నా శక్తిలేక పోయింది.

**5.2.4.2. పైడయ్య** : 'ఏటిపాట' కథలో పైడయ్య కథానాయకుడు, గాయకుడు పొట్టకూటికోసం రకరకాల వేషాలు వేస్తాడు. వీధిపాటగాడుగా అందరినీ తన పాటతో సంతోషపెడతాడు. వారిచ్చింది పుచ్చుకొంటాడు. ఒక గ్రామంలో సవర్ణ స్త్రీ అతనిని ప్రేమించింది. ఆమె సూరమ్మ. పైడయ్యతో వెళ్లిపోయింది. సమాజం మారుతున్నకొద్దీ సమాజంపై సినిమా ప్రభావం వుండటం వల్ల పైడయ్య పాటలను వినేవాళ్లు తక్కువయ్యారు. ఆ గ్రామ పెద్ద పెద్దనాయుడింట్లో పైడయ్యకు పాలేరుతనం తప్పనిసరైంది. పైడయ్య రైతుకూలీ సంఘంలో సభ్యుడైతే నాయుడు కోపంచెందాడు. గ్రామంలో వున్న బంజరు భూమిని సంఘం వాళ్ళు స్వాధీనపరుచుకుంటే నాయుడు ఆగ్రహించాడు. అందులో తీవ్రకోపానికి గురైనవాడు పైడయ్య. పైడయ్యను పోలీసులు తీసుకెళ్లారు. ఆ రాత్రిలో ఇంటికొస్తున్న పైడయ్యను నాయుడు మనుషులు హత్యచేశారు. తామ ఎవరికీ అన్యాయం చేయకుండా బంజరుభూమిని సాధించుకొంటే సవర్ణుల ఆగ్రహానికి గురయ్యాడు. గొప్పకళాకారుడైనా కాల పరిస్థితుల్లో అతని కళ కాలగర్భంలో కలిసిపోయింది.

**5.2.4.3. గురవయ్య** : 'ఒక్కపిడికిలి చాలు' కథలో గురవయ్య దొరపాలేరు. కథానాయకుడు. తన కుటుంబం వంశ పారంపర్యంగా దొర ఇంట్లో పాలేరుతనం చేస్తోంది. ప్రస్తుతం తాను ఆ పని చేస్తున్నాడు. తన రక్తమాంసాలను దొర ఇంటికే దత్తం చేశాడు. ఇక తన వంశం దొర ఇంట్లో పాలేరుతనం చేయకూడదని తనతోనే అంతం కావాలని పెళ్లిచేసుకోలేదు. తినడానికి తిండిలేక బ్రతుకుతున్నాడు. గురవయ్య తిండి దొర భార్య దయాదాక్షిణ్యాలపై ఆధారపడి వుంటుంది. నిత్యం దొర ఈ సడింపులకు దెబ్బలకు సగం చిక్కిపోయాడు. సవర్ణ ఆడపిల్లలను హరిజన యువకులు పరిహాసం చేస్తే ఉగ్రుడైన దొర గురవయ్య ప్రాణానికి ముప్పు తలపెట్టడానికి ప్రయత్నించాడు. చేయని నేరానికి తనను బలిచేశాడు. గురవయ్య జీవితం మీద ఆశవదులుకొని తన వంశానికి దొరచేసిన ద్రోహానికి కోపోద్రిక్తుడై దగ్గరలోనే వున్న గునపాన్ని తీసుకొని దొరను చంపి దొరచేతుల్లో అతనూ చనిపోయాడు. తాను చచ్చినాసరే ప్రతీకారాన్ని తీర్చుకొన్నాడు. సమాజాన్ని హెచ్చరించాడు.

**5.2.5. మతాంతరీకరణం** : హరిజనులు తమ ఉనికిని మార్చుకోవడం కోసం ఇతర మతాలతో ప్రవేశించిన కథలను పరిశీలిద్దాం.

**5.2.5.1. జీవరత్నం, శిఖామణి** : 'విష్‌యు హేపీ క్రిస్మస్' కథలో జీవరత్నం, శిఖామణి కథానాయకులు. చిన్నప్పుడే తల్లిదండ్రులతో దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించి క్రైస్తవాన్ని పుచ్చుకొన్నారు. మతం ఆశ్రయంతోనే విద్యావంతులై ఉద్యోగాలు సంపాదించారు. స్వార్థం అనేది మనుషులమధ్య శత్రుత్వాన్ని ఎలా పెంచుతుందో వీరిద్దరి మధ్య కన్పిస్తుంది. చర్చి సంబంధమైన ఆస్తికోసం వీరిద్దరూ తగవులాడుకొన్నారు. తోటి క్రైస్తవులను రెండు గుంపులుగా చీల్చి ఘర్షణపడి కోర్టుల చుట్టూ తిరుగుతున్నారు. అయినా స్వార్థాన్ని వీడలేదు. పరమార్థాన్ని కోరలేదు. ఉద్యోగస్థులై సమాజంలో ఉన్నత స్థానంలో వున్నప్పటికీ వీరి స్థానం నీచస్థితికి దిగజారింది. మతం ఆస్తిని సాధించుకోవడంకోసమే మతం పుచ్చుకొన్నట్లుగా ప్రవర్తించాడు. క్రిస్మస్

పర్వదినాన చర్చికి వచ్చారు. తమ స్పర్థలను ప్రక్కకునెట్టి - ఒకరినొకరు స్నేహ కరచాలనం చేసుకొని స్నేహంగా వుండదలచాడు. కథలో ఈ పాత్రలు క్రైస్తవులు చర్చిలో వున్నప్పుడు భేదాభిప్రాయాలను వదలి స్నేహంగా వుంటారని, క్రైస్తవ మతంలో ప్రవేశించిన హరిజనులకు పోరాట పటిమ వుంటుందని తెలియజేస్తాయి.

**5.2.5.2. హరిజన పాత్రలు** : 'పాహిమాం...పాహి ...పాహి' కథలో చెంగయ్య, గంగయ్య, రంగయ్య హరిజన పాత్రలు. వాడపెద్దలు. సమస్యసాధనకోసం పోరాడే నాయకులు. సవర్ణులు హరిజనులను ''ఏమో ఊరిబయట వున్నోళ్లం ఊరిబావికాడికి రాగూడదంట''31 అని దూరం చేశారు. హరిజనులు సవర్ణులతో పోరాడి జయించలేక ఊరికి దూరంగా మంచినీళ్ల బావిని త్రవ్వుకొన్నారు. సవర్ణుల ఆగ్రహానికి గురై వీరిగుడిసెలను ఆహుతిచేసుకొన్నారు. అయినా సవర్ణులను ఎదిరించడానికి ప్రయత్నించలేదు. మంచినీళ్ల బావివద్దే గుడిసెలు వేసుకొని సవర్ణుల పీడనకు గురి కాకుండా నిశ్చింతగా బ్రతికారు. 'కష్టపడే వాడికే కష్టాలు తప్పవన్నట్లు'' దారికి అడ్డం అని హరిజనుల గుడిసెలను ప్రభుత్వం కూల్చడానికి ప్రయత్నించింది. హరిజనులంతా క్రైస్తవం పుచ్చుకొని వాడకు బెత్లహాం నగర్ అని పేరు పెట్టారు. తమవాడ కూలిపోకుండా తెలివిగా నిలుపుకోగలిగారు.

**5.2.6. హరిజన పతనం** : హరిజనులు సుఖాన్ని ఆశించి తీవ్రకష్టాలకు గురయ్యే కథలను పరిశీలిద్దాం.

**5.2.6.1. లచ్చుంగాడు** : 'పండగపూట పరవాణ్ణం' కథలో లచ్చుంగాడు కథానాయకుడు, రెడ్డి ఇంటిపాలేరు. తల్లిదండ్రులు వెళ్ళిపోయినా వాడికి రెడ్డి సేవ తప్పలేదు. కష్టపడి పనిచేసేవాడు. రెడ్డి ఆశీస్సులతోనే లచ్చివిని పెళ్లిచేసుకొన్నాడు. రెడ్డికి నమ్మినబంటుగా వుండిపోయాడు. ప్రతిరోజు రెడ్డికి రెడ్డెమ్మకు సారాయి తెచ్చి ఇచ్చేవాడు. రెడ్డిలాగా తాను తన భార్యతో కలసి సారాయి త్రాగాలని తపనపడ్డాడు. ఉగాదిరావటంతో తనకోరిక నెరవేరుతుందని సంతోషించాడు. దొంగసారా చేయడానికి ప్రయత్నించాడు. ఆ ప్రయత్నంలో పోలీసులకు చిక్కి తన భార్యను పోగొట్టుకున్నాడు. సారా ముడి పదార్థాల కండను పోలీసులు ధ్వంసం చేశారు. లచ్చుంగాడు నిత్యం కష్టపడే మనిషి, సుఖం అంటే ఎరగనివాడు. ఒకరోజు తన కష్టాలను మరచి సుఖంగా కాలం గడపాలనిప్రయత్నిస్తే సమాజం చట్టంపేరుతో వాడి సుఖాన్ని కాలరాచింది. జీవితాంతంభార్యా వియోగాన్ని ప్రసాదించింది. సారాయి సవర్ణులు త్రాగడంలో తప్పులేనిది హరిజనులు త్రాగితే తప్పా అని సమాజానికి సూటి ప్రశ్న వేసింది. సుఖాలనేవి తమకు అవసరం లేదా అనే ఆలోచనలో పడవేసింది ఈ పాత్ర.

**5.2.6.2. లచ్చివి** : 'పండగపూట పరవాణ్ణం' కథలో లచ్చివి లచ్చుంగాడి భార్య, కథానాయిక. అభిమానవతి భర్తపై ప్రేమకలది. భర్త ప్రతిరోజు రెడ్డి ఇంటినుండి ఆలస్యంగా రావడానికి కారణం తెలుసుకోవడం కోసం ప్రయత్నించింది. రెడ్డికి సారాయి తెచ్చి ఇవ్వడంవల్ల ఆలస్య మైందనే విషయం తెలుసుకొని తనభర్త ఆ సారాయి త్రాగడానికి ప్రయత్నిస్తే నిరాకరించింది. మరలా మనస్సు మార్చుకొంది. తన భర్తకోరిక తీర్చదలచింది. వాడలో దొంగసారాయి చేస్తున్నందుకు పోలీసులు దాడిచేస్తే భర్తమీద అభిమానంతో తన ఇంట్లోని సారాయి కుండను కాపాడటానికి ప్రయత్నించింది. సర్కిల్ ఇన్స్‌పెక్టర్‌ను చావబాదింది. పోలీసుల ఆగ్రహానికి గురైంది. వారిచేతిలోనే తాన ప్రాణాలను కోల్పోయింది. తన భర్తకోరిక తీర్చడంలో విఫలమైంది.

**5.2.6.3. లొండలక్ష్మయ్య** : 'పెద్దోళ్లు' కథలో లొండ లక్ష్మయ్య రామరాజపురం రిజర్వుడు పంచాయతీ ప్రెసిడెంటు. పెదనాయుడి పాలేరు. లక్ష్మయ్య ప్రెసిడెంటుపేరుకు మాత్రమే. పనులన్నీ పెదనాయుడి చేతులుమీదుగానే జరుగుతాయి. లక్ష్మయ్య ప్రెసిడెంటు అయినా అతని బ్రతుకు మారలేదు. రాత మారలేదు. తననివాసం మారలేదు. తిండి దొరకలేదు. పెదనాయుడి ముంగిళి మాత్రం శాశ్వతమైంది. లక్ష్మయ్య ఆ గ్రామ ప్రెసిడెంటుగా యం. యల్. ఏ పరశురాం కూతురు పెళ్లికి వెళ్ళాడు. పెళ్ళిలో అందరితో

సమానంగా వుండదలచాడు. కాని ఆ అవకాశం పెదనాయుడు వల్ల రాలేకపోయింది. అందరితో సమానంగా భోజనం చేయడానికి వెళితే పెదనాయుడు ''అరేయ్ లొండా ! కసింత ఇలగరమ్మీ, నీవు తరువాత తిందువుగాని32'' అని ఈసడించాడు. సమయానుకూలంగా పెదనాయుడు గర్జనకు భయపడవలసి వచ్చింది. చివరికి తోటి ప్రెసిడెంట్ల సరసన కుర్చీమీద కూర్చుంటే పెదనాయుడి ఆగ్రహానికి బలయ్యాడు. అయినా తనహోదాను కాపాడుకోవడానికి కుర్చీ వదలలేదు. కథలో పాత్ర సాటి మనిషిగా బ్రతకడానికి ప్రయత్నించింది. వ్యక్తిత్వాన్ని నిలుపుకోవడానికి ప్రయత్నించింది.

పై పాత్రలు చిరకాలంగా తాము సవర్ణుల మోసానికి గురవుతున్నామని తెలుసుకొన్నాయి. ఒకవైపు సవర్ణుల ఇళ్లల్లో వెట్టిచాకిరీ చేస్తూ మరోవైపు వారినే ప్రతిఘటించడం మొదలుపెట్టాయి. బానిసత్వంనుండి విముక్తి పొందడానికి ప్రయత్నించాయి. ఈ ప్రయత్నంలోనే హరిజనులు మనస్పర్థలు పెంచడానికి సవర్ణులు ప్రయత్నించడం, దీనివల్ల ఐక్యత సాధించడంకోసం మరికొంతకాలం వారు దాస్య శృంఖలాల్లోనే మగ్గాల్సివచ్చింది. సాహిత్యం సామాజిక స్థితిగతులు వీరిలో చైతన్యాన్ని తీసుకురావడానికి ప్రయత్నించాయి. సాంఘిక అభివృద్ధిని సాధించడంకోసం పలుమార్గాలను ఎన్నుకొన్నాయి. కొన్ని పాత్రలు అన్యాయాన్ని అన్యాయంతోనే ప్రతిఘటిస్తే మరికొన్ని పాత్రలు శాంతియుతంగానే సవర్ణుల సానుభూతితోనే తమ సమస్యలను పరిష్కరించుకొన్నాయి. మొదటి ప్రయత్నంలో కొన్ని పాత్రలు రాడికల్స్ ప్రభావానికి లోనయ్యాయి.

సామాజిక జీవనంలో భాగంగా కొన్నిపాత్రలు ఆకలితోనూ బానిసత్వంతోనూమగ్గిపోయాయి. సోమరితనాన్ని వదలికొట్టి చైతన్య వైపు పయనించడానికి మరికొన్ని పాత్రలు ప్రయత్నించాయి. రాజకీయంగా తాము వెనకబడి వుండటానికి కారణాలను గుర్తించాయి. ఆ ప్రయత్నంలో ప్రభుత్వం రిజర్వేషన్ పద్ధతిని ప్రవేశపెట్టి సహకరించింది. అయినా అక్కడ భూస్వాములు చేతుల్లోనూ నారి పాలేర్ల చేతుల్లోనూ అధికారం కేంద్రీకృతమైంది. హరిజనుల ప్రయత్నానికి కొంతవరకూ గండిపడింది. చైతన్యవంతులైన హరిజనులు రాజకీయంగా అధికారాన్ని చేపట్టడానికి ప్రయత్నించినా సవర్ణులతో సమస్య ఎదురైంది. తత్ఫలితంగా సవర్ణుల ఆగ్రహానికి గురయ్యాయి. అయినా ఈ పాత్రలు పరిణామదిశగా పయనించాయి. సమస్య సాధనకోసం ప్రయత్నించాయి.

## 5.3 హరిజనాభ్యుదయం

సాంప్రదాయాలతో మూఢాచారాలతో తమ హక్కులు బాధ్యతలు తెలియక గాఢాంధకారంలో జీవించిన హరిజనులు తమకు జరుగుతున్న అన్యాయాలను తెలుసుకొని సమానత్వం సాధించడం కోసం ప్రయత్నించారు.

మానవుల స్థితిగతుల్లో, ఆశయాల్లో, ఆలోచనల్లో ఆచార వ్యవహారాల్లో, కార్యసాధనల్లో, పరస్పర సంబంధాల్లో ఒకప్పుడున్న స్థితి మరొకప్పటికి సమష్టి శ్రేయోన్ముఖంగా చెందే పరిణామాన్ని అభ్యుదయం అంటారు. వ్యక్తి జాతి, మతం, వర్ణం, ఏదైనా కాని వెనకబాటుతనంలో మగ్గి పోతున్నప్పుడు ఆ స్థితినుండి బయటపడటం ప్రగతిపథంవైపు పయనించడం అభ్యుదయ లక్షణం.

భూస్వామ్య వ్యవస్థ అధికారంలో వున్న దేశాలన్నింటిలోను సంపద కేంద్రీకృతంమైంది. ఈ స్థితిలో హరిజనులు ఎక్కువభాగం భూస్వాములు చేతిలో నలిగిపోయారు. వారి నుండి విముక్తి పొందడానికి వీరికి ఉద్యమాలే శరణ్య మయ్యాయి. వీరిలో ఉద్యమస్ఫూర్తినిపెంచడానికి రచయితలు, సంఘ సంస్కర్తలు అనేక విధాలుగా ప్రయత్నించారు. సమస్య పరిష్కారానికి మార్గాలను సూచించారు. కష్టపడిన వాడికే ఫలితం దక్కుతుందనే ఆలోచనను వారిలో తీసుకరాగలిగారు. అభ్యుదయవాదులు కొంతమంది సవర్ణులు చేసే దోపిడిని , హింసను, బహిరంగంగానే తూర్పారబట్టారు. మొదట ఉద్యమంలో పాల్గొన్నది కూడా

సవర్ణులే. హరిజనులు బానిసత్వంతో భూస్వాములు చేతుల్లో నలిగిపోతున్న సమయంలో వీరి రచనలు ఉద్యమాలు వారి జీవితాల్లో వెలుగులు ప్రసాదించాయి. అభ్యుదయం వైపు పయనించడానికి తమవంతు సహకారాన్ని అందించాయి.

''హరిజనులకు భూమికోసం, భుక్తికోసం సమాజంలో గుర్తింపుకోసం యత్నించడం అభ్యుదయ మార్గమనుకొంటే రాజకీయ సంస్కరణలద్వారా భూమి, ఆర్థిక సంస్కరణల ద్వారా భుక్తి, సాంఘిక సంస్కరణల ద్వారా గుర్తింపు సాధ్యమవుతుంది''33

నేడు హరిజనుల స్థితి కొంత మెరుగ్గానే వుందని చెప్పవచ్చు. పల్లె ప్రాంతాలు పట్టణ ప్రాంతాల్లో హరిజనులు విద్యావంతులై ఉన్నతస్థితిని సాధించారు. సవర్ణులతో సమానంగా జీవించగలుగుతున్నారు. బడి, గుడుల్లో ప్రవేశం లభించింది. సవర్ణులతోపాటు హక్కులను అనుభవిస్తున్నారు. ప్రభుత్వంఏర్పరచిన రిజర్వేషన్లను కొంతమంది హరిజనులు వినియోగించుకొంటున్నారు. మరోవిషయం - హరిజనుల ఆలోచనాతీరు సరిగాలేని కారణంగా హరిజనుడే హరిజనుడిని అణగద్రొక్కడానికి ప్రయత్నిస్తున్నాడు. వీరిలో అంతర్గత ఐక్యత అవసరం. ఈ ఐక్యత సాధ్యమైతే హరిజనులు ఉన్నత స్థాయిని అనుభవించడం సులభసాధ్యం. కాని గ్రామీణ హరిజనుల జీవనస్థితిగతి నేటికి అలాగే ఉంది. వారి జీవితం కష్టాల కడలి. ఆలోచనలేక అవసరాలు తీరక పాలేరుతనం తప్పక దుర్భర దారిద్ర్య జీవితాన్ని అలాగే సాగిస్తున్నారు. వీరిని చైతన్యవంతులను చేయడానికి అనేకమంది సంఘ సంస్కర్తలు, స్వచ్ఛంద సేవా సంస్థలు పాటుపడుతున్నాయి. అనేక ప్రసారసాధనాలు వారు నష్టపోతున్న విషయాలను తెలియజేస్తున్నాయి. ఈ నేపథ్యమే తెలుగు కథానికా వస్తువైంది. అభ్యుదయపథంవైపు పయనించిన పాత్రలను పరిశీలిద్దాం.

**5.3.1. సాంఘికాభ్యుదయం**: హరిజనులకు సాంఘిక న్యాయం జరగాలంటే సవర్ణులలోనూ అవర్ణులలోనూ మార్పు రావాలి. సవర్ణులు హరిజనులను తమతో సమానంగా చూడడానికి ప్రయత్నించాలి. హరిజనులు సోమరులుగా, బానిసలుగా, బిక్షగాళ్ళుగా, త్రాగుబోతులుగా దొంగలుగా వుండరాదు. వారి ఆహార విషయాదుల్లో సంప్రదాయ పద్ధతుల్లో మార్పు అవసరం. వాళ్ళ స్వతహాగా ఆలోచించి తమ భవిష్యత్తు సుగమం చేసుకోవడానికి ప్రయత్నించాలి. సాధ్యమైనంత వరకూ సమాజంలో నీచవృత్తులకు స్వస్తి చెప్పి పిరికితనాన్ని వదలుగొట్టుకొని గౌరవంగా, హుందాగా బ్రతకడానికి ప్రయత్నించాలి. ప్రభుత్వం అందించే సహాయాన్ని సాధ్యమైనంతవరకూ వినియోగించుకోవడానికి ప్రయత్నించాలి. హరిజనులు అభివృద్ధి సాధించడానికి విద్యావంతులైన తోటి హరిజనులు తమజాతిని ప్రగతి పథంవైపు నడిపించడానికి ప్రయత్నించాలి. తమవారిని మూఢాచారాలు, సాంప్రదాయాలు, నిరక్ష్యరాస్యతనుండి మేల్కొవాలి. ఆ ప్రయత్నంలో సవర్ణులు వేసే ప్రతి అడ్డును అధిగమించాలి. ఎత్తుకుపైఎత్తు వేయగలగాలి. జిత్తుల మారి నక్కగా తయారవ్వాలి. అప్పుడే హరిజనులు సాంఘికాభ్యుదయం సాధించగలరు.

ఇక సవర్ణుల విషయానికొస్తే హరిజనులు అభ్యుదయంవైపు పయనించాలంటే వీరి సహాయం అవసరం . వీరు అన్నింటా హరిజనులను సమానంగా చూడటానికి ప్రయత్నించాలి. వీరికి మంచి చేయకపోయినా ఫరవాలేదు. చెడుమాత్రం తలపెట్టకూడదు. వాళ్ళ ప్రగతిని దెబ్బతీయకూడదు. సవర్ణులు నీతి నియమాలకు కట్టుబడి వుండాలి. కేవలం కర్మసిద్ధాంతాలు ఆచారాలను వారిపై రుద్ది చైతన్యవంతులు కాకుండా వుంచడానికి ప్రయత్నించకూడదు. పై గుణాలన్నీ హరిజనుల యెడ సవర్ణులు అలవర్చుకొన్నప్పుడే సాంఘికాభ్యుదయం సాధ్యమవుతుంది. రెండు చక్రాలు సరిగా వున్నప్పుడే బండి బాటపై చక్కగా పయనించగలదనే మాట ఇరువర్గాలు గుర్తుంచుకోవాలి. అప్పుడే సాంఘికాభ్యుదయాన్ని సాధించడం సులభసాధ్యం.

**5.3.2. ఆర్థికాభ్యుదయం :** మానవజీవితం ఆర్థిక స్థితిలో ముడివడి వుంది. రక్త సంబంధం కూడా డబ్బుకే ప్రాధాన్యతనిస్తుంది. ధనహీనునికి సమాజంలో గుర్తింపు వుండదు. మానవ జీవనగమనానికి అడుగడుగునా డబ్బు అవసరం. ఈ డబ్బు సమాజంలో కొంతమంది చేతుల్లో కేంద్రీకృతమై, మిగతావారిని ఆర్థికంగా కృంగదీసింది. బానిసలను చేసింది. వీరే హరిజనులు కాలమే కొన్ని సమస్యలకు పరిష్కారం సూచిస్తుంది. నేడు హరిజనులు ఆర్థికంగా ఉన్నతస్థాయిని అందుకోవడానికి తపనపడుతున్నారు. వీరి స్థితిగతులు మెరుగుపడడానికి ఆర్థికంగా అనేక సంక్షేమ పథకాలను ప్రభుత్వం ప్రవేశపెట్టింది. ఆ పథకాలను హరిజనులు చక్కగా వినియోగించుకొంటున్నారు. ఇంకా ప్రయత్నించాలి. ఆర్థిక వనరులను వినియోగించుకోవాలి. బానిస బ్రతుకులకు స్వస్తి చెప్పి సవర్ణులనుండి తమ ఆర్థిక స్థితిని రక్షించుకోవాలి. ఆ ప్రయత్నంలో ప్రతిఘటన తప్పదు. అయినా వెనుకాడరాదు. ఈ ప్రయత్నంలో సంఘసంస్కర్తలు, సవర్ణుల సహాయం కూడా అవసరం. తమను తాము ఉద్ధరించుకోగలమనే ఆత్మ విశ్వాసం కూడా వుండాలి. అలా చేయగలిగినప్పుడే వారి ప్రయత్నాలు సఫలం కాగలవు. నేటి సమాజంలో హరిజనుల్లో కష్టానికి తగిన ఫలితాన్ని పొందటం పట్టణ జీవితానికి అలవాటు పడటం వంటి ఆలోచనలు వారిలో మెదలుతున్నాయి. భూములను సాధించి పంటలు పండించి ఆర్థికస్థాయిని చేపట్టగలుగుతున్నారు. తమ సమస్యలను తామే పరిష్కరించుకోగలుగుతున్నారు. కులవృత్తులకు స్వస్తి చెప్పి ఆదాయం వచ్చే వ్యాపారాల్ని చేపడుతున్నారు.

**5.3.3. రాజకీయాభ్యుదయం :** భారత రాజ్యాంగం ప్రకారం చట్టం దృష్టిలో అందరూ సమానులే అందుకే రాజ్యాంగంలోని ఈ నేపథ్యంలోనే గాంధీ అంబేద్కర్‌లు హరిజన సమస్యకోసం తీవ్రంగా కృషిచేశారు. 17 వ నిబంధన అస్పృశ్యతా నివారణను సూచిస్తుంది. వారి ప్రయత్న ఫలితంగానే హరిజనులకు సౌకర్యాలు మెరుగయ్యాయి. 1933 జనవరి 8న తేదీన హరిజనులు దేవాలయ ప్రవేశదినంగా పాటించారు. రాజకీయ పరిస్థితిని కూడా అవగాహన చేసుకున్నారు. వీటికితోడు ప్రభుత్వం ఇచ్చే సహకారాలన్నింటినీ సద్వినియోగం చేసుకోవడానికి హరిజనులు ప్రయత్నిస్తున్నారు. సంఘ సంస్కర్తలు అభ్యుదయ వాదులు వీరికి రాజకీయ ఔన్నత్యాన్ని సంఘంలో గౌరవస్థాయిని కల్పించడానికి తపనపడ్డారు. తత్ఫలితంగా హరిజనులు పాలితులే కాకుండా పాలకులు కూడా కాగలిగారు. కేవలం వీటితోనే సరిపెట్టుకుంటే హరిజనులు అభ్యుదయకాముకులు కాలేరు. ఉన్నత విద్యావంతులై రాజకీయంగా ఉన్నత స్థాయిని పొందగలిగినప్పుడు తోడి హరిజనులను కూడా తమస్థాయికి చేర్చుకోవడానికి ప్రయత్నించాలి. ఆ ప్రయత్నంలో అవసరమైతే సవర్ణులను ఎదిరించడానికైనా సిద్ధం కావాలి. ఇప్పటికే కొంతమంది హరిజన నాయకులు ఎన్నికల్లో రాజ్యాంగబద్ధంగా పోటీచేసి నెగ్గగలుగుతున్నారు.

పై మూడు పద్ధతులద్వారా హరిజనాభ్యుదయం సాధ్యమవుతుంది. ఆ ప్రగతికోసం సమాజం ప్రయత్నిస్తోంది. పై మూడు పద్ధతుల్లోని హరిజన పాత్రలను కథానికా సాహిత్యంద్వారా పరిశీలిద్దాం.

**5.3.4 హరిజన చైతన్యం :** హరిజన చైతన్యాన్ని ప్రబోధించే కథలను పరిశీలిద్దాం.

**5.3.4.1. వీరన్న :** 'హరిజన సమస్య' కథలో వీరన్న కథానాయకుడు, విద్యావంతుడు, అన్యాయాన్ని ప్రతిఘటించే స్వభావం వున్నవాడు. యోగిపాలనలో పెరిగాడు. తనకులానికి జరుగుతున్న అన్యాయాన్ని గుర్తించాడు. సవర్ణులతో సమానంగా వుండాలని పట్టుపట్టాడు. తన సవర్ణమిత్రులతో హరిజన సమస్యపై ఆలోచించేవాడు. తోటి హరిజనులను చైతన్యవంతులను చేశాడు. ''వాళ్లకు ఏం అధికారం వుంది, మానవుడు మానవుణ్ణే పశువుగా చూడడానికి34'' అని సవర్ణులను ప్రశ్నించాడు. తమ కులానికి జరుగుతున్న అన్యాయంపై యోగితో చర్చలు జరిపేవాడు. వాటితో సంతృప్తి చెందక ''హరిజనులు విప్లవం చేసి మీ స్త్రీలకి హరిజన బిడ్డల్ని కనాలి35'' అనేవాడు. ప్రభుత్వం చేసే శాసనాలవల్ల తమ బ్రతుకు మారదని

HUM-11

తలచాడు. ప్రతిఘటిస్తేనే హక్కులను సాధించుకోవచ్చుననే భావం వున్నవాడు. ఒకరోజు తన వాడ యువకులతో సవర్ణస్త్రీలపై పడ్డాడు. సవర్ణులు ఉగ్రులై హరిజనులతో ఘర్షణకు దిగారు. వారి మధ్యకు వచ్చిన యోగి దెబ్బ తగిలి మరణించాడు. తత్ఫలితంగా వీరన్నజైలుపాలయ్యాడు. కాని హక్కులను మాత్రం సవర్ణులతో సమానంగా అనుభవించగలిగాడు. హరిజనులు కూడా మనుషులేనని సమాజంచే గుర్తింపబడేలా చేశాడు.

**5.3.4.2. చింతయ్య :** 'పశ్చాద్భూమి'కథలో రాంకోటి రెండవ కుమారుడు చింతయ్య ప్రభుత్వోద్యోగి, దుడుకుతనం వున్నవాడు. ఎదుటివాడిని లెక్కచేయనితనం అతనిలో వుంది. ఆలోచనగలవాడు. అవకాశం వస్తే ఉన్నతస్థాయిని సాధించాలనే తపనపడేవాడు. ఎప్పుడైనా డిప్యూటి కలెక్టర్ అవుతాననే గర్వాన్ని మతిలోనే దాచుకొన్నాడు. ఉన్నదాంతోనే తోడి మనుషులతో సుఖంగా బ్రతకాలని తపనపడేవాడు. తన ఇంట్లోపని మనిషివుంది. ఆమె కూడా హరిజన స్త్రీ, చింతయ్య తండ్రి ఆమెను చూసి ఆమె ఇంట్లోకి వస్తే ఎవరైనా ఏమైనా అనుకోరా అని ప్రశ్నించాడు. చింతయ్య తండ్రితో ఎవరు ఏమనుకుంటేనాకేమి? అసలు ఎవడు ఈళ్ళందర్ని లెక్కజేసేది? ఎదవనాయాళ్ల ఒకడెవడో ఏందో అనుకొంటాడని.... అట్టా వ్యవహారాలు నేనుగాదు ఉడకనిచ్చేద్ది[16]'' అన్నాడు. అతనిలో సాటి హరిజనులపై అభిమానం వుంది. అంతకన్నా గొప్పగా వ్యక్తిత్వం ఉంది. దానికి కారణం అతని హోదా కావచ్చు, మరొకటి కావచ్చు. సాటిమనిషిగా గుర్తించడం అతని అలవాటు.

**5.3.4.3. చిదంబరం భార్య :** 'ఊరబావి' కథలో చిదంబరం భార్య అత్తగారింటికి అదృష్టవంతురాలు. కథానాయిక. ధైర్యసాహసాలకు మారుపేరు. ఈమె గోముఖవ్యాఘ్రం. తాను అన్యాయాన్ని సహించదు. తాను చేసేపనిని ఇతరులతో చెప్పడానికి ప్రయత్నించదు. సాధారణ స్త్రీలలో లేని చైతన్యం ఆమెలో వుంది. మంచినీళ్ల బావివద్ద సవర్ణుడు తాకితే గువ్వమీద చాచికొట్టింది. వాడు గొప్పవాడని వాడివల్ల తన బ్రతుకు కష్టమవుతుందని గుర్తించలేదు. రైల్వేస్టేషన్‌లో తన భర్తను సవర్ణులు కొట్టడానికి ప్రయత్నిస్తే వారిని ప్రతిఘటించింది. బావిని సాధించే ప్రయత్నంలో ఊరబావిలో ఎద్దు దట్టెంను వ్రేలాడదీసింది. అయినా అజ్ఞాతంగానే వుండిపోయింది. హరిజనులు తన భర్తపై చేయనినేరాన్ని మోపి చావట్లో కట్టేస్తే రాత్రివెళ్లి తనభర్త, మామ కట్లను విప్పి, మునసబు గడ్డివాములకు నిప్పు పెట్టింది. చివరకు ఏమీ తెలియనిదానిలా ఇళ్లు చేరింది. ఊరబావిని హరిజనుల పరం చేసింది. ఊరబావిలో మనిషి చనిపోయాడని హరిజనులు నీళ్లు తీసుకెళ్లకపోతే తానే మొదటగా తీసుకెళ్లింది. కథలో ఈ పాత్ర జాతిని జాగృతి పరచింది. హరిజనులను భుజం తట్టి లేపింది. తమ హక్కులను సాధించుకోవడంలో సఫలమైంది.

**5.3.4.4. సూరి :** 'జలగ' కథలో సూరి వెంకడి కొడుకు, తొమ్మిదవ తరగతి చదువుతున్నాడు. అమాయకత్వంతోకూడిన పట్టుదల గలవాడు. తండ్రిపడే కష్టాల్లో పాలుపంచుకోవడానికి ప్రయత్నించాడు. పట్నంలో చదువుతున్నాడు. రోజు తండ్రి రిక్షాలో ఇంటికొస్తాడు. ఒకరోజు వర్షంలోనే రిక్షాలో సూరి తండ్రితోపాటు వస్తున్నాడు. తండ్రిని రిక్షాలో కూర్చోబెట్టి తానే రిక్షా త్రొక్కుతున్నాడు. సవర్ణుడైన రామగోపాలం ఆ వర్షంలోనే రిక్షా ఎక్కితే సూరి తన తండ్రిని కూడా రామగోపాలంతో సమానంగా కూర్చోబెట్టి రిక్షా త్రొక్కాడు. అతని అమాయకత్వమే తనతండ్రి ని సవర్ణునితో సమానంగా కూర్చోబెట్టగలిగింది. తరతరాలు ఆచారాలను తలక్రిందులు చేసింది. మరుసటిరోజు చెరువులో కూడా సూరి సవర్ణులతో సమానంగా వెళ్లిచేపలు పట్టాడు. సవర్ణుడైన రామగోపాలానికి చేపలు పట్టిచ్చాడు. తెలియని ఆలోచనలతో చేయరాని సాహసాలు చేశాడు. తండ్రి చేయలేని చేయరాని కార్యాలను సూరి చేశాడు. రాంగోపాలం దొరతనాన్ని నేలమట్టం చేశాడు.

**5.3.4.5. పోచయ్య** : 'చెప్పులు' కథలో పోచయ్య భూమయ్య కొడుకు, కథానాయకుడు. గొప్ప విద్యావంతుడు కావాలని ఆశపడేవాడు. ఒకసారి బడికి వెళ్లుతున్న పోచయ్య తనకు ఇష్టంలేకున్నా తండ్రిమాట మీద గౌరవంతో దొరకిషన్‌రావుకు చెప్పులు ఇవ్వడానికి వెళ్లాడు. కిషన్‌రావు పనిమీద వుండటం వల్ల తన బడికి ఆలస్యమైంది. కిషన్‌రావు ఇంటిముందు కావలిమనిషికి ఇవ్వడానికి ప్రయత్నిస్తే ఆ ప్రయత్నం సఫలం కాలేదు. ఆరోజు బడికి వెళ్లలేదు. దారిలో బడికి వెళుతున్న తోడి విద్యార్థులను చూసి మన స్తాపానికి గురయ్యాడు. కొంత సేపటికి దొర బయటకు వచ్చి చెప్పులు సరిగా లేవని ''కొంచెం కుట్టైమైయినమిరా పొల్లగా తీస్కపోయి వొదులు చేయించుకుర్రా,'' [37] అన్నాడు. దొరకారణంగా పోచయ్య బడికి వెళ్లలేదు. కాలంగడిచింది. వృత్తులు మారాయి. విద్యావంతుడై ఎమ్మార్వో అయ్యాడు. కిషన్‌కావు కాలం తలక్రిందులై కరీంనగర్‌లో చెప్పులషాపు పెడితే పోచయ్య అక్కడకు వెళ్లాడు. కథలో ఈ పాత్ర కాలంతో పాటు మానవ సంబంధాలలో మార్పు సహజమని మానవుల వృత్తులు కూడా కాలంతోపాటు మారుతున్నాయని తెలియజేస్తుంది.

**5.3.5. సవర్ణుల సానుభూతి**: సవర్ణుల అభిమానానికి పాత్రుల,న కవులను పరిశీలిద్దాం.

**5.3.5.1. వరాలు** : 'సబ్బు' కథలో రావుడికూతురు వరాలు కథానాయకురాలు. అన్యాయాన్ని ఎదిరించే మనస్తత్వం, సమానత్వం కోసం తపనపడటం కన్పిస్తాయి. నగ్నంగా స్నానం చేస్తున్న వరాలును రమణ చూశాడు. వరాలు రమణను ప్రేమించింది. అతనిచేత ప్రేమింపబడింది. అతనిని పెళ్ళి చేసుకోవడానికి ఇష్టంవున్నా తనకులం కారణంగా అతనికి అనర్హురాలుననుకొంది. అతనిని చూసి తృప్తిపడటానికి బావికెళ్ళేది. దొంగచూపులతో అతని మనస్సును చిత్రిత్తించేది. గ్రామంలో సవర్ణులు, అవర్ణులు ఒకే బావినీళ్ల ఉపయోగించడం, వల్ల వాడయువకులు, ఊరి యువకులు స్నానానికి వచ్చారు. ఆమె ఎదుటే ఊరియువకులు రమణ సబ్బును ఉపయోగించుకొన్నారు. ఈ అవకాశం వాడ యువకులకు లేకపోవడం సహించలేకపోయింది. తన మనస్సు చలించింది. రమణను వివాహమాడటానికి తిరస్కరించింది. ''అసలు మీ మనసుల్లో మురికి తరతరాలుగా పేరుకపోయింది... దీనికింకా చాలాకాలం పడుతుంది బాబూ,'' [38] అని రమణను ఈసడించింది. అందరూ కలిసేకాలం రావాలన్నది. మనుషుల్లో హెచ్చుతగ్గులన్నంతకాలం ఐక్యత కుదరదని తెలియజేసింది. ఆమెమాటల్లో చైతన్యం అణువణువునా కనిపిస్తుంది. చెడును ఎదురించే ధైర్యంవుంది.

**5.3.5.2. మాలదాసరి**: 'మాలదాసరి' కథలో మాలదాసరి హరిజనుడు, భక్తి తత్పరుడు. కథా నాయకుడు. కురుంగుడి (వామన) దేవాలయం బయటే కూర్చొని పూజలు చేసేవాడు. గుడి బయటే శూద్రులు ప్రసాదం పెడితే ఆరగించేవాడు. బ్రాహ్మణులు ఎదుటపడితే కడు దూరం వెళ్ళేవాడు. ఒకసారి మాలదాసరి సోమశర్మతో భక్తి వాదానికి దిగవలసివచ్చింది. ఆ వాదంలో మాలదాసరి గెలిచి సోమశర్మతో దెబ్బలకు గురి కావలసి వచ్చింది. మాలదాసరి నిత్యం భక్తితత్పరుడు. సోమశర్మ స్వార్థంతో డబ్బు సంపాదించి దొంగల చేతుల్లో హతమై దయ్యం అవుతాడు. 'బ్రతికి సాధించలేకపోయినా చచ్చైనా సాధించాలనే' చందాన మాలదాసరిని చంపడానికి ప్రయత్నించాడు. ఒకరాత్రి మాలదాసరి దేవాలయానికి వెళ్లుతుంటే శ్మశానంలో సోమశర్మదయ్యం పట్టుకొంది. అతనిని భక్షించడానికి ప్రయత్నించింది. కాని భక్తితత్పరుడైన మాసదాసరి పూజతర్వాత తనను భక్షించమన్నాడు. తన మాటను నిలుపుకొన్నాడు. సత్యవంతుడు, భక్తి స్వరూపుడు అని సోమశర్మచే నిరూపించుకోబడ్డాడు. అతని అహంను తగ్గించగలిగాడు. మాటతప్పనివాడుగా నిలబడ్డాడు. కులంకన్న భక్తిమిన్న అని నిరూపించాడు.

**5.3.5.3. అరుంధతి** : 'రుధిరమధనం' కథలో అరుంధతి కథానాయిక, పోలయ్యభార్య. భర్తచేసే పనిలో

ఆమె సహకరించేది. పనిమీద కామయ్య ఇంటికెళ్లి అతని కామానికి గురై తప్పించుకోగలిగింది. తాము సుఖంగా బ్రతకడంకోసం కామయ్య బారినుండి తప్పించుకొని ఊరువదలి వెళ్లారు. పచ్చని పొలాల్లో మనుషులకు దూరంగా బ్రతకడానికి ప్రయత్నించింది. లారీ ప్రమాదంలో గాయపడిన కామయ్య కొడుకును ఆసుపత్రికి తీసుకెళ్లి తనరక్తం ఇచ్చి ప్రాణం పోసింది. మనసున్న మనిషిగా కష్టాల్లో ఎదుటి వ్యక్తిని ఆదుకొనే వ్యక్తిగా తలచబడింది. కామయ్య అభిమానాన్ని చూరగొనింది. అతని మూర్ఖత్వాన్ని, అహంను సానుభూతితోనే దెబ్బకొట్టింది. తన పాదాల దగ్గరకి వచ్చేలా చేసుకోగలిగింది.

**5.3.6. హరిజన ఘర్షణ** : హరిజనులు సవర్ణులతో దిగి విజయం సాధించిన కథలను గమనిద్దాం.

**5.3.6.1. పుల్లన్న** : 'చీకటినాడీ - వెలుగునెత్తురూ' కథలో పుల్లన్న రామిరెడ్డి ఇంట్లో కష్టం చేస్తున్నాడే కాని కష్టానికి తగిన ఫలితం ఆశించలేడు. రెడ్డి ఇచ్చిన డబ్బుతోనే తృప్తి చెందేవాడు.

**5.3.6.4 హరిజన విద్యార్థి** : పాపం కుంటేలుగాడు కథలో హరిజన విద్యార్థి, హైస్కూల్ విద్యార్థి, అభ్యుదయ భావాలు కలవాడు. సమానత్వం కావాలని తపనపడేవాడు. స్కూల్‌లో పాఠశాల నాయకత్వానికి సవర్ణ విద్యార్థితో పోటీపడ్డాడు. అతనిపై నెగ్గాలని ప్రయత్నించాడు. గ్రామంలో ప్రచార నిమిత్తం గోడలపై తనపేరు రాయడానికి రిజర్వుచేసుకొన్నాడు. తత్ఫలితంగా సవర్ణ విద్యార్థి ఆగ్రహానికి గురయ్యాడు. వాడిచేత అమానంపాలై దెబ్బలు తిన్నాడు. కోపోద్రిక్తుడయ్యాడు. జరిగిన అవమానానికి ప్రతీకారం అవసరం అని తలచాడు. తన వాడయువకులతో సవర్ణవిద్యార్థి మీదపడి అతనిని ఆసుపత్రి పాలుచేశాడు. తన కులానికి జరిగిన అవమానం మరోసారి జరుగకుండా చేయడానికి ప్రయత్నించాడు. హరిజనులు ధైర్యవంతులని, శక్తివంతులని నిరూపించాడు.

**5.3.6.5. సిన్నాయుడు** : 'హోమం' కథలో సిన్నాయుడు కథానాయకుడు. హరిజన వాడ పంచాయతీ మెంబరు. కొండారెడ్డి అభ్యర్థిపై పోటీచేసి గెలిచాడు. తన వాడ సమస్యలను తీర్చదలచాడు. తమకు సవర్ణులు సాయం చేస్తారని తమ సమస్యలను తీరుస్తారని ప్రయత్నించి విఫలమై అధికారంతోనైనా సాధించడానికి ప్రయత్నించాడు. తత్ఫలితంగా గ్రామప్రెసిడెంటు కొండారెడ్డి ఆగ్రహానికి గురయ్యాడు. 'మొదటికే ముప్పు' అన్నట్లు వారికున్న నీటి సమస్య పెరిగింది. వాడ ప్రజలు వాడు కొంటున్న చెరువులో కొండారెడ్డి చేపలు పట్టించాడు. ఇది అన్యాయం అని సిన్నాయుడు నాయకత్వాన హరిజనులు వెళ్లి కొండారెడ్డిని అడిగి సవర్ణులచేత అవమానం పాలయ్యారు. ఘర్షణకు దిగారు. వీరిని చెరువుకు దూరంగా వుంచారు. ''వొరే, మేము కాదంటే...సావులకీ సభలకీ కొమ్ములూదీ పలకలు కొట్టి బతకాల్సిందేరా మీరు''40 అని అన్నారు. సవర్ణులు జరిపిన అన్యాయాన్ని నాయుడు నాయకత్వం ప్రతిఘటించలేకపోయింది. అన్యాయాన్ని అన్యాయంతోనే ఎదిరించాలనే సూత్రంతో హరిజను లెవ్వరూ డప్పులువాయించకూడదని సిన్నాయుడు తీర్మానం చేశాడు. తమ డప్పులను మంటలకు ఆహుతిచేశారు. కథలో ఈ పాత్ర సవర్ణులకు సమస్యలను తెచ్చిపెట్టింది. వారి ఎత్తులకు పై ఎత్తు వేసింది. తోడి హరిజనులను అభ్యుదయంవైపు పయనించేలా చేసింది.

**5.3.7. హరిజన ప్రయత్నం** : ఈ కథల్లో హరిజన ప్రయత్నం స్ఫురిస్తుంది.

**5.3.7.1. హరిజన పాత్రలు** : 'మలుపు' కథలో సాధనకోసం వ్యక్తిగతంగా కాక మూకుమ్మడిగా హరిజన పాత్రలు ప్రయత్నించాయి. హరిజనులు కష్టజీవులు. త్రాగునీటి సమస్య వారికి ఎదురైంది. స్వశక్తితో బావిని త్రవ్వకొన్నారు. అయినా ఫలితం లేకపోయింది. బావి నీళ్లలో ఫ్లోరైడ్‌శాతం ఎక్కువగా వుండటం వల్ల ఆ నీటిని త్రాగిన హరిజనులు రోజూ చనిపోవడం, జాతర్లు జరపడం మొదలెట్టారు. ప్రభుత్వ అధికారులు సహాయంతో బావినీళ్లు త్రాగకూడదని తెలుసుకొన్నారు. త్రాగునీటి బావికోసం ప్రభుత్వానికి వినతి పత్రం సమర్పించినా ఫలితం లేకపోయింది. సవర్ణులు బావి నీళ్లకు హరిజనులను రానివ్వకపోవడంతో తీవ్ర

ఇబ్బందులకు గురయ్యారు. తీవ్ర దప్పికతో చావు బ్రతుకుల మధ్య కొట్టుమిట్టాడుతూ సవర్ణులు చేసే అన్యాయాలను తెలుసుకొన్నారు. సవర్ణులపై ఉధ్యమించారు. రైతు కూలీలు చిన్నకారురైతులు సహకరించారు. అందరూ సవర్ణుల మంచి నీటి బావిలో నీళ్లు తీసుకోవడానికి వెళ్లారు. అందరూ ఏకమై సమస్య పరిష్కారం సులభంగా చేసుకున్నారు.

**5.3.7.2. రాముడు** : 'సూర్యుడు తలెత్తాడు' కథలో రాముడు కథానాయకుడు. ఒక ఎకరాపొలానికి భూస్వామి కష్టపడి పనిచేస్తాడు. సవర్ణులంటే దూరంగా వుంటాడు. వారితో పోట్లాడి జయించడం కష్టమనుకొనేవాడు. తమ సంసారాన్ని గురించి ఆలోచించక పొలాన్ని గురించే ఆలోచించాడు. తనభార్య సవర్ణులచేత అవమానం పాలై చనిపోతే చలించలేదు. తన కూతురును సవర్ణుడు గర్భవతిని చేస్తే , ఆమె ప్రసవించి చనిపోతే దోషిని ఎదిరించలేదు. తనకూతురుకు జరిగిన అన్యాయాన్ని ప్రతిఘటించలేదు. కొడుకు కూడా సవర్ణులచే హత్యకు గురయ్యాడు. రాముడికి మాత్రం తన ఎకరా పొలం సర్వస్వం అయింది. ఆ పొలం కూడా సవర్ణులే కాజేయడంతో చివరకు నిస్సహాయుడయ్యాడు. నిస్సహాయతతో అతను దేనిని పోగొట్టుకొన్నాడో తెలుసుకొన్నాడు. అందుకు కారణం ఎవరో ఊహించుకోగలిగాడు. వారిపై ప్రతిఘటించడానికి సంసిద్ధుడయ్యాడు. అందుకోసమే ''ఈ బతుకులిట్టా తగులబడ్డానికి ఈల్లేదు...ఈ బతుకులిట్లా తగలబడ్డానికి ఈల్లేదు''41 అంటూ అగ్గిపెట్టెతో ఊరివైపు పరిగెత్తాడు. కథలో ఈ పాత్రద్వారా నిస్సహాయుడు ఎలాంటి స్థితిలో చైతన్యవంతుడవుతాడో తెలియజేశాడు రచయిత.

**5.3.7.3. అంకయ్య** : 'చెంబుకొకగంగ' కథలో అంకయ్య కథానాయకుడు. చిన్నతనంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకొని కన్న ఊరిలోనే అడుక్కొని జీవించేవాడు. వాడి వయస్సు పెరిగేకొద్ది ఆలోచనతోపాటు కష్టపడటం నేర్చుకొన్నాడు. పశువులకాపరిగా జీవితం ప్రారంభించాడు. ఒకరోజు పశువులపై చిరుతపడటంతో తన ప్రాణాన్ని కాపాడుకోవడంకోసం చెట్టుఎక్కాడు. పశువులు చెల్లాచెదురై పంటపొలాల్లోపడి నాశనం చేశాయి. తత్ఫలితంగా అంకయ్య యజమానిచేత దెబ్బలుతిని తనబ్రతుకు మార్చు కోవడం కోసం సైన్యంలో చేరాడు. కాలంగడిచింది. సైన్యంనుండి తిరిగివచ్చాడు. కాలం మారినా తన జాతిబ్రతుకు మారలేదని గ్రహించాడు. వారి అభ్యుదయంకోసం కంకణం కట్టుకొన్నాడు. మొదటి ప్రయత్నంగా గ్రామ బంజరు భూముల్లో స్వంత గుడిసెలను వేయించాడు. ప్రభుత్వంతో ప్రతిఘటించి గుడెసెలు కూలకుండా చేశాడు. సవర్ణుల ఆగ్రహానికి గురై, వారి బావుల్లో నీళ్లు తీసుకోవడానికి అనర్హులయ్యారు. తోడి హరిజనులు శ్రమశక్తితో అందరూ ఏకమై అంకయ్య నాయకత్వాన మంచినీళ్ళ బావిని త్రవ్వుకొన్నారు. సమస్యలు లేక సుఖంగా బ్రతకడానికి అలవాటుపడ్డారు. వేసవిలో సవర్ణులకు నీటి ఎద్దడి ఏర్పడితే హరిజన అంకయ్యవద్దకు వచ్చారు. ప్రభుత్వానికి విన్నవించి కలెక్టర్‌తో సమస్య పరిష్కారానికి ప్రయత్నించారు. కాని అంకయ్యమాత్రం బావిలో నీటి పంపులు లేకుండా బావివద్దకెళ్లి తీసుకపొమ్మన్నాడు. కలెక్టర్‌తో ''దేవరా, కులానికొక్క చెంబు, చెంబుకొకగంగ . చెంబు ఏ కులానిదైతే గంగ ఆ కులానిదైపోతున్నది. గంగకు అంటూ ముట్టూ లేదంటూనే జాతికొక గంగను చేస్తున్నారు. తెలుగుగంగేది, తమిళ గంగేది....ఒడ్డున కూర్చుని వాదులాడుకుంటావుండాం''42 అని అన్నాడు. కులంపేరుతో గంగను సూచించే పద్ధతికి స్వస్తి చెప్పమన్నాడు. కథలో ఈ పాత్ర సవర్ణులు చేసే అన్యాయాలకు పరాభవం తప్పదని తెలియజేస్తుంది.

**5.3.7.4. నరసన్న** : 'నరసన్న పాపాయి' కథలో నరసన్న రవణ అత్తగారింటిపాలేరు. కథానాయకుడు. హరిజన వాడపెద్ద చిన్నతనంలో తెలియని ఆలోచనలో రుద్రేశ్వరం గుడిలోకి ప్రవేశించి తనకులం కారణంగా రవణ అన్నచేత దెబ్బలు తిన్నాడు. ఆనాడు హరిజనులకు గుడి, బడి నిషిద్ధం. నరసన్న కూడా నిరక్షరాస్యుడు. ఆలోచనలేనివాడు. కాలంమారింది. రవణ అత్తగారింట్లో నరసన్న ఒక కుటుంబ సభ్యుడుగా వున్నాడు.

రవణ భర్తచే సమానంగా చూడబడ్డాడు. అతని చేతనే విద్య నేర్చుకున్నాడు. నర్సన్నకు వివాహమై కూతురు పుట్టింది. రాజకీయాల్లో ప్రవేశించి శాసనసభ్యుడయ్యాడు. అందులో రవణ భర్త సహాయం వుంది. రవణ కుటుంబాన్ని ఆర్థికంగా ఆదుకొన్నాడు. కులమతప్రమేయం లేకుండా రెండు కుటుంబాలు స్నేహంగా వుండగలిగాయి. స్నేహానికి కులం అడ్డురాదని ఈ పాత్ర తెలియజేసింది.

**5.3.7.5. ఆనందరావు** : 'వ్యూహం' కథలో ఆనందరావు కథానాయకుడు. వాడ యువనాయకుడు. విద్యావంతుడు. అభ్యుదయభావాలు కలవాడు. తమ వాడ ప్రజలను చైతన్యవంతులను చేయాలని, వాడను అభివృద్ధిపరచాలని ప్రయత్నించాడు. కాని సవర్ణులు అడ్డు తగిలారు. తనవాడ ప్రగతి కోసం బాక్‌వర్డ్‌క్లాసెస్ వెల్‌ఫేర్ అసోషియేషన్ అనే సంస్థను స్థాపించాడు. పంచాయతీ ప్రసిడెంటుకు తమవాడ తరఫున వినతిపత్రాలు ఇచ్చాడు. కాని ఫలితం లేకపోయింది. పంచాయతీ ఎన్నికల్లో ప్రసిడెంటుగా పోటీచేశాడు. తమ పరపతి పోతుందనే నెపంతో రాముడు ఓటుకు ఐదువందలు చొప్పున హరిజనులకు ఇచ్చి ఓట్లు వేయించుకొని గెలిచాడు. ఆనందరావు పన్నినవలలో రాముడు చిక్కుకొన్నాడు. హరిజనులు ఓట్లు కోసం రాముడిచ్చిన డబ్బంతా అసోషియేషన్‌కు ఇచ్చి వాడ ప్రగతికి దోహదపడ్డారు. కథలో ఆనందరావు సామాజిక పరంగా ఓడినా, నైతికంగా గెలిచాడు.

**5.3.8. హరిజన వ్యక్తిత్వం** : హరిజన వ్యక్తిత్వం కన్పించే కథానికలను గమనిద్దాం.

**5.3.8.1. నందయ్య** : 'దేవుడు' కథలో నందయ్య హరిజన నాయకుడు. తన నాయకత్వంలో హరిజనులను శ్రీరామునిగుడి దర్శనార్థం తీసుకొచ్చాడు. దేవుడిని దర్శించవచ్చుని సంతోషించాడు. ఇంతకాలానికి తన ఆశ తీరుతుందని తలచాడు. చాలాదూరంనుండి నడిచివచ్చాడు. కాని అతని ప్రయత్నం సవర్ణుల విఘాతానికి గురియైంది. అతని ప్రయత్నం సఫలం కాలేదు. సరిగదా, తీవ్రదాడికి గురయ్యాడు. ఆరోజే తీవ్ర వర్షంతో గుడి కూలిపోవడం వల్ల సవర్ణులకు నందయ్య అవసరం పడింది. గుడిని కట్టమన్నారు. అందుకు నందయ్య నిరాకరించాడు. ''అప్పుడు గుళ్లోకొచ్చినప్పుడు ముట్టుడుంది గాని గుడి కట్టేందుకు లేదా సామీ ముట్టుడు43'' అన్నాడు. తనకు మేలు చేయని దేవుడు తనను దాడికి గురిచేసిన దేవుడు అవసరం లేదనుకొన్నాడు. కథలో ఈ పాత్ర తమ అవసరాలు తీర్చుకొని సంప్రదాయాల పేరుతో హరిజనులకు దూరంగా వుంచే సవర్ణులకు బుద్ధిచెప్పింది. తామూ తెలివిగలవారమే, అవసరమైతే ప్రతిఘటించగలమని నిరూపిస్తుంది.

**5.3.8.2. కథకుడు** : 'బందీ' కథలో కథకుడు ఉన్నత విద్యావంతుడు . చిన్నతనంలో ఒకవైపు డబ్బు సంపాదించుతూ మరోవైపు విద్యనార్జించాడు. పట్టుదలగల మనిషి. కులాభిమానం గలవాడు. వ్యక్తిత్వం వున్నవాడు. చదువుపూర్తి కాగానే పల్లెటూళ్లో టీచర్ ఉద్యోగం సంపాదించాడు. ఊరిప్రజలచేత మంచి ఉపాధ్యాయుడు అనిపించుకొన్నాడేగాని తనకులం కారణంగా హరిజనవాడలో తప్ప ఊళ్ళో అద్దెఇల్లు దొరకలేదు. కాపుయువతి రేణుకచేత ప్రేమింపబడ్డాడు. పెళ్లికూడా చేసుకోవాలనుకొన్నాడు. కథకుడు ఆర్డీవో అయ్యాడు. రేణుక తల్లిదండ్రుల చేతకూడా ఆదరింపబడ్డాడు. తనలో తమకులంపై తాను చదువుకొన్న చదువుపై గర్వంవుంది. ఎదుటివాడి కులంకన్న తనకులం ఎక్కువనే ఆలోచనవుంది. అందుకే తనకులం యువతి మల్లికను ప్రేమించాడు. తనకు విలువ ఇవ్వని కులంలోని రేణుకని పెళ్లి చేసుకోవడానికి నిరాకరించాడు. ఆమెను వ్యక్తిగా ప్రేమించాడు తప్ప కులపరంగా ఆమెను గౌరవించలేదు. రేణుకతో సాంప్రదాయధోరణిలో వివాహానికి ఇష్టపడి ఆ పని జరగక తనకులస్థురాలిని పెళ్ళిచేసుకొన్నాడు. కాని రేణుకతో మాత్రం ప్రేమ సంబంధాలను తెంచుకోలేదు. భార్య మాటపై రేణుకను రెండవ వివాహం చేసుకోలేదు. వ్యక్తిత్వంకోసం తన ప్రేమనే చంపుకున్నాడు.

**5.3.8.3. చంద్రావతి** : 'పరిధులూ ప్రమేయాలు' కథలో చంద్రావతి ఆనందరావు కూతురు. ఎం.ఏ చదివింది. చైతన్యభావాలు కలది. ప్రతి మనిషికి వ్యక్తిత్వం అవసరమని తలచేది. తాను వ్యక్తిగా తనకు అవసరమైన నిర్ణయాలను తానే తీసుకోవాలని ఆలోచించేది. కులపరమైన చర్చల్లో పాల్గొనేది. అస్పృశ్యత తొలగాలంటే కేవలం మాటలవల్ల చాలదని దానిని చేతలద్వారా సమాజం చేయాలని తపనపడేది. తనతండ్రి ఆనందరావు సవర్ణుడైన శంకరంతో ఈమెకు పెళ్ళి సంబంధాన్ని కుదిర్చితే అందుకు నిరాకరించింది. తాను ఒక సవర్ణుడిని పెళ్లి చేసుకున్నంతమాత్రాన అస్పృశ్యత పోదని తలచింది. అస్పృశ్యత పోవడానికి పెళ్లి సంబంధాలు ముఖ్యం కాదని, సవర్ణుల మనస్తత్వంలో ఆలోచన మారనంతవరకూ ఈ సమస్య పోదనే విషయం స్పష్టపరిచింది ఈమె.

20వ శతాబ్దంలో హరిజనులూ మనుష్యులేననే భావం సవర్ణులకు స్ఫూరించింది. దానికి తోడు వీరియెడ దయ, సానుభూతి ప్రతిఫలించాయి. పై కథల్లోని పాత్రలన్నీ వ్యక్తిగతంగా బ్రతకడానికి ప్రయత్నించాయి. సవర్ణులతో సమానంగా హక్కులు అనుభవించాయి. తమజాతి ప్రగతికోసం సంస్కరణ మార్గాన్ని ఎన్నుకొన్నాయి. దానికితోడు సనాతన ఆచారాలపట్ల ప్రాధాన్యం తగ్గిపోయింది. బ్రతకడానికి సవర్ణులైనా, అవర్ణులైనా ఏవృత్తినైనా చేపట్టడానికి ప్రయత్నించారు. సాధ్యమైనంతవరకూ కులవృత్తులను మూలపడేశారు. అప్పటినుంచి వర్ణ వ్యవస్థకు ఆయుస్సు తగ్గిందని చెప్పవచ్చు. వర్ణాంతర వివాహాల ప్రాధాన్యత హెచ్చింది. కులాల వ్యత్యాసాలను పోగొట్టడానికి సాధ్యమైనంతవరకూ ఈ వివాహాలు దోహదం చేశాయి. హరిజనుల్లో తరాలనుండి సోమరితనం, భయం, అజ్ఞానం, పోగొట్టుకొవడానికి తమకష్టానికి తగిన ఫలితాలను అందుకొవడానికి కులనిర్మూలన మీద నిర్మించబడిన వ్యవస్థ రూపురేఖలు చెరిగిపోవడానికి ప్రయత్నించారు. అభ్యుదయపథంవైపు పయనించారు.

## అధ సూచికలు


1. కథానిక స్వరూప స్వభావాలు - పోరంకి దక్షిణామూర్తి పుట 323
2. కరుణ కుమార కథలు - కరుణ కుమార పుట 88
3. కరుణ కుమార కథలు - కరుణ కుమార పుట 62
4. ముత్తడు - గొప్పొడు - పులికంటి కృష్ణారెడ్డి - ఆంధ్రజ్యోతి వారపత్రిక 11-3- 83 పుట 51
5. ఇది కథా- బోయ జంగయ్య ఇండియాటుడే మార్చి 6-20-1995 పుట 64
6. యజ్ఞంతో తొమ్మిది-కాళీపట్నం రామారావు పుట 20
7. జూదం (కథలసంపుటి) - సింగమనేని నారాయణ పుట 41
8. మధురాంతకం రాజారాం కథలు - మధురాతకం రాజారాం పుట 86
9. గ్రుక్కెడునీళ్లు - బందా కనకలింగేశ్వర రావు భారతి మే 1932 పుట
10. అయ్యోపాపం - గొట్టుముక్కల మంగాయమ్మ.....పుట16
11. ఊరిబాయి - బి. దామోదర రావు పుట 3
12. ఇంకానా ఇకపై సాగదు (దళితకథలు) భార్గవీరావు పుట 104
13. ఇంకానా ఇకపై సాగదు (దళితకథలు) భార్గవీరావు పుట 105
14. ఊరబావి - కొలకలూరి ఇనాక్ పుట 5
15. ఊరబావి - కొలకలూరి ఇనాక్ పుట 23
16. మాకూ వున్నాయి స్వగతాలు - గోపీచంద్ పుట 30

17. వేట - పులిపాక శ్రీరామచంద్రమూర్తి, రచన మాసపత్రిక నవంబర్ 1994 పుట 55
18. హరిజనుల పుట్టుపూర్వోత్తరాలు- గోవాడ నిరీక్షణరావు పుట
19. తెలుగు నవల - అస్పృశ్యతా సమస్య - ననుమాసస్వామి పుట 16
20. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి కథల సంపుటి (మూడవభాగం) శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, పుట 281
21. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి కథల సంపుటి (మూడవభాగం) -శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి పుట 281
22. కోటిగాడు స్వతంత్రుడు - పులికంటి కృష్ణారెడ్డి పుట 75
23. కరుణకుమార కథలు - కరుణకుమార పుట 43
24. కరుణకుమార కథలు - కరుణకుమార పుట 51
25. అగ్నిగుండం - కాలువ మల్లయ్య అభ్యుదయ మార్చి ఏప్రిల్ 1991 పుట 13
26. యజ్ఞంతో తొమ్మిది - కాళీపట్నం రామారావు పుట 55
27. ఊరబావి - కొలకలూరి ఇనాక్ పుట 156
28. తల్లిమట్టి - స్వామి ఉదయం వారపత్రిక పుట 62
29. కొత్తదారి - పినాకపాణి అరుణతార జులై ఆగష్టు 1994 పుట 19
30. పాపానికి జీతం - జి. భాను భారతి నవంబర్ 1969 పుట 18
31. ఇంకానా ఇకపై సాగదు - భారవీరావు పుట 2
32. ఇంకానా ఇకపై సాగదు - భార్గవీరావు పుట 130
33. హరిజనాభ్యుదయం - ఆధునికాంధ్ర కవిత్వం - కల్లూరి ఆనందరావు పుట 447
34. ఆ రాత్రి (కథలసంపుటి) - చలం పుట 130
35. ఆ రాత్రి (కథలసంపుటి) - చలం పుట 132
36. ఊరబావి - కొలకలూరి ఇనాక్ పుట 161
37. చెప్పులు - జింబో ఆంధ్రజ్యోతి వారపత్రిక 20-1-95 పు 46
38. సబ్బు - పులికంటి కృష్ణారెడ్డి యువ పుట 134
39. కేతు విశ్వనాథరెడ్డి కథలు - కేతు విశ్వనాథ రెడ్డి పుట 92
40. ఇంకానా ఇకపై సాగదు - భార్గవీరావు పుట 35
41. సూర్యుడు తలెత్తాడు - కొలకలూరి ఇనాక్ పుట 202
42. చెంబుకొకగంగ - పులికంటి కృష్ణారెడ్డి ఆంధ్రజ్యోతి వారపత్రిక 21-11-86 పుట 31.

# 6. తెలుగు కథానిక - హరిజనాభ్యుదయం

హిందూ సమాజం తరతరాలుగా హరిజనుల్ని అస్పృశ్యులుగా చూడడమే గాక వారు చూడరానివారుగా, అంటరానివారుగా, విద్యానర్హులుగా దూరంగా వుంచింది. ఇందువల్ల వీళ్ళు పరిణామంచెందటం ఆలస్యమైంది. ఆ ఆలస్యంగానైనా పరిణామం చెందడానికి హరిజనులు ప్రయత్నిస్తే సవర్ణులు అడ్డంకిగా వారికి నిలిచారు. హరిజనులు చేసేదిలేక మతాంతరీకరణ చెంది విద్యాభ్యాసం చేయడానికి ప్రయత్నించారు. విద్యావంతులైన సాహితీవేత్తలై తమ సమస్యలను చిత్రించుకోవడానికి ప్రయత్నించారు.

హరిజనుల సమస్యలను గురించి హరిజన రచయితలు చెప్పడం వేరు, హరిజనేతర రచయితలు చెప్పడం వేరు. హరిజనులు స్వయంగా కులద్వేషాల్ని అస్పృశ్యతావమానాల్ని చేదు అనుభవాల్ని చవి చూచి వుంటారు. తేలు కుట్టినవాడికే బాధ గురించి తెలుస్తుందన్నట్లు ఆకలి అయినవాడికే కడుపు మంట తెలుస్తుందన్నట్లు వీళ్ళే వీళ్ళ సమస్యలను చిత్రించడంలో వాస్తవికత, దయనీయత, బాధామయ జీవితం, మనోవ్యథమొదలైనవి స్పష్టంగా కన్పిస్తాయి. మానవతా దృష్టిగలవారికి జాలిగొలుపుతాయి. ఆకట్టుకొంటాయి.

దళితేతర రచయితల విషయానికొస్తే తరాలుగా సమాజంలో బ్రాహ్మణాధిక్యం కొనసాగింది. హరిజనులు అంధకారంలోనే మగ్గారు. పందొమ్మిదవ శతాబ్దంలో అనేక మంది సంఘ సంస్కర్తలు బయలుదేరి సమాజంలోని సంప్రదాయాలను, మూఢాచారాలను ఖండించారు. అప్పుడు హరిజనులు మేల్కొన్నారు. విద్యపై మోజు చూపారు. సమాజంలో ఉన్నత వర్గాల రచయితలు హరిజనుల అభ్యున్నతిని గుర్తించారు. ఇక సనాతన ఆచారాలంటూ కూర్చుంటే లాభంలేదనుకొన్నారు. అప్పుడు వారే హరిజన జీవిత సమస్యలపై రచనలు చేయడం ప్రారంభించారు. వారి రచనల్లో దయ, జాలి, కరుణ వర్షిస్తుందే తప్ప వాస్తవికత కన్పించదు. ఆప్యాయత కురిపిస్తుందే తప్ప అక్కున చేర్చుకోదు. సమస్యలను చిత్రీకరిస్తుందే తప్ప సంప్రదాయరీతిలో సమస్యలకు పరిష్కారం చెప్పదు.

## 6.1 హరిజన రచయితలు

హరిజన జీవితాన్ని హరిజనులు రచించే ధోరణిలో తమ జీవితానుభవాలు కష్టాలు కన్పిస్తాయి. రచనా పరంగా కొంత ప్రత్యేకతను సంతరించుకొంటాయి. వీరి రచనల్లో తమ జీవితానుభవం తప్పని సరిగా వుంటుంది.

పాత్రలు-హరిజన రచయితలు చిత్రించిన హరిజన జీవితం చిత్రించే కథల్లో ప్రధానంగా కనిపించే హరిజన పాత్రలు సహజంగా వుంటాయి. వాటి చుట్టూ మిగతా పాత్రలు పరిభ్రమిస్తాయి. సమస్య సవర్ణులకు హరిజనులకు సంబంధించినదైనా హరిజన పాత్రలే ప్రధానంగా కన్పిస్తాయి. వీరి కథల్లోని పాత్రలకు సవర్ణులనిచే ఎన్నికష్టాలు వచ్చినా మూర్ఖంగా అనుభవించడం తప్ప ఎదురుతిరగడం వుండదు. వీళ్ళు సమ్మె చేయాలన్నా, ప్రతిఘటించాలన్నా కొన్ని సంఘాల సహాయం అవసరం. అప్పుడే వీళ్ళు దేనినైనా ప్రతిఘటించగలరు. రచయిత వీరి అభ్యుదయాన్ని కాంక్షించినట్లైతే కథలో హరిజన పాత్రలు భయపడుతూనే, లేదా వారి క్రిందనుండే వారి సానుభూతితో తమ హక్కులను సాధించగలరు. దాదాపు వీరిలో సర్దుకుపోయే గుణం వుంటుంది తప్ప అన్యాయాన్ని ఎదిరించే ధైర్యం వుండదు. శ్రమించగలరు గాని, శ్రమకు తగిన ఫలితాన్ని భూస్వామి నుండి ఆశించి పొందలేరు. ఒక రు ఉద్యోగం ఇస్తే చేయగలరు తప్ప ఉద్యోగం కోసం ప్రయత్నించి సాధించుకోలేరు. తమ కోర్కెలు తీర్చుకోవడం కోసం ఇతరులపై ఆధారపడుతారు తప్ప తాము స్వతంత్రంగా తీర్చుకోలేరు. విద్యావంతుడైనా సరే తమకు జరిగిన అన్యాయాన్ని నిరసించగలడుగాని, సమాజాన్ని నిందించలేడు. వీరి స్వరూపాలను కథానికలద్వారా పరిశీలించటం ప్రస్తుత కర్తవ్యం.

శిల్ప-కథారచనకు శిల్పం ఆయువుపట్టు. కథలోని శిల్పం ఆ రచయిత యొక్క గొప్పతనానికి అద్దం పడుతుంది. హరిజన జీవితాలను గురించి హరిజనులు రచన చేయడంలో కొంత అనుభవం అవగాహన స్పష్టంగా కన్పిస్తుంది. వారి కష్టాలను కన్నులకు కట్టినట్లుగా చిత్రించగలుగుతారు.

6.1.1. ఆచార్య కొలకలూరి ఇనాక్ - తెలుగు కథానికా సాహిత్యంలో హరిజన జీవితాన్ని గొప్పగా మలచిన కథకుడు. స్వానుభవం ఇతని రచనకు ప్రాణం పోసింది. సమాజంలో మార్పు కోరుతూ సామాజిక న్యాయాన్ని ఆకాంక్షిస్తూ నిరంతరం రచనలు చేస్తున్నారు. కులంపేరుతోనో వర్గం పేరుతోనో అట్టడుగున పడి కొట్టు మిట్టాడుతున్నటువంటి జనాలకు తన రచన ద్వారా చేయూత నిచ్చాడు. సమాజావసరాన్ని సాహిత్యంలో ప్రతిబింబించాడు. ఆధునిక దళిత కవిత్రయంలో ఒకరుగా నిలిచాడు. ఈయన రచించిన హరిజన కథలు వాస్తవానికి చాలా దగ్గరగా వుంటాయి. వీరి కథల్లో ప్రధాన పాత్రలు హరిజన పాత్రలు. సవర్ణ పాత్రలువున్నా వీటి చుట్టూ పరిభ్రమిస్తాయి. కథారచనలో కూడా హరిజన జీవితాలు సామాన్యంగానే విజయాన్ని సాధించటం కన్పిస్తుంది. వీరి కథల్లో హరిజనులు సవర్ణుల సానుభూతి ఒకవైపు సాధిస్తూ తమ అవసరాలను తీర్చుకొంటారు. మరోవైపు సవర్ణులపై ప్రతిఘటించే కథల్లో దాడి ఉంది. అంటే యుక్తితో కూడిన ప్రతిఘటన కన్పిస్తుంది. వీరి కథల్లో హరిజన పాత్రల్లోనే మూడు భాగాలుగా వుంటాయి. సంప్రదాయ పాత్ర పరిణామ పాత్ర అభ్యుదయ పాత్ర. అయినా తమ హక్కుల కోసం ఎదుటివాడిపై ప్రత్యక్షంగా ఘర్షణకు దిగవుకాని పరోక్షంగా విశేష ప్రతిఘటన ప్రతిపాదిస్తాయి. సమస్యను సామరస్యంగానే ఎదుటివాడిచేత మెప్పుకు సాధ్యంకాక తప్పనిసరికి గుర్తై విజయాన్ని సాధిస్తాయి. ఈయన కథల్లో కొన్ని పాత్రలు రాముడు (ఊరబావి), చిన్ని (ఆకలి), రావుడు (సూర్యుడు తలెత్తాడు), రామకోటి (పశ్చాత్భూమి) ప్రభాకర్‌జి (సంస్కారణల), మణిరత్నాలు (విష్‌యు హాపీ క్రిస్మస్) వంటి పాత్రల్లో హరిజన స్థితి కన్పిస్తుంది. హరిజనులకు సవర్ణులపై ఎదురుతిరిగే స్వభావంలేక, అన్యాయం జరిగినా సర్దుకుపోయే గుణం ఉంటుంది. ఎదుటివాడిపై ఘర్షణకు దిగరు. అవసరమైతే హరిజనులు అజ్ఞాతంగా తమకు అన్యాయం చేసిన సవర్ణుడిని అంతం చేయడానికైనా ప్రయత్నిస్తారు. కాని బహిరంగంగా మాత్రం ఏ కార్యమూ వీరు చేయలేరు. అందుకు కారణం సామాజిక పరిస్థితి అని స్పష్టం. ఊరబావి కథలో ''ఒరేయ్, మునసబుగారు పంపకుండా మనం యెళితే రేపు మళ్ళీ బట్టుకొచ్చి చితగ్గొడితే దిక్కేవుందిరా మనకి. ఈ ఊరినించి పారిపోలేంగా రేపు నిజం తెలిసి ఆళ్లే ఒదిలేత్తారు!'' అని రావుడు చిదంబరంతో అంటాడు. మరికొన్ని కథల్లో హరిజనులకు హక్కులు సాధించాలని తపన ఉంటుంది కాని దాని సాధించే సామర్థ్యం ఉండదు. ఎవరైనా సాధిస్తే తప్ప. చూసి ఆనందించడం ఒకరు తెచ్చి ఇస్తే తీసుకోవడం తప్ప తాము స్వతహాగా సాధించుకోలేరు. ఇది నేటి సమాజ హరిజన స్థితి అందుకే 'ఆకలి' కథలో చిన్ని తన ఆకలి తీర్చుకోవడం కోసం తండ్రి కోసం ఎదురు చూసింది. కాని, ఆ ఆకలి తీరే మార్గం తన పరిధిలో ఆలోచించింది. అందుకోసం ప్రయత్నించింది. ఈ దృష్టితో చిన్ని చైతన్యవంతమైన పాత్ర. 'సూర్యుడు తలెత్తాడు' కథలో రావుడి కొడుకును సవర్ణులు కొడితే ''ఊళ్లో వాళ్లతో పెట్టుకోవద్దురా అంటే వింటాడా, ప్రాణాలకు తెచ్చుకొన్నాడు'' అని అంటాడు. అందులో రావుడి ఆలోచన తన కొడుకును సవర్ణులపై ప్రతిఘటించవద్దని, అలా చేసే ప్రయత్నంలో వారిపై విజయం సాధించే స్థితిని తెచ్చుకోమని అంటాడు తప్ప ప్రాణాలను పోగొట్టుకోమని చెప్పడు. హరిజనులకు సవర్ణులచేత ఎంత అన్యాయం ఎదురైనా ప్రతిఘటించే స్థితి వారికి కూడదు. ఏదైనా సంఘపరంగా ప్రతిఘటించగలరు కానీ, ఏకత్వంగా ప్రతిఘటించలేరు. అందుకే రావుడు (సూర్యుడు తలెత్తాడు) తన సంసారం అంతా సవర్ణులచే నాశనం అయినా తన కొడుకును మాత్రం సవర్ణులపై దాడికి పూనుకోవద్దని సలహా ఇచ్చాడు. ఈ సూచనలో పరాజయం తెచ్చుకొనే ప్రతిఘటన వద్దని విజయం తెచ్చే తిరుగుబాటు ముఖ్యమని హెచ్చరించింది.

''విష్యు హేపి క్రిస్మస్'' కథలో ఈ దేశంలోని హరిజనులు తమ స్వార్థంకోసం క్రైస్తవాన్ని స్వీకరించారని తమ ఉనికిని కాపాడుకోవడంకోసం వెళ్లారని చెప్పవచ్చు. అంతేగాక క్రైస్తవం పుచ్చుకొన్న హరిజనులకు పోరాటపటిమ వుంటుందని తెలియజేస్తుంది. 'ఎర్నీళ్ళు' కథలో కూడా మానవుడు తన ప్రగతికి బాట వేసుకోవడానికి ఆహార పదార్థాల వినియోగం అని, వాటిని ముఖ్యంగా హరిజనులు వృథా కాకుండా చూడాలనే తపన కన్పిస్తుంది. ఈయన కథల్లో హరిజన జీవితం నిండుగా ఫలిస్తుంది. మూర్ఛంతో వున్న హరిజనుడిని భుజం తట్టి లేపుతుంది. నేడు సమాజంలో యువ రచయితలు ఈయన రచనా విధానాన్ని అన్వయించుకొని మంచి కథలు రాయగలిగితే దళిత ఉద్యమానికి ఉత్తమ సాహిత్యాన్ని అందించిన వారవుతారు.

**6.1.2. డా. జి.భాను** :-డా. జి. భాను హరిజన జీవితంతో సంబంధం వుంది. హరిజన జీవితాన్ని కథానికా సాహిత్యం ద్వారా పరిచయం చేసిన వ్యక్తి. ఈయన రచనలో హరిజనుల వాస్తవ జీవితం ప్రతిబింబిస్తుంది. సమాజానుగుణంగా హరిజన జీవిత విధానాల కనుగుణంగా రచన చేశారు. ఈయన రచనల్లో సమాజంలో సవర్ణులు హరిజనులపై చేసే దౌర్జన్యం కన్పిస్తుంది. రచయిత అనుభవం కన్పిస్తుంది. ఈయన కథల్లో కూడా హరిజనులు కేవలం సవర్ణులు సానుభూతిపైనే ఆధారపడి బ్రతకగలరనే విషయం స్పష్టమవుతుంది. హరిజనులు సవర్ణులు చేసే అన్యాయాన్ని ప్రతిఘటించడం కష్టం. అందువల్లనే హరిజనులు ఒకవైపు తమ ఉనికిని కాపాడుకొంటూ మరోవైపు తమ హక్కుల కోసం ఉద్యమించడం ఈయన, కథల్లో కన్పిస్తుంది. ఈయన 'పాపానికి జీతం' రుధిరమథనం' అనే కథానికలు రచించాడు. ఈ రెండు కథల్లోనూ సమస్య అవర్ణులకు సవర్ణులకు సంబంధించినదైనా హరిజనపాత్రలే ప్రధానంగా వుంటాయి. మిగతా పాత్రలు వాటి చుట్టూ పరిభ్రమిస్తాయి. హరిజనులపై సవర్ణులుచేసే దౌర్జన్యాలు ఈ కథల్లో చిత్రిసారు. వాటిని హరిజనులు ధైర్యంగా ఎదిరించకపోవటం. ఈ కథలో కన్పిస్తోంది. ఉదా:-'పాపానికి జీతం' కథలో అరుంధతి భుజంగరావు కామదాహానికి గుర్త్తె అందులో నుంచి తప్పించుకోవడానికి ప్రయత్నించి అతని చేతిలోనే ప్రాణాలను పోగొట్టుకొంది. కాని అతనిని ఎదిరించి తప్పించుకోవడానికి చేసిన ప్రయత్నం ఆమె చైతన్యం. ఈ స్థితి హరిజనులు కష్టాల్లో నుంచి తప్పించుకోవడానికి ఆలోచనాపరులుగా చేస్తుంది. ఇది సమాజంలోని వాస్తవిక స్థితి. హరిజనునికి సవర్ణుల నుండి రక్షణ లేదు. వారి స్త్రీల మానప్రాణాలకు భద్రతలేదు. అరుంధతిని హత్య చేసిన భుజంగరావు కు శిక్ష పడలేదు. కనీసం అతను హత్య చేశాడనే సాక్ష్యం లేదు.

మరోకథ 'రుధిర మథనం' లో హరిజనులు సవర్ణుల దయాదాక్షిణ్యాలలోనే బ్రతుకుతారనడానికి నిదర్శనం. ఉదా:- కామయ్య బారినుండి తప్పించుకొన్న అరుంధతి తన భర్తతో ఊరువిడిచి వెళ్లిపోతుంది. మరలా చావుబ్రతుకుల మధ్యలో వున్న కామయ్య కొడుకును నిండు మనస్సుతో తన రక్తాన్ని పంచి బ్రతికించి కామయ్య అభిమానాన్ని చూరగొని గ్రామం చేరుకొంటుంది. తన శీలాన్ని కాపాడుకోవటం కోసం, తమ భర్తతో కలసి సుఖమయ జీవితం గడపటం కోసం ఊరు వదలిన అరుంధతిలో చైతన్యం తెలుపుతుంది. అలాగే తిరిగి గ్రామంలోకి చేరటం స్వస్థలం. పోగొట్టుకోలేని వ్యక్తిత్వం. తమ ఆస్తులను వదులుకోలేని మనస్తత్వం ప్రతిబింబిస్తుంది. తాను అవమానంపాలైన చోటే స్వేచ్ఛగా బ్రతికే అరుంధతి జీవితం సవర్ణులకు చెంపపెట్టు. ఇది హరిజన జీవిత సత్యం. సమాజంలో ఒక గొప్ప పని చేస్తున్నాడంటే దాని వెనుక సవర్ణుల దయాదాక్షిణ్యాలు వుంటాయనే చెప్పవచ్చు. ఇదే కథలో పోలయ్య తన భార్యకు జరిగిన అన్యాయానికి భుజంగరావు పై ఎదురు తిరగడానికి ప్రయత్నిస్తే అందుకు అరుంధతి ''వొద్దు మావా వొద్దు ..పెద్దోళ్లోతో పగ మనకొద్దు అన్నేయం ఆళ్లే జేసినా యెదిరిస్తే మనకే సేటు...ఎన్నూళ్లల్లో న్యేయం బట్టకట్టిందో సెప్పు.... సెరువు కట్టతెగినప్పుడు పాగురుగిత్త యెదుటబడ్డప్పుడు ఏంజేత్తన్నాం పారిపోతున్నాంగా యిప్పుడు అంతేమావా''3 అంటుంది. జరిగిన అవమానానికి ఎదిరించే శక్తిలేని అరుంధతి పోలయ్యలు మానంకోసం

ఊరు వదలి వెళ్లటంలో తిరిగి ఊరులోకి రావటంలో అరుంధతిలో చైతన్యం ప్రస్ఫుటమవుతూ ఉంది.

భాను హరిజనుడు. హరిజన సమాజాన్ని వాస్తవిక దృష్టితో చూశాడు. అందుకే హరిజన కథలను రచించడంలో సఫలం అయ్యాడు. రచనాపరంగా కూడా ఉన్నత స్థాయిలోనే వున్నాడని చెప్పవచ్చు.

**6.1.3. బోయ జంగయ్య** :- బోయ జంగయ్య తెలంగాణా హరిజన . రచయిత కథారచనల్లో ఈయనది బలమైన గొంతు. ముఖ్యంగా తెలంగాణా ప్రాంతంలో జరుగుతున్న అన్యాయాలను, ఘోరాలను అద్దం పట్టినట్లు వారి వాస్తవిక జీవితాన్ని తన రచనల్లో పొందుపరిచాడు. సామాజిక వ్యవస్థలో అనేక ఇబ్బందులకు గురిఅవుతూ తోడి సమాజం చేత హీనంగా దీనంగా చూడబడుతూ తినడానికి తిండి లేక బ్రతుకుతున్న ప్రజల గురించి కూడా రచన చేశాడు. వీరు ఎంత కష్టపడినా తిండి దొరకదు. ఆ తిండిని సాధించుకోవడంకోసం వీరుపడే బాధలు వర్ణనాతీతం. ఈయన హరిజన సమస్యపై రచించిన కథలు నాలుగు- బంచరాయి, ఇంకానా ఇకపై సాగవు. ఇది కతా, గ్రహణం. సమాజంలో హరిజనులు ఇంకా మూర్ఖంగానే వున్నారని, స్వతంత్రంగా సవర్ణులను ఎదిరించి తమ హక్కులను కాపాడుకోలేని స్థితి వారిదని కథల్లో స్ఫురిస్తుంది. ఈయన కథల్లో హరిజన పాత్రలే ప్రధానంగా కన్పిస్తాయి. ఉదా:- ఇది కథలో ప్రధానపాత్ర మల్లయ్య చెప్పులు కుట్టి జీవించాడు. అందులో తన జీవితం మారదని బర్రెను ప్రభుత్వం నుండి తనఖా క్రింద తీసుకొన్నాడు. ఆ తనఖాలో ప్రభుత్వ అధికారుల చేతిలో మోసపోయాడు. ఆ మోసంలోనే తన అస్తినంతా పోగొట్టుకొని పట్టణం చేరాడు. అక్కడైనా సుఖంగా బ్రతకాలని ప్రయత్నిస్తే అక్కడ కూడా ఇబ్బందులే ఎదురుపడ్డాయి. జీవితంలో హరిజనులకు నిత్యం కష్టాలే ఎదురవుతాయి, అనే విషయం ఈ కథలో స్పష్టమవుతుంది. పట్నంలో సమ్మె జరిగినప్పుడు మల్లయ్య ''రేపు మల్ల బందా ఇగ ఉపాసమే! వారానికో బందైతే ఎట్ల బతికేది4'' అని అతని మనస్సులో అనుకొన్నాడు తప్ప ఆ సమ్మెకు కారకులైన వారిని దూషించలేదు. అయితే అతనిలో తన కష్టాలకు ఇలాంటి సమస్యలే కారణమని ఆలోచన కలవాడుగా తన జీవితంలో సవర్ణులతోనే అన్యాయం పాలయ్యానని తెలుసుకోగలగడం అతని చైతన్యాన్ని తెలియజేస్తుంది. తమ ఆకలి కడుపులను సమ్మెల నేటివి కొడుతున్నాయని ఆలోచించాడు. అలాగే హరిజనులు సవర్ణుల దయాదాక్షిణ్యాలపై బ్రతుకుతారనడానికి ''బంచరాయి'' కథ. కథలో హరిజనులు ప్రభుత్వ ఆదేశం ప్రకారం బంజరు భూమిని సాగు చేయదలిస్తే గ్రామస్థులు నిరాకరించారు. వీరిని అమాయకులను చేసి మాయ మాటలు చెప్పి వీరి గుడిసెలకే నిప్పు పెట్టారు. అందుకు హరిజనులు కూడా సవర్ణుల మాటలు నమ్మి దేవుడు ఆగ్రహంతోనే తమ గుడిసెలు కాలిపోయాయి అని నమ్మడం హరిజన సంప్రదాయ దాస్యస్థితి కన్పిస్తుంది. అదే స్థితిలో విద్యావంతుడైన హరిజన గోపాలం సవర్ణులు చేసిన అన్యాయాన్ని తెలుసుకోగలిగాడు. తమ జాతిని ప్రతిఘటన వైపు మళ్లించడానికి ప్రయత్నించాడు. ఈ కథలో హరిజన గోపాలం చైతన్యవంతుడు.

సమాజంలో హరిజనులు ఆలోచన లేనివారుగా జీవించడంవల్ల సవర్ణులు వీరి మూర్ఖత్వాన్ని ఆసరాగా తీసుకొని మోసం చేసి ఆస్తులను స్వాధీనం చేసుకొంటున్నారు. ఇలా జరిగినా హరిజనులు సవర్ణులను ఎదలకపోవటం సమాజస్థితి. రచయిత ఈ కథలను రాయడంలో ఫలవంతం అయ్యాడనే చెప్పవచ్చు.

**6.1.4. గొట్టుముక్కుల మంగాయమ్మ** :- తెలుగు కథానికా సాహిత్యంలో హరిజన జీవితాన్ని గురించి రచనచేసిన హరిజన రచయిత్రి ఈమె. ఈమె రచనలో వాస్తవ జీవితం దర్శనమిస్తుంది. సమస్యనే చెబుతుంది కాని పరిష్కారాన్ని సూచించదు. ఒకవేళ పరిష్కారం సూచించినా ఆ పరిష్కారం సవర్ణుల చేతులమీదగానే జరుగుతుంది. హరిజనులను చూసే గతి ఈమె కథల్లో కన్పిస్తుంది. ఈమె 'అయ్యోపాపం' అనే కథ వ్రాసింది. సమాజంలో ఆచారాల పేరుతో హరిజనులకు జరుగుతున్న అవమానానికి హృదయం దహించి రాసిన కథ. ఇందులో పాత్రలు అన్నపూర్ణ భాస్కరులు. కథలో ఈ పాత్రలే ప్రధానంగా కన్పిస్తాయి.

మిగతాపాత్రలు వీటి చుట్టూ సంచరిస్తాయి. మండుటెండలో వెళుతున్న అన్నపూర్ణా భాస్కరులు దాహార్తి కోసం బ్రాహ్మణ చలివేంద్రం దగ్గరకు వెళ్లితే బ్రాహ్మణులు వీరి కులం కారణంగా నీళ్లు ఇవ్వలేదు. అదే ఒక ముస్లీం మతస్థుడు కులం వేరైనా వీరి దాహం తీర్చాడు. అన్నపూర్ణ భాస్కరులు తమకు నీళ్ల ఇవ్వనందుకు కర్మ సిద్ధాంతంతోనే ముడి పెట్టుకోగలిగారు. సమాజంలో హరిజనుడు సవర్ణుని ఎదిరించలేడు అన్నది స్పష్టం. భాస్కరుడు తమకు నీళ్ల ఇవ్వని బ్రాహ్మణులను నిందించలేదు. ఈ కథలో హరిజనుల దయనీయ స్థితినే చెప్పింది కాని హరిజనాభ్యుదయానికి దోహదకారి కాలేదని చెప్పవచ్చు.

హరిజన రచయితలు హరిజన సమస్యను చిత్రించిన కథల్లో అనుభవం కన్పిస్తుంది. వారిపై సానుభూతి చూపించడం సవర్ణులని యుక్తితో ప్రతిఘటించడం వీరి కథల్లో గోచరమవుతాయి. అవసరమైతే హక్కుల కోసం ఉద్యమించమని సలహా ఇస్తుంది.

### 6.2 హరిజనేతర రచయితలు

హరిజన జీవితాన్ని హరిజనేతరుల రచయితలు రచించడంలో అనుభవం ఉండదు, వాస్తవికతకు చెరువుగా ఉండదు. వారికి సవర్ణుల జీవితంతో సంబంధం అనుభవం వుంటుంది. కాబట్టి వారి రచనల్లో సమస్య హరిజన సమస్య అయినా ప్రధానపాత్రలు సవర్ణుల అయిఉంటారు. వీరి కథల్లో హరిజనులపై సానుభూతితో వాళ్లను చైతన్యవంతులుగా చేయడానికి సవర్ణ మనస్తత్వంతో హరిజనులు సవర్ణులపై ఎదురు తిరిగేలా తమ హక్కులను సాధించుకొనేలా చిత్రించారు. సవర్ణుల భార్యలపై అత్యాచారం చేసినట్లుగా వాళ్ళను హతమార్చినట్టుగా చిత్రిస్తారు. అలా చేసిన హరిజనులు సమాజంలో తమ ఉనికిని సాధించుకోవడం, వాళ్ళు బ్రతకడం కష్టం.

నేడు సాహితీ పరంగా దళితులకు దళితేతరులకు హరిజన సమస్యను రచన చేయడంలో తేడాలుంటాయనడంలో సందేహంలేదు. కాని కొందరు సిద్ధాంతాలు రాద్ధాంతాలు చేస్తూనే ఉంటారు. ఒకవైపు హరిజనులు తమ సమస్యలను తామే చిత్రించుకొంటే అది అవాస్తవమని, అసహజమని హరిజనేతరులు విమర్శించడం కన్పిస్తుంది. ఇటీవల కాలంలో ప్రముఖకవి, విమర్శకుడు గుంటూరు శేషేంద్ర శర్మ దళితుల గురించి ఇతరులు బాధపడకూడదనే అభిప్రాయాన్ని దళితవాదులు కలిగిస్తున్నారని, ఇది తప్పుడు ధోరణి అన్నారు. ''దెబ్బలు తినడం అనుభూతి అయితే దెబ్బలు తింటున్నవాడిని చూసి బాధపడే వ్యక్తి సహానుభూతి అని, అనుభూతి కంటే సహానుభూతి ఎంతో విలువైనదని, ఇద్దరి వ్యక్తుల్ని కలిపేది సహానుభూతేనని ప్రస్తుత దళితవాదం అనే లేబుల్ వల్ల ఈ సహానుభూతి అనే లక్షణానికి విఘాతం ఎర్పడే అవకాశం ఉందని4'' అన్నారు. ఇతనేగాక దళితేతర రచయితలంతా ఈ వాదంతో ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ ఏకీభవిస్తున్నారు. హరిజన సమస్యను చిత్రించడానికి హరిజనులే కడు సమర్థులు అనే విషయం సమంజసమేగాని అవగాహనవున్న హరిజనేతర రచయితలు కూడా ఆ అనుభవం మేరకు హరిజన సమస్యను చిత్రించగలరు. అది సంపూర్ణ జీవితంగా ఉండదు. అయినా హరిజన సాహిత్య ధ్వనికి ప్రతిధ్వనిగా ఉండదగ్గ హరిజనేతర సాహిత్య సృష్టి దళిత సమస్య మీద వెలువడుతూ ఉంది. ఈ హరిజనేతర రచయితలు హరిజన జీవితావగాహన ఉన్న వాళ్లు లేనివాళ్ళు, అని రెండుతరగతులుగా కన్పిస్తారు.

హరిజన జీవితంపై అవగాహన వున్న రచయితలు:- చరిత్ర పుటలను ఒకసారి త్రిప్పిచూస్తే హరిజన జీవితంపై అవగాహన వుండి. రచనలు చేసిన రచయితలు బహుకొద్ది మంది కన్పిస్తారు. వీరిలో కరుణకుమార, గోపీచంద్, మధురాంతకం రాజారాం కేతు విశ్వనాథరెడ్డి వంటివారి రచనల్లో ఈ విషయం ద్యోతకమగుతుంది.

**6.2.1. కరుణకుమార:-** తెలుగు కథానికా సాహిత్యంలో హరిజన జీవితాన్ని గొప్పగా చిత్రించిన రచయిత

కరుణ కుమార. ఈయన కథలకు గ్రామాలు ఆయువు పట్టు. నిత్యం సమాజంలో సవర్ణులు హరిజనులకు చేసే మోసాలు, దౌర్జన్యాలు అడుగడుగునా దర్శనమిస్తాయి. భూస్వాములు కబంధహస్తాల్లో చిక్కుకొని పోయి తినడానికి తిండిలేక దయనీయ జీవితాన్ని గడుపుతున్న ప్రజలు ఈయన కథల్లో పాత్రలు. రెవెన్యూ అధికారిగా ఉద్యోగం చేయటం వల్ల గ్రామాలతో, ముఖ్యంగా అందులో బడుగు వర్గాలతో సంబంధాలను ఏర్పరుచుకోవటంవల్ల దేశానికి పట్టుకొమ్మలైన గ్రామ సీమల్లో ముఖ్యంగా కర్షక జీవితంలో హీనంగా జీవిస్తున్న హరిజనుల గురించి రచన చేయడానికి ప్రయత్నించాడు. అవగాహనతో రచన చేశాడు. ఈయన 'మాలపల్లి' నవల చదివి హరిజన జీవితంపై ప్రభావితుడయ్యాడు. ఈయన కయ్య-కాలువ, పోలయ్య, కొత్తచెప్పులు, బిళ్లల మొలత్రాడు, పశువుల కొఠం వంటి కథలను రచించాడు. ఈయన కథల్లో ఇతివృత్తం హరిజన సమస్య అయినా ప్రధానంగా పాత్రలు సవర్ణ పాత్రలే. హరిజన పాత్రలు వాటి చుట్టూ పరిభ్రమిస్తాయి. రచనలో కూడా సవర్ణ మనస్తత్వమే దర్శనమిస్తుంది. 'పశువుల కొఠం' కథలో పెంచెలి రాముడు దౌర్జన్యానికి కొన్నిసార్లు గురై తప్పించుకొంటుంది. అతనిబారి నుండి తప్పించుకోవడానికి పెళ్లి చేసుకొని జీవితాంతం సుఖంగా జీవించాలని తపన పడుతుంది. ఈ ప్రయత్నంలో ఆమె ప్రాణాలను పోగొట్టుకొన్నా తమ సమస్యలను పరిష్కరించుకోవడానికి ప్రయత్నించింది. ఈప్రయత్నమే ఆమెను చైతన్యవంతురాలుగా చేయగలిగింది. 'పోలయ్య' కథలో పోలయ్య తన కులం తెలియజేయక వెంకటశాస్త్రికి బండి కట్టినందుకు శాస్త్రి పోలయ్యకు శిక్షవేసి, అతని శరీరం అంతా కాల్చడానికి ప్రయత్నించాడు. యుక్తితో తప్పించుకోవడానికి పోలయ్య ''నన్ను మీరీ ప్రకారం హింసిస్తున్నారు. నేను చచ్చినా బ్రతికినా ఈ విషయంపైకి పొక్కక మానదు. పాదరి దొరగారికి ఈ సంగతి తెలిస్తే మీరు ఇంతకింత అనుభవిస్తారు16'' అని తాను క్రైస్తవుడనని అబద్ధం చెప్పి శిక్షను తప్పించుకోగలుగుతాడు. ఇందులో యుక్తితో కూడిన ప్రతిఘటన కన్పిస్తుంది. పోలయ్య తమ సమస్యల నుండి బయటపడి సుఖంగా బ్రతకడం కన్పిస్తుంది. ఈ విషయం హరిజన జీవితానికి అవసరం. 'కయ్య-కాలువ' కథల్లో లక్ష్మమ్మ పొలం ప్రక్కన మాలకొండడి పొలం వున్నందుకు సహించని ఆమె ఆ పొలం కాజేయడానికి చేసిన ప్రయత్నంలో మాలకొండడు పడిపోక తప్పలేదు. కాని కొండడు చివరగా తన పొలాన్ని నిలబెట్టుకోవడానికి చేసిన ప్రయత్నం గొప్పది. అతను తనకు చేస్తున్న మోసానికి మహాలక్ష్మమ్మపై ప్రతిఘటించక ఆమె సానుభూతి సాధించడానికే ప్రయత్నించాడు. ఇది అతని ఆలోచనా ప్రగతికి నిదర్శనం. ఈ కథ తోడి హరిజనుణ్ణి తమ ఉనికిని తామే కాపాడుకోమని ఉద్బోధిస్తుంది. ఇలాగ దాదాపు అన్ని కథల్లోనూ పాత్రలు చైతన్యవంతంగానే కన్పిస్తాయి. రచనా ధోరణిలో సమస్యను చిత్రీకరించడంలో ఈయన ప్రయత్నం హరిజనజీవితానికి దగ్గరగానే వుందని చెప్పవచ్చు.

**6.2.2. త్రిపురనేని గోపీచంద్** : ఆధునిక సాహిత్యంలో బహుముఖ ప్రజ్ఞాశాలి. ఈయన మంచి లక్షణాలున్న సజీవ కథలనెన్నింటినో రచించాడు. హరిజన జీవితాన్ని తమ కథానికా సాహిత్యం ద్వారా పొందుపరచడానికి ప్రయత్నించాడు. సంఘంలో మానవుని అవసరాలు పెరిగేకొద్దీ పరిధి కూడా పెరుగుతుంది. ప్రతి మనిషి సాధించాలని తపన పడటం సహజం. అందులో కొందరు కృతకృత్యులైతే మరి కొందరు సాధించలేకపోవడం సహజం. ఈయన 'చెప్పులు కుట్టేవాడు' అనే కథను రచించాడు. ఈ కథలో ప్రధానంగా ఈ పాత్రే కన్పిస్తుంది. మిగతా పాత్రలన్నీ సహజంగా దీని చుట్టూ పరిభ్రమిస్తాయి. కథలో చెప్పులు కుట్టేవాడు. పట్టణంలో చౌరాస్తా ప్రక్కన చెప్పుల కొట్టు పెట్టుకొంటే పోలీసు అతనిని అక్కడ నుండి కొట్టి పంపిస్తాడు. అయినా అతను పోలీసును ఎదిరించలేదు. తిండిలేక ఆకలి బ్రతుకులు బ్రతికాడు. తాను కష్టపడైనా సరే ఒక చెప్పుల షాపు పెట్టాలనుకోవడం అతని చైతన్యానికి ప్రతీక. ఆ ప్రయత్నంలో అతను విఫలమయినా, ప్రయత్నం చేయడం హరిజన జాతిని ఆలోచనావంతులుగా చేస్తుంది. ఆ ప్రయత్నంలో తన భార్య సహకరిస్తుంది. ఈ

కథ హరిజనులు తమ సమస్య సాధనకోసం వారికి వారే సహకరించుకోవాలని తెలియజేస్తుంది. సమాజంలో హరిజనుల ప్రయత్నాలు ఫలించవు . వారు ఆశతో ఏది చేయాలనుకొన్నా అందుకు ఏదో విధమైన అడ్డంకి ఎదురవ్వడం సహజం. కథలో ఇదే విషయం మనకు కన్పిస్తుంది. తమ సమస్యను సాధించుకోవడం కోసం ఎదుటివాడిపై ఎదురు తిరగడంలాంటి అవాస్తవిక విషయాలు ఇందులో లేవు. అందుచేతనే గోపీచంద్ హరిజన సమస్యపట్ల సరయిన అవగాహన వున్న రచయితే.

**6.2.3. మధురాంతకం రాజారాం :** హరిజన జీవితాన్ని గురించి కేవలం ఒక కథను మాత్రమే రచించిన రాజారాం కొంతవరకూ అవగాహనతోనే రచించాడని చెప్పవచ్చు. ఈయన కథ 'అజ్ఞాతవాసం.' ప్రభుత్వం హరిజనులకు రాజకీయంగా రిజర్వేషన్‌ను అమలు చేసింది. వాటిని సరిగా అమలు చేయలేకపోవటంవల్ల వాటిని సక్రమంగా హరిజనులు వినియోగించుకోలేకపోవటంవల్ల సమస్యలు ఉత్పన్నం అవుతూ వచ్చాయి. తినడానికి తిండి లేనివాడు, పరుల పంచన బ్రతికేవాడు. అయిన హరిజనుడు రాజకీయాధికారం చేపట్టడం కనబడుతుంది. కథలో ప్రధానంగా ఆసాదు గంగడి పాత్ర కన్పిస్తుంది. మిగతా పాత్రలు వాడి చుట్టూ పరిభ్రమిస్తాయి. ఇతను గ్రామ పంచాయతీ ప్రెసిడెంటు అయినా గ్రామ పెద్దల చేతిల్లో కీలుబొమ్మ అయ్యాడు. ప్రస్తుత సమాజంలోని వాస్తవికతకు దగ్గరగా వుంది. ఈ కథలో గంగడు పంచాయతీ ప్రెసిడెంటు అయినా అధికారం చెలాయించలేదు సరికదా తినడానికి తిండిలేక గ్రామం వదిలి పెట్టవలసిన పరిస్థితి ఏర్పడింది. అయినా సవర్ణులు తనకు మోసం చేశారని తెలుసుకొని తాను బ్రతకడం కోసం ఆకలి తీర్చుకోవడం కోసం, ఊరు వదలటం కన్పిస్తుంది. స్వార్థంతో వున్న సవర్ణులు ఆసాదు గంగడు తిండి కోసం గ్రామం వదిలితే అందుకు సమ్మతించారే గాని గ్రామంలోనే తిండి కోసం వేరే దారిని చూపించలేక పోయారు. ఈ కథలో ప్రతిఘటన కన్పించదు. కాని తన బ్రతుకు తెరువుకోసం గంగడు ప్రయత్నించడం కన్పిస్తుంది. హరిజన సంఘ జీవిత పరిణామంలో ఈ ఘట్టం గమనార్హంగా ఉంది.

**6.2.4. సి.యస్.రావు :** తెలుగు కథానికా సాహిత్యానికి హరిజన జీవితాన్ని తన రచన ద్వారా అందించాడు సి.యస్.రావు. హరిజనులపై సానుభూతితో వారిని చైతన్యవంతులుగా చేయాలి; అభివృద్ధి పథంవైపు పయనించేలా చేయాలని తపన పడ్డాడు. వ్యక్తిగా గాక, శక్తిగా ప్రతిఘటించాలి. ఈయన కథలు మార్పుకు మార్గం , పావులు పాములుగా మారిన వేళ, బంగారమ్మ కమతం. ఈ కథలు సవర్ణ మనస్తత్వ ప్రధానంగా ఉన్నాయి. హరిజనులపై సానుభూతితోనే ఈ కథలు రచించాడు హరిజన సమస్యకు సంబంధించినవైన ప్రధాన పాత్రలు సవర్ణులు. హరిజనులు వారి చుట్టూ సంచరిస్తారు. కథల్లో సవర్ణుల అధికారదర్పం కన్పిస్తుంది. హరిజనుల కష్టాలుతీరే మార్గం మాత్రం స్పష్టంగా కన్పించదు. సవర్ణులు తమ స్వార్థం కోసం హరిజనులను బలిచేయటం కన్పిస్తుంది. కానీ, వారి ప్రగతికి మార్గాలు కన్పించవు. 'పావులు పాములుగా మారినవేళ' కథలో సవర్ణుల హరిజనులకు చేసిన మోసానికి హరిజనులు ఎదురుతిరగటం కన్పిస్తుంది.

'మార్పుకు మార్గం' కథలో ప్రెసిడెంటు పాలేరు సుబ్బడు తన జీవితాంతం అతని ఇంట్లో పాలేరు తనం చేసినా గడపమాత్రం దాటలేదు. అతని కొడుకు ఇంజనీరు అయితే ప్రెసిడెంటు స్వార్థం కోసం అతను హరిజనుడై నా తన ఇంట్లోకి రానిచ్చుకోవడం కన్పిస్తుంది. హరిజనులు తమ ఆర్థిక స్థితిని అభివృద్ధి చేసుకోగలిగితే అసమానతలను రూపుమాపుకోవచ్చునే రచయిత అభిప్రాయం కొంత వరకూ సహాయపడవచ్చు. హరిజనులు అభివృద్ధి సాధించడానికి కేవలం ఒక ఆర్థిక స్థితే ప్రధానం కాదు. ఈ అసమానత కేవలం ఒక ఆర్థిక స్థితిపైనే ఆధారపడి లేదు. రచయిత అభ్యుదయవాది కాబట్టి హరిజనుల ప్రగతి కోసం తపన పడ్డాడు. ఈ విధంగా చూస్తే ఈయన కథల్లో సవర్ణుల ఆధికత్య కన్పించినా కొంతవరకూ హరిజన జీవితాన్ని అవగాహనతోనే రాయగలిగాడన్నది మాత్ర స్పష్టం. రచయిత తన ఆశకు, ఆకాంక్షకు అద్దం పట్టాడు.

**6.2.5. పులికంటి కృష్ణారెడ్డి**: సమకాలిన సమాజంలో హరిజన జీవితాన్ని గురించి ఎక్కువ కథలను రచించినవాడు పులికంటి కృష్ణారెడ్డి. హరిజన జీవితాన్ని కొంతవరకూ అవగాహన చేసుకొని రచన చేయగలిగాడు. ఈయన కథల్లో జాలి. చైతన్యం ప్రతిబింభిస్తాయి. ఈయన కథల్లో దాదాపు అగ్రవర్ణ మనస్తత్వం కన్పిస్తుంది. కాని వాస్తవిక దృష్టితో హరిజన జీవితాలను చూపడం సాధ్యం కాలేదు. ఈయన కథల్లో అట్టడుగున వున్న హరిజనులు ఒకేసారి అకాశాన్ని ఎక్కి కూర్చున్నట్లు అభివృద్ధినంతా సాధించేసినట్లుగా కనిపిస్తారు. కథలో సవర్ణులే ప్రధాన పాత్రలుగా కన్పిస్తారు. హరిజన పాత్రలు వారి సేవకులుగా వారి చుట్టూ తిరుగు తుంటాయి. వీరి కథలు ముత్తడు గొప్పోడు, చెంబుకొక గంగ, కొమ్మలు, సుబ్బ, మేకు, పండగ పూట పరవాణ్ణం వంటి కథలను పరిశీలిద్దాం. ఈ కథల్లో రచయిత సవర్ణులు హరిజనులను చంపినట్లు, సవర్ణులే హరిజనులను నీటికోసం, వారి స్త్రీలను వివాహం చేసుకోవడం కోసం యాచించినట్లు చిత్రించాడు. ఈ విషయాలు సమాజ వాస్తవ జీవితానికి సమీపంగా వుంటే బాగుండేది. నేడు సమాజంలో అగ్రవర్ణులు హరిజనులను యాచించే స్థితిలోలేరు. బావి హరిజనులదైనా సరే, వారి అనుమతి పొందకనే ఆ బావి నీటిని ఉపయోగించుకొంటారు. ఇది సమాజస్థితి. ఒక హరిజన స్త్రీని సవర్ణుడు పెళ్లి చేసుకొంటానంటే తన ప్రాణాలు వుండవని తెలిసినాసరే అంగీకరిస్తుంది. ఇది హరిజనుల చైతన్య దిశలోని భాగం. అలాంటిది ఒక అమాయక యువతి సవర్ణుడు పెళ్లి చేసుకొంటానంటే తిరస్కరించడం విశేషంగా కనిపించే కథ పులికంటి చిత్రించాడు.

దాదాపు ఎక్కువ భాగం కథలు హరిజన జీవితావగాహనతోనే వ్రాసిన రచయిత ఆసక్తి వాస్తవికత కంటే అధికంగా అభివ్యక్తమయింది. మరికొన్ని చోట్ల హరిజన వాస్తవస్థితి కూడా కన్పిస్తుంది. 'కీచకవధ' కథలో తమ పాలేరు వెంకటరాముడికి మోసం చేసిన బసివిరెడ్డిని సిద్దులుగాడు అజ్ఞాతంగా కన్పించడం ఈ కథలో రచయిత ఆశించిన స్థితి నమాజంలో వుంది. హరిజనులు అజ్ఞాతంగా ఏమైనా చేయగలరనే స్థితి కన్పిస్తుంది. రచయిత సవర్ణుడు, సవర్ణజీవితంతో సంబంధం వున్నవాడు. హరిజన జీవితంతో సంబంధం లేని రచన అభిమానంతో ఉంది. ఈయన కథల్లో కొన్ని హరిజనులు చేయకలిగిన స్థితి వున్నా ఎక్కువభాగం వీరు చేయలేని స్థితిని చేసేటట్లుగా చూపించి తన ఉత్సాహం ప్రదర్శించాడు రచయిత.

పులికంటి కృష్ణారెడ్డి అభ్యుదయవాద హరిజనుల విముక్తి సాధనకు చైతన్యమైన మార్గం అవసరమని తలచాడు. కులమతాల సమాజంలోని కుళ్లును కడగడానికి తన రచనా విధానాన్ని ఎన్నుకొన్నాడు. తరాలుగా తమ హక్కులను పోగొట్టుకొని శ్రమజీవులుగా బ్రతుకుతున్న హరిజనుల జీవితాలను చూసి హృదయం చలించింది. హరిజనులకు యాచించడం ఒకరి దయపై ఆధారపడటం కాదు కావల్సింది ప్రతిఘటించే ధైర్యం కావాలని తలచాడు. అలాంటి పాత్రలను తన కథల్లో ప్రతిబింబింపజేశాడు. ఈయన కథల్లో హరిజనులు సంప్రదాయంగానూ చైతన్యవంతంగానూ అభ్యుదయంగానూ కన్పిస్తారు. హరిజన జీవితాలను గురించి రచన చేయడంలో అతని తపన కనబడుతుంది. తన ధోరణిలో రచనజేసి హరిజనులకు అందించి వారి చైతన్యానికి పాటు పడ్డాడు.

**6.2.6 కేతు విశ్వనాథ రెడ్డి** - హరిజన జీవితాన్ని అవగాహనతో రచించిన రచయిత కేతువిశ్వనాథరెడ్డి. సమాజంలో దౌర్జన్యపు కోరల్లో, విద్యావంతుల చేతుల్లో పరిశ్రమ యాజమాన్యపు క్రింద, నలిగిపోతూ తినడానికి తిండిలేక పలుఇబ్బందులకు గురి అవుతున్న హరిజనులు ఈయన కథల్లోని పాత్రలు తనచుట్టూ వున్న జీవితాన్నే కథలకు యితివృత్తంగా తీసుకొన్నాడు. రక్తమాంసాలున్న మనుష్య రకాల్నే పాత్రలుగా చేసుకొని తన కథలు రచించడానికి ప్రయత్నించాడు. వాస్తవానికి దగ్గరగా తన కథలుండటానికి ప్రయత్నించాడు. ఈయన హరిజన జీవితాన్ని గురించి రచించిన కథలు 'శిలువ వేసిన మనుషులు', 'మార్పు', 'చీకటి నాడి

వెలుగునెత్తురూ', 'శ్రుతి' వంటి కథలను రచించాడు. ఈయన కథల్లో యితివృత్తం హరిజన సమస్య అయినా ప్రధానంగా సవర్ణ పాత్రలే దర్శనమిస్తాయి. హరిజన పాత్రలు వీరి చుట్టూ పరిభ్రమిస్తాయి 'మార్పు' కథలో హరిజనులు కూలీ రేట్లు పెంచమన్నందుకు సవర్ణులు వారి గుడిసెలకు నిప్పుపెట్టడం కన్పిస్తుంది. అందుకు హరిజనులు న్యాయంకోసం ఊరేగింపు జరపడం కన్పిస్తుంది అందులో సవర్ణులను ప్రతిఘటించడం కన్పిస్తుంది. రచయిత ఆశించిన స్థితి సమాజంలో వుంది. హరిజనుడు ఊరేగింపు కూడా కొన్ని సంఘాలతో కలసి చేయగలుగుతాడు. కాని కేవలం హరిజనులే అలాంటిపని చేయలేరు. రచయిత ఆశించినంత చైతన్యం హరిజనుల్లో లేదని చెప్పవచ్చును. అలాగే 'చీకటినాడీ - వెలుగు నెత్తూరూ' కథలో హరిజనులు తమ కూలీ రేట్లును పెంచమని సమ్మె చేయడం కన్పిస్తుంది. అంతేగాక రామిరెడ్డి పాలేరు పుల్లన్నకు జీతం సరిగా ఇవ్వనందుకు ''లెక్కంతా గుర్తువేసియివ్వండి సామి.. మూడేండ్లది యిప్పటిలో''7 తన కష్టానికి తగిన ఫలితాన్ని పుల్లన్న తన రెడ్డిని అడగటం కన్పిస్తుంది. ఈ కథలో హరిజనుడు నేటి సమాజంలో కష్టానికి తగిన ఫలితం అడిగినా సమ్మె చేయుటం మాత్రం కన్పించదు. రచయిత ఆశించినంత చైతన్యం సమాజంలోని హరిజనులు సాధించకపోయారు. కథల్లో ఎక్కువ భాగం సవర్ణ మనస్తత్వం కన్పిస్తుంది. తప్ప హరిజన మనస్తత్వం కనిపించదు. అయినా కొంతవరకూ హరిజన జీవితాన్ని అవగాహన చేసుకోవడానికి ప్రయత్నించాడని చెప్పక తప్పదు.

**6.2.7 సింగమనేని నారాయణ** - రాయలసీమలోనే హరిజన జీవితాన్ని కొంతవరకు అవగాహన చేసుకోగలిగిన రచయిత సింగమనేని నారాయణ. ఈయన కథల్లోని ఇతివృత్తాలు వాస్తవ ప్రతిరూపాలు తన జీవితావగాహనను నలుగురితో పంచుకోవాలనే తపన కన్పిస్తుంది. సాటిమనిషిగా ఎదుటివాడి బాధలను అర్థం చేసుకొని వాటిపై స్పందించడం ఈయన కథల్లో గోచరిస్తుంది. ఈయన కథలు 'ఉచ్చు' 'మకరముఖం', సమాజం మారినా హరిజనులు ఇంకా గుడికి బడికి దూరంగానే వున్నారనే విషయం గోచరిస్తుంది. 'మకరముఖం' కథలో ఉపాధ్యాయుడు. ప్రధానపాత్రగా కన్పిస్తాడు. సమాజంలో విద్యావంతుడైన హరిజనుడికి కూడా సమానత్వాన్ని ఇవ్వక, అతనిని హింసించే స్థితిలో వుందనే విషయం స్ఫురిస్తుంది. ఉపాధ్యాయుడు చదువుకొనే రోజుల్లోనే సవర్ణ విద్యార్థులచేత అవమానం పొందినా ఎదిరించలేకపోయాడు. ఉపాధ్యాయుడైనా గుడిలోనికి ప్రవేశం లేక గుడిబయట నుండే పిల్లలను చదువు చెప్పటం కన్పిస్తుంది. అయినా ఉపాధ్యాయుడు మమ్ములను సమాజం హీనంగా చూస్తుందని ఆలోచించలేక పోయాడు. కులం పేరుతో హీనంగా చూడబడుతున్నందుకు తనలోనే వ్యధ చెందాడు తప్ప సమాజాన్ని దూషించలేదు. సవర్ణులపై ప్రతిఘటించలేదు. ఈ కథలో అణగారిన హరిజన మనస్తత్వం కన్పిస్తుంది. తప్ప చైతన్యభావన కన్పించదు. ఇది సమాజ హరిజనుడి జీవితానికి దగ్గరగానే వుందనిచెప్పవచ్చు.

సమాజంలో రచయితలు హరిజన సమస్యలపై అవగాహన ఉన్న సందర్భాన కొంత వరకు సఫలీకృతులయ్యారనే చెప్పవచ్చు. రచనాపరంగా, పాత్ర పరంగా వారి జీవిత సత్యాలను తెలియజేశారు. వారి ఉనికి సమాజానికి అందించారు. హరిజనేతర రచయితలు సమాజంలోని హరిజన సమస్యను ప్రధానంగా గ్రహించి హరిజన పాత్రలను ప్రముఖంగా నిలిపి యథాతథ స్థితిని విస్పష్టంగా ప్రతిపాదించటం కన్పిస్తుంది. అయినా సవర్ణ మనస్తత్వంతోనే హరిజన జీవితాన్ని ఎక్కువ భాగం చూడగలిగారు. ప్రతిఘటనరూపంలోనే తమ హక్కులను సాధించుకోవాలని ఉద్బోధించారు. ఒక హరిజనుడు దేనినైనా సాధించాలంటే సవర్ణుల సానుభూతి సహకారం తప్పనిసరిగా అవసరం అవుతాయి. వీరి ప్రతిఘటిస్తే పని జరగదు మొదటి కే మోసం వారి ఉనికికే ప్రమాదాన్ని తెచ్చుకొనే అవకాశం వుంటుంది తప్ప అన్యాయం వుండదు. అయితే ప్రతిఘటించి విజయం సాధించడం అన్నమార్గంలో సుగమం కావటానికి ప్రయత్నపథంలో కథా సాహిత్యం సృష్టికావడం అవసరంగా ఉంది.

## 6.3 హరిజన జీవితం - అవగాహన

హరిజన జీవితాన్ని అనేక మంది హరిజనేతర రచయితలు రచించడానికి తపనపడ్డారు. వారిపైన జాలితోనో, అభిమానంతోనో అనేక కథానికలను రచించారు. సంఘంలో సాంప్రదాయిక జీవితాన్ని గడుపుతున్న హరిజనులు అభినందించే రీతిగా రచన చేయగలిగారు. దుఃఖించే హరిజనులపట్ల జాలి చూపుతూ కథలురాశారు. ఈ విషయం మీద అంతగా అవగాహన లేకున్నా రాయడానికి ప్రయత్నించారు. సమస్య అసలు సిసలు రూపం కూడా కనిపించదు. ఒకవేళ పురోగమనం కన్పించినా అతిశయోక్తిగా, అత్యోక్తిగా కనపడుతుంది. ఇలాంటి కథానికలు పరిశీలిస్తే హరిజన సమస్య అంతగా అవగాహన కాని వాళ్ల ధోరణి స్పష్టమవుతుంది.

**6.3.1 కాళూరి వేంకటరావమారావు** - స్వాతంత్రానికి పూర్వం కథకులలో ఒకరు కాళూరి వేంకట రామారావు. సంఘసంస్కరణ ప్రభావంతో స్వాతంత్ర్యోద్యమ ప్రభావంతో కథానికలు రచించాడు. సమాజంలో ఆచార వ్యవహారాలను తమ రచనల ద్వారా రూపుమాపడానికి ప్రయత్నించాడు ఈయన. హరిజన సమస్యపై 'సంసార సాగరం' అనే కథను రచించాడు. కథలో విశ్వనాథ బ్రహ్మణుడైనా అస్పృశ్యతను పాటించకుండా వుంటాడు. అతని భార్య సుందరమ్మకు హరిజనులంటే అసహ్యం. తన భర్త ఆఫీసు నుండి ఇంటికి రాగానే తాను హరిజనులను తాకి వుంటాడని అతనిని నీచంగా చూసేది. అతనిని తాకడానికి కూడా ఇష్టపడేది కాదు. ఈకథలో ప్రధాన సమస్య హరిజన సమస్య అయినా సవర్ణ పాత్రలే ప్రధాన పాత్ర వహిస్తాయి. ఈ కథలో బ్రాహ్మణ మనస్తత్వం బాహాటంగా కన్పిస్తుంది. హరిజన సమస్య కన్పిస్తుంది కాని పరిష్కార మార్గం స్ఫురించదు. ఈకథ హరిజన జీవితానికి ఏమాత్రం ఉపయోగపడదు. కాని బ్రాహ్మణులకే హరిజనులను దూరంగా వుంచడానికి ఉపయోగపడుతుంది. హరిజన సమస్యను చిత్రించిన కథ. హరిజన జీవితానికి ఒక మార్గాన్ని చూపించాలి. వాళ్ల ప్రగతికి బాట వేయడానికి ప్రయత్నించాలి. కనీసంవాళ్ల జీవితం వాస్తవికంగా నయినా చిత్రించాలి. అంతేగాక ఈ స్థితి సమాజంలో నేడు కూడా లేదు. అలాంటిది 1932 ప్రాంతంలోనే సవర్ణుల జాలిపైనో లేదా ఆగ్రహం పైనో ఈ కథను రాయడానికి ప్రయత్నించలేదని స్పష్టమవుతుంది.

**6.3.2 అయ్యపెల్లి రామలక్ష్మి** - 1941 ప్రాంతంలో కథాసాహిత్యానికి తమ వంతు కర్తవ్యాన్ని అందించింది. అయ్యపెల్లి రామలక్ష్మి ఇతివృత్తాన్ని ఎన్నుకోవడం శిల్ప పరంగా ఒకస్థాయిని అందుకోవడానికి ప్రయత్నించి ఉత్తమ కథల నెన్నింటినో రచించగలిగింది. ఈమె హరిజన జీవితాన్ని గురించి 'ధన్యజీవులు' అనే కథను రచించింది. ఇందులో విద్యావంతుడైన శంకరం. బ్రాహ్మణుడు ఇతని తండ్రి వేంకటశాస్త్రికి హరిజనులంటే అసహ్యం. అయితే వైద్యవృత్తి చేతిలో నున్న శంకరం ఒకసారి హరిజనవాడకెళ్లి మాలవెంకటి భార్యకు వైద్యం చేశాడు. అది సహించని వేంకటశాస్త్రిని వదలి శంకరం మాలపల్లెలోనే తన సంసారాన్ని పెట్టాడు. చివరికి తండ్రి చనిపోవడం. తన తండ్రి నుంచి సంక్రమించిన ధనం హరిజన సేవకు ఇచ్చాడు. ఈ కథలో హరిజనుల సమస్యవున్నా సవర్ణ పాత్రలే ప్రధానంగా కన్పిస్తాయి. ఈ కథలో సవర్ణ ఆధిపత్యమే కన్పిస్తుంది. హరిజనులంటే నేటికి దూరంగా వుంచే బ్రాహ్మణ సమాజంలో 1941 ప్రాంతంలోనే రచయిత్రి ఆలోచన తీరుగా సమాజస్థితి వుండదని, కేవలం హరిజనులపై జాలితో మాత్రమే ఈమె రచించిందని చెప్పవచ్చు. శంకర ం ఉదాత్త వ్యక్తి అయినా మాలపల్లెలోకి పోయి సంసారం పెట్టలేడు. పెట్టినా సజవుగా సాగదు. ఈమెనాడు ఆశించిన స్థితి నేటికీ కూడా లేదని చెప్పవచ్చు. రచయిత్రి నాడు హరిజన జీవితాన్ని అవగాహన చేసుకోవడంలో లోపముందని చెప్పవచ్చు.

**6.3.3 చలం** - ఆధునికాంధ్ర సాహిత్యంలో స్త్రీ జీవిత చైతన్యం పునాదిని నిర్మించిన వాడు చలం. అందుకే సమాజం చేత స్త్రీ పక్షపాత రచయితగా గుర్తింపబడ్డాడు. స్త్రీ జాతికి జరిగిన అన్యాయాల్ని అక్రమాల్ని సహించలేక తన కలంద్వారా సమాజాన్ని సంస్కరించడానికి ప్రయత్నించాడు. స్త్రీ పురుష సంబంధాలను ఆధిపత్య సంబంధాలుగా గుర్తించి వాటిని వ్యతిరేకించాడు. పురుషుల ఆధిపత్యానికి గురవుతున్న స్త్రీ నిస్సహాయస్థితిని నిరసించాడు. అలాంటి రచయిత హరిజన జీవితాలను గురించి కథలు రాశాడు. ఈయన కథలు 'హరిజన సమస్య' 'హరిజన విద్యార్థి' 'మాదిగమ్మాయి'. ఈకథల్లో సవర్ణుల అధికారమే కన్పిస్తుంది. హరిజన జాతిచైతన్యం చేసే మనస్తత్వం కన్పించదు. హరిజన సమస్య కథలో హరిజనుడు తమ హక్కులను సాధించుకోడు. సవర్ణుల కుటుంబాలపై పడివారి స్త్రీలను అనుభవించడం కోసం చేసే ప్రయత్నం కన్పిస్తుంది ఇది వాస్తవానికి ఎంత విరుద్ధంగా వుందో స్పష్టమవుతుంది. హరిజనులు సామూహికంగా సవర్ణ స్త్రీల మానభంగం చేయతల పెట్టినట్లు అది బాహాటంగా చేయటానికి పూనుకొన్నట్లు వ్రాయటం హరిజన జీవితం పట్ల అవగాహన లేక పోవటమే కాదు. కోపం ఉండటాన్ని కూడా తెలుపుతుంది. రచయిత రచన చేయడం స్పష్టం చలం ఈ కథను రచించిన కాలం 1946 నేడు ఒక హరిజనుడు సవర్ణ స్త్రీని మానభంగం చేస్తేవాడు తన ఉనికిని కాపాడుకోవడం కష్టం. ఇదే జరిగితే తన జాతి మనుగడకే ముప్పు కలుగుతుంది. ఈ కథను రచించడంలో చలం మనస్తత్వంతో వ్యక్తిత్వంతో వ్యక్తిగత భయాన్ని వ్యవస్థ గీతం చేశాడు. తమ స్థాయిలో ఆలోచించి హరిజనులు సవర్ణులను ప్రతిఘటించే స్థితిని తెలుపదు. అలాగే హరిజన విద్యార్థి కథ లో హరిజనుడి కన్నా బ్రాహ్మణుడికే రిజర్వేషన్ అవసరం అనే అభిప్రాయాన్ని సూచించాడు. హరిజనులు అంటరానితన వల్ల చాలా కాలంగా అనేక బాధలకు గురై సామాజికంగా దయనీయ స్థితిలో ఉండటం వల్ల, వీరికి రిజర్వేషన్లు అవసరం అనే ఆలోచన కలిగింది. అలాంటి సమాజంలో ఉన్నత శిఖరాల మీద ఉన్న బ్రాహ్మణులకు రిజర్వేషన్ ఉండాలని భావించే చలం హరిజనుల్ని అర్థం చేసుకోలేదు సరికదా వాళ్లస్థితిని అపార్థం చేసుకొన్నాడు. బ్రాహ్మణ కష్టం హరిజన కష్టం ఒకటిగా చూస్తే చలం సామాజిక దృక్పథంలోపభూయిష్టం. ఇది వ్యక్తిగత విశ్వాసం కాని వ్యవస్థ సందేశం కాదు. అలాగే 'మాదిగమ్మాయి' కథలో కథానాయికను వేశ్యగా చిత్రించాడు. వేశ్యగా జీవితం గడపడానికి కేవలం మాదిగమ్మాయే అర్హురాలు కానక్కర లేదు. ఏవ్యక్తి అయినా ఆ పరిస్థితుల్లో వేశ్యకావచ్చు, హరిజన స్త్రీ మాత్రమే వేశ్య అయ్యే సందర్భం కాదు. సమాజంలో కూడులేక కూటికోసం శరీరం అమ్ముకొని బతికే వాళ్లంతా వేశ్యలే. ఆర్థిక బాధవల్ల ఏ స్త్రీ అయినా వ్యభిచారి అయితే కావచ్చు. ఆర్థిక కష్టం వస్తే అది తొలగించుకోవడానికి వేశ్య అయితే కాని మాదిగమ్మాయే కానక్కర లేదు. అసలు ఈ కథ హరిజన కథ కాదనే చెప్పవచ్చు. ఒక వ్యవస్థనే తన రచన ద్వారా కదిలించిన చలం హరిజన జీవిత చిత్రణలో అంత సమర్థంగా సాహిత్యం సృష్టించలేక పోయాడు. హరిజన జీవితం మీద సరయిన అవగాహన లేకపోవటం వల్ల అగ్రవర్ణ ఆధిపత్యంతోనే ఈ కథలు రచించాడు.

**6.3.4 డా వి. చంద్రశేఖర రావు**- వృత్తిరీత్యా వైద్యుడగుట వలన వైద్య సమస్యలను ఇతివృత్తంగా స్వీకరించి రోగులకు డాక్టర్లకు సంబంధించిన కథలనెన్నింటినో రాశాడు. అనారోగ్యంతో వున్న సమాజానికి తన కథ ద్వారా వైద్యం చేయడానికి ప్రయత్నించాడు. ఈయన హరిజన జీవితాన్ని గురించి 'సరీసృపాలు' అనే కథను రచించాడు. కథలో మోహన రావు హరిజనుడు రిజర్వేషన్‌తో డాక్టర్ కొర్సులో సీటు సంపాదించాడు. తన తరగతిలోనే సవర్ణస్త్రీ అయిన పార్వతితో సన్నిహితంగా వుంటున్నాడు. సీనియర్లు తన సవర్ణులు రాగింగ్ చేయడం మొదలుపెట్టి మోహన్‌రావ్‌ను కులం పేరుతో రాగింగ్ చేసి రిజర్వేషన్ సీటు వచ్చిందని ఎగతాళి చేశారు. తన కుల స్త్రీ పార్వతితో తిరగవద్దని గద్దించారు. కులం పేరుతో ఒకరికొకరు దూషించుకొని విద్యార్థులంతా జైలుపాలయ్యారు. తత్ఫలితంగా తీవ్ర అవమానానికి గురైన మోహన్‌రావు ఆత్మహత్యకు

పాల్పడ్డాడు. హరిజనుడైనా మరెవరయినా వైద్య కళాశాలలో చెరీచేరకముందే వేరే కులం స్త్రీ పార్వతితో తిరగటంలో కొంత సమస్య ఉంది. కులం పేరుతో దూషిస్తే తిరగబడ్డ వ్యక్తి కొట్లాడిన వ్యక్తి జైలుశిక్ష దాకా సాగిన వ్యవహారం అకారణంగా ఆత్మహత్య పరిణమిస్తే అభ్యుదయం పొందే ఒక వైద్య విద్యార్థి చైతన్య రహితంగా మార్చినట్లు అవుతుంది.

ఈ హరిజనుడు చస్తే బాగుండన్న సవర్ణ దృష్టి మాత్రమే ఈ కథలో ఉంది కాని ఇది సహజంగా లేదు ఈ కథ హరిజన సమస్య అయినా సవర్ణ పాత్రలే ప్రధానంగా కన్పిస్తాయి. మరో విషయం ఈ కథలో విద్యార్థుల మధ్య ఘర్షణ జరగడం సామాన్యం. ఈ వ్యవస్థను రచయిత సరీస్పపాలతో పోల్చాడు ఒక రచయిత హరిజన కథరాస్తే నిజజీవితానికి దగ్గరగా ఉండాలి. వాళ్ల జీవితాలను మార్చుకోవడానికి ఒక మార్గం చూపించాలి ఈ కథలో మోహన్ రావు పాత్రలో సమస్య వుంది కాని పరిష్కార మార్గం లేదు. కులం పేరుతో ఇబ్బందులకు గురవుతున్న మోహన్‌రావు లాంటి వాళ్లకు రచయిత పరిష్కారాన్ని చెప్పగలగాలి. చంద్రశేఖరరావు సమాజంలోని హరిజన జీవితాన్ని గుర్తించి వారుపడుతున్న ఆవేదనకు జాలిపడ్డాడు. కాని అభ్యుదయ పథంవైపు పయనింపజేయడం కోసం హరిజన జీవితం అర్థం చేసుకోవటం అంతగా సామర్థం లేకపోయింది.

ఈ విధంగా ఆలోచిస్తూ పోతే మరికొంత మంది రచయితలు ఈ కోవలోకి వచ్చే అవకాశం వుంది. రచయిత రచన చేయడానికి ముందు ఆ సమస్యలపై అవగాహనను పెంచు కోవాలి సమస్యకు పరిష్కార మార్గం చెప్పడానికి ప్రయత్నించాలి తాము మోసపోతున్న విషయాలను చెప్పడానికి వాళ్ల వెన్ను తట్టాలి. అవసరమైతే ఒక సిద్ధాంతాన్ని ప్రబోధించాలి అప్పుడే గొప్ప రచయిత కాగలడు. సమాజానికి ఉత్తమ కథానికలను అందించగలడు. హరిజనేతర కథారచయితలు చాలా మంది తమ దృక్పథం నుంచే హరిజన జీవితం చిత్రించారు కానీ హరిజన దృక్పథం నుంచి చిత్రించలేకపోయారు సమస్యమీద వ్యవస్థ మీద వ్యక్తుల మీద ప్రేమ, జాలి, సానుభూతి చాలవు . ఈ సమస్య ఈ వ్యక్తుల మధ్య ఈవిధంగా పరిణామం చెందుతుందని విశదంగా తెలియాలి ఈ సమస్యకు ఇది పరిష్కారం అని గుర్తెరగాలి. ఈ వ్యవస్థ పరిష్కారానికి ఈ విధంగా ఉంటుంది, ఈ విధంగా ఉండాలి అనే దృష్టి హరిజన జీవితం సామీప్యం నుంచి పరిశీలిస్తేనే సాధ్యం అవుతుంది. ఈ అసాధ్యం హరిజనేతర కథారచయితల కథలో ఆ జీవిత అవగాహన లోపం వల్ల అసాధ్యంగానే చాల సందర్భాలలో ఉండిపోయింది.

## 6.4 హరిజన జీవితం - భిన్న ప్రాంతాలు

ఆంధ్ర రాష్ట్ర హరిజన జీవితాన్ని కథానికా సాహిత్యం ద్వారా నాలుగు ప్రాంతాలను వేరుచేసి చూసినట్లైతే వీరి జీవితం నాలుగు రకాలుగానే దర్శనమిస్తుంది. పరిసరాల ప్రభావం వేరు కావడంవల్ల స్థితిగతులు వేరుకావడంవల్ల రచనలో దృక్పథంలో బోధించే విషయాల్లో తేడాలుంటాయి. జీవనవిధానాలు వేరుకావడం వల్ల రచనలో కూడా మార్పు వుండటం సహజం. తెలుగు కథానికా జీవితాన్ని నాలుగు భాగాలుగా పరిశీలించవచ్చు.

1. రాయలసీమ రచయితల కథానికలు
2. తెలంగాణా రచయితల కథానికలు
3. ఆంధ్ర రచయితల కథానికలు
4. ఉత్తరాంధ్ర రచయితల కథానికలు

6.4.1 రాయలసీమ రచయితల కథానికలు:- రచయితల పరంగా ఆలోచించి వారందించిన విషయాలను తెలుసుకొందాం మధురాంతకం రాజారాం హరిజనులు రాజకీయంగా సవర్ణులకు ఎలా బలి అవుతున్నారో వీరి మూర్ఖత్వాన్ని అసరాగా చేసుకొని సవర్ణులు స్వార్థపరులై చివరికి వీరి నాశనానికే కారకులవుతున్నారని హరిజనులసంక్షేమం కోసం ప్రభుత్వం ప్రవేశ పెట్టిన రిజర్వేషన్‌తో వారి అభివృద్ధి

చెందటం ప్రక్క నుంచి వారికి కష్టాలనే తెచ్చిపెడుతున్నది. అని తెలియజేశాడు. పులికంటి కృష్ణారెడ్డి కథల్లో సవర్ణుల స్వార్థం కోసం మోసపోయిన పాలేర్లు కడుపుకూటికోసం తమప్రాణాలను పోగొట్టుకొన్న పాలేర్లు దుర్భర దారిద్ర్యంతోజీవితాలు సాగించే హరిజనులు, కుల అసమానతలు క్షీణించాలని అభిప్రాయపడే యువతులు కన్పిస్తారు. జీవితంలో మానవుడికి ముందు చూపు అవసరమని సవర్ణుల చేతుల్లో పడి మోసపోయి నలిగిపోవద్దని స్వతంత్రంగా జీవించమనే విషయం స్ఫురిస్తుంది. వీటన్నింటికి హరిజనుల మూర్ఖత్వమే కారణమని సవర్ణుడు తమకు దేవుడు అతని అండలేక పోతే బ్రతకలేమనే ఆలోచన వున్నంతవరకూ వారు అభివృద్ధిచెందలేరని, హరిజనులకు డబ్బులేకున్నా శక్తి వుందని ఆశక్తితో వారు దేనినైనా సాధించగలరని తెలియజేశాడు. కేతు విశ్వనాథ రెడ్డి కథల్లో తినడానికి తిండిలేక హరిజనులు తమ జీవితాలను సాగిస్తున్నారని వారికి ప్రభుత్వం ప్రవేశపెట్టిన సంక్షేమ పథకాలు సరిగా అందుబాటులో లేవని, వాటిని మధ్య వర్తులే కాజేస్తున్నారిని సవర్ణులు తమపాలేర్లకు సరైన జీతాలు ఇవ్వక అప్పుపేరుతో మోసం చేస్తున్నారని వీరు విద్యావంతులైన తోట హరిజనుల చేతుల్లో కూడా మోసపోతున్నారని తెలియజేశారు. వారికి కష్టానికి తగిన ఫలితం అవసరమని బానిసతనం నుండి విముక్తి చెంది జీవించాలని తపనపడ్డారు.

కలపకొలను సదానంద కథల్లో కులాంతర వివాహాలు హరిజనులకు అవసరమని అభిప్రాయ పడ్డాడు. హరిజనులు కుల రక్కసి నుండి బయట పడగలిగితే వృద్ధి చెందగలడని ఉద్బోధించాడు. సింగమనేని నారాయణ తన కథల్లో అనాగరికంగా బ్రతుకుతున్న హరిజనులను అప్పుల పేరుతో అంటరాని తనం పేరుతో మోసం చేస్తున్నారని, గుడికి బడికి దూరంగా వుంచుతూ, వారు ప్రగతి పథంవైపు నడవకుండా సవర్ణులు అడ్డుకొంటున్నారని స్పష్టపరిచాడు. అలాగే ముద్దుకృష్ణ కూడా హరిజనుల ఆస్తులను సవర్ణులు మోసంజేసి కాచేస్తున్నారని వివరించాడు.

కేశవ రెడ్డి కథల్లో హరిజనులందరూ ఐక్యంగా వుండమని సవర్ణుల మాటలు విని తమలో తామే ఘర్షణకు గురికావద్దని హెచ్చరించాడు. వి.ఆర్. రాసాని కథల్లో సమాజంలో హరిజనులు తమనీచవృత్తుల కారణంగానే సమాజానికి దూరంగా వుంటున్నారనే విషయం గోచరిస్తుంది. ఆరవేటి శ్రీనివాసులు కథలో హరిజనులు చైతన్యవంతులు కావడానికి తాము మోసపోతున్న విషయాలను తెలుసుకోవాలనే విషయాన్ని ఉద్బోధించాడు. గౌరునాయుడు. చిలుకూరి దేవపుత్ర కథల్లో సవర్ణులు స్వార్థం కోసం బలైన హరిజనులు చేయనినేరానికి సవర్ణులచే శిక్ష అనుభవించిన హరిజనులు కన్పిస్తారు. స్వామి, శాంతినారాయణ పినాకపాణి, కథల్లో హరిజనుల మనస్తత్వాన్ని హరిజనులను నీచంగా చూసే సవర్ణులు హరిజనులు చైతన్యవంతులై ప్రగతి పథంవైపు నడవడంలో తమకు అడ్డంకిగా వున్న సవర్ణులను ఎదిరించి సంఘవ్యతిరేక శక్తులుగా పేరు మోపబడి అడవులపాలైన వారున్నారని తెలియజేశారు.

రాయలసీమ కథల్లో హరిజనుల జీవనస్థితిగతులకు ఎక్కువ ప్రాధాన్యత వుంది. ముఖ్యంగా రాయలసీమలోని హరిజనులు కరువు కాటకాల కారణంగా సరిగా పంటలు పండక తినడానికి తిండి లేక బానిసత్వం వైపు మొగ్గుచూపుతూ పాలేర్లుగా సవర్ణుల ఇళ్లల్లో వుంటూ తమ కష్టానికి తగిన ఫలితం లేక దుర్భరదారిద్ర్యాన్ని అనుభవించటం అమాయకంగా బ్రతుకడం కన్పిస్తుంది.

**6.4.2** తెలంగాణా రచయిత కథానికలు:- వీరి కథల్లో ఎక్కువ భాగం ఉద్యమ ప్రభావం కన్పిస్తుంది. తమ అవసరాలు తీరడం కోసం అగ్రవర్గాలను ఎదిరించడం కోసం సమాజక శక్తి అవసరం. ఆ ప్రయత్నంలో భాగమే ఉద్యమం. ఉద్యమం ద్వారా తమ బ్రతుకులు మారుతాయని వారి అభిప్రాయం రచయితలు చెప్పిన విషయాలను గురించి పరిశీలించడం గమనార్హం బోయ జంగయ్య హరిజనులపై సవర్ణులు చేసే దురాగతాలు, మోసాలు, సహాయం పేరుతో ప్రభుత్వం అధికారులు చేసే విషయాలను వివరించి, మూర్ఖంగా

వారి మోసాలకు బలికావద్దని వ్యక్తిత్వాన్ని పెంచుకొని స్వతంత్రంగా బ్రతకమని తన కథానికల్లో సలహానిచ్చాడు. లోక జ్ఞానం తెలిసిన హరిజనులు కూడా సవర్ణులను ఎదిరించేశక్తిలేక పోతున్నారని వ్యథ చెందడం ఈయన కథల్లో దర్శనమిస్తుంది. కోటేశ్వరరావు కథల్లో కులాంతర వివాహాలు అవసరమని ఇవి మనుషుల మధ్య అంతరాలను తొలగించి సమానత్వాన్ని సాధించడానికి దోహదపడుతాయనే అభిప్రాయం స్ఫురిస్తుంది. ఈ కులాంతర వివాహాలు తాత్కాలిక కష్టాలు తెచ్చిపెట్టినా అంతరాలు తొలగడం కోసం అవసరం అన్నాడు. బి.యస్. రాములు కథల్లో సాటిమనుషులుగా బ్రతుకడానికి హరిజనులకు వ్యక్తిత్వం అవసరమని అది మనిషి పురోభివృద్ధికి తోడ్పడుతుందనే అభిప్రాయాన్ని తెలిపాడు.

కాలువ మల్లయ్య కథలో సమాజంలో హరిజనులను హక్కులను సవర్ణులు హరిస్తూ వారిని మాయ మాటలతోనే దూరంగా వుంచుతున్నారని ఒకవేళ వాళ్ళు విద్యావంతులై చైతన్యవంతులైతే వారిని సంఘ విద్రోహశక్తులకు పాల్పడ్డారనే నెపంతో హతమార్చడం సవర్ణులకు పరిపాటి అని అభిప్రాయ పడ్డారు. ఈరజయిత సమాజాన్ని రక్షించాల్సిన పోలీసులు కూడా అన్యాయానికి పాల్పడి తమ హక్కుల కోసం పోరాడే వారిని నాశనం చేస్తున్నారనే విషయాన్ని తేటతెల్లం చేశాడు. గోపి,తోలేటి జగన్నాథరావు కథల్లో హరిజనులు అమాయకత్వం వల్లనే ఆలోచన లేకుండా ప్రవర్తించి తమ బ్రతుకులను బుగ్గిపాలు చేసుకొంటున్నారని ప్రస్ఫుటం కావించారు. డా బి. దామోదరరావు కథల్లో హరిజనులు తమ ప్రాణాలకు తెగించి పోరాడైనా సరే తమ హక్కులను వినియేగించుకొమని హరిజనులు ఉన్నతపదవుల్లో వున్నవారు సవర్ణులకు బానిసలుగా వుంటూ తోటిహరిజనులనే మోసం చేస్తున్నారని వారికి సహాయపడటం లేదని తెలియజేశాడు. జింబో అరుణతార కథల్లో కాలపరిస్థితుల కనుగుణంగా హరిజనులు కూడా మారాలనే అభిప్రాయం తెలిపాడు.

తెలంగాణా కథల్లో హరిజనులు నిజాం పాలనలో నిచంగా అణగి ద్రొక్కబడి జమీందారుల చేతుల్లో నలిగిపోయి బానిసత్వం నుండి విముక్తి పొందలేక పోరాటమే తమ శరణ్యమని ఉద్యమించి తమ ఉనికిని కాపాడుకోవడం కోసం చేసిన ప్రయత్నం కన్పిస్తుంది.

6.4.3 ఆంధ్ర ప్రాంత రచయితలో కథానికలు: - ఆంధ్రాప్రాంతంలో హరిజనుల పాలేరుతనం అగ్రవర్ణాల దౌర్జన్యం కనిపిస్తుంది. కథాసాహిత్యం కూడా ఈ ధోరణిలోనే గోచరమవుతుంది. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి కథల్లో హరిజనుల్లో అసమానతలున్నాయని సమానత్వం కోసం క్రైస్తవం చేరినా ఫలితం లేక పోయిందని హరిజనులు తమ బ్రతుకు మార్చుకోవడం కోసం అనేక మతాల్లోనూ కులాల్లోనూ ప్రవేశించారని, ఆప్రయత్నంలో భాగంగా ముస్లిం మతంలో కూడా చేరారని తెలియజేశాడు. కరుణ కుమార కథల్లో హరిజనులపై సవర్ణులు చేసే దౌర్జన్యాలు వీరిని మోసగించి వారి ఆస్తులను దోచుకోవడం సవర్ణుల విధిగా కన్పిస్తుంది సవర్ణుల కామ దాహానికి బలైన హరిజన స్త్రీలు కూడా కన్పిస్తారు. బందా కనకలింగేశ్వర రావు అడివిబాపిరాజుకథల్లో హరిజనులను సృష్టించడం కోసమే ఉద్భవించారని, సాటి మనిషిని నీచంగా చూడటానికి సవర్ణులు చేసే ప్రయత్నమే తప్ప ఇది అన్యం కాదు. చలం కథల్లో హరిజనులు చాలా నీచస్థితిలో బ్రతుకుతున్నారని చైతన్యవంతులై సవర్ణులపై దండెత్తి వారి స్త్రీలతో సంబంధాలను ఏర్పరచుకొంటారనే భయం వ్యక్తం చేశాడు. రాయసం వేంకటశివుడు, గోపీచంద్, మాగోఖలే కథల్లో హరిజనులు ఎంత కష్టపడినా తమ ఆకలి తీరడం లేదని, తీరే మార్గం కనపడటం లేదని, ఈ ప్రయత్నంలో అనేక సంఘ సంస్కర్తలు ఉద్భవించి వారిని చైతన్యవంతులను చేయడానికి ప్రయత్నించాలని తపన పడ్డారు.

మాగోఖలే కథల్లో హరిజనులు కాటికాపరులుగా చేస్తూ ఆస్మశానంలో శవాల మధ్యనే బ్రతుకుతూ తమ జీవితాలను మార్చుకోవడానికి ప్రయత్నించడం లేదని తమ పాత వృత్తులకు స్వస్తిచెప్పమనే అభిప్రాయం

కన్పిస్తుంది. కపిల కాశీపతి, కొచ్చెర్లకోటి వెంకట సుబ్బారావు కొనకళ్ళ వేంకటరత్నం, చుండూరి రమాదేవి కథల్లో హరిజనులను సంఘసంస్కరణోద్యమం పేరుతో కూడా సవర్ణులు మోసం చేస్తున్నారని ఒకవైపు హరిజనులు చైతన్యవంతులు కావాలని అరుస్తూ మరోవైపు వారిని చీకటిలో వుంచడానికే ప్రయత్నిస్తున్నారని తెలియజేశారు. అంతేగాక సవర్ణుల్లో హరిజనులను హీనంగా చూసేవారే గాక అప్యాయతతో దగ్గరకు తీసుకొనేవారు కూడా ఉన్నారనడానికి తెలియజేశారు. ఆచార్య కొలకలూరి ఇనాక్ కథల్లో హరిజనుల హక్కులను సవర్ణులు కాలరాస్తున్నారని వారి మూర్ఖత్వాన్ని విశదీకరించాడు. బి.భాను, అనిశెట్టి సుబ్బారావు కథల్లో హరిజన స్త్రీలు, సవర్ణుల దౌర్జన్యాలకు తీవ్రంగా బలి అవుతున్నారని విద్య నుండి దూరంగా వుంచబడుతున్నారని అందువల్ల అవిద్య అనేది సర్వ కష్టాలకు మూలం అని, హరిజనులు విద్యావంతులు కావాలని అభిప్రాయపడ్డారు. అచ్యుతవల్లి కథలో హరిజనులకు క్రైస్తవంలో ఆశలు పెరిగాయి కాని తీరలేవి, అంటరాని వారిలోనైనా సరే సవర్ణుల కన్నా గొప్పగానే భక్తి ప్రవత్తులుంటాయని భక్తికి, కులం, మతం అడ్డురాదని, దేవుని సన్నిధిలో అందరూ సమానులేనని ప్రతిపాదించాడు. పాలేపు బుచ్చిరాజు, కాట్రగడ్డ దయానంద్, కథల్లో సవర్ణుల స్వార్థంకోసం హరిజనులు బలవుతున్నారనే విషయం వెలువరించాడు.

ఆంధ్రకథల్లో హరిజనులు భూసాముల దౌర్జన్యంతో పాలెర్లుగా తరతరాలుగా ఊడిగం చేస్తూ తమ కష్టానికి తగిన ఫలితం అందక సవర్ణులతో ప్రతిఘటించి తమ హక్కులను సాధించుకోవడం కన్పిస్తుంది. స్వతంత్రంగా తమ జీవితాలను గడపటం కూడా స్ఫురిస్తుం.

6.4.4 ఉత్తరాంధ్ర రచయితల కథానికలు - ఉత్తరాంధ్ర కథానికల్లో తీవ్రమోసానికి గురికా బడ్డ హరిజనులు దర్శనమిస్తారు. కాశీపట్నం రామారావు కథల్లో హరిజనులు సవర్ణుల మధ్య ఆర్థిక సంబంధాలు వ్యక్తమయ్యాయి. సవర్ణుల ధనదాహానికి గురైన హరిజనులు ఆ ఊబిలో నుండి కోలుకోలేక సతమతమువుతున్నవారు. తమతో తామే అనైక్యత నేర్పరుచుకొని ఘర్షణ పడి సవర్ణుల చేత అవమానాలు పొందిన హరిజనులు కన్పిస్తారు. ఈ అనైక్యత వల్ల ఎదుటి వారిచే హీనంగా చూడబడుతారు తప్ప సాధించేదేమి లేదని రచయితలు హరిజనులకు సూచించారు.

ఉత్తరాంధ్ర కథల్లో హరిజనులు తరాలుగా ఆర్థిక ఇబ్బందులకు గురవుతూ ఆ ఆర్థిక స్థితిలోనే సవర్ణుల మోసానికి గురై దీనంగా, హీనంగా బ్రతకడం గోచరిస్తుంది.

## 6.5 హరిజన జీవితం - భిన్నమార్గాలు

తెలుగు కథానికా సాహిత్యంలో హరిజన జీవితం చిత్రించిన కథలు రెండు ప్రధాన మార్గాలలో పయనించాయి. సవర్ణుల చేతుల్లో హరిజనులు మోసపోవటం బలికావటం ఒక పద్ధతి కాగా హరిజనులు ప్రతిఘటించటం ప్రతీకారం తీర్చుకోవటం మరో పద్ధతిగా ఉంది. మొదట దశలో హరిజనుల ప్రాణాలకు రక్షణ లేకపోయింది. వాళ్ల స్త్రీల మానాలకు రక్షణ కరువైంది. వాళ్ల ఆస్తులు దోపిడికి గురి అయ్యాయి. కర్మ సిద్ధాంతం పేరుతో వాళ్లను పట్టి బంధించి ఉంచింది. సమాజం బ్రాహ్మణులు మనస్సంఘర్షణ హరిజనుల్లో కలిగించారు రెడ్డి, కమ్మ, నాయుడు వంటి సవర్ణులు హరిజనుల్ని శారీరకంగా హింసించారు. వాళ్లకు రావలసినవి రాదగ్గవి రానివ్వలేదు. ఉన్నవి తమ వశం చేసుకొన్నారు. సవర్ణులు అంతా స్థూలంగా హరిజనులమని చెప్పదగ్గ సర్వ, ధన, మాన, ప్రాణ ,చైతన్యాలను హరించటం తెలుగు కథానికా సాహిత్యంలో కనిపిస్తూఉంది. ఆ దోపిడి విధానం చిత్రించిన కథల్ని పరికించటం కర్తవ్యం.

**6.5.1 హరిజనుల్ని హరిజనేతరులు చంపటం చిత్రించిన కథలు** - హరిజనులను సవర్ణులు కులపరంగా హీనంగా చూసి చంపటం కొన్ని కథలు ఉన్నాయి 'కొత్తచెప్పులు' కథలో నరిసి ఆలస్యంగా చెప్పులు కుట్టి తెచ్చినందుకు చిన్నపరెడ్డి కోపించి ఆమెను చంపాడు. 'సూర్యుడు తలెత్తాడు' కథలో సవర్ణులు కామంతో

ద్వేషంతో భార్యను కూతురును కొడుకును హత్యచేశారు. 'ఏటిపాట' కథలో నాయుడు పాలేరు పైడయ్య ఆ గ్రామం సంఘంతో చేతులు కలిపి బంజరు భూమిని ఆక్రమింపదలిస్తే అందుకు ఆగ్రహించిన నాయుడు పోలీసు స్టేషన్ నుండి రాత్రిలో వస్తున్న పైడయ్యను తన మనుషుల చేత హత్య చేయించాడు.

6.5.2 హరిజన స్త్రీలను ఇతరులు మానభంగం చేసి వ్యభిచారంలోకి దించిన కథలు:- 'బిళ్ళల మొలత్రాడు' కథలో రామిరెడ్డి తన పాలేరు సుబ్బులు భార్య రమణి ని కామించి ఆమెను అనుభవించడానికి ప్రయత్నించాడు పశువుల కొఠం కథలో రాముడు హరిజన యువతి పెంచెలిని అనుభవించడం కోసం ప్రయత్నించి. ఆ ప్రయత్నం సఫలం కాక ఆమె చావుకు కారకుడయ్యాడు. 'మాదిగమ్మాయి' కథలో మాదిగమ్మాయిని సవర్ణులు అనుభవించడం కోసం ప్రయత్నించి ఆమెను మానసికంగా హింసించి ఆమెను వేశ్యగా మార్చి వేశారు. 'పాపానికి జీతం' కథలో అరుంధతి దొర భుజంగరావు కామానికి బలై అతని చేతిలోనే మరణించింది. 'రుధిరమథనం'కథలో అరుంధతి కామయ్యచేయబోయిన మానభంగం నుండి తప్పించుకొని ఊరువదలి వెళ్లిపోయింది.

6.5.3 హరిజనుల్ని కులం కారణంగా ఇతరులు హింసించిన కథలు పరిశీలినం పొందుతాయి. 'చెప్పులు కుట్టేవాడు' కథలో చెప్పులు కుట్టివాడు' చౌరాస్తా ప్రక్కన కూర్చొని పాత చెప్పులు కుట్టుకొని జీవిస్తుంటే ఒక పోలీసు అతనిని అక్కడ నుండి వెళ్లి పొమ్మని కొట్టాడు. 'ఇలాంటి తవ్వాయివస్తే' కథలో హరిజనులను సవర్ణులు తమ చెరువు నుండి నీళ్లను తీసుకొనివ్వలేదు. 'మనిషి' కథలో చక్రవర్తి ఇంట్లో తిండికోసం, చదువుకోసం హరిజన గోవిందుడు చేరితే అతని ప్రయత్నాన్ని చక్రవర్తే చెడగొట్టాడు. 'కొమ్ములు' కథలో హరిజనులు ఐక్యంగా వుంటే సహించని కొండారెడ్డి వారి మధ్య స్పర్థలు సృష్టించి వేరుచేశాడు. 'అప్పావుపిళ్ళ ఆత్మఘోష' కథలో హరిజన వెంకటయ్య 'తన గురువు ఇంట్లోకి వెళ్లి నూతన సంవత్సరపు శుభాకాంక్షలు చెప్పలేక పోయాడు 'జీవనాడులు' కథలో ఆసాదు ఎంగడు తన కూతురు పెళ్ళి ఘనంగా చేయదలిస్తే అందుకు అతనికి సవర్ణుల నుండి కులపరమైన ఎదురు దెబ్బలు తగిలాయి. చివరకు నూతన దంపతులు కూడా రెడ్డి చేత అవమానం పాలయ్యారు.

6.5.4 హరిజనుల్ని ఆర్థికంగా సవర్ణులు మోసం చేసిన కథలు కొన్ని సృష్టిపొందాయి. 'కొత్తజోడు' కథలో భీమయ్య అప్పు తీర్చని వెంకన్న ఆస్తిని కాజేయడానికి ప్రయత్నించాడు. 'కీచక వధ' కథలో బసివిరెడ్డి పాలేరు వెంకటరాముడుకు జీతం ఇవ్వకపోగా చనిపోయిన వాడే తనకు వేయిరూపాయలు బాకీ పడ్డాడని మోసగించాడు కోటిగాడు స్వతంత్రుడు కథలో కోటిగాడికి ప్రభుత్వం రిక్షా కోసం డబ్బు ఇస్తే దానిని పెంటయ్య మాయ మాటలుచెప్పి కాజేశాడు. 'మల్లమ్మఉసురు' కథలో గంగులు నాయుడు పట్టణంతో తక్కువ వడ్డీతో అప్పుతెచ్చి గ్రామంలో మల్లయ్య లాంటి హరిజనులకు ఎక్కువ వడ్డీకి ఇవ్వడం ఉంది. 'మేకు' కథలో మాకుడు గంగులు నాయుడు వద్ద చేసిన అప్పుకు తన ఆస్తినంతా ఇచ్చి పట్నం వెళ్లి దొంగతనం చేసి పట్టుబడి తీవ్ర అవమానానికి గురి అయ్యాడు 'పురుగు' కథలో పెదనాయుడు అప్పు ఊబిలో పైడి తల్లి ఇరుక్కొన్నాడు.

6.5.5 హరిజనులు ఆర్థిక లోపం వల్ల భంగపడిన కథలు పరిశీలింపవలసి ఉంది. 'ఏదిగమ్యం' కథలో రాము తన ఆర్థిక స్థితి వల్ల విద్యార్థి దశలోనే తోటి విద్యార్థి అయిన రవికి బానిసగా జీవించాడు 'నెంబర్రాళ్లు' కథలో రావుడి కుటుంబం నిత్యం కూలీకి వెళ్లితేగాని పూట గడపటం కష్టమవుతుంది. 'ముత్తాయి కూతురు' కథలో వెట్టి తన కూతురుకు జ్వరం వస్తే మందుల కోసం తన భార్య తాళిని తీసుకెళ్లడం కన్పిస్తుంది. 'చితి మీద బతుకులు' కథలో కాటికాపరి తన కొడుకు ఉద్యోగం కోసం స్మశానంలో ఒక అధికారిని అడుక్కోవడం ఉంది. 'ఇది కతా' కథలో మల్లయ్య గ్రామంలో సవర్ణునివల్ల ఆర్థిక మోసానికి గురై పట్నంలో చౌరాస్తా వద్ద

చెప్పులు కుట్టుకొని రోజూ జరిగే సమ్మెల వల్ల తన కుటుంబం గడవక ఇబ్బందులకు గురిఅయ్యాడు.

6.5.6 హరిజనులు కర్మ సిద్ధాంతం పేరుతో కట్టుబడి వుండేటట్లు చేసిన కథలు కొన్ని వచ్చాయి. 'ఒక హరిజనుని కథ' కథలో గాలివానలో చిక్కుకొని స్పృహ కోల్పోయిన రామచరన్‌కు బ్రాహ్మణుడు రక్షించి దేవాలయంలోకి తీసుకెళ్లితే స్పృహ వచ్చిన రామచరణ్ దేవాలయంలోకి వెళ్లి దేవుని మైల చేశాడని బాధపడ్డాడు. 'దేవుడు' కథలో నందయ్య నాయకత్వంలో హరిజనులు దేవాలయ ప్రవేశం చేయడానికి ప్రయత్నిస్తే అందుకు సవర్ణులు అడ్డుకోవడం కన్పిస్తుంది. 'మకర ముఖం' కథలో హరిజన ఉపాధ్యాయుడు దేవాలయంలో నున్న బడి పిల్లలకు గుడి బయట నుండి చదువు చెప్పటం కన్పిస్తుంది.

6.5.7 హరిజనులు అమాయకత్వం వల్ల నష్టపోయిన కథలు పరికించవచ్చు. హరిజనులు తమ జీవితాన్ని సుగమం చేసుకోవడం చేతకాక నష్టపోయిన కథలు కన్పిస్తాయి. ''పావులు పాములుగా మారిన వేళ'' కథలో హరిజన రాజిగాడు ఇద్దరు సవర్ణుల రాజకీయంలోపడి అమాయకంగా వారి చేతుల్లోనే చనిపోవడం ఉంది. 'అంటరాని పొలం' కథలో పిచ్చయ్య అమాయకత్వం వల్ల ఆంజినేయులు ఇతని ఆస్తిని కాజేయడానికి ప్రయత్నించాడు. 'వేపచెట్టు' కథలో హరిజన విద్యార్థి డాక్టర్ కోర్సు పూర్తి చేసి ఎంప్లాయ్‌మెంటు ఆఫీసు చుట్టూ ఉద్యోగం కోసం తిరగటం విశదమవుతుంది. 'వేట' కథలో భీముడు అమాయకత్వం వల్ల ధర్మ భూషణ చేతిలో తన సంసారాన్ని నాశనం చేసుకొని చివరికి అతని చేతుల మీదుగానే జైలుపాలయ్యారు.

6.5.8 బ్రాహ్మణుల దౌర్జన్యానికి గురైన హరిజన కథలు కొన్ని రూపొందాయి. సమాజంలో నాడు అగ్రగామిగా వున్న బ్రాహ్మణుల దౌర్జన్యానికి గురైన హరిజనులకు సంబంధించిన కథలు కొన్ని ఉన్నాయి. 'మాలదాసరి' కథలో మాల దాసరి కురుంగుడి దేవాలయంలో భక్తితో భజనలు చేస్తే అది సహించని సోమశర్మ అతని తల పగలగొట్టాడు. '(గుక్కెడనీళ్ళు' కథలో మడినీళ్ళు తెస్తున్న మహాలక్ష్మమ్మకువెట్టి వెంకటప్ప ఎదురు వచ్చినందుకు ఆమె తన భర్తతో చెప్పి చెప్పుతో కొట్టించి బండబూతులు తిట్టించింది. 'యీరమ్మ' కథలో యీరమ్మ అన్న అనారోగ్యానికి గురైతే మందు కోసం పూజారి ఇంటికి వెళ్లినా అతను మందు ఇవ్వకపోవడం కన్పిస్తుంది. 'పోలయ్య' కథలో తన కులం తెలుపక వేంకటశాస్త్రికి ఊళ్ళోకి వెళ్ళడానికి బండి కట్టినందుకు పోలయ్యను హింసించడానికి ప్రయత్నించాడు 'సంస్కరణం' కథలో ఒక హరిజన సంఘసంస్కర్త కందుకూరి వీరేశలింగం విగ్రహానికి పూల మాలవేస్తే బ్రాహ్మణులు వీటిని తిరస్కరించడం గోచరిస్తుంది. 'అయ్యోపాపం' కథలో దంపతులైన అన్నపూర్ణ, భాస్కరులు దాహర్తి కోసం బ్రాహ్మణులు చలివేంద్రం దగ్గరకు వెళ్లినా కులం కారణంగా వాళ్ళు నీళ్ళు తాగే వీలులేక పోయింది.

6.5.9 రెడ్ల దౌర్జన్యానికి గురైన హరిజనులు కొందరున్న కథలు పరిశీలించవచ్చు. అనేక మంది హరిజనులు, పాలేర్లుగా, బానిసలుగా రెడ్ల దౌర్జన్యాలకు గురైన హరిజను కథలు ఉన్నాయి. 'కయ్యి - కాలువ' కథలో తన పొలం ప్రక్కన మాలకొండడి అర ఎకరా పొలం వుండటం సహించక ఆ పొలం కాజేయడానికి అనేక ఇబ్బందుకు గురిచేసింది. మహాలక్ష్మమ్మ. 'పాపం కుంటేలుగాడు' కథలో ఒక హరిజన విద్యార్థి పాఠశాల ఎన్నికల్లో రెడ్డి కొడుకుతో పోటీ పడితే రెడ్డి కొడుకు వాడిని కొట్టాడు. 'మార్పు' కథలో హరిజనులు కూలీరేట్లు పెంచమన్నందుకు రెడ్లు హరిజనులపై ఆగ్రహించి వారి గుడిసెలకు నిప్పు పెట్టారు. 'చీకటి నాడీ - వెలుగు నెత్తురూ' కథలో తన పాలేరు పుల్లన్న జీతం సరిగా ఇవ్వమన్నందుకు రామిరెడ్డి అతనిపై అప్పు మోపాడు. 'ఉచ్చు' కథలో అప్పుపేరుతో హరిజన నాగన్న పొలాన్ని కాజేశాడు వెంకట రెడ్డి. 'తొందరపడి ఒక కోడి ముందే కూసింది' కథలో సుబ్బారెడ్డి ఆగ్రామ హరిజనులకు అన్ని విధాలా మోసం చేశాడు. 'కొత్తదారి' కథలో రాములు కాలిపోతున్న తమ గుడిసెలు రక్షించుకోవడానికి శివాలయం బావిలో దిగి నీళ్లు తీసుకొన్నందుకు బాబుల్ రెడ్డి అతణ్ణి కొట్టి రాడికల్స్‌గా పోలీసులచే ముద్రవేయించాడు.

6.5.10 కమ్మ కాపు నాయుడు దౌర్జన్యాలకు గురైన హరిజనుల జీవితాలు చిత్రించిన కథలున్నాయి. 'యజ్ఞం' కథ వ్యాపారం పేరుతో మోసం చేసి అప్పలాముని భూమిని గోపన్న కాజేశాడు. 'ఆర్తి' కథలో హరిజనులు తమతో తామే పోట్లాడుకొని నాయుడు వద్దకు న్యాయం కోసం పోయి అతని చేత హీనంగా తిట్లుతిన్నారు.

6.5.11 ఇతర సవర్ణుల దుర్మార్గానికి గురైన హరిజనుల కథలు పరిశీలించాలి. 'అంటరాని బాలిక' కథలో రూప జ్ఞానూ ఇంట్లో పని చేస్తూ అతని తల్లిచే అవమానాలకు గురైంది. 'దిరోడ్' కథలో హరిజనులు ఏకమయినందుకు మునసబు వారి మధ్య చిచ్చు పెట్టాడు. 'పాకిది' కథలో కోటిగాడు చదువుకోవలిస్తే సవర్ణుడైన భాస్కర్‌రావు అడ్డుతగిలాడు.

6.5.12 ప్రభుత్వం కల్పించిన రాయితీలు పొందలేని హరిజనులు కొందరు కథల్లో కనిపించారు. ప్రభుత్వం హరిజనుల సంక్షేమం కోసం కొన్ని రాయితీలు కల్పించింది. కాని అవి మధ్యలోనే సవర్ణుల చేతుల్లో వుండిపోయాయి తప్ప హరిజనులకూ అందలేదని కొన్ని కథలు ఉన్నాయి. 'అజ్ఞాతవాసం' కథలో హరిజనుడైన ఆసాదు గంగడికి పంచాయితీ ప్రెసిడెంటు గా పెట్టి సవర్ణులే నిజమైన అధికార్లుగా చెలామణి అయ్యారు' ఏది గమ్యం' కథలో రాము బీదవాడు. హరిజనుడైనా తండ్రి చేసే అటెండరు ఉద్యోగం కారణంగా అతనికి స్కాలర్ షిప్ రాదు. 'ఊడల మర్రి' కథలో మాజి ప్రెసిడెంటు భీమప్ప తన పాలేరు ఓబులుగాడిని రిజర్వుడు పంచాయితీ ప్రెసిడెంటుగా పోటీ చేయించాడు. 'బంచరాయి' కథలో హరిజనులు ప్రభుత్వ ఆదేశం ప్రకారం బంజరు భూములను స్వాధీన పరుచుకొంటే. అందుకు గ్రామ సవర్ణులు నిరాకరించారు 'పెద్దోళ్ళు' కథలో పెదనాయుడు పాలేరు లొండలక్షయ్య పంచాయితీ ప్రెసిడెంటు అయినా నాయుడింట్లో పాలేరుతనం మాత్రం పోలేదు. 'వేట' కథలో హరిజనుల ఇళ్ళస్థలాలకు ప్రభుత్వం మంచి స్థలాన్ని కేటాయిస్తే గ్రామ పెద్ద ధర్మ భూషణం అందుకు అడ్డుకొన్నాడు.

6.5.13 పొలం పోగొట్టు కొన్న హరిజనుల కథలు కొన్ని ఉన్నాయి. హరిజనులు అమాయకత్వం వల్ల తమ ఆస్తులను సవర్ణుల చేతుల్లో పోగొట్టు కొన్నాయి. 'అంటరాని పొలం' కథలో పిచ్చయ్య మోసపోయి తన ఆస్తిని పోగొట్టుకో బోయాడు! 'వేట' కథలో భీముడు తన ఆస్తికి నీళ్లోదులుకొన్నాడు.

ఇన్ని విధాలుగా హరిజనులు మోసపోవడం బలవ్వడం కన్పిస్తుంది.

## 6.6. హరిజన జీవితం - చైతన్యం

దోపిడికి గురి అవుతున్న హరిజనులు తరతరాలుగా అణగారి ఉన్నప్పటికి ఇప్పుడిప్పుడే చైతన్యం పుంజుకొంటున్నారని తెలిపే కథలు వెలువడ్డాయి. వాళ్లకు చదువు మీద ప్రేమకంటే జీవితం మీద కోర్కెకంటే, ఉజ్జ్వల భవితవ్యం మీద ఆశకంటే ప్రతీకారం ప్రముఖంగా ప్రకటించే కథలు వెలువడ్డాయి. వాళ్ళు కూడా సవర్ణుల లాగా ప్రాణ హాని చేసిన కథలు వచ్చాయి. మానహాని చేయటమూ కన్పిస్తుంది. తమ హక్కులు కోసం సమ్మెలు చేయటమూ గోచరమవుతుంది. తమకు న్యాయం జరగలేదని, కర్మసిద్ధాంతం తమకు బంధిఖానాగా మారిందని దాని నుంచి విముక్తికి క్రైస్తవ మతంలోకి మహమ్మదీయ మతంలోకి మతాంతరీకణం పొందే కథలను కూడా రచయితలు సృష్టించారు. ఈ సందర్భంలో హరిజన కథారచయితలు సృష్టించిన కథా సాహిత్యం తమ అభివృద్ధి మార్గం తాము అన్వేషించుకోవాలన్న దృష్టిని ప్రసాదిస్తూంది.

6.6.1. హరిజనులు మానభంగంతో వ్యభిచారంతో సవర్ణ స్త్రీలను పాడు చేసిన కథలు వెలువడ్డాయి. 'హరిజన సమస్య' కథలో హరిజనుడైన వీరన్న సమానత్వం కోసం తన వాళ్ళతో కలసి సవర్ణ స్త్రీలపై పడి మానభంగం చేయబోవటం కన్పిస్తుంది. 'మాలా - మనిషి' కథలో హరిజన రావుడు సవర్ణ యువతి సీతను ప్రేమించి ఆమెను పెళ్ళి చేసుకోవడంలో విఫలమయి ఇద్దరూ చనిపోవడం కన్పిస్తుంది. 'పులిగుండు'

కథలో రావుడు, నాయుడు భార్య నిర్మలమ్మతో అక్రమ సంబంధం పెట్టుకొని నాయుడు చేతిలోనే మరణించాడు. 'సరీసృపాలు' కథలో ఒక కళాశాల హరిజన విద్యార్థి సవర్ణ విద్యార్థినితో ప్రేమించబడి సవర్ణుల చేతుల్లో హతమయ్యాడు.

6.6.2. సవర్ణుల్ని హరిజనులు చంపిన కథలు కొన్ని వెలువడ్డాయి. 'కీచకవధ' కథలో బసివిరెడ్డి పాలేరు వెంకటరాముడు చనిపోతే అతడి భార్యపై కన్ను వేసిన రెడ్డికి ఒక బావి వద్ద పొందు ఏర్పాటు చేస్తానని చెప్పి పిలిపించి రెడ్డిని హత్య చేశాడు. 'ఒక్క పిడికిలిచాలు' కథలో గురవయ్య దొరను చంపి తానూ చనిపోయాడు.

6.6.3. సమ్మె చేసిన హరిజనుల కథలు కొన్ని సృష్టిపొందాయి. తమ హక్కులను సాధించుకోవడం కోసం హరిజనులు కొన్నిసార్లు సమ్మె చేయక తప్పలేదు. 'మార్పు' కథలో తమ కూలీ రేట్లు పెంచమని సమ్మె చేశారు. 'చీకటినాడి - వెలుగునెత్తురు' కథలో వరి కోతల కాలంలో తమ కూలీ లేట్లు పెంచమని హరిజనులు సమ్మె చేశారు. 'ఇంకానా ఇకపై సాగవు' కథలో రంగన్న నాయకత్వాన హరిజనులు తమ కూలీ లేట్లు పెంచమని, కష్టానికి తగిన ఫలితం అవసరం అని సమ్మె చేశారు.

6.6.4. క్రైస్తవం పొందిన హరిజన కథలు కూడా గుర్తించవచ్చు. కొందరు క్రైస్తవ మతంలో ప్రవేశించటం లోక విదితమే. 'సంసార సంగం' కథలో కాటన్న, సోమాలు ప్రేమించుకొని క్రైస్తవం స్వీకరించి పెళ్ళి చేసుకొన్నారు. 'వ్యత్యయం' కథలో రాములు తినడానికి తిండిలేక తిండి కోసం క్రైస్తవం పుచ్చుకొని రెబెకాను పెళ్ళి చేసుకొన్నాడు. 'ఇలాంటి తవ్వాయివస్తే' కథలో హరిజనులు త్రాగునీటి సమస్యను నివారించుకోవడం కోసం విస్సన్న న్యాయకత్వంలో క్రైస్తవంలో చేరారు. 'విష్ యు హేపి క్రిస్మస్' కథలో తిండి కోసం బట్టకోసం హరిజనులు క్రైస్తవ మతాన్ని స్వీకరించారు. క్రిస్మస్ శుభాకాంక్షలు కథలో హరిజనులు తమ హక్కులను సాధించుకోవడం కోసం క్రైస్తవంలో చేరారు. ''పాహిమాం.. పాహి...పాహి..'' కథలో హరిజనులు తమ కాలనీని కాపాడుకోవడం కోసం క్రైస్తవమతాన్ని సీకరించారు.

6.6.5. మహమ్మదీయ మతంలోకి చేరిన హరిజనుల్ని చిత్రించిన కథలు కూడా ఆవిర్భవించాయి. 'ఇలాంటి తవ్వాయివస్తే' కథలో క్రైస్తవ మతంలో ఉన్న హరిజనులు అక్కడ కూడా తమ సమస్యలు పరిష్కారం కాక మహమ్మదీయ మతంలో ప్రవేశించారు.

## 6.7 హరిజన జీవితం - వాస్తవికత

హరిజన కథా రచయితల కథల్లో హరిజనులు స్వతంత్రంగా సుఖంగా బ్రతికే మార్గం ప్రబోధించారు. హరిజనులు తమ అభివృద్ధికి అభ్యుదయాన్ని భవిష్యత్తునూ తామే అన్వేషించుకోవాలని, ఉజ్వల జీవితం పొందాలని ఉన్నతులుగా, ఉత్తములుగా జీవించాలనీ తెలిపారు 'ఊరబావి' కథ హరిజనులను హింసలేకుండా యుక్తితోనే వీలైనంత సామరస్యంగా తమ హక్కులను సాధించుకోమని తెలియజేస్తుంది. 'పశ్చాద్భూమి' కథ హరిజనులు తమ భయాలు విడిచిపెట్టి. తమ ఆస్తిని రక్షించుకోవాని, తమను తామే కాపాడుకోవాలని, సవర్ణులు ఎవరూ కాపాడరని , సవర్ణులు మోసం చేస్తారని, ఆ మోసానికి గురికావద్దని, తమ వృత్తిని దైవంగా చూసుకోవాలని ప్రబోధిస్తుంది. 'ఎర్నీళ్ళు' కథ కర్మ సిద్ధాంతం పేరుతో అంధవిశ్వాసాలతో ఆహారం దుర్వినియోగం కాకుండా సంప్రదాయాల మీద తిరుగుబాటుగా పసివాళ్ళను కూడా జీవించమని కోరింది.

మానభంగం జరిగిన ఒక స్త్రీ 'పాపానికి జీతం'లో చనిపోతే, మరొక స్త్రీ 'రుధిరమథనం'లో ఊరువిడిచి వెళ్ళి భర్తతో సుఖంగా జీవించి తిరిగి నేర్పుగా స్వగ్రామంలో ప్రవేశించి సుఖపడ్డ కథ . ఇందులో దుర్మార్గానికి గురైనప్పటికి ఆత్మహత్య చేసుకోకుండా దుర్మార్గులు సిగ్గుపడేటట్లుగా జీవించాలని హరిజనుల

ఈ కథ ప్రబోధించింది. 'సూర్యుడు తలెత్తాడు, కథ సూర్యుడు లాగా తలవంచుకు పోయే జనం ప్రాణంపోతే శీలంపోతే చలింక ఆర్థికస్థితికి పునాది అయిన భూమి పోతే చలించక పోతే న్యాయం కాదని, భూమి కోసం పోరాడాలని ఒక్కడు, పదిమందితో తలపడటం కష్టం కాబట్టి, దాపరికంగానైనా ప్రతీకారం తీర్చుకోమని హెచ్చరిస్తుంది. బంచరాయికథలో హరిజనులు బంజరు భూమిని దున్నుకొనే ప్రయత్నం చేస్తే దొర మాయ మాటలు చెప్పి వాళ్ళ ఇళ్ళు తగులబెట్టి నిరాశ్రయుల్ని చేయటం, విద్యావంతుడైన యువకుడు ప్రశ్నించడం కనపడుతుంది. 'ఇంకానా ఇకపై సాగదు' కథలో హరిజనులు సమైక్యంగా తమ హక్కుల కోసం ప్రయత్నిస్తే ఆ ప్రయత్నం భంగపరచి, నాయకుణ్ణి జైలుకు పంపడం జరిగింది. హరిజనులు సమైక్యంగా వుండటంతోపాటు జాగ్రత్తగా ఉండాలని గుర్తించడం జరిగింది. 'ఇదికతా' లో పల్లెలో ఉండలేక పట్టణం చేరినా, సమ్మెల మూలంగా, రోజులు గడపడం కష్టమయిన చర్మకారుడి జీవితం చిత్రమయింది 'ఆకలి' కథలో తిండికోసం సర్వప్రాణాలు యుద్ధం చేస్తుంటే కర్మపేరుతో కట్టుబడి ఉండే వైరాగ్య స్థితి నుంచి మేల్కొని ఒక పసిప్రాణి అన్నం కోసం చేసిన తీవ్ర కృషి ప్రాణహానిగా మారినా చలించవద్దని హరిజనులకు సూచిస్తుంది. 'సంస్కరణం' కథ బ్రాహ్మణులు సహజంగానే హరిజనుల్ని అంటరాదనటమూ ఆ హరిజనులు ఆవిష్కరించిన సంస్కర్త విగ్రహం కూడా అంటు తగిలిందని పరిశుభ్రం కావించే ప్రయత్నం మీద తిరుగుబాటుగా మరో అంటరాని అధికారితో విగ్రహం పవిత్రతను కాపాడుటం ప్రధానాంశం.

'ఏది గమ్యం' కథ తరతరాల తాతముత్తాతల బానిస మనస్తత్వం జీర్ణించుకొని విద్యావంతులు కూడా పతనం కావద్దని, ప్రాణహాని పొందవద్దని, నలుగురితో సమానంగా జీవించే ధైర్యం పొందమని హరిజనులను హెచ్చరిస్తుంది. 'వేపచెట్టు' కర్మ సిద్ధాంతం పేరుతో నైరాశ్యం ముసుగులో కర్తవ్యతా విమూఢులవుతున్న విద్యావంతులైన హరిజన యువకుల్ని స్వయం కృషితో అభివృద్ధి చెందమని ప్రబోధిస్తుంది. 'క్రిస్మస్ శుభాకాంక్షలు' క్రైస్తవ మతంలో ప్రవేశించిన హరిజనులు రెండు తరాల వాళ్ళు సంఘర్షించినా వాళ్ల మధ్య ప్రేమ, అభిమానం, ఆత్మీయత తొలగిపోరాదని ప్రకటించింది. 'విష్ యు హేపి క్రిస్మస్' కథ క్రైస్తవ మతంలో ప్రవేశించిన హరిజనులు ఆర్థికంగా సుస్థితి కోసం ఒకరితో నొకరు పోరాడ గలిగిన స్థితిని ప్రతిపాదించింది. నలుగురితో సమంగా ఆర్థిక సుస్థిరత కోసం సంఘర్షించే స్థితికి పెరిగిన ఉన్నత విద్యావంతుల జీవితం హెచ్చరికను సూచిస్తుంది. 'ఇదేం న్యాయం' కథలో మతాంతరీకరణం పొందిన హరిజనులు ఆర్థిక ంగా స్థిరపడి బ్రాహ్మణులతో సమంగా వియ్యానికి, కయ్యానికి సిద్ధంగా ఉన్న స్థితిని బాహాటంగా సమాజ సందర్భన సమర్థంగా రూపొందినది.

## అథస్సూచికలు


1. ఊర బావి - కొలకలూరి ఇనాక్ పుట 23
2. సూర్యుడు తలెత్తాడు--కొలకలూరి ఇనాక్ పుట 198
3. ఇంకానా ఇకపై సాగదు--భార్గవీరావు పుట 77
4. ఇదికతా--బోయ జంగయ్య, ఇండియా టుడే మార్చి 6-20-1995 పుట 64
5. దళిత కవిత్వాన్ని దళితులే రాయనక్కరలేదు--గుంటూరు శేషేంద్ర శర్మ ఈనాడు దినపత్రిక 23.4.95
6. కరుణకుమార కథలు - కరుణకుమార పుట 51
7. కేతు విశ్వనాథరెడ్డి కథలు --కేతు విశ్వనాథరెడ్డి పుట 91.

# ఉపసంహారం

హరిజనుల జీవనస్థితి గతులను కథానికా సాహిత్య వస్తువులుగా తీసుకొని వస్తువుకు తగిన పాత్రను సృష్టించి బానిసత్వపు కోరల్లో అంటరానితనం అనే శాపంతో బ్రతుకుతున్న హరిజనులకు విముక్తి కలిగించడానికి సభ్యసమాజంలో వారూ సమానంగా బ్రతకడానికి రచించిన అనేక కథానికలను తీసుకొని అందులోని వారి జీవితానికి సంబంధించిన ఇతివృత్తం, పాత్ర, సమస్యలు మొదలైన అంశాలున్న కథానికా సాహిత్యాన్ని హరిజనాభ్యుదయం పట్ల రచయితల అభిప్రాయాలను, దృక్పథాలను, హరిజన జీవన తత్వాన్ని పరిశీలించడం ఈ పరిశోధన లక్షం.

ప్రథమాధ్యాయంలో సామాన్య మానవులు సహితం చదువ గలిగిన తెలుగు కథానిక ఉద్భవించిన రీత్యా వ్యక్తమయింది. పాశ్చాత్య సాహిత్య ప్రభావంపట్ల ఉద్భవించిన కథానిక, దాని నిర్వచనాలను వాటి లక్షణాలకు అనుగుణంగా ఉండటం, అంతేగాక 1910 లో ఉద్భవించిన కథానిక కాలానుగుణంగా రచనా విధానంలో మార్పు చెంది శాఖోపశాఖలుగా విస్తరించడం పరిశీలన పొందింది. సమాజావసరానికి అనుగుణంగా రచన సాగడం కన్పించింది. ఈ కథా వ్యాప్తికి అనేక పత్రికలు సహకరించడం స్పష్టమయింది. సంఘంలోని వివిధ అంశాలపై దృష్టిని కేంద్రీకరించి కాలానుగుణంగా సాధించిన, సాధించవలసిన అంశాలను వివరిస్తూ, వస్తువులో భాషలో మార్పు చెందుతూ కథానిక పరిణామం చెందటం వివరణం పొందింది. తెలుగు కథానికా స్థానం విశిష్టం కావటం తెలిసివచ్చింది.

ద్వితీయాధ్యాయంలో తెలుగు కథానికా వికాసంలో వచ్చిన మార్పుతో పాటు సమాజంలోని సమస్యలపై కథానికా ప్రభావం ఉండటం పరిశీలన పొందింది. ప్రజల జీవన విధానంలో ఆచార వ్యవహారాలలో సంసారిక జీవనంలో వృత్తుల్లో సంస్కరణ దృక్పథంలో, రాజకీయ దృష్టితో స్త్రీవాదం, దళితవాదంలాంటి అత్యాధునిక విషయాల్లో రచనా తీరుల్లో రచయితలు ఎన్నుకొన్న పద్ధతులు విశ్లేషణం పొందాయి. సంఘంలో జరుగుతున్న దురాచారాలను న్యాయాలను, ధర్మాధర్మాలను విచారించి సమాజాన్ని ప్రగతి పథంవైపు పయనించడానికి ప్రయత్నించింది కథానిక. దళిత వాదాన్ని గురించిన పరిశోధన కాబట్టి దళితవాదంలో సామాన్యంగా సమాజంలోని హరిజన జీవితాన్ని సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా భిన్నకోణాలను పరిశీలించడం జరిగింది. సమస్యలతోపాటు రచయిత ఆలోచనలు సమాజంతోపాటు మార్పు చెందటం కూడా విశదమయింది.

తృతీయాధ్యాయంలో హరిజన జీవిత చిత్రీకరణ జరిగింది. తెలుగు కథానికా సాహిత్యంలో ప్రతిబింబించిన హరిజన జీవితం వివిధ ధోరణులలో గోచరమయింది. తరాలుగా అస్పృశ్యతకు గురై అన్నింటికీ దూరంగా ఉంటూ సవర్ణుల పాలేర్లుగా బ్రతుకు తుండటం, తిండికి, బట్టకు కరువై దుర్భర జీవితాన్ని అనుభవించడం నిరూపణ పొందింది. తీవ్రమైన ఆర్థికమైన ఇబ్బందులకు గురై రాజకీయంగా అనేక సమస్యలను ఎదుర్కొని నీచాతినీచంగా హరిజనులు సమాజ జీవనం చేయడం విశ్లేషణం పొందింది. కథానికా సాహిత్యంలో ఈ హరిజన జీవితం రెండు కోణాల్లో కనిపించటం వల్ల వాటిని వేరుచేసి పరిశీలించడం జరిగింది. హరిజనులు వ్రాసిన కథానికల, హరిజనేతరుల వ్రాసిన కథానికలు మధ్య స్పష్టమైన తేడా కనిపించింది. హరిజనేతరులు రచించిన కథల్లో హరిజనేతర మనస్తత్వం, హరిజనులపట్ల జాలి, సానుభూతి, దయ , ప్రేమ, వాత్సల్యం కనిపించాయి. ఇందులో హరిజనుల జీవితం కనిపించదు. హరిజనులు సృష్టించిన కథానికా సాహిత్యంలో హరిజనుల జీవితంతోపాటు, వారి సమస్యలు, కష్టసుఖాలు, ఆచార వ్యవహారాలు, స్పష్టంగా నిజాయితీగా భవిష్యత్తు మీద ఆశావహంగా, వాస్తవంగా రూపొందటం పరిశీలనం పొందాయి.

చతుర్థాధ్యాయంలో హరిజన దృక్పథాన్ని రెండు కోణాల్లో పరిశీలించటం జరిగింది. సాంప్రదాయక జీవితంలో హరిజనుల మూర్ఖత్వాలు కర్మ సిద్ధాంతాలు , పాలేరుతనం, సవర్ణుల బానిసలుగా ఉండటం స్పష్టం చేయటమయింది. తమస్థితి మారక, మార్చుకోవాలనే ఆలోచన లేక చావు బ్రతుకుల మధ్య సాగే జీవితాల పరిశీలన జరిగింది. తమకు జరిగిన అన్యాయానికి సవర్ణులను ఎదిరించే ధైర్యం లేక హరిజనులు ఉండటం, తమ స్త్రీలు సవర్ణుల కామదాహానికి బలి కావడం వివరణం పొందాయి. ప్రయోగ జీవితంలో మారుతున్న కాలానికనుగుణంగా హరిజనులు చైతన్యవంతులు కావడం అభివ్యక్తి పొందింది. తమ హక్కులను సాధించుకోవడం, అన్యాయాన్ని ప్రతిఘటించడం, సామాజానికనుగుణంగా తమ పద్ధతులను మార్చుకొని తమ వ్యక్తిత్వంతో తాము జీవించడం ఋజువు చేయడమయింది. విద్యానార్జించి, ఉద్యోగాలు సాధించడం ఒక లక్షణం కాగా, రాజకీయంగా, ఆర్థికంగా ఎదగడం మరోదృక్పథంగా వివరణం పొందాయి. మొత్తంమీద సామాజికంగా సవర్ణులతో సమాన స్థాయిలో హరిజనులు ఉండే ప్రయత్నంగా కథానికా సాహిత్యంలో ఉన్నతీరు ఈ అధ్యాయంలో ప్రతిబింబించింది. ఈ రెండింటి విషయాలను సమీకరించి దృక్పథవైవిధ్య తత్వంలో పరిశీలించడం జరిగింది.

పంచమాధ్యాయంలో హరిజన పాత్రల స్వరూప స్వభావాల చిత్రీకరణ ఉంది. మొదటగా యధాతథ దృక్పథంలో పాత్రలు కర్మసిద్ధాంతంతో ముడిపెట్టుకొని సవర్ణుల పశువుల కొఠం తమ పాలిట ఆశాజ్యోతిగా భావించి కష్టానికి తగిన ఫలితాన్ని ఆశించక తమ జీవితాంతం పాలేర్లుగా కట్టుబానిసలుగా ఉంటూ చేయని నేరానికి శిక్షను అనుభవించేవి, బలైనవి. వారి కామదాహానికి గురైన పాత్రలుగా కనిపించటం స్పష్టీకరణ పొందింది. పరిణామ దృక్పథంలోని హరిజన పాత్రలు చైతన్యదిశగా పయనించడం, హరిజనులు విద్యకోసం, ఉద్యోగం కోసం సవర్ణులపై ఆధారపడి కష్టానికి తగిన ఫలితాన్ని ఆశించడం, ఆలోచనాపరులుగా మారటం, ఇన్నాళ్లుగా తాము పోగొట్టుకొన్న సర్వహక్కులను సాధించాలనే తపన పడటం, తమకు జరిగిన అన్యాయాన్ని గురించి ఆలోచించడం, అందుకు బాధ్యులైనవారిని ప్రతిఘటించాలనే ఆశ ఉండటం తమ హక్కులను సాధించుకోవడం కోసం సవర్ణులకు సానుభూతిపరులుగా మెలగడం వివరణం పొందింది. హరిజనాభ్యుదయంలో హరిజనుల సాంఘిక, ఆర్థిక, విద్య రాజకీయ వివాహ వ్యక్తిత్వ విషయమనే పాత్రలు స్వతంత్రంగా ఆలోచించే వ్యక్తిత్వం గల పాత్రలు , రాజకీయ స్వభావాలు పొందిన ఫలితాలు స్పష్టంగా పరిశీలనం పొందాయి.

షష్ఠాధ్యాయంలో రచనా విధానంలో హరిజన రచయితలకు హరిజనేతర రచయితలకు శిల్పపరంగా వస్తుపరంగా స్ఫురించే తేడాను విడమర్చి చూపటమయింది. హరిజన రచయితల రచనలో యుక్తితో కూడిన ప్రతిఘటన కన్పిస్తే హరిజనేతర రచయితల రచనలలో సమస్య వుంటుంది. కాని దానికి పరిష్కారం హరిజన సమాజం ఆశించినంతగా వుండకపోవటం స్పష్టం చేయడమయింది. సమస్య అవగాహన వున్న రచయితలు కాగలిగారు. తెలుగు హరిజన కథానికా సాహిత్యాన్ని రాయలసీమ తెలంగాణా, కోస్తాంధ్ర, ఉత్తరాంధ్ర నేపథ్యంనుంచి పరిశీలన చేయగా గోచరమయ్యే వైవిధ్యం స్పష్టీకరించటమయింది. హరిజనాభ్యుదయం రచయితలు, ప్రాంతాలు, విషయాలు వివరించే దృష్టితో ఈ కథానికా సాహిత్యంలో పరిశీలన పొందింది.

తెలుగు కథానికా సాహిత్యంలోకి హరిజన జీవితం గుర్తించి సాహిత్యాన్ని నిర్మించిన రచయితలు హరిజనాభ్యుదయానికి చేసిన ప్రయత్నాన్ని తెలిపి వారిచ్చిన మార్గాలను చర్చించి హరిజనాభ్యుదయానికి కథానికా సాహిత్యం ఎంతమాత్రం దోహదకారి అవుతుందో విశదం చేసింది. సాహిత్యానికి సంఘానికి మధ్యవున్న సంబంధాలను ఈ పరిశోధన తెలియజేసింది. హరిజనాభ్యుదయానికి కథానికా సాహిత్యం ఎంతమాత్రం దోహదకారి అవుతుందో విశదం చేసింది. సాహిత్యానికి సంఘానికి మధ్యవున్న సంబంధాలను ఈ పరిశోధన తెలియజేసింది. హరిజనాభ్యుదయానికి సాహిత్యం మార్గంలో దిక్ప్రదర్శనం చేయగలిగింది.

## అనుబంధం - 1

| వ.సంఖ్య | కథానిక | రచయిత | ప్రచురణ |
|---|---|---|---|
| 1. | అగ్నిగుండం | మల్లయ్య, కాలువ | అభ్యుదయ మార్చి ఏప్రిల్ 1991 |
| 2. | అజ్ఞాతవాసం | రాజారాం, మధురాంతకం | మధురాంతకం రాజారాం కథలసంపుటి |
| 3. | అప్పొవుపిల్ల ఆత్మఘోష | కృష్ణారెడ్డి, పులికంటి | కోటిగాడు స్వతంత్రుడు కథల సంపుటి |
| 4. | అయ్యోపాపం | మంగాయమ్మ, గొట్టుముక్కల | గృహలక్ష్మి మార్చి 1935 |
| 5. | అంటరానిపోలం | ముద్దుకృష్ణ | ముద్దుకృష్ణ కథల సంపుటి |
| 6. | అంటరాని బాలిక | రామకోటయ్యచౌదరి,కనుకుర్తి | |
| 7. | అంకురార్పణ | బుచ్చిబాబు, పాలెపు | ఇంకానా ఇకపై సాగదు-కథల సంపుటి |
| 8. | ఆకలి | ఇనాక్, కొలకలూరి | ఊరబావి కథల సంపుటి |
| 9. | ఆచూకి | గోపి | అరుణతార ఫిబ్రవరి 1949 |
| 10. | ఆర్తి | రామారావు, కాళీపట్నం | యజ్ఞంతో తొమ్మిది కథల సంపుటి |
| 11. | ఆసావెరి | రామకృష్ణశాస్త్రి,మల్లాది | భారతి జనవరి 1949 |

| వ.సంఖ్య | కథానిక | రచయిత | ప్రచురణ |
|---|---|---|---|
| 12. | ఇరుకు | దేవపుత్ర, చిలుకూరి | ఆరుగ్లాసులు కథల సంపుటి |
| 13. | ఇరుకుమాను | కృష్ణారెడ్డి, పులికంటి | ఆంధ్రభూమి వారపత్రిక 5.8.1982 |
| 14. | ఇదేం న్యాయం | ఇనాక్, కొలకలూరి | సూర్యుడు తలెత్తాడు కథలసంపుటి |
| 15. | ఇదికతా | జంగయ్య, బోయ | ఇండియాటుడే మార్చి 6-21-1995 |
| 16. | ఇలాంటితవ్వాయివస్తే | సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీపాద | శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి కథలు మూడవ సంపుటి |
| 17. | ఇంకానా ఇకపై సాగవు | జంగయ్య, బోయ | హెచ్చరిక కథల సంపుటి |
| 18. | ఉస్తి | వెంకటరావు, కవికొండల | భారతి జనవరి 1951 |
| 19. | ఉచ్చు | నారాయణ, సింగమనేని | జూదం, కథల సంపుటి |
| 20. | ఉరిత్రాడు | నాసరయ్య, పి | దళితరాజ్యం అక్టోబర్ 1994 |
| 21. | ఊడలమర్రి | దేవపుత్ర, చిలుకూరి | ఆహ్వానం ఆగస్టు 1993 |
| 22. | ఊరిబాయి | దామోదరరావు, బి | సింగడి కథల సంపుటి |

| వ.సంఖ్య | కథానిక | రచయిత | ప్రచురణ |
|---|---|---|---|
| 23. | ఊరిబాయి | ఇనాక్, కొలకలూరి | ఊరబావి కథల సంపుటి |
| 24. | ఎదురుతిరిగితే | రాజయ్య, అల్లం | కథావేదిక 1992 |
| 25. | ఎర్రీళ్లు | ఇనాక్, కొలకలూరి | సూర్యుడు తలెత్తాడు కథల సంపుటి |
| 26. | ఎలచ్చన్ అమ్మోరికిబలి | గాయత్రిరాజ్ | వనితాజ్యోతి డిశంబర్ 1994 |
| 27. | ఎలిగోపెద్దోళ్లనలిగేసన్నోళ్లు | రామకృష్ణారెడ్డి | ఆంధ్రప్రభ వార పత్రిక జనవరి 1995 |
| 28. | ఏదిగమ్యం | ఇనాక్, కొలకలూరి | సూరుడు తలెత్తాడు కథలసంపుటి |
| 29. | ఏటిపాట | గౌరునాయుడు,గండేటి | కథాసంకలనం, 1992 |
| 30. | ఒక్కపిడికిలి చాలు | రాజగోపాల్, తుల్లి | ఇంకానా ఇకపైనాగదు కథలసంపుటి |
| 31. | ఒక హరిజనుని కథ | నరసింహం, కూచి | ఆంధ్రపత్రిక 1936 |
| 32. | కడుపుసొద | కృష్ణారెడ్డి,పులికంటి | ఆంధ్రప్రభ వారపత్రిక 24.11.1982 |
| 33. | కయ్యి-కాలువ | కరుణకుమార | కరుణకుమార కథల సంపుటి |
| 34. | కాణిపాకం వినాయకుడిసాక్షిగా | కృష్ణారెడ్డి,పులికంటి | ఇండియా టుడే ఏప్రిల్ 4-16 1995 |

| వ.సంఖ్య | కథానిక | రచయిత | ప్రచురణ |
|---|---|---|---|
| 35. | కాపోడా - కులోడా | రామకృష్ణారెడ్డి | పెన్నేటి కథల సంపుటి |
| 36. | క్రిస్మస్ శుభాకాంక్షలు | ఇనాక్, కొలకలూరి | సూర్యుడు తలెత్తాడు కథలసంపుటి |
| 37. | కీచక వధ | కృష్ణారెడ్డి, పులికంటి | కోటిగాడు స్వతంత్రుడు కథలసంపుటి |
| 38. | కులం | జగన్నాథరావు, తోలేటి | ఆహ్వానం నవంబర్ 1994 |
| 39. | కులమతాలను కూల్చండి | నాసరయ్య, పి | దళిత పోరాట కథల సంపుటి |
| 40. | కొత్తచెప్పులు | కరుణ కుమార | కరుణ కుమార కథల సంపుటి |
| 41. | కొత్తజోడు | చ.రా | గృహలక్ష్మి మార్చి 1938 |
| 42. | కొత్తదారి | పినాకపాణి | అరుణతార జులై, అగస్టు 1994 |
| 43. | కొమ్మలు | కృష్ణారెడ్డి, పులికంటి | ఆంధ్రప్రభ వారపత్రిక 1.4.1987 |
| 44. | కోటిగాడు స్వతంత్రుడు | కృష్ణారెడ్డి, పులికంటి | కోటిగాడు స్వతంత్రుడు కథలసంపుటి |
| 45. | గ్రహణం | జంగయ్య, బోయ | ఆంధ్రజ్యోతి వారపత్రిక 26.5.1995 |
| 46. | గుక్కెడునీళ్లు | కనకలింగేశ్వర రావు, బందా | భారతి మే 1932 |

| వ.సంఖ్య | కథానిక | రచయిత. | ప్రచురణ |
|---|---|---|---|
| 47. | గుండెలు మాడినపుడు | నాసరయ్య,పి | దళితరాజ్యం మార్చి 1994 |
| 48. | గొర్లు | దామోదర రావు,బి | సింగడి కథల సంపుటి |
| 49. | గోపమ్మ తల్లి | వెంకటరామనాథ,వేమూరి | భారతి ఫాల్గుణ 1954 |
| 50. | చదువు | రంగాచార్య,దాశరథి | చదువు కథల సంపుటి |
| 51. | చదువుకన్ను | శారదా,సదానంద | చదువు కథల సంపుటి |
| 52. | చితిమీద బతుకులు | వెంకట సుబ్బారావు,కొచ్చెర్లకోట | భారతి ఏప్రిల్ 1989 |
| 53. | చివరి రాత్రి | ఊర్వశి | భారతి జులై 1969 |
| 54. | చీకటినాడీ-వెలుగునెత్తురు | విశ్వనాథరెడి,కేతు | కేతు విశ్వనాథరెడ్డి కథల సంపుటి |
| 55. | చెప్పులు | జింబో | ఆంధ్రజ్యోతి వారపత్రిక 20.1.1995 |
| 56. | సెప్పుక్రింద పూలు | విశ్వప్రసాద్, పాలగిరి | నేత్రం త్రైమాసిక పత్రిక |
| 57. | చెప్పులు కుట్టేవాడు | గోపీచంద్,త్రిపురనేని | మాకూ వున్నాయి స్వగతాలు కథలసంపుటి |
| 58. | చెలమ | దయానంద,కాట్రగడ్డ | ఇంకానా ఇకపై సాగదు కథల సంపుటి |

| వ.సంఖ్య | కథానిక | రచయిత | ప్రచురణ |
|---|---|---|---|
| 59. | చెంబుకొక గంగ | కృష్ణారెడ్డి, పులికంటి | ఆంధ్రజ్యోతి వారపత్రిక 21.11.1986 |
| 60. | జలగ | జగదీశ్వరరావు, బమిడి | ఇంకానా ఇకపై సాగదు కథల సంపుటి |
| 61. | జీవనగమనం | కోటేశ్వరరావు, చిత్తూరి | ఆంధ్రజ్యోతి వారపత్రిక 30.12.1994 |
| 62. | జీవనాడులు | శాంతినారాయణ | ఉదయం దినపత్రిక జూన్ 2,1991 |
| 63. | తల్లిమట్టి | స్వామి | ఉదయం ఆదివారం ప్రత్యేకం 26.1.1990 |
| 64. | తీర్పు | దామోదర రావు, బి | సింగడి కథల సంపుటి. |
| 65. | తొందరపడి ఒక కోడి ముందే కూసింది. | శ్రీనివాసులు, ఆరవేటి | ఆంధ్రప్రభ వారపత్రిక 17.1.1990 |
| 66. | ది రోడ్ | కేశవరెడి, పి | భారతి ఆగష్టు 1971 |
| 67. | దిష్టికళ్లు | వనశ్రీ | భారతి జూన్ 1952 |
| 68. | దేవుడు | సుగుణ రావు, ఎమ్. | ఇంకానా ఇకపై సాగదు కథల సంపుటి |
| 69. | ధన్యజీవులు | రామలక్ష్మి, అయ్యపెళ్లి | గృహలక్ష్మి అక్టోబర్ 1941 |

| వ.సంఖ్య | కథానిక | రచయిత | ప్రచురణ |
|---|---|---|---|
| 70. | ధ్వని | దామోదర రావు, బి | సింగడికథల సంపుటి |
| 71. | ధర్మతల్లి | రమాదేవి, చుండూరి | గృహలక్ష్మి మార్చి 1938 |
| 72. | నరసన్న పాపాయి | బాపిరాజు, అడవి | రాగమాలిక కథల సంపుటి |
| 73. | నిరంజన శాస్త్రి | వెంకట శివుడు, రాయసం | ఆంధ్రప్రభ ఉగాది సంచిక 1929-30 |
| 74. | నిశ్చయం | భార్గవీరావు | ఇంకానా ఇకపై సాగవు కథల సంపుటి |
| 75. | నువ్వు కాదూ | నారాయణస్వామి, అంటె | కథా స్రవంతి కథల సంపుటి |
| 76. | నెంబరాళ్ల | కృష్ణారెడ్డి, పులికంటి | కోటిగాడు స్వతంత్రుడు కథలసంపుటి |
| 77. | పండగపూట పరవాణ్ణం | కృష్ణారెడ్డి, పులికంటి | ఆంధ్రప్రభ వారపత్రిక 24.10.1990 |
| 78. | పరిధులూ ప్రమేయాలు | పద్మాకర్, దగ్గుమాటి | ఆంధ్రజ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక 1994 |
| 79. | పరివర్తన | నారాయణస్వామి, అంటె | వ్యత్యాసాలు కథల సంపుటి |
| 80. | పశ్చాద్భూమి | ఇనాక్, కొలకలూరి | ఊరబావి కథల సంపుటి |
| 81. | పశువుల కొఠం | కరుణ కుమార | కరుణ కుమార కథలసంపుటి |

| వ.సంఖ్య | కథానిక | రచయిత | ప్రచురణ |
|---|---|---|---|
| 82. | పాకీది | సుబ్బారావు, అనిసెట్టి | భారతి జనవరి 1943 |
| 83. | పాపం కుంటేలుగాడు | కృష్ణారెడ్డి, పులికంటి | ఆంధ్రప్రభ వారపత్రిక 4.8.01983 |
| 84. | పాపానికి జీతం | భాను, జి | భారతి నవంబర్ 1969 |
| 85. | పావులు పావులుగా మారినవేళ | రావు, సి. యస్. | ఊరుమ్మడి బతుకులు కథల సంపుటి |
| 86. | పాహిమాం--పాహి--పాహి | సూర్యప్రసాదరావు, ఎం. | జంకానా ఇకపై సాగవు కథల సంపుటి |
| 87. | పుల్లంరాజు2 | సుబ్రహ్మణ్యంశాస్త్రి, శ్రీపాద | ప్రబుద్ధాంధ్ర జూన్ 1925 |
| 88. | పులిగుండు | కృష్ణారెడ్డి, పులికంటి | కోటిగాడు స్వతంత్రుడు కథలసంపుటి |
| 89. | పురుగు | మధుచక్రవర్తి | ఇంకానా ఇకపై సాగవు కథల సంపుటి |
| 90. | పెద్దోళ్లు | కూర్మారావు, బొడ్డు | ఇంకానా ఇకపై సాగవు కథల సంపుటి |
| 91. | పొడవని పొద్దు | మహేరాజు, దేవరాజు | చదువు కథల సంపుటి |
| 92. | పొద్దుకుంకింది | కృష్ణారెడ్డి, పులికంటి | యువ మాసపత్రిక |

| వ.సంఖ్య | కథానిక | రచయిత | ప్రచురణ |
|---|---|---|---|
| 93. | పోలయ్య | కరుణ కుమార | కరుణ కుమార కథల సంపుటి |
| 94. | బంగారమ్మ కమతం | రావు, సి. యస్. | ఊరుమ్మడి బతుకులు కథల సంపుటి |
| 95. | బంచరాయి | జంగయ్య, బోయ | ఎచ్చరిక కథల సంపుటి |
| 96. | బడితెగాడు | - | కథావేదిక 1992 |
| 97. | బందీ | రాములు, బి. యస్. | ఆంధ్రజ్యోతి వారపత్రిక 28.4.1995 |
| 98. | బిళ్లల మొలతాడు | కరుణ కుమార | |
| 99. | బుద్ధుడు పుట్టిన భూమిలో | కృష్ణారెడ్డి, పులికంటి | ఆంధ్రప్రభ వారపత్రిక 7.11.1986 |
| 100. | మలుపు | అరుణ తార | ప్రజాసాహితి జూన్ .1981 |
| 101. | మకరముఖం | నారాయణ, సింగమనేని | ఇండియా టుడే వార్షిక సంచిక 1995 |
| 102. | మనిషి | వెంకటరత్నం, కొనకళ్ళ | భారతీ జనవరి 1971 |
| 103. | మరోమలుపు | రామాచారి, టి. | ఆహ్వానం నవంబర్.1994 |
| 104. | మల్లమ్మ ఉసురు | కృష్ణారెడ్డి పులికంటి | ఆంధ్రప్రభ వారపత్రిక 24.10.1994 |

| వ.సంఖ్య | కథానిక | రచయిత | ప్రచురణ |
| --- | --- | --- | --- |
| 105. | మార్పు | విశ్వనాథరెడ్డి,కేతు | కేతు విశ్వనాథరెడ్డి కథల సంపుటి |
| 106. | మార్పుకు మార్గం | రావు,సి.యస్. | ఊరుమ్మడి బతుకులు కథల సంపుటి |
| 107. | మాదిగమ్మాయి | చలం | ఖర్మమిట్లా కాలింది కథల సంపుటి |
| 108. | మాదిగవాడు | లీలావతి | జయంతి,మే 1930 |
| 109. | మాదిగాడిపెళ్లాం | వెంకటప్పయ్య | భారతీ, ఏప్రిల్ 1938 |
| 110. | మాలా-మనిషి | సదానంద,కొలవకొలను | ఏడ్చేపెదవులు, నవ్వేకళ్ళు,కథలసంపుటి |
| 111. | మాల-దాసరి | శివరామశాస్త్రి,వేలూరి | భారతి జనవరి 1933 |
| 112. | ముత్తాయికూతురు | గోఖలే, మాధవపెద్ది | భారతి మార్చి 1956 |
| 113. | ముత్తడు గొప్పోడు | కృష్ణారెడ్డి, పులికంటి | ఆంధ్రజ్యోతి వారపత్రిక 11.3.1985 |
| 114. | ముత్యాల చెరువు | అచ్యుతపల్లి,వై.వి.యస్. | తెలుగు కథ, కేంద్రసాహిత్య అకాడమి |
| 115. | మేకు | కృష్ణారెడ్డి, పులికంటి | దీపావళి ప్రత్యేక సంచిక 1991 |
| 116. | యజ్ఞం | రామారావు,కాళీపట్నం | యజ్ఞంతో తొమ్మిది కథల సంపుటి. |

